





# చరిత్ర

హిందూ దేశ,ఆంధ్రుల,సాహిత్య,తత్వ

## ఉభయ భారతి





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలుపైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలుపైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071721

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఉభయభారతి

(భాషా, సాహిత్యవ్యాససంపుటి)

**Dr. R. SRI HARI**
Professor & Head
Dept. of Telugu
University of Hyderabad.
Hyderabad.

ప్రచురణ :

వరరుచి పబ్లికేషన్స్

హైదరాబాదు.

జ్ఞానపీఠపురస్కారగ్రహీత,
పద్మభూషణ్
**ఆచార్య సి. నారాయణరెడ్డి**
అధ్యక్షులు
ఆంధ్రసారస్వతపరిషత్తు.

# అంతశ్శోధనం

అసలైన పరిశోధకుని లక్షణం ఉపరిశీలనం కాదు-అంతశ్శోధనం. పొరలను విదిలించి నిక్షిప్త ధాతువులను ఎత్తిచూపినప్పుడే మౌలికసత్యం ఆవిష్కృతమవుతుంది.

ఆచార్య రవ్వా శ్రీహరిగారు "లోనారసి" మేలెంతో తాలెంతో విశ్లేషించి చూపే వివేచనశీలురు. ప్రాచీన సంస్కృతాంధ్ర కృతులను సమీక్షించినా, వర్తమాన భాషా కవిత్వరీతులను తరచి చూసినా శ్రీహరిగారి వ్యాసాల్లో ఏదో ఒక నూత్నదృక్కోణమో, ఎన్నో కొన్ని విలక్షణాంశాలో ప్రతిఫలిస్తాయి.

'ప్రాచీన కావ్యాలు - పాఠ పరిష్కరణ' అనే వ్యాసంలో ఆయన చేసిన కొన్ని పాఠాల ఔచిత్యాంకనం ఆలోచనా ప్రేరకంగా ఉంది. 'ధ్వన్యనుకరణ వాచ' కాలపేరుతో మన వ్యాకర్తలు పేర్కొన్నవన్నీ "ధ్వని" పరిధిలోకి రావు. వాటిలో "తళతళ" లాంటి రూపానుకరణ వాచకాలు, "కలుక్కు" లాంటి అవస్థానుకరణ వాచకాలు ఉన్నాయి. ఇది గమనించిన శ్రీహరిగారు వీటిని "ధ్వన్యాద్యనుకరణ వాచకాలని వ్యవహరించి ఉంటే బాగుండే"దని కాదనలేని తీర్పు చెప్పారు.

శ్రీహరి గారికి సంస్కృతాంధ్ర వాఙ్మయపారీణతతో పాటు తెలంగాణా మాండలికాల పట్ల లోతైన అవగాహన ఉంది. "తెలంగాణా మాండలికంలో సమాపక క్రియారూపాలు", "తెలంగాణంలోని తెలుగు పలుకుబళ్ళు" అనే వ్యాసాల్లో ఆంధ్రప్రాంతీయులకు తెలియని తెలంగాణంలోని ప్రత్యేక పదాల, విలక్షణ ప్రయోగాల స్వరూప స్వభావాలను ఆసక్తికరంగా వింగడించి చూపారు.

శ్రీహరిగారిలో ఒక ప్రౌఢ వ్యాకరణమర్మజ్ఞుడేకాదు, వర్తమాన వ్యావహారిక భాషాభిజ్ఞుడు కూడా కుదురుకుని వున్నాడని ఈ రెండు వ్యాసాలు సహేతుకంగా చాటుతాయి. "నేటి వాడుక తెలుగులో కొన్ని అపప్రయోగాలు" అనే వ్యాసంలో నా దృష్టిని పదే పదే మీటుతున్న కొన్ని ప్రయోగాలను ఆయన విశ్లేషించి చూపారు. ఉదాహరణకు ''మహిళా బాధితులకు సత్వర న్యాయం" అనేది. వాళ్ల మహిళలచేత బాధింపబడినవారు కాదు. బాధలకు లోనైన మహిళలు. శ్రీహరి గారన్నట్టు "బాధిత మహిళలు" అని ఉండడమే సముచితం. అలాగే "విచ్ఛిన్న కరశక్తులు" అనే విచిత్ర ప్రయోగం వాడుకలో ఉంది. "విచ్ఛిన్న" అంటేనే చీలిపోయిన అని అర్థం. ఆ శక్తులు చీలిపోయినవి కావు-చీల్చేవి. అలాంటప్పుడు "విచ్ఛేదకర శక్తులు" అనడం సమంజసం. ప్రాచీన మహాకవి ప్రయుక్తాలైన "దినవెచ్చము" "కరకంఠుడు'' లాంటి మిశ్రసమాసాల్లాగా, ఈ 'అపార్థ' ఘటిత ప్రయోగాలు అసలు అర్థంలోనే వాడుకలో చోటు చేసుకున్నాయి. వీటిని మనం ఆపలేకున్నా అంతర్యం తెలుసుకోవడం ధర్మం. ఈ కోవకు చెందిన అపప్రయోగాలెన్నిటినో శ్రీహరిగారు ఉదాహరించారు.

ఈ సంపుటి పేరు "ఉభయ భారతి.'' ఆ దృష్టితో ఇది సార్థకాభిధ. సంస్కృతాంధ్ర భాషా సాహిత్య సంబంధి వ్యాసమణులు ఈ కోశం నిండా ఉన్నాయి. ఆచార్య శ్రీహరిగారు కోటికెక్కిన "ఉభయభారతీ"యులు.

శ్రీహరిగారి పరిశీలన, పరిశోధన ప్రవృత్తులకు ఈ వ్యాసాలు నిక్కమైన గీటురాళ్లు.

ఆచార్య నాయని కృష్ణకుమారి
రాలు
తెలుగు విశ్వవిద్యాలయం

# ముందుమాట

డా॥ రవ్వా శ్రీహరిగారి "ఉభయ భారతి" వ్యాస సంపుటిని చూచాను. బహుముఖాలుగా విస్తరిల్లిన ఆయన పాండిత్యం ఈ పాతిక వ్యాసాలలోను పుష్కలంగా ప్రకటితమౌతున్నది. ప్రాచీన తెలుగు కావ్యాలు, వాటికి సంబంధించిన పాఠ పరిష్కరణలు, వాటిలో గుర్తింపబడిన భాషా ప్రయోగ విశ్లేషణే కాక రామాయణ కల్పవృక్షం వంటి ఆధునిక కావ్యానికి సంబంధించిన భాషా విశేషాలు, ఇటీవలి కవిత్వంలోని ప్రయోగవిశేషాలు ఆయనకు ప్రాచీన, ఆధునిక కావ్యాలలో గల గాఢపరిచయాన్ని వెల్లడిచేస్తున్నవి.

ఇందులో తెలుగు, సంస్కృత భాషలలోని వ్యాకరణ ప్రయోగాలు, వ్యాకరణాంశాల వివరణలు మనల్ని తలవూచేటట్లు చేస్తాయి. ప్రాచీన కావ్యాల పరిష్కరణ, సంస్కృత నిఘంటువుల వైవిధ్యం, తెలుగుకు సంబంధించిన అలబ్ధ వాఙ్మయం, తెలుగు మాండలిక శోభ- ఇవన్నీ మనల్ని ఆలోచింపజేస్తాయి. విషయ వైవిధ్యం కలిగిన ఈ వ్యాసాలన్నీ పండితులను ఆకట్టుకొనేవే. ఎన్నో విషయాలను పలు కోణాల్లో పరిశీలించి, విశ్లేషించి, పాఠకలోకానికి సమర్పించిన శ్రీహరిగారు అభినందనలకు అర్హులు. ఈ గ్రంథానికి పండితలోకం మధ్యకు ఆహ్వానం. గ్రంథకర్తకు నా శుభకామన.

# నా మాట

ఈ వ్యాససంపుటిలో ఇరవై యైదు వ్యాసాలున్నాయి. ఇవి సాహిత్యానికి, భాషకు సంబంధించినవి. వీటిలో కొన్ని ఆయా సందర్భాల్లో సదస్సుల్లో చదివి నవి. మరికొన్ని ప్రత్యేకించి ప్రత్యేక సంచికలకు రాసినవి. వీటన్నిటినీ సంపుటీక రించి 'ఉభయభారతి' పేర సహృదయపాఠకులకు అందజేస్తున్నాను.

ఈ వ్యాససంపుటిని ప్రాతఃస్మరణీయులు, నా వ్యాకరణగురువులు కీ.శే. శ్రీ కే.కే. శఠగోపరామానుజాచార్యస్వామివారికి భక్తిపూర్వకంగా అంకితం చేస్తున్నాను. వీరు హైదరాబాదులో వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాలను స్థాపించి, ప్రిన్సిపాలుగా దానిని దీక్షతో నిర్వహించి, తెలంగాణంలో సంస్కృత భాషాదీపాన్ని ఆరిపోకుండా రక్షించి, నావంటి ఎందరికో జీవికను ప్రసాదించిన సంస్కృతభాషా సేవకులు. శిష్యవాత్సల్యం రూపుగొన్నవారు. నన్ను ప్రత్యేకంగా అభిమానించి తమ ఇంటికి పిలిపించుకొని మహాభాష్యాన్ని బోధించిన ఉదారహృదయులు. వారి ఋణం తీర్చుకోలేనిది. ఈ వ్యాస సంపుటిని వారికి అంకితంచేసి కొంతైనా ఋణవిముక్తి పొందగలిగితే ధన్యుణ్ణిగా భావిస్తాను.

నామీది అభిమానంతో ఈ వ్యాససంపుటికి ముందు మాటలు రాసి నన్ను అభినందించిన ఆంధ్రసారస్వతపరిషత్తు అధ్యక్షులు, జ్ఞానపీఠఅవార్డుగ్రహీత, పద్మభూషణ, ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి, తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షురాలు ఆచార్య నాయని కృష్ణకుమారిగారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని ముద్రించుకోవడానికి వీలుగా యథోచితంగా ఆర్థిక సాహాయ్యం చేసిన హైదరాబాదు విశ్వవిద్యాలయాధికారులకు - ప్రధానంగా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య గోవర్ధన్ మెహతాగారికి నా కృతజ్ఞతలు.

గ్రంథాన్ని త్వరగా ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాస్‌గౌడ్‌గారికి శుభాకాంక్షలు.

—ఆర్. శ్రీహరి

# ఇందులోని వ్యాసాలు


| | | |
|---|---|---|
| 1. | భాస్కర రామాయణంలో పాఠ భేదాలు | 1 |
| 2 | తెలుగులో సాదృశ్యవాచకాలు-ప్రయోగవిశేషాలు | 7 |
| 3. | భాస్కర, రంగనాథ రామాయణములు-తులనాత్మకపరిశీలనము | 14 |
| 4. | తెలంగాణా మాండలికంలో అసమాపకక్రియా రూపాలు | 31 |
| 5. | సంకలనగ్రంథంగా ప్రబంధరత్నావళి | 40 |
| 6. | తెలుగులో అనుకరణవాచకాలు | 49 |
| 7. | ప్రాకృతాంధ్ర భాషాసాహిత్యాలు | 56 |
| 8 | తెలంగాణంలోని తెలుగుపలుకుబళ్ళు | 68 |
| 9. | తెలుగుకవుల సంస్కృతానుకరణలు | 77 |
| 10. | పాణినీయంలో లాఘవం | 87 |
| 11. | మహమ్మదీయుల సంస్కృతసాహిత్యసేవ | 96 |
| 12. | మాధవీయ ధాతువృత్తి | 103 |
| 13. | తెలుగులో భగవద్గీతలు | 110 |

14. పోతన భాగవతేతరభాగవతాలు 120

15. తెలంగాణా మాండలికంలో సమాపకక్రియారూపాలు 132

16 సంస్కృతసాహిత్యంలో స్మృతికవిత్వం 143

17 సంస్కృతనిఘంటువులు-వైవిధ్యం 160

18. అక్బర్‌షా రచించిన శృంగారమంజరి 172

19. సింహాసనద్వాత్రింశతి-భాషా ప్రయోగవిశేషాలు 177

20. సంస్కృతీకరింపబడ్డ తెలుగుకావ్యాలు 185

21. నేటి వాడుకతెలుగులో కొన్ని అపప్రయోగాలు 198

22 తెలుగులో అలబ్ధవాఙ్మయం 202

23. రామాయణకల్పవృక్షం-భాషావిశేషాలు 215

24. ప్రాచీన కావ్యాలు-పాఠపరిష్కరణ 22·

25 ఇటీవలికవిత్వం-భాషాప్రయోగవిశేషాలు 231

# భాస్కర రామాయణంలో పాఠభేదాలు

ప్రస్తుతం మనకు లభ్యమౌతున్న ముద్రిత భాస్కరరామాయణ ప్రతుల్లోని అరణ్యకాండ భాగాన్ని తాళపత్రప్రతులతో పోల్చి పరిశీలించినపుడు ముద్రిత పాఠానికి, తా.ప్ర. పాఠానికి అనేక భేదాలు కనిపిస్తున్నాయి. ఇతర కాండల్లో కూడా కొన్ని పాఠ భేదాలు కనిపించినా వాటికీ, అర. కాం. పాఠాంతరాలకూ విశేషమైన భేదం ఉంది. ఇతర కాండల్లో పద్యాల్లోని కొన్ని శబ్దాల్లోనో, పద్యైకదేశంలోనో పాఠాంతరాలు కనిపిస్తాయి. అర. కాం. లో మాత్రం పద్యాలకు పద్యాలే పాఠాంతరాలు తా.ప్ర.ల్లో దర్శనమిస్తున్నాయి. చాగంటి శేషయ్యగారు కొన్ని తా.ప్ర.లను పరిశీలించి వాటిలో కనిపించిన పాఠాంతర పద్యాలను కొన్నింటిని కవితరంగిణిలో చూపియున్నారు. వారు చెప్పిన విషయాలను వదలి తా.ప్ర.ల్లో నాకు కన్పట్టిన అర.కాం. పాఠభేదాలను - ప్రధానమైన వాటిని మాత్రమే ఈ వ్యాసంలో పరిశీలిస్తాను.

ముద్రిత భా. రా. లోని అర. కాం. లో మనకు రెండు పాఠాలు కనిపిస్తున్నాయి. వ్రాతప్రతి పాఠమని అక్కడక్కడా కొన్ని పద్యాలకు బదులుగా అథోభాగంలో కొన్ని పాఠాంతర పద్యాలు చూపబడ్డవి. ప్రధాన పాఠంగా చూపబడ్డ పద్యాలు వివరణాత్మకంగానూ, పాఠాంతర పద్యాలు సంక్షిప్తంగానూ కథాభాగాన్ని వర్ణిస్తున్నాయి. ఐతే అనేక తాళపత్ర ప్రతుల్లో ము.ప్ర.ల్లో పాఠాంతరంగా చూపబడ్డ పద్యాలు మాత్రమే ఉన్నాయి. కాని, ప్రధాన పాఠంగా చూపవలసిన యీ పద్యాలన్నింటికీ పరిష్కర్తలందరూ అధోగతిని ఎందుకు కల్పించినారో తెలియదు. ప్రధాన పాఠంలోని పద్యాలకూ, వాటికి పాఠాంతరంగా చూపబడ్డ పద్యాలకూ సంబంధించిన వివరాలు ఈ కిందివిధంగా ఉన్నాయి:

| ము. ప్ర. లో ప్రధాన పాఠ పద్యాలు | | | | ము. ప్ర. లో ప్రధాన పాఠానికి బదులుగా చూపబడ్డ పాఠాంతర పద్యాలు |
|---|---|---|---|---|
| 1. ఆశ్వాసము | | | | |
| 66 వ పద్యం నుండి | 71 వరకు | = | 6 | 4 |
| 168 ,, | 190 ,, | = | 22 | 10 |
| 192 ,, | 199 ,, | = | 8 | 6 |
| 214 ,, | 244 ,, | = | 31 | 25 |
| 261 ,, | 264 ,, | = | 4 | 1 |
| 266 ,, | 279 ,, | = | 14 | 8 |
| 281 ,, | 291 ,, | = | 11 | 6 |
| | | | 96 | 66 |
| 2. ఆశ్వాసము | | | | |
| 77 ,, | 91 ,, | = | 15 | 9 |
| 148 ,, | 389 ,, | = | 242 | 62 |
| 406 ,, | 423 ,, | = | 18 | 21 |
| | | | 275 | 92 |

పైన చూపబడ్డ ప్రధానపాఠసంఖ్యనూ, పాఠాంతరపద్యసంఖ్యనూ పరిశీలిస్తే పాఠాంతరపద్యాలను రచించిన కవి క్లుప్తరచనయందభిమానం కలవాడని స్పష్టమౌతుంది. అధోభాగంలో పాఠాంతరంగా చూపబడ్డ పద్యాలే అనేక తా. ప్ర. ల్లో కనిపిస్తున్నప్పుడు వాటినే ప్రధానపాఠంగా చూపక పాఠాంతరంగా చూపడంవల్ల ము. ప్ర.లో ప్రధానపాఠంగా చూపబడ్డపద్యాలే బహు తా. ప్ర.ల పాఠమని పాఠకులు భ్రమపడడానికి అవకాశం కలుగుతుంది. ఆనందాశ్రమవారి భా. రా. (రెండవ ముద్రణం)[1] నికి పీఠిక వ్రాసిన తం. తేవప్పెరుమాళయ్య

1. 1912 లో ముద్రితము.

గారు తమ పీఠికలో ము. ప్ర. లోని ప్రధానపాఠపద్యాలను గూర్చి ఇట్లా వ్రాసినారు,

"అర. కాం. న వ్రాతప్రతుల చూపట్టు పాఠము మిక్కిలియు సంగ్రహముగా నుండవచ్చు. ప్రతులందలి పాఠమదేమి కారణమో అంతకంటె చాల నధికముగాను బెక్కుచోట్ల మిక్కిలియు భిన్నముగాను చూపట్టుచున్నది. కొన్నిచోట్ల వ్రాతప్రతుల యొక్క పద్యమునకు అచ్చుప్రతులంగానిపించు నధిక పద్యములుగాని, భిన్నపద్యములుగాని మాకు దొరికినన్ని వ్రాతప్రతులందును, ప్రాచ్యలిఖితపుస్తక భండారమందలి ప్రతులందును గానిపింపవు. ఈ గ్రంథమును తొలుత ముద్రణము గావించిన కరాలపాటి రంగయ్యగారు మంచి కవి యగుటచే సంగృహీతములుగాను, గ్రంథపాతములుగాను నున్నయెడల సొంత కవనముచే బెంచియు బూరించియు నుండునేమో యని సందేహము గలుగుచున్నది."[1]

ము. ప్ర. లోని వివరణాత్మక పద్యాలన్నీ కరాలపాటివారు రచించినవేమో యని తేవప్పెరుమాళ్ళయ్యగారు సందేహించినారు. కాని, యివి కరాలపాటివారు రచించి ప్రక్షిప్తము చేసిన పద్యాలు కావు. ఈ పద్యాలున్న ప్రాచీన తాళపత్ర ప్రతులు రెండు ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ) గ్రంథాలయంలో ఉన్నాయి."[2] ఈ రెండు ప్రతులూ ఒక్క రీతిగా లేవు. ప్రధాన పాఠంలోని పద్యాలతోపాటు అక్కడక్కడా ము. ప్ర. లో చూపబడ్డ పాఠాంతరపద్యాలు కూడా వీటిలో ఉన్నాయి. 100/14 నెంబరు కాకినాడ ప్రతిలో 1 ఆ. 66 వ పద్యం నుండి 71 వ పద్యం వరకు ము. ప్ర. లోని ప్రధాన పాఠపద్యాలు. తక్కినచోట్ల పాఠాంతర పద్యాలు. రెండవ అశ్వాసంలో మాత్రం అంతటా ము. ప్ర. లోని పాఠాంతర పద్యాలే ఉన్నాయి. 183/14 నెంబరు ప్రతి (కాకినాడ)లో మాత్రం 1 వ ఆశ్వాసమంతా ము.ప్ర. ప్రధాన పాఠ పద్యాలు. 2 వ ఆశ్వాసంలో 77 నుంచి 91 వ పద్యంవరకు ప్రధాన పాఠమూ, 148 నుండి 389 వరకు పాఠాంతర భాగమూ ఉన్నాయి. ఈ రెండు ప్రతుల్లో అక్కడక్కడా పాఠాంతర పద్యాలున్నా వాటికి బదులు ప్రధాన పాఠ పద్యాలు ఉన్న తా.ప్ర.లు కూడా తప్పక ఉండి ఉంటాయని ఈ వ్యాసకర్త అభిప్రాయం.

---

1. పేజి XVI. 3. నెం. 100/14; నెం. 183/14.

పైన పేర్కొన్న తా.ప్రల్లో ము.ప్ర.ల్లో కానరాని అనేక పద్యాలు ఆయా ఘట్టాల్లో అధికంగా కానవస్తున్నాయి. శ్రీరాముడు శరభంగ, సుతీక్ష్ణులను దర్శించడం ము.ప్ర.లో 23 గద్య పద్యాల్లో వర్ణింపబడితే[1] ఈ రెండు ప్రతుల్లో సుమారు 50 గద్య పద్యాల్లో విపులంగా వర్ణితమైంది. ఈ ఘట్టంలోని రెండు పద్యాలను మాత్రం ఉదాహరిస్తాను.

వాసపరత్యముల్ హరితవర్ణములంబరచారు లీ రథా
గ్రేసరులైన విందు దిలకించి కెలంకుల నస్త్రప్రాణులై
భాసురలీల గ్రాలు నెలప్రాయములుం గలవారు నాకభూ
వాసుల నింగి నిట్లు వినవచ్చు రవంబులు దివ్యగానముల్.

రాక నలంకరించు నుడురాజున నొప్పెడు నాతపత్రమ
స్తోకమణిప్రభాపటలితో రమణీకర ధూయమాన చా
మీకర చారుచామర సమీరవిహారవిలోలకుంతలున్
దా(నా) కమనీయు డింద్రుడగునైనను నేర్పడ జూచి వచ్చెదన్."[2]

అగస్త్యుడు శ్రీరామునికి దివ్యాయుధాలను ప్రసాదించే ఘట్టం మొదలుకొని ఖరుడు శ్రీరామునిపై కదిలివచ్చే ఘట్టం వరకు గల విషయమంతా ము.ప్ర.ల్లో 71 గద్య పద్యాల్లో వర్ణింపబడింది. వీటిలో జంబుకుమార వధ ఘట్టం కూడా ఉంది. ఈ ఘట్టం వర్ణితమైన ఇరవై పద్యాలను తీసివేస్తే, పై ఘట్టాలు యాభై పద్యాల్లో వర్ణింపబడ్డవన్నమాట. వీటికి బదులుగా 183/14 (కాకినాడ) నెంబరు ప్రతిలో సుమారు నూరు వేరే పద్యాలు కనిపిస్తున్నాయి. వాటిలో రెండింటిని మాత్రం పేర్కొంటాను:

"అరుదగు మేని మాంస మవినాయత దంష్ట్రిలు ఘోరవక్త్రి గ
హ్వరమును దీర్ఘజంఘలు నుదగ్రమహోల్కల నీను నక్షి వి
స్ఫురణము నూర్ధ్వకేశములు జూడ్కికి నోట యొనర్ప పంక్తి కం
ధరు ననుజన్మ శూర్పణఖ నా నొక రాక్షసి వచ్చె చెచ్చెరన్."

1. భా.రా. 1, 41 - 63.

2. నెం. 100/14 తా 91 (బి) కమ్మ; 183/14 100 (ఏ) కమ్మ.

ఇట్లు వికృతాకారంబు ఘోరంబుగా జనుచెంచి;

దలదిందీవర సుందరద్యుతియుతుం దారుణ్యలక్ష్మీ సము
జ్జ్వలు నుద్బంధురకంధరుం గరికరస్పర్ధోరుబాహార్గళుం
జలజస్ఫారవిశాలలోచను విరాజత్పార్థివవ్యంజనా
కలనాలంకృతుఁగాంచె కట్టెదుర నా కాకుత్స్థవంశాగ్రణిన్.[1]

ఐతే, ఈ అధిక పద్యాలన్నీ భా.రా.లో ఎట్లా ప్రవేశించాయి? అనే విచికిత్స కలుగుతుంది. అర. కాం. సంక్షిప్తంగా ఉందనే కారణంగా ఎవరో అనంతరకవులు వర్ణనప్రీతిచే ఆయా సందర్భాలలో తమ పద్యాలను ప్రక్షిప్తం చేసి ఉండవచ్చునని నా ఊహ. ఈ నా ఊహను బలపరిచే ఒక తా. ప్ర. ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో ఉన్నది.[2] ఈ ప్రతిలో అయోధ్యారణ్య కాండలు వివిధ వర్ణనలతో సంభరితాలై ము. ప్ర. భాగంకన్నా నాలు గింతలు విపులంగా ఉన్నాయి. ఈ ప్రతి అయోధ్యాకాండ ప్రారంభంలో ఈ క్రింది రెండు పద్యాలు కనిపిస్తున్నాయి:

శ్రీనుత నూకలాఖ్య కులశేఖరు రంగనృపాలు వాక్సుధా
నూన వివర్ధితాత్మహృదయోల్లసదంబుజుడై కవీంద్రమదా
దానకృతి క్రియానిపుణతాఖని మామిడిపల్లి వేంకటా
ఖ్యానుడు కీర్తిభాసురు డకల్మషుఁ డూర్జిత కౌతుకంబునన్.

శ్రీరామాయణమందు భాస్కరకవిశ్రేష్ఠుండు సంక్షేప లీ
లారూఢస్థితి కాండపంచక మయోధ్యాకాండయే యాదిగా
శ్రీ రంజిల్ల రచించె నందు కథలన్ శ్రేష్ఠప్రసిద్ధంబులన్
సూరివ్రాతము మెచ్చఁజెప్పె ధర నాసూర్యాబ్జమై వర్ధిలన్.[3]

---

1. 111 (బి) వ కమ్మ.
2. టి 527.
3. 47 (ఎ) వ కమ్మ.

పై పద్యాలవల్ల మామిడిపల్లి వేంకటార్యుడే యీ ప్రతిలోని అధిక పద్యాల కర్త యని స్థూలంగా ఊహింపవచ్చు. మొత్తంపై భాస్కర రామాయణంలోని అయోధ్యారణ్యకాండలను పెంపు చేయడానికి కవులు ప్రయత్నం చేసినారన డానికి ఈ ప్రతి ప్రబలసాక్ష్యమనడంలో సందేహం లేదు.

ప్రస్తుతం మనకు లభ్యమౌతున్న భాస్కర రామాయణ ముద్రిత ప్రతుల్లో అర. కాం. అనేక ప్రక్షిప్త పద్యాలతో కూడి ఉన్నట్లుగా పైన పేర్కొన్న విష యాల వల్ల తెలుస్తుంది. తా. ప్ర. పాఠాలతో పరిశీలన చేసి భా.రా. లోని అర. కాం. స్వరూపాన్ని నిర్దుష్టంగా తేల్చి చూపవలసిన అవసరం ఎంతైనా ఉంది. విశ్వవిద్యాలయాలో, పరిశోధన సంస్థలో ఈ కార్యాన్ని చేపడితే ఎంతో సముచి తంగా ఉంటుంది.

(ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్సు ప్రొసీడింగ్స్ (1980) లో ముద్రింపబడ్డ వ్యాసం.)

# తెలుగులో సాదృశ్యవాచకాలు - ప్రయోగవిశేషాలు

సాదృశ్యాన్ని తెలిపే అట్లు, పోలె, బలె, వలె అనే శబ్దాలు ఇవార్థకాలు. వీటిని ప్రయోగించేటప్పుడు ప్రకృతి విభక్తిలో వచ్చే మార్పులను ప్రౌఢవ్యాకర్త సమాసపరిచ్ఛేదంలోని ౩౨ వ సూత్రంలో వివరించినాడు. ఈ సూత్రాన్ని స్పష్టత కోసం కిందివిధంగా నాలుగు సూత్రాలుగా విభజించవచ్చు.

1. ఉపమేయము ప్రథమాంతమగునపుడు 'అట్లు' పరంబగుచో ఉపమానంబులగు నామ, తదస్మద్యుష్మదాత్మార్థములకు షష్ఠి యగును.

2. ఉపమేయము ప్రథమాంతమగునపుడు పోలె, బలెలు పరంబగుచో నామ తచ్ఛబ్దార్థములకు ప్రథమయు, నస్మదర్థ ప్రభృతులకు ద్వితీయయు నగును.

3. ఉపమేయము ప్రథమాంతమగునప్పుడు వలె పరంబగుచో నామతచ్ఛబ్దార్థములకు షష్ఠియు, అస్మదర్థాదులకు షష్ఠీ ద్వితీయలయందెదియే నొక్కటియు గ్రమంబుగ నగు.

4. ఉపమేయము ద్వితీయాద్యంతమగునపుడు పోలె ప్రభృతులు పరంబులగుచో ఉపమానంబులకుపమేయవిభక్తుల యగు.

పై సూత్రాలలో మొదటి మూడు సూత్రాలు ఉపమేయం ప్రథమాంతంగా ఉన్నప్పుడూ, చివరి సూత్రం ఉపమేయం ద్వితీయాంతంగా ఉన్నప్పుడూ ప్రకృతి విభక్తిలో వచ్చే మార్పును వివరిస్తున్నాయి. మొదటి మూడింటిలోనూ మొదటి సూత్రం అట్లు అనేది పరంగా ఉన్నప్పుడూ; రెండో సూత్రం పోలె, బలెలు పరంగా ఉన్నప్పుడూ; మూడో సూత్రం 'వలె' పరంగా

ఉన్నప్పుడూ ప్రకృతి విభక్తిలోని మార్పులను నిర్దేశిస్తున్నాయి. దీన్నిబట్టి ఉపమేయం ప్రథమాంతంగా ఉన్నప్పుడు ప్రకృతి విభక్తుల మార్పును నిర్ణయించే ఇవార్థకాలను మూడు రకాలుగా విభజించవచ్చు.

1. అట్లు
2. పోలె, బలె
3. వలె

ఐతే మొత్తం భాషలో ఇవార్థకాలు ఈ నాలుగు మాత్రమే కాక మరెన్నో ఉన్నాయి. వాటిని ప్రౌఢవ్యాకర్త 'అట్లు' కరణ్యాదులకు గ్రాహకంబు (సమాస 38) అని చెప్పి, తక్కిన ఇవార్థకాలన్నింటినీ సంగ్రహించినాడు. ఐతే, కరణ్యాదులైన ఇవార్థకాలేవో తెలుసుకునే ముందు తెలుగుభాషలో ఇవార్థకాలుగా వాడబడే శబ్దాలేవో తెలుసుకుందాం:

తెలుగులో ఇవార్థాన్ని తెలియజేసే పదాలను రెండురకాలుగా పేర్కొనవచ్చు:

1. అట్లు, పోలె, బలె, వలె అనేవి. ఇవి అవ్యయాలు.
2. విధము, ఓజ, భంగి మొదలైనవి. ఇవి నామవాచకాలు.

అంటే-ఇవార్థమైన సాదృశ్యార్థాన్ని అట్లు మొదలైన అవ్యయాలద్వారానే కాకుండా విధము, ఓజ, భంగి మొదలైన నామవాచకాలద్వారా కూడా తెలియజేయవచ్చునన్నమాట, ఉదా: రామునివలె, రామునిభంగి మొ॥ ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు కూర్చిన తెలుగుపర్యాయపద నిఘంటువులో విధము అనే ఆరోపంకింద చూపబడిన ఈ కింది పదాలనన్నింటినీ ఇవార్థకాలుగా గ్రహించవచ్చు.

| | | | | |
|---|---|---|---|---|
| అందము | అచ్చు | అనువు | అలవి | అలవు |
| ఓజ | కట్టడ | కరణి | కైపు | కైవడి |
| క్రియ | గురుతు | గోము | చంధము | చక్కటి |
| చదురు | ఛాయ | ఛాళి | చూడిక్కి | చెన్ను |

| | | | | |
|---|---|---|---|---|
| జాడ | జాతి | జాను | జోక | జెక్కు |
| తేవ | తీరు | తెన్ను | తెరగు | తేకువ |
| తోగ | దతు | దార | దారి | దినుసు |
| దెప్పరము | దెస | నలువు | నిజము | నీటు |
| నెపము | నెఱి | నేర్పు | పగటు | పగిది |
| పదురు | పద్ధతి | పన్ను | పరపు | పరసు |
| పరువడి | పఱి | పస | పాగు | పాగెము |
| పూనిక | పెంపు | పెచ్చు | పెలుచ | పెలు |
| పొందిక | పొందు | పొలము | పొలుపు | పోడిమి |
| ప్రకృతి | బడి | బలువిడి | బాగు | బాళి |
| బెడగు | భంగి | భాతి | భావము | మట్టు |
| మర్యాద | మవ్వము | మాడ్కి | మాదిరి | మానము |
| ముట్టు | మెండు | మే | మేర | మై |
| ఎస | ఒరవు | సొలుపు | రమణ | దీటు |
| | క్రమము | ఢంగు | వక్క(క్కా)ణ | ఢీక |

| | | | |
|---|---|---|---|
| చక్కదము | మొగి | రేక/రేఖ | వరుస |
| చొప్పు | రీతి | వన్నె/వన్నియ | విధానము |
| ఠీవి | వగ | వాలకము | వైఖరి |
| తేట | వహి | వెంబడి | సంచు |
| పదకము | సరవి | సోయగము | రాణ |
| పరిపాటి | సొబగు | రకము | వక్కా(క్క)ణము |
| పాటి | మొడికట్టు | లీల | వలను |
| పొంకము | రూపు | వన్నువ | విన్ననువు |
| సంగడి | సొంపు | నులివు | వైళము |
| ప్రకారము | వడగు | వితము | వైనము |
| బిరుసు | వాటు | వెరవు | సరణి/సరళి |
| మతము | వెంట | సంగతము | సొగసు |
| మార్గము | శయ్య | సూటి | విధము. |
| మైవడి | సవతు | హరువు | ఘావణిక |

స్వర్ధు

ఇవి మొత్తం 152 పదాలు. ఇవికాక వీటి అర్థంలో ప్రయోగింపబడే మరికొన్ని శబ్దాలు కూడా ఉన్నాయి. అవి యివి.

ఆకృతి, ఇరవు, ఉపమ, ఉనికి, వత్తు, ఒడికము, ఒరపు, కడిది, కేళి, కొలది, గమనిక, గరిమ, గతి, చాడ్పు, చాగు, చెలువు, చెలువము, డాలు, తెరకువ, తరుచన, తూనిక, త్రోవ, తేజము, నిలుకడ, నడవడి, పేరిమి, ప్రౌఢి, బలిమి, మహిమ, మెరవడి, మెలుపు, రహి, రుచి, లాగు, వీక, వృత్తి, వడువు, పోల్కి, పోలిక, సాటి.

వీటిలో క్రమము, జాతి, పద్ధతి, విధము, మార్గము, మహిమ, రుచి, వృత్తి మొదలైనవి తత్సమశబ్దాలు. తక్కినవి అచ్చికాలు. ఈ పదాలన్నీ సాక్షాత్తుగా ఇవార్థకాలు కాకపోయినా పరోక్షంగా ఇవార్థంలో వాడబడుతున్న శబ్దాలే. ఈ శబ్దాలనన్నింటినీ ప్రౌఢవ్యాకర్త, ఉపమేయము ప్రథమాంతమగు నపుడు అట్లు పరంబగుచో అనే సూత్రం (శబ్ద, 38) లో అట్లు శబ్దంతో సూచించిన కరణ్యాదులుగా భావించవచ్చు. ప్రౌఢవ్యాకర్త చెప్పినట్లుగా ఉపమేయం ప్రథమాంతంగా ఉన్నప్పుడు ఈ శబ్దాలు పరమైతే ఉపమానాలైన నామ, తదస్మద్యుష్మదాత్మార్థకాలకు షష్ఠీవిభక్తి వస్తుంది.

వీటిలో భంగి, కరణి, మాడ్కి, వడువు, పగిది, విధము, రమణి, అట్లు అనేవి ఇవార్థకాలే ఐనా, మళ్ళీ వీటిపై ఇవార్థకప్రయోగం నన్నయాది ప్రాచీనకవుల కావ్యాల్లో కనిపిస్తుంది.

అట్లు + పోలె:

బాలునట్లపోలె (ద్రోణ. 3.274)

ఉచ్చారణదక్షుచేత నభిహితంబగు శబ్దంబు నట్లపోలె (ఆది. 1-3-12)

అట్టులు + కైవడి

అతనిమేను కుంతియట్టులకైవడి (శాంతి. 1-12)

భంగి + పోలె

కల్లు పూసిన యద్దంబు భంగివోలె నిజవిభాతి దఱికి (కు. సం. 9

కులగిరుల్ గ్రొలువున్న భంగివోలె (కు.సం. 3-13)

బ్రయలువడ డించిపోయిన భంగివోలె (కు. సం. 5 - 78)

నిగళంబువెట్టిన పగిదివోలె (కు. సం. 9-
కేకించు పురినమ్మి పగిదివోలె (కు. సం. 5-86).

విధము+పోలె
విత్తుగా డాచికొనియున్న విధమపోలె (కు. సం. 6-126).

చాడ్పు+పోలె
శారద నీరద సమూహిచాడ్పున బోలెన్ (కు. సం. 11-162).

కరణి+పోలె
నుత, సుధాకరరేఖ యుదయించు కరణివోలె (కు. సం. 3-

వడువు+పోలె
నందన, వనము గాపువచ్చు వడువవోలె (కు. సం. 5-23).

రమణ+పోలె
హేమరాజీవ ముదయించు రమణవోలె

మాడ్కి+పోలె
మద్దికాయలు మాటిడ్డ మాడ్కివోలె.

లీల+వోలె
నీతిధ్వజుని రథరథ్యసారథుల లీలవోలె (విక్రమార్క చరిత్రము 6-88)

పై ఉదాహరణలవల్ల పోలె, క్రైవడి అనే రెండు ఇవార్థకాలు మాత్రమే ఇవార్థకాలపై చేరుతున్నట్లుగా తెలుస్తుంది. ఇవార్థకాలపై ఇవార్థకాలు చేరిన ప్రయోగాలు నన్నయ, తిక్కనల భారత రచనలో కనిపించినా; కవిత్రయ భారతంలోని విశేష ప్రయోగాలను గుర్తించిన ప్రౌఢవ్యాకర్త ఈ విశేషాన్ని తన వ్యాకరణంలో పేర్కొ లేదు. అంతేకాక - అట్లపోలె, విధమపోలె, వడువపోలె మొదలైనచోట్ల పోలె పరమైనప్పుడు అట్లు, విధము, వడువు మొదలైన శబ్దాలపై అవధారణార్థకమైన 'అ' చేరడం కూడా కనిపిస్తుంది. నామాదులపై ఇవార్థకం చేరినప్పుడు కూడా అవధారణార్థకం చేరిన ప్రయోగాలు కనిపిస్తాయి. ఉదా :- ఇష్టుడపోలె (భార. ఆది. 6-112) సర్పమపోలెన్ (భార. ఆది. 6-112) మొ॥ ఐతే, ఈ ప్రయోగాల్లో అవధారణార్థ మేమీ కనిపించదు. ప్రౌఢవ్యాకర్త ఈ ప్రయోగాలోని ఈ విశేషాన్ని కూడా తన వ్యాకరణంలో

పేర్కొ-లేదు. పోలెన్ అనే ఒక్క- ఇవార్థకం పరంగా ఉన్నప్పుడే అవధారణార్థకమైన 'అ' చేరుతుంది. వలెన్, బలెన్ మొదలైనవి పరంగా ఉన్నప్పుడు మాత్రం చేరదు. ఇది గమనింపదగిన అంశం. ఉపమేయం ప్రథమాంతమైనపుడు, పోలె, బలెలు పరమైతే అస్మదర్థ ప్రత్యృతులకు ద్వితీయ విధింపబడింది. (ప్రౌఢ. శబ్ద. 38) నన్నుబోలె, నిన్నుబోలె మొ॥ శ్రీనాథుని రచనలో ఉపమేయం ప్రథమాంతమైనా అస్మదర్థానికి ద్వితీయ కాకుండా ప్రథమ వచ్చిన ప్రయోగం ఒక్కటి కనిపిస్తుంది.

ఏనుబోలె నెక్కటి యీ సర్వంసహాచక్రంబును భరియింపంగల
యదియే (కాశీఖండం - 1-100)

ఈవును నేన పోలెను మునీశ్వర (భీమ. 3 - 5)

ఉపమేయం ప్రథమాంతంగా ఉన్నప్పుడు 'వలె' పరంగా ఉంటే నామానికి షష్ఠీవిభక్తి విధింపబడింది. (ప్రౌఢ; శబ్ద. 38) కాని, దీనికపవాదంగా కేయూరబాహుచరిత్రలో కింది ప్రయోగంలో 'వలె' పరంగాఉన్నా నామం షష్ఠీ విభక్తిలోకాక ప్రథమావిభక్తిలో ప్రయోగింపబడడం గమనించదగ్గ అంశం.

"..................................మి
త్రుండువలె నుండి తగునే
యొండొరులకు గీడు సేయుటుచితమె మనలోన్" (3-252)

కావ్య ప్రయోగాలను పరిశీలించినపుడు ఇవార్థకాలకు సంబంధించిన ఇలాంటి ప్రయోగవిశేషాలెన్నో మనకు తెలిసే అవకాశం ఉన్నది.

(ఆచార్య కోవెల సంపత్కు-మారాచార్య షష్ట్యబ్దపూర్తి అభినందన సంచిక 'సాహితీ సంపద' 1993 లో ముద్రితం.)

# భాస్కర, రంగనాథ రామాయణములు– తులనాత్మక పరిశీలనము

తెలుగున వెలసిన రామాయాణములలో రంగనాథ, భాస్కర రామాయణములు మిక్కిలి ప్రసిద్ధి గాంచినవి. వీనిలో నొకటి దేశిరచనలో మూర్ధన్యము కాగా మరొకటి మార్గరచనలో తలమానికమైనది. రెండును అనేక కర్తృకములే. తెలుగున తొలుత వెలసిన భారత భాగవత రామాయణములు మూడును బహు కర్తృకములగుట యొక విశిష్ట ఘటనగా చెప్పవచ్చును. ఇంచుమించు ఏక కాలముననే ఈ రెండు రామాయణములు రచింపబడినను భా.రా.న కించుక పూర్వమే రం.రా. రచితమని విమర్శకుల యభిప్రాయము. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు తెలుగున మొదటి రామాయణము రం.రా.మే యని రం.రా. పీఠికలో నిరూపించియున్నారు.[1] భా.రా. న కించుక పూర్వము రచింపబడుట చేతను, దేశియచ్ఛందస్సులో రచితమై మిక్కిలి ప్రచారమును పొందియుండుట చేతను భా.రా. కర్తలు తమ రామాయణ రచనా సందర్భమున రం.రా.ను తప్పక చూచియే యుందురనియు, తత్ప్రభావము వీరిపై కలదనియు నిస్సంశయముగా చెప్పవచ్చును.

ఆచార్య లక్ష్మీకాంతంగారు తమ రం.రా. పీఠికలో భా.రా.న, రం.రా. అనుకరణలు కలవని సూచించుటయేకాక[2] తమ ఆంధ్ర సాహిత్య చరిత్రలో నట్టి యనుకరణలకు రెండు మూడుదాహరణములను కూడ చూపియున్నారు.[3] భా.రా. కర్తలు ప్రధానములగు కథాంశములనేకాక భావములను, అలంకారములను, పదబంధములను యథాతథముగ రం.రా. నుండి యనుకరించిరనుటకు అనేక దృష్టాంతములు గలవు. ప్రధానములగు కథాంశములను రం.రా. నుండి

1. గౌతమ వ్యాసములు పే. 126.
2. అందే పే. 128.
3. పే. 314, 315.

కాక మరే యితర గ్రంథమునుండియో అనుకరించిరని తలచుటకు వీలున్నను సమాన సందర్భములందు పద, భావాలంకారములందు కొట్టవచ్చినట్లుగా సాదృశ్యము భా. రా. న కనబడుటచే భా. రా. కర్తలు రం. రా.ను అనుకరించిరనియే చెప్పవచ్చును. ఐనను, కొన్నిచోట్ల రం. రా. ననుకరింపక, స్వతంత్రించి వర్ణించిన ఘట్టములును లేకపోలేదు. ఈ రెండు రామాయణములకు గల భేదసాదృశ్యములను పరిశీలించుటయే ఈ వ్యాసమునందలి ప్రధానాంశము. మొదట పదభావాలంకారములకు సంబంధించిన యనుకరణములను పరిశీలింతము.

## బాలకాండము :

1. రోమపాదుడు తన దేశమున యేర్పడిన యనావృష్టిని తొలగించుటకు ఋష్యశృంగుని ఉపాయమున తన నగరమునకు తీసికొనివచ్చుటకై యాతని యొద్దకు వేశ్యలను పంపగా, వారాతనిని రోమపాదుని నగరమునకు తీసికొని వచ్చిన ఘట్టము.

రం. రా. "ఒనరెడు దీమంబు లోక వింత మృగము
గొనివచ్చు తెఱగున గొనివచ్చి రతని" (పే. 12)

భా. రా. "తెచ్చిరి దీమముల్ మృగము దెచ్చినకైవడి
ముగ్ధ సంయమిన్" (1-94)

2. దేవతలు రావణుని యౌద్ధత్యమును గూర్చి బ్రహ్మతో మొఱపెట్టుకొన్న సందర్భము.

రం. రా. "వాడన్న కులగిరుల్ వడవడ వడకు
వేడిమి చూపగ వెఱచు భాస్కరుడు
వీకతో నితడున్న-వీట నెన్నడును
తేకువ చెడి గాలి తిరుగంగ వెఱచు
అ న్నిశాచరు గన్న నాటోప మెసగ
మున్నీరు గడలెత్తి మ్రోయంగ వెఱచు" (పే. 14)

భా. రా. "కడలెత్తి ప్రోయ వెఱచును
జడనిధు, లిను డెండ గాయ శంకిలు
బొడగనునెడ వాయువు లుర
వడి పీవక యడఁగు, గిరులు వడవడ వడకున్" (1 - 137)

3. వసిష్ఠుడు తనకు సురభి నీయనందులకు కోపించి విశ్వామిత్రుడు అతనిపై వారుణాద్యస్త్రములను ప్రయోగించును. వసిష్ఠుడు వానిని బ్రహ్మ దండముతో చక్కాడగా, విశ్వామిత్రు డాతనిపై బ్రహ్మాస్త్రము సంధించిన ఘట్టము.

రం. రా. "సకల గీర్వాణులు సకల సంయములు
సకల గంధర్వులు సకల పన్నగులు
సకల భూతంబులు సకల దిక్పతులు
సకల తారాగ్రహ చంద్ర సూర్యులును
సకల లోకంబులు చలనంబు నొంది" (పే. 48)

భా. రా. "సకలాసుర గంధర్వులు
సకలోరగ సకల భూత సకల దిశా పా
లక సకల గ్రహ తారక
సకలభువన సకలమునులు జలనము బొందన్" (1 -

4. విశ్వామిత్రుడు తనకు కామధేనువు నిమ్మని వసిష్ఠుని ప్రార్థించు

రం. రా. "లక్ష గుఱ్ఱంబులు లక్ష ధేనువులు
లక్ష యేనుగులు వే లక్షలు మణులు
నిచ్చెద నీ ధేను విమ్మ నా కనిన" (పే. 47)

భా. రా. "లక్ష తురగంబులను మఱి
లక్ష మదేభముల వేయి లక్షల మణులన్
లక్షల గోవుల నిచ్చెద
దక్షత నా కిమ్ము నీవు తగ నీ గోవున్" (1 - 557)

వాల్మీకమున

"గవాం శతసహస్రేణ దీయతాం శబలా మమ" (1-53-9)

అను శ్లోకమున తనకు కామధేనువు నిచ్చిన లక్షగోవుల నిచ్చెదనని మాత్రమే చెప్పినట్లుగ కలదు. తురగములు, మదేభములు, మణులు - వీని ప్రసక్తి వాల్మీకమున కన్పట్టదు. పై భా.రా. పద్యమునకు రం.రా. ద్విపదలే మూలము. గుఱ్ఱములను తురగములుగ, ఏనుగులను మదేభములుగ సంస్కృతీకరించుటయే భా.రా. పద్యమున కనిపించు భేదము.

5. సూర్యాస్తమయవర్ణన ఘట్టము.

రం.రా. "కడకమై విఱిచి రాఘవుడేపు మెఱసి
కడు మోదమున సీత గైకొను నెల్లి
నని రసాతలమున కంతయు జెప్ప
జనిన చందమున భాస్కరుడస్తమించె" (పే. 54)

భా. రా. "నా కులజుడైన రాముడు
శ్రీకంతుని విల్లు విఱిచి సీతం బ్రీతిన్
గైకొను రేపని చెప్పగ
నాకమునకు నరుగు విధమునన్ రవి గ్రుంకెన్" (1-683)

సూర్యాస్తమయమును ప్రకృత కథా వస్తువుతో సమన్వయించి ఉత్ప్రేక్షా రూపమున నింత రమ్యముగా వర్ణించుట వాల్మీకమున కన్పట్టదు. అందు-

"కర్మకాలో మునిశ్రేష్ఠ లంబతే రవిమండలమ్" (1-65-35) అను శ్లోకమున "లంబతే, రవి మండలమ్" అను రెండు పదములలో సాయంకాలమగుట నిరలంకారముగ వర్ణింపబడినది. పై భా. రా. పద్యమందలి భావమునకు మూలము రం. రా. మే. రామునకు "నా కులజుడైన" యను విశేషణమును చేర్చి మల్లికార్జునుడు రంగనాథ రామాయణమందలి భావమునకు మరింత సొగసును కూర్చినాడు.

**అయోధ్యాకాండము :**

దశరథుడు తనకు గల ముని శాపమును కౌసల్యకు తెలుపు ఘట్టము.

రం. రా. "నాడెల్ల నేలెడునాడు నా పిన్న
నా డొక్కనాడేను నడురేయి బోయి" (పే. 107)

భా. రా. "నా పిన్ననాడొక నాడేను నడురేయి
సరయూతటంబున" (11-304)

2. యజ్ఞదత్తుడను మునిబాలకుడు దశరథుని బాణముచే మృతినొందగా, నాతని తండ్రి కుమారుని గూర్చి విలపించు ఘట్టము.

రం. రా. "దీర్ఘాయు వని నిన్ను దీవింతుగాని
నిర్ఘాత పటుబాణ నిహతి పల్కితినె" (పే. 110)

భా. రా. "దీర్ఘాయు వనుట కర్థము
నిర్ఘాత పటిష్ఠ బాణనిహతియె పుత్రా!" (11 -)

ఈ భా.రా. పద్యమున రం.రా. నందలి భావమేకాక, పదబంధములును యథాతథముగ ననుకరింపబడినవి.

**అరణ్యకాండము :**

1. అకంపనుడు రావణునొద్దకు వెళ్ళి, రామునిచే ఖరదూషణాదులు మడిసిన విషయమును తెలుపుచు శ్రీరాముని పరాక్రమమును రావణునితో చెప్పు సందర్భము.

రం. రా. "మాటమాత్రంబున మహియు నాకసము
మీటను నాట నమ్మేటియే నేర్చు
కార్చిచ్చునైనను గరువలినైన
నార్చను గూర్చను నాతడే నేర్చు
భువనంబు లన్నియు బూది గావింప
నవి ప్రోది గావింప నాతడే నేర్చు
పొల్పడి బ్రహ్మాండభాండంబు నైన
నిల్పు బగుల్ప నా నిపుణుడే నేర్చు

జలరాసు లన్నియు జల్లి యింకింప
నలవడ నిండింప నాతడే నేర్చు
గ్రహతారకావళి గడు వడితోడ
మహి రాల్ప నవి నిల్ప మహిపతి నేర్చు" (పే. 145)

భా. రా. ధరణీతలంబు పాతాళంబునకు గ్రుంగ
నడప నింగికి నెత్త నతడె చాలు
గ్రహతారకౌఘంబు మహి గ్రందువడ రాల్ప
నవి పొందుపడ నిల్పనతడె చాలు
జలధు లన్నియు బాఱబల్లి యింకింపంగ
నవి నిండ బూరింప నతడె చాలు (111-249)

పై భా.రా. నందలి భావమేకాక ఎత్తుగడయు రం.రా. నకు ప్రతిరూప మనవచ్చును.

## కిష్కింధాకాండము :

1. తార లక్ష్మణుని కోపము నుపశమింపజేయు సందర్భము.

రం. రా. "మీరు పెట్టిన చెట్టు మిహిరనందనుడు" (పే. 194)
భా. రా. "మీ పెట్టిన చెట్టినజుడు" (1 - 489)

## సుందరకాండము :

1. హనుమంతుడు సముద్రమును దాటి లంకలో ప్రవేశించిన ఘట్టమున కావింపబడిన సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనములు.

రం. రా. "నే నున్న నమవుగా దీ లంక జొరగ
పీనికి నన్నట్లు వెస గ్రుంకె నినుడు" (పే. 211)

భా. రా. "నాకెంతయు బ్రియశిష్యుం
డీ కపివరు డితని పనికి నెడ గాకుండం
బోక యుచిత మను కరణి వి
భాకరు డపుడపరశిఖరిపై కరుగుటయున్" (V - 74)

రం. రా. "చుక్కలగమికాడు చూపట్టె మింట
పావని వీడెల్ల పరికింపవలసి
దేవత లెత్తిన దీపమో యనగ" (పే. 213)

భా. రా. "పావనికి సీత వెదకం
గా విశ్వము గానిపింప ఘనతమ మడపన్
దేవత లెత్తిన దీపము
కైవడి చందురుడు వెలిగె గగనతలమునన్" (V - 89)

## యుద్ధకాండ పూర్వభాగము :

1. శుకరూపమున వచ్చిన రావణదూత యగు శుకునితో సుగ్రీవుడు రావణునకు సందేశమును పంపు ఘట్టము.

రం. రా. "పటుకార్ముకంబె యూపంబుగా నిలిపి
చటులాస్త్రములు పరిస్తరణము ల్సేసి
పరగ గెందూళ్ళను బ్రబలుగా జేసి
తరుచర స్రుక్స్రువతతులు చేపట్టి
సమర భూవేదికాస్థలమున నిలిచి
అమరులకెల్ల ప్రియం బెక్కుచుండ
తొరగుచునున్న నెత్తురు నెయ్యి వోసి
మహిత గుణధ్వనుల్ మంత్రముల్ గాగ
.......................................
విడువక సంగ్రామ విపుల యజ్ఞంబు
గడు నొప్పజేయు రాఘవసోమయాజి" (పే. 266, 267)

భా. రా. "విలు యూపంబు, శరాళి దర్భతతి, మౌర్వీటంకృతుల్ మంత్రముల్
గళితాసృక్ఛట లాజ్యధారలు, నిషంగద్రోణికల్ స్రుక్స్రువం
బులుగా, రాముడు యాజకుండయి సమిద్భూవేదిఁ గోపానలా
ర్చులతో నద్దశకంఠుడన్ పశువు వ్రేల్చున్ నిర్జరప్రీతిగన్."
(VI-208)

ఈ పద్యమునందలి రూపకాలంకారమునకు మూలము రం.రా. ద్విపదలే. ఈ సందర్భమున వాల్మీకమున నిట్టి భావము కనుపింపదు.

2. నాగపాశబద్ధుడైన లక్ష్మణుని గుఱించి రాముడు బాధపడు ఘట్టము.

రం. రా. "జయశాలి యగుచున్న సౌమిత్రి లేని
జయము నాకంధుని చంద్రోదయంబు" (పే. 317)

భా. రా. "అంధునకైన చంద్రునుదయంబు తెఱంగుసుమీ" (VI-601)

## యుద్ధకాండ శేషము (అయ్యలార్యుడు) :

1. వానరులు లంకను గాల్చిన ఘట్టము :

రం. రా. "లలనల మణిమేఖలా రవంబులును
కలయ జెన్నొందు కంకణరవంబులును
పొలుపారు రత్ననూపుర రవంబులును
ఇంపారు బెంతయు నేలతో గలిసి" (పే. 382)

భా. రా. "రమణీ రమణీయమణి
క్రమ శుభకాంచీరవములు, గంకణఝుంకా
రములును, నూపురక నినా
దములును నొకమాత్రఁ బొలిసె దహనునిచేతన్" (VI-1152)

ఈ భావము వాల్మీకమున లేదు. రం. రా. నందలి భావమునే కాక అందు పేర్కొనబడిన మేఖలా, నూపురముల క్రమమునుకూడ అయ్యలార్యు డనుసరించినాడనుట స్పష్టమే కదా!

2. హనుమ సంజీవనిని రెండవమాఱు తెచ్చుటకు పోవుచున్నపుడు రాముడాతనితో పలుకు సందర్భము.

రం. రా. "అనుజులు మును మువ్వు రరయ నాకిప్పు
డనిలనందన నల్వురైరి నీతోడ" (పే. 432)

భా. రా. సోదరుల మేము నలువుర
మైదవ తోడఁగుదు వీవు ననయము జేతో

మోదంబు మిగుల గలుగన్
నాదెస గృపసేయవయ్య నగచరవర్యా" (VI - 1608)

హనుమంతునకు సోదర స్థానమిచ్చి గౌరవించిన యీ సన్నివేశమునకు రం. రా. మే మూలము. ఇట్టి మనోజ్ఞభావము

"ఇలలోన నల్గురము ఇపుడన్నదమ్ములము
ఇటుపైని మాతోటి హితవు మీఱంగ
ఐదవవాడగుదు అలరుచుందువు నీవు"

అను జానపదగేయమునందును కనిపించుచున్నది.

భా. రా. కర్తలు రం. రా. నందలి భావములను, అలంకారములను, పదబంధములను ఎట్లనుకరించిరో పైన నిరూపింపబడినది.

ఆయా కాండములందు సమాన సందర్భములలో నిట్టి యనుకరణము లనేకములు గలవు. విస్తర భీతిచే కొన్నింటిని మాత్రమే ఇట చూపుట జరిగినది.

ఇక కథాంశముల విషయముననను భా. రం. రా.లకు సాదృశ్యము గల ఘట్టము లనేకములు గలవు. వానిలో కొన్నింటిని మాత్రమే యిట చూపెదను.

**బాలకాండము :**

1. సంస్కృత రామాయణము లన్నింటను శ్రీరామాదులు జన్మించిన తిథి నక్షత్రములే చెప్పబడినవి. కాని, వారములు చెప్పబడలేదు. శ్రీరాముడు బుధవారమున జన్మించినట్లు భా. రా. తెలుపుచున్నది.దీనికి మూలము రం.రా.మే. కాని, రం.రా.న లక్ష్మణాదులు జన్మించిన వారముల ప్రసక్తిలేదు. కాని భా. రా. న భరతుడు గురువారమునాడు, లక్ష్మణ శత్రుఘ్నులు శుక్రవారము నాడు జన్మించినట్లుగ చెప్పబడినది.[1] మొల్లమ్మ మాత్రము రామాదు లందఱును ఆదివారమునాడు జన్మించినట్లుగ పేర్కొన్నది.[2] దీనికి కారణము వీరు రవివంశజులగుట కాబోలు!

1. 1 - 167, 2. మొ. రా. 1. 45.

2. రామాదుల వివాహమునకు పూర్వము దశరథుని వంశక్రమమును వసిష్ఠుడును, జనకుని వంశక్రమమును శతానందుడును తెలిపినట్లుగ రం. రా. న కలదు. భా. రా. నను కలదు. కాని, వా. రా. న వసిష్ఠు డిక్ష్వాకువంశ వర్ణన గావింపగా జనకుడే స్వయముగా తన వంశవర్ణన గావించినట్లుగ వర్ణింప బడినది.

## అయోధ్యాకాండము :

1. దశరథుని బాణనిహతిచే చంపబడిన మునికుమారుని పేరు యజ్ఞదత్తుడని భా. రా. న పేర్కొనబడినది. రం. రా. నను యజ్ఞదత్తుడనియే కలదు. వాల్మీకమున నీ పేరు కనిపింపదు. (అగ్నిపురాణమున మునిబాలకుని పేరు యజ్ఞదత్తుడనియే కలదు[1].) అంతేకాక, భా. రా., రం. రామాయణములందు రెండింటను పుత్రునికై ముని మాత్రమే కాక ముని భార్యయు విలపించుట వర్ణింపబడినది. వాల్మీకమున మునివిలాపము మాత్రమే కలదు.

## అరణ్యకాండము :

జంబుకుమారుని వృత్తాంతము రం.రా. నను, ముద్రితములగు భా. రా. ప్రతులందును కనిపించుచున్నది. అవాల్మీకమగు నీ యంశము రం. రా. నుండియే గ్రహింపబడినదని చెప్పుట కవకాశమున్నది. కాని, అసలు జంబుకుమారుని వధ వృత్తాంతము భాస్కరారణ్యకాండ కర్తృకమేనా యను విషయము నాలోచింపవలసి యున్నది. ముద్రితములగు భా.రా. ప్రతులన్నింటను కనిపించుచున్న ఈ విషయము ఈ వ్యాకర్త పరిశీలించిన అనేక తాళపత్ర ప్రతులలో నెక్కడను కనిపించుటలేదు. కనుక నీ జంబుకుమారుని వృత్తాంతము భాస్కర రామాయణారణ్యకాండ కర్తృకము గాదనియు, తరువాత నెవరిచేతనో ఇందు చేర్చబడి యుండవచ్చుననియు తలపవచ్చును. మొట్టమొదటిసారిగా భా.రా.ను పరిష్కరించి ముద్రింపించినవారు కరాలపాటి రంగయ్య గారు. వీరు స్వయముగా గొప్ప కవులగుటచే వారే యీ వృత్తాంతమును వ్రాసి యిందు చేర్చి యుండవచ్చునని నా యూహ. ఇట్టి ప్రక్షేప ఘట్టములు, పద్యములు

---

1. కౌసల్యాయై కథాం పూర్వాం యదజ్ఞానాద్ధతః పురా
క్షౌమ్యారే సరయూతీరే యజ్ఞదత్తకుమారకః (VI - 38)

భా.రా.న ఇంకెన్ని యున్నవో! పరిష్కృత ముద్రణము వచ్చినపుడుగాని తేలని విషయము.

రం.రా. ననుసరించిన అవాల్మీక ఘట్టములు భాస్కరారణ్య కాండలో మొత్తముమీద లేవనియే చెప్పవచ్చును. యుద్ధకాండ పూర్వభాగమున మాత్ర మిట్టి ఘట్టము లనేకములున్నవి. దీనినిబట్టి అరణ్యకాండ కర్తయును యుద్ధ కాండ పూర్వభాగకర్త యగు భాస్కరుడును ఒక్కరు కారేమో అన్న అనుమానమున కవకాశము కలుగుచున్నది. ఈ విషయమును చర్చించుట యిట అప్రకృతము గనుక వదలివేసెదను.

## కిష్కింధాకాండము :

1. జాంబవంతుడు, తనకు యౌవనమున అప్రతిమమగు బలముండెనని మాత్రమే తెలిపినట్లుగా వా.రా.న కలదు. అందు తన కాబలము కలుగుటకు కారణము తెలుపబడలేదు. కాని, భాస్కర, రంగనాథ రామాయణముల రెండిం టను అమృత సేవనము కారణముగా తెలుపబడినది.

## సుందరకాండము :

సీతాదేవి రాముని యభిజ్ఞానార్థము చెప్పిన కాకాసుర వృత్తాంతమున హనుమంతుడు శ్రీరామునితో చెప్పు సందర్భమున నీ విషయము వాల్మీకమున సుమారు 16 శ్లోకములలో చెప్పబడినది.[1] కాని యీ సందర్భమున రం.రా.న

"తను చిత్రకూటాద్రి దగ నొక్క కాకి
చెనకుటయును మనశ్శిలచేత మీరు
లీలతో మకరిక ల్లిఖియించుటయును
శీలించి గుఱుతుగా జెప్పె నన్నియును" (పే. 242) అని క్లుప్తముగ

చెప్పబడినది. భా.రా. కర్తయు,

'తన కుచాంతరగత కాక నఖరేఖలును, సరసత మీరు నించిన గండస్థ మనశ్శిలాపత్ర రేఖలును దలపింపు మనియె' (562) అను గద్యమున రం.ర వలె క్లుప్తీకరించి చెప్పుట కలదు.

---

1. V. 62-2 నుండి 17 వరకు

## యుద్ధకాండ పూర్వభాగము :

1. రావణునిచే పరాభూతుడైన విభీషణుడు తన తల్లియగు కైకసి యొద్దకు వెడలి తనకు జరిగిన యవమానమును చెప్పి తాను శ్రీరాముని సేవింప బోవుచున్నట్లుగ తెలుపును. అప్పుడు కైకసి శ్రీమహావిష్ణువే శ్రీరాముడుగా అవతరించినాడనియు, ఆతనినే యాశ్రయింపుమనియు దీవించి పంపును. అవా[illegible]మగు నీ యంశము భా,రం. రామాయణముల రెండింటను గలదు.[1]

## యుద్ధకాండ ఉత్తరభాగము :

ఇంద్రజిత్తు మరణమును రావణున కాతని మంత్రులు తెలియజేసినట్లుగ వాల్మీకి రామాయణమున కలదు. కాని, రం.రా.న రావణుని మంత్రులు కాక యుద్ధరంగము నుండి కాందిశీకులై వచ్చిన రాక్షసులే తెలియజేయుదురు. అంతే కాక, మూలమునందువలె అకస్మాత్తుగ చెప్పినట్లుగ కాక మొదట ఇంద్రజిత్తు పరాక్రమముతో నెదిరించిన విధమును క్రమముగా తెలిపి, చివరికి అతని మరణమును తెలుపును. రం.రా. నందలి యీ మార్పును భా.రా. కర్త యనుకరించి ఇంద్రజిన్మరణమును రాక్షసులచే క్రమముగా రావణునకు తెలియజేసినాడు.

రం.రా. కర్తయు, భా.రా. కర్తలును అనుసరించిన వా.రా. ప్రతియొక్కటే యనియు, అందువలననే రెండింటను సంవదించు భాగము లనేకములు కలవనియు, ఆ కారణమున భా.రా. నందలి పై యంశములు రం.రా.న కనుకరణములనుటకు వీలులేదనియు నొక యాక్షేపము రావచ్చును. కాని, భా. రా. నందలి రచనా విషయకములగు రం. రా. అనుకరణల వలన భా. రా. కర్తలు తప్పక రం. రా. ను అనుకరించిరనుటలో సందేహము లేదు. కనుక కథాంశముల విషయముననును భా. రా. కర్తలు రం. రా. ను అనుకరించిరనుటలో బాధకమేమియు లేదు. అంతేకాక భా, రం. రా. కర్తలు ఒకే వా. రా. ప్రతిని అనుసరించిరనియు, భా, రం. రా. లందలి సమాన ఘట్టముల కా ప్రతియే మూలమనియు కథాంశముల విషయముననను భాస్కరము రంగనాథము ననుకరింపలేదనియు చెప్పిన పక్షమున నిట్టి సామ్యములు గ్రంథమంత

1. భా.రా. VI 148 నుండి 162 వరకు; రం.రా. పే. 259, 260.

టను ఉండవలసి యుండును. కాని, భా, రం. రామాయణముల కనేక కథాంశ ములలో వైషమ్యములుండుటచే నీ యభిప్రాయము నింకను ఆలోచింపవలసి యున్నదని మాత్రము మనవి చేయుచున్నాను.

ఇక భా, రం. రామాయణములకు గల వైషమ్యములను పరిశీలింతము.

## బాలకాండము :

1. వా. రా. న వలె రం. రా. నను ప్రారంభమున వాల్మీకి నారద సంభాషణము. సంగ్రహణ రామాయణ కథయు కూర్పబడినవి. భా. రా. న వాల్మీకి నారద సంభాషణముగాని, సంగ్రహ రామాయణ కథకాని లేవు. వావిళ్ళ వారు ప్రచురించిన భా. రా. న గ్రంథ ప్రారంభమునకు ముందొక సంగ్రహ రామాయణము చేర్చబడియున్నది. కాని, యిది భా. రా. కర్తలు రచించినది కాదు. పీఠికాకర్తలగు మేడేపల్లి వేంకటరమణాచార్యులే స్వయముగా రచించి ఇందు చేర్చియుందురని కొందఱి యభిప్రాయము.

## అయోధ్యాకాండము :

1. లక్ష్మణుడు వనవాసము ముగియువఱకు నిద్రపోవక యందునని ప్రతిన చేసి సీతారాములను కంటికి రెప్పవలె కాపాడుచుండును. అంత నిద్రా దేవి వచ్చి రాత్రి సమయమున నిద్రించవలయుననెడి నియమమును ధిక్కరించి తివి కనుక నిన్ను విడుచు మార్గమును తెలుపుమని యడుగగా లక్ష్మణుడు వనవాసము ముగియువఱకు తన భార్యయగు ఊర్మిళాదేవిని ఆశ్రయించుమనియు, ఆ తరువాత తిరిగి స్వీకరింతుననియు తెలుపును. లక్ష్మణుని భ్రాతృభక్తిని శీలౌన్నత్యమును ప్రకటించు నీ యంశము రం. రా. న వర్ణితము.

ఈ యంశమును వాల్మీకమందు గాని, ఇతర పురాణములందు గాని కనుపింపదు. భా. రా. కర్త లక్ష్మణుని ప్రతిజ్ఞను గ్రహించినను తక్కిన యంశములను గ్రహింపలేదు.

## అరణ్యకాండము :

1. విద్యుజ్జిహ్వుని పుత్రుడగు జంబుకుమారుని లక్ష్మణుడు చంపుట రం.రా.న కలదు. అవాల్మీకమగు నీ యంశము ప్రస్తుత ముద్రిత భా. రా.

ప్రతులన్నింటను కలదు. కాని, తాళపత్ర ప్రతులలో నెందును ఈ వృత్తాంతము కనిపింపకపోవుటచే రం.రా. నందలి ఈ యంశమును భా.రా. కర్త గ్రహింప లేదనియే చెప్పవచ్చును.

2. సీతాదేవి నిష్ఠుర వాక్యములను విని లక్ష్మణుడు రామునొద్దకు వెళ్ళుచు "పర్ణశాలకు చుట్టు బరులేడు" వ్రాయుటయు, "ఎవ్వడే నీ బరుల్ వెస దాటి వచ్చు, నవ్వీరవరు తల లవియు నా క్షణమె" అని పలుకుటయు రం.రా.న గలదు.[1]

ఈ విషయము భా.రా. న గ్రహింపబడలేదు.

3. సుతీక్ష్ణుని సెలవు గైకొని రామలక్ష్మణులు అగస్త్య మహాముని దర్శనార్థము వెళ్ళుచుందురు. మార్గమధ్యమున శ్రీరాముడు లక్ష్మణునకు అగస్త్య మహాముని మాహాత్మ్యమును అభివర్ణించినట్లుగ భా.రా.న కలదు.[2] వాల్మీక మందును రాముడే అగస్త్యుని మాహాత్మ్యమును చెప్పినట్లుగ వర్ణితము.[3] కాని రం.రా.న రామలక్ష్మణులు అగస్త్యభ్రాత యొద్దకు వెళ్ళి యాతనిని అర్చించి ఆతనితో సుఖగోష్ఠి చేయుచుండగా అగస్త్యమహాముని వాతాపిని చంపిన విధ మును తెలియజెప్పుమని శ్రీరాము డగస్త్య భ్రాతను ప్రశ్నింపగా అగస్త్య భ్రాతయే అగస్త్యుని మాహాత్మ్యమును వర్ణించినట్లుగ చెప్పబడినది.[4] (వా.రా,న అగస్త్యభ్రాత యున్నను ఆతడనామకుడు. అతని పేరు 'సుదర్శను' దని పరవస్తువారి లఘుశబ్దార్థ కోశములో నున్నట్లుగ వ్యావహారికాంధ్ర మహాభారత ములో శ్రీ పురిపండా అప్పలస్వామి గారు తెలిపియున్నారు. (అరణ్యపర్వము - పుట 30).

## కిష్కింధాకాండము :

జాంబవంతుడు హనుమంతుని జన్మవృత్తాంతమును చెప్పి యాతనిని ప్రశంసించి సీతా వృత్తాంతమును కనుగొని రమ్మని చెప్పిన పిదప హనుమం తుడు మఱల వానరులతో తన జన్మవృత్తాంతమును తెలిపినట్లుగ భా. రా. న కలదు. కాని, రం.రా. న హనుమంతుడు స్వయముగా తన జన్మవృత్తాంతమును తెలుపు నంశము లేదు.

1. పే. 153, 2. III-170, 3. III-II సర్గ, 4. పే. 131.

## సుందరకాండము :

అశోకవన భంగమునకు కుపితుడై ఇంద్రజిత్తు హనుమంతుని బంధించి రావణుని భవనమునకు తీసికొని వచ్చును. అప్పుడు రావణుడు ప్రహస్తునితో-

"నిను నెవ్వడు పుత్తెంచెను
వనమేటికి పెఱికితీవు వడి రాక్షస భం
జనమేల సేసి తెవ్వడ
వని యడుగుము" (భా. రా. - 433)

అని పలుకును. హనుమంతుని వృత్తమును గూర్చి రావణుడు ప్రహస్తునిచే నడిగించుట యతని యధికారమునకు చిహ్నము. ఇట్లు భా. రా. న రావణుడు ప్రహస్తునిచే హనుమవృత్తముల నడిగినట్లు తెలుపబడగా, రం. రా. న రావణుడే స్వయముగా హనుమంతుని ప్రశ్నించినట్లుగ వర్ణింపబడినది.[1]

## యుద్ధకాండము :

1. శ్రీరాముడు సుగ్రీవాది వానరులతో సముద్రమును దాటి సువేలాద్రి చేరుకొనును. ఈ విషయము తెలిసిన కైకసి చింతిల్లి మాల్యవంతునితో ఆ విషయమును చెప్పి, సీతాదేవిని రామునకప్పగించుమని రావణునకు బుద్ధి చెప్పుట మంచిదని యాతనితో విచారించి, రావణునికడకేగి యాతనికి నీతిబోధ గావించుటయే కాక రాముని మహిమమును, జలప్రళయమును వివరించును. రం. రా. న సుమారు ఐదు పేజీలలో వర్ణింపబడిన రాముని పురుషోత్తమత్వ సమర్థకమగు నీ యంశమంతయు[2] భా. రా. న కనిపింపదు. వాల్మీకమునను ఈ విషయము లేదు.

2. సేతుబంధ సమయమున ఉడుత చూపిన భక్తిభావము భా. రా.న లేదు.

3. తన మాట ప్రకారము రాముడు తిరిగి రానందున దుఃఖితులైన గుహ, భరతులు అగ్నిప్రవేశము గావింప సిద్ధముగా నుండగా హనుమంతుడు

వెళ్ళి వారికి శ్రీరాముని వార్త చెప్పి వారి ప్రయత్నమును మాన్పించును. అతి వేలమగు గుహ, భరతుల రామభక్తిని ప్రకటించు నీయంశము రం. రా.న వర్ణిత మైనది.[1] భా. రా. న నీ యంశము లేదు.

4. యుద్ధానంతరము రావణ సంహారముచే తనకు గలిగిన బ్రహ్మహత్యా దోష నివారణార్థము కాశినుండి హనుమంతుడు శివలింగమును తెచ్చుట కాలస్యమగుటచే రాముడు స్వయముగా నొక సికతాలింగమును సిద్ధము చేసి రామేశ్వరమున ప్రతిష్ఠ గావించినట్లు రం. రా. న కలదు.[2] అవాల్మీకమగు నీ యంశము భా. రా.న కనబ్బడు.

5. రం. రా. నందలి సులోచనా సహగమనమును, లక్ష్మణదేవర నవ్వును భా. రా.న లేవు.

ఈ సందర్భమున నొక విషయమును చెప్పవలసియున్నది. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు తమ రం. రా. పీఠికలో (లాయల్ అండ్ కో వారిచే ముద్రితము, 1957) భా. రం. రామాయణములకు యుద్ధకాండమున గల భేదములను గూర్చి వ్రాయుచు నిట్లు తెలిపిరి:

"ఇక రం. రా. యుద్ధకాండమునందలి అవాల్మీకములన్నియు నించు మించుగ భా. రా. నందున్నవి. లేని వొక్క మూడు విషయములు (శ్రీరాముడు ఉడుతభక్తిని జూచి సంతసించుట, కైకసీ సులోచనా వృత్తాంతములు మాత్రమే)[3] కాని, గుహ, భరతుల యగ్నిప్రవేశ ప్రయత్నము, శ్రీరాముడు రామేశ్వరమున శివలింగమును ప్రతిష్ఠించుట, లక్ష్మణదేవర నవ్వు మున్నగు రం. రా. నందలి వృత్తాంతములనుకూడ భా. రా. కర్త గ్రహింపలేదు. కనుక రం. రా. యుద్ధకాండమందలి అవాల్మీకములలో భా. రా. న లేనివి పై మూడు వృత్తాంతములు మాత్రమే యని నిష్కర్షించి చెప్పుట ఆలోచింపదగిన విషయము.

భా. రా. కర్తలు రం. రా. ననుకరించినను రం. రా.న వర్ణింపబడిన అవాల్మీకములు కొన్ని భా.రా.న కనిపింపకపోవుటచే భా.రా. కర్తలు రం.రా.

1. ౦. 489 2. పే. 484 3. పే. 16.

నందలి అవాల్మీకాంశములను యథాతథముగ గ్రహింపలేదనియు, వాని విషయ మున కొంత స్వాతంత్ర్యము నవలంబించినారనియు చెప్పవచ్చును.

ఇక రం.రా.న లేకుంత భా.రా.న మాత్రము కనిపించు నవాల్మీకాంశము లను గుఱించి విచారింతము.

1. సీతాదేవి జన్మవృత్తాంతమునకు సంబంధించిన యొక అవాల్మీకమగు వింత విషయము భా.రా.న. కనిపించుచున్నది. ఒకప్పుడు జనకుడు తన సహ ధర్మచారిణులతో గలిసి యజ్ఞభూమికి వెళ్ళగా నట మేనక పొడగాంచును. ఆమె రూపమునకు ముగ్ధుడై జనకుడు-

"..............అధిక పుణ్యుడఁగానే
యనపత్యుడ నగునే ని
వ్వనజాననయం దపత్యవంతుడ నైనన్" (భా.రా. II - 434)

అని మనమున తలపోయును. అంత నాకాశవాణి మేనకవలన జనకునకు 'అసమ రామణీయక వైభవంబు వెలయు మాన సాపత్యము" గలుగునని తెలుపును. జనకుడు యజ్ఞభూమియందు బీజముష్టి విక్షేపము సేయగా నట పృథ్వీగర్భమున సీతాదేవి లభించును.[1] సీతాదేవి జన్మమునకు మేనకా సంబం ధము గల్పించుటయు, ఆమెను మానస పుత్రికగా పేర్కొనుటయు రం.రా.న గాని, వా.రా.న గాని గన్పట్టవు.

2. వాలిభార్య యగు తార "సీత నీకడం జిగతర కాల మింపుగ వసింపక నీ వతి దుఃఖపాటుతో నెరియుచునుండ భూమి జొరనిమ్ము" అనుచు రాముని శపించినట్లుగ భా.రా.న (305) కలదు. పట్టాభిషేకానంతర సీతా పరి త్యాగ ఘట్టమునకీ శాపమును భా.రా. కర్త భూమికగా కల్పించుకొని యుండ వచ్చును. అవాల్మీకమగు నీ తారాశాపము రం.రా.న లేదు.

రం.రా.తో భేదించు నిట్టి యంశములు కొన్ని భా.రా.న నున్నను భా.రా. మొత్తముమీద రం.రా. ననుసరించినదియే చెప్పవచ్చును.

('వివేచన' - 1978 (ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖ పరిశోధన పత్రిక)లో ప్రచురితమైన వ్యాసం.)

---

1. గౌడీయ ప్రతియందును, పశ్చిమోత్తరీయ ప్రతియందును ఈ విషయ మున్నట్లుగ "రామ్ కథా, ఉత్పత్తి ఔర్ వికాస్" అను గ్రంథమున కలదు. పే. 369.

# తెలంగాణామాండలికంలో అసమాపకక్రియలు

క్త్వార్థకం, తుమున్నర్థకం, శత్రర్థకం. చేదర్థకం, అనంతర్యార్థకం, సతిసప్తమ్యర్థకం, యద్యర్థకం - ఇవి తెలుగు క్రియల్లో అసమాపక క్రియలు. తెలుగు వాడుకలో ఉన్న అన్ని ప్రాంతాల్లో వీటి వాడుక ఒక్క రూపంలో కనిపించదు. ఈ ప్రయోగవిశేషాలను తులనాత్మకంగా పరిశీలించడమే ఈ వ్యాసం లోని ప్రధానాంశం.

**క్త్వార్థకాలు :**

అసమాపక క్రియల్లో, ఏ మార్పుకూ లోనుకాక తెలుగు దేశమంతటా ఒకే రూపంలో ఉన్న క్రియ క్త్వార్థక క్రియ ఒక్కటి మాత్రమే, స్వతంత్రంగా వాడబడే క్త్వార్థక క్రియల్లో మార్పు లేకపోయినా అనుబంధంగా చేరిన కొనుధాతువు క్త్వార్థకరూపంలో తెలంగాణావాడుకలో కొంతభేదం కనిపిస్తుంది. అది కొనులోని ఒకారం వికల్పంగా దీర్ఘంగా మారడం.

| | | |
|---|---|---|
| ఉదా : | చదువుకోని | చదువుకొని |
| | తీసుకోని | తీసుకొని |

క్త్వార్థక క్రియలకు పోవు, వచ్చు క్రియారూపాలు అనుబంధంగా ఉన్నపుడు తెలంగాణా మాండలికంలో కొను 'క' గా మారుతుంది. కోస్తా వాడుకలో 'కు' గా మారుతుంది.

| | తెలంగాణా | కోస్తా |
|---|---|---|
| ఉదా : | పట్టుకపో | పట్టుకుపో |
| | తీసుకపో | తీసుకుపో |
| | పట్టుకరా | పట్టుకురా |

కాని 'క' గా మారిన రూపాలు ప్రాచీన భాషలో కొల్లలుగా కనిపిస్తవి. ఐతే, ఈ మార్పు కేవలం పోవు, వచ్చు క్రియారూపాలే కాక ఏ ధాతురూపం పరంగా ఉన్నా కనిపిస్తుంది.

ఉదా : గరళంబెత్తుక గ్రోల, గా పలచితే (భా. రా.)
మడి దున్నుక బ్రతుకవచ్చు (సు. శ)

**తుమున్నర్థకాలు :**

ప్రాచీన భాషలో తినను / తినన్ మొదలైన నుజ్యంత రూపాలు తుమున్నర్థకాలు. ఆధునిక భాషలో వీటి ప్రయోగం కేవలం పోవు, వచ్చు అనే రెండు ధాతువులకు మాత్రమే పరిమితమై అన్ని ప్రాంతాల వ్యవహారంలో కనిపిస్తుంది.

ఉదా : పోను/పోన్ రెండు రూపాయలు.
రాను/రాన్ రెండు రూపాయలు.

ఇక్కడ పోను, రాను అనే శబ్దాలకు పోవడానికి, రావడానికి అని అర్థం, తుమర్థంలో ఇతర ధాతువులపై కూడా తెలంగాణా వ్యవహారంలో నుజి చేరడం కనిపిస్తుంది. ఐతే ప్రయోగంలో మాత్రం నుజి లోపిస్తుంది.

ఉదా : ఉతుక పది రూపాయలు
(ఉతుకడానికి పదిరూపాయలని అర్థం)
ఇస్త్రీ చెయ్య పదిరూపాయలు
(ఇస్త్రీ చెయ్యడానికి పదిరూపాయలని అర్థం)

అనుబంధక్రియ పరంగా ఉన్నపుడు కూడా నుజ్యంతాలైన తుమున్నర్థక రూపాలు తెలంగాణామాండలికంలో కనిపిస్తవి.

ఉదా : తినబోయిండు (తినన్ + పోయిండు)
దున్నబోయిండు (దున్నన్ + పోయిండు)

ఈ రూపాల్లో నుజ్యంతరూపాల్లోని ద్రుతం నిత్యంగా లోపించింది. తెచ్చు, వచ్చు ధాతురూపాలైన తే, రా అనే దీర్ఘాంతరూపాలపై మాత్రం ఈ ద్రుతలోపం వైకల్పికంగా కనిపిస్తుంది.

ఉదా : తేన్ బోయిండు
తేబోయిండు
తీసుకరాన్ బోయిండు
తీసుకరాబోయిండు
} తీసుకురావడానికి పోయినాడని అర్థం.

పై రూపాల్లో ధాతువుపైనే సాక్షాత్తుగా తుమున్నర్థక ప్రత్యయం చేరి తుమున్నర్థక రూపాలు ఏర్పడడం గమనించవచ్చు.

కోస్తా ప్రాంతం వాడుకలో ఈ విధంగా ధాతువుపై నేరుగా తుమున్నర్థక ప్రత్యయం చేరి తుమున్నర్థకరూపాలు ఏర్పడే పద్ధతి కనిపించదు. ధాతువును ముందుగా భావార్థకంగా మార్చి దానిపై కు ప్రత్యయం చేర్చడంవల్ల భావార్థకాలు ఏర్పడుతాయి.

ఉదా : రావడానికి (రావడం + కు)
పోవడానికి (పోవడం + కు)
తినడానికి (తినడం + కు) మొ॥

తెలంగాణా మాండలికంలో తుమున్నర్థకాలు ఏర్పడడం మరో రెండు పద్ధతుల్లో కనిపిస్తుంది. ఒకటి ధాతువుమీద అందుకు చేర్చడంవల్ల.

ఉదా : వస్తుందుకు (వచ్చు+అందుకు) పోతందుకు (పోవు+అందుకు)
తింటందుకు (తిను+అందుకు) రాస్తందుకు (రాయు+అందుకు)

రెండు : తద్ధర్మార్థకవిశేషణాలమీద అందుకు చేర్చడంవల్ల.

ఉదా : వచ్చేటందుకు (వచ్చే + అందుకు) పోయెటందుకు (పోయే+అందుకు)
తినెటందుకు (తినే+అందుకు) రాసెటందుకు (రాసే+అందుకు)

ఈ రూపాల్లో వచ్చే, పోయే మొదలైనవాటి చివరి దీర్ఘం హ్రస్వంగా మారడం, టుగాగమం రావడం విశేషం. టుగాగమంతోపాటు తుగాగమం రావడం కూడా కనిపిస్తుంది.

ఉదా :- వచ్చెతందుకు, పోయెతందుకు
తినెతందుకు, రాసెతందుకు

బహుశః ఈ రూపాల్లో ధాతువుమీది ఏకారం లోపించడంవల్ల వస్తందుకు, పోతందుకు ఇత్యాది రూపాలు ఏర్పడి ఉండవచ్చు.

కోస్తా వ్యవహారంలో తద్ధర్మార్థకక్రియలమీద 'అందుకు' చేరి ఏర్పడే ఇటువంటి రూపాలు ఉన్నా వాటిలో టుగాగమం, తుగాగమం కనిపించదు.

ఉదా : వచ్చేందుకు, పొయ్యేందుకు
తినేందుకు, రాసేందుకు

మహబూబ్‌నగర్ మాండలికంలో తుమున్నర్థకాలుగా రానీకి, పోనీకి మొదలైన రూపాలు కనిపిస్తాయి.

**అనంతర్యార్థకాలు :**

ప్రాచీన తెలుగు భాషలో ఆనంతర్యార్థంలో ధాతువుపై ద్రుతాంతమైన "డు" వర్ణకం విధింపబడింది. (బా.వ్యా. క్రియా-43) ఉదా : తోతెంచుడును మొ॥ ఈ ప్రయోగం ఆధునిక భాషలో ఏ ప్రాంతంలోనూ వాడుకలో లేదు. నేటి కోస్తా వాడుకలో ఆనంతర్యార్థంలో ధాతువుపై 'ఆక' అనే ప్రత్యయం కనిపిస్తుంది. తెలంగాణా మాండలికంలో మాత్రం భూతార్థక క్రియాజన్య విశేషణాలపై 'అంక' అనే ప్రత్యయం చేరుతుంది.

| తెలంగాణా | కోస్తా |
|---|---|
| వచ్చినంక | వచ్చాక |
| పోయినంక | పోయాక |
| తిన్నంక | తిన్నాక |
| రాసినంక | రాసాక |

కోస్తా వాడుకలో ఉన్న వచ్చాక, పోయాక మొదలైన రూపాలు కూడా తెలంగాణా వాడుకలో మాదిరిగా భూతార్థక క్రియాజన్య విశేషణాల మీద ఏర్పడిన రూపాలుగానే భావించవచ్చు. వచ్చినంక అనే రూపమే అనుస్వార లోపమూ, లోపదీర్ఘమూ, నకారలోపమూ వచ్చి వచ్చాక అనే రూపం ఏర్పడి ఉంటుంది. (వచ్చినంక - వచ్చినాక - వచ్చి అక. వచ్చాక) వచ్చినాడులో నకారం లోపించి వచ్చాడు అనే రూపం ఏర్పడినట్లే వచ్చినాక వచ్చాకగా మారడం సముచితంగానే కనిపిస్తుంది.

ఈ అర్థంలో వచ్చిన తరువాత, వచ్చింతరువాత మొ॥ రూపాలు తెలుగు దేశమంతటా వాడుకలో ఉన్నాయి.

శత్రర్థకాలు :

ప్రాచీన భాషలో శత్రర్థకంగా వాడబడే చువర్ణకానికి బదులుగా ఆధునిక భాషలో 'తూ' వర్ణకం వాడబడుతుంది. వీటికి ఆత్మనే పదార్థంలో కొను ధాతువు చేరినపుడు ఏర్పడ్డ చదువుకుంటూ, రాసుకుంటూ, చదువుకుంటు; రాసుకుంటు మొదలైన రూపాలుకూడా వ్యవహారంలో ఉన్నాయి. ఐతే, తెలంగాణా వాడుకలో శత్రర్థక టువర్ణంలోని ఉకారం అకారంగా మారిన రూపం కూడా వాడుకలో కనిపిస్తుంది.

| తెలంగాణా | కోస్తా |
|---|---|
| చదువుకుంట/చదువుకుంటు | చదువుకుంటు/చదువుకుంటూ |
| రాసుకుంట/రాసుకుంటు | రాసుకుంటు/రాసుకుంటూ |

తెలంగాణంలో చదువుతూ, రాస్తూ మొదలైన తువర్ణక సహిత శత్రర్థక రూపాలు అసలే లేకపోలేదు. ఐతే, ఇవి దీర్ఘ ఆకారాంతాలుగా వ్యవహారంలో కనిపిస్తాయి.

ఉదా : చదువుతా (పోయిండు), రాస్తా (పోయిండు)
అడుగుతా (పోయిండు), చెప్తా (పోయిండు)

అంతేకాక, శత్రర్థకరూపానికి ద్విరుక్తి ఉన్నపుడు, అవధారణార్థకం పరంగా ఉన్నప్పుడు కూడా 'తు' వర్ణకం అవర్ణాంతంగా తెలంగాణావాడుకలో ఉంది.

ద్విరుక్తిల్లో :

| తెలంగాణా | కోస్తా |
|---|---|
| చదువుత చదువుత | చదువుతూ చదువుతూ |
| రాస్త రాస్త | రాస్తూ రాస్తూ |

అవధారణార్థకం పరంగా ఉన్నపుడు

| తెలంగాణా | కోస్తా |
|---|---|
| చదువుతనే | చదువుతూనే |
| పోతనే | పోతూనే |

రాస్తనే రాస్తూనే
వస్తనే వస్తూనే

**చేదర్థకాలు :**

ప్రాచీన భాషలో చేదర్థంలో వాడబడే వచ్చిన (న్) అడిగిన (న్) మొదలైన రూపాలు ఆధునిక భాషలో ఏ ప్రాంతంలోనూ వాడుకలో లేవు. ఆధునికభాషలో చేదర్థంలో వచ్చే, 'తే' తెలంగాణా వ్యవహారంలో హ్రస్వాంతంగా వాడబడుతుంది.

ఉదా : చదివితె పోతే
వస్తె ఇస్తే

ఈ రూపాలకు కాలత్రయంలోనూ వాడుక ఉన్నది. క్త్వార్థంపై ఉండు ధాతువు చేదర్థకరూపం చేరిన రూపాలు కూడా తెలంగాణంలో చేదర్థంలో వాడబడుతున్నాయి. ఐతే, వీటికి భూతార్థంలోనే వాడుక.

ఉదా : తెచ్చింటె (తెచ్చి + ఉంటె) చదివింటె (చదివి + ఉంటె)
అడిగింటె (అడిగి + ఉంటె) పోయింటె (పోయి + ఉంటె)

ఇక్కడ సంధిలో పూర్వపరస్వరాలకు పరస్వరంకాక పూర్వస్వరమే ఏకాదేశం కావడం విశేషం. పరస్వరం ఏకాదేశంగా వచ్చిన వచ్చుంటె. తెచ్చుంటె మొదలైన రూపాలకు కూడా తెలంగాణంలో వాడుక ఉన్నది.

తెచ్చింటె మొదలైన రూపాల్లో నుగాగమం వచ్చిన రూపాలు కూడా తెలంగాణం వాడుకలో కనిపిస్తవి.

ఉదా : తెచ్చినుం చదివినుంటె
అడిగినుం పోయినుంటె

వ్యతిరేక క్త్వార్థక క్రియలమీద 'పోతె' అనే పోవు ధాతువు చేదర్థకరూపం చేరి వ్యతిరేక చేదర్థకరూపాలు ఏర్పడడం కోస్తా వ్యవహారంలో కనిపిస్తుంది. తెలంగాణంలో ఈ విధమైన రూపాలతోపాటు 'ఉంటె' అనే ఉండు ధాతువు చేదర్థక రూపం చేరి ఏర్పడిన రూపాలు కూడా వాడుకలో ఉన్నాయి. ఈ రెండూ హ్రస్వాంతాలే.

| తెలంగాణా | కోస్తా |
|---|---|
| చదువకపోతే/చదువకుంటె | చదవకపోతే |
| అడుగకపోతే/అడుగకుంటె | అడగకపోతే |

తెలంగాణా వ్యవహారంలో కోస్తా వ్యవహారంలో మాదిరిగా అడుగక అనే చోట 'డు' లోని ఉవర్ణం వర్ణసమీకరణంచేత అకారంగా మారకపోవడం విశేషం.

**సతిసప్తమ్యాద్యర్థకాలు :**

తెలుగు వాడుకల్లో ఉన్న అన్ని ప్రాంతాల్లోనూ శత్రర్థక రూపంపై 'ఉంటె' అనేది చేరి సతిసప్తమ్యకర్థకరూపాలు ఏర్పడడం కనిపిస్తుంది. ఐతే, కోస్తావ్యవహారంలో 'తూ' అనే శత్రర్థక వర్ణకానికీ, ఉంటే అనే అనుబంధానికీ సంధి రాదు. తెలంగాణావ్యవహారంలో మాత్రం సంధి వస్తుంది.

| తెలంగాణా | కోస్తా |
|---|---|
| వస్తుంటె | వస్తూ ఉంటె |
| పోతుంటె | పోతూ ఉంటె |
| రాస్తుంటె | రాస్తూ ఉంటె |

తెలంగాణాకు చెందిన వరంగల్లు, కరీంనగర్ జిల్లాల వ్యవహారంలో మాత్రం కింది రూపాలు వాడుకలో ఉన్నాయి:

| | |
|---|---|
| వస్తాంటె | పోతాంటె |
| రాస్తాంటె | చదువుతాంటె |

ఆదునిక వ్యవహారంలో కొంతమంది వాడుకలో వస్తా ఉంటె, చేస్తా ఉంటె, చదువుతా ఉంటె అనే రూపాలు కనిపిస్తాయి. ఇక్కడ చదువుతూ ఉంటె మొదలైన రూపాల్లో శత్రర్థక 'తూ' వర్ణకంలోని ఉకారం ఆకారంగా మారిందన్న మాట. వరంగల్లు, కరీంనగర్ జిల్లాల వాడుకలో ఈ మాదిరిగానే తూలోని ఊకారం ఆకారంగా మారడమే కాక తెలుగుకు విలక్షణమైన పూర్వస్వరైకాదేశసంధి వచ్చిందన్నమాట.

శత్రర్థకతువర్ణకాంతధాతురూపాలపై 'ఉండంగ' అనే రూపం చేరి సతిసప్తమ్యర్థకాలు ఏర్పడడం కూడా తెలంగాణంలో వాడుకలో ఉన్నది. ఈ రూపాల్లో కోస్తా వ్యవహారంలో ఉండగా అనేది చేరుతుంది.

| తెలంగాణా | కోస్తా |
|---|---|
| వస్తుండంగ | వస్తూ ఉండగా |
| పోతుండంగ | పోతూ ఉండగా |
| రాస్తుండంగ | రాసూ ఉండగా |

ఈ విధంగా నుజ్యంతంపై కన్ చేరి సతిసప్తమ్యర్థకాలు ఏర్పడడం అన్ని ప్రాంతాల్లో కనిపిస్తుంది. ఐతే కోస్తాప్రాంతం వ్యవహారంలో ధాతువు మీది ద్రుతం లోపించి కన్ లోని అకారం దీర్ఘంగా మారి, 'ఉండగా' మొదలైన రూపాలు ఏర్పడుతవి. తెలంగాణా వాడుకలో మాత్రం ధాతువుమీది ద్రుతం పూర్ణ బిందువుగా మారుతుంది. కన్‌లోని అకారం హ్రస్వంగానే ఉంటుంది.

| తెలంగాణా | కోస్తా |
|---|---|
| చెప్పంగ | చెప్పగా |
| రాంగ | రాగ |
| పోంగ | పోగా |
| తినంగ | తినగా |

'చెప్పంగ వినకపోతే చెడంగ చూడాలె' మొదలైన సాధారణజనవ్యవహారంలో పూర్వబిందు సహితరూపాలు ప్రసిద్ధంగా వినబడేవే. ద్రుతం పూర్వబిందువుగా మారిన ప్రాచీన గ్రాంథికరూపం నేటికీ తెలంగాణా వాడుకలో ఉన్నదన్నమాట.

భూతార్థక క్రియాజన్య విశేషణాలమీద అప్పుడు అనేది చేరి ఏర్పడిన వచ్చినప్పుడు, పోయినప్పుడు మొదలైన సతిసప్తమ్యర్థకరూపాలు అన్ని ప్రాంతాల వ్యవహారంలోనూ ఉన్నాయి. వీటికి భూతార్థంలోనూ, భవిష్యదర్థంలోనూ వాడుక ఉన్నది.

కొన్ని శత్రర్థకాలు కాలత్రయవాచకాలుగా కూడా వ్యవహారంలో ఉన్నాయి. అవి వచ్చేప్పుడు, పోయేప్పుడు మొదలైనవి. ఈ రూపాలకు మారుగా తెలంగాణంలో వచ్చేటప్పుడు, వచ్చేతప్పుడు మొదలైన రూపాలతోపాటు దిగువ చూపిన రూపాలు కూడా జనవ్యవహారంలో కనిపిస్తవి.

ఉదా : వస్తప్పుడు పోతప్పుడు
రాస్తప్పుడు తింటప్పుడు
చూస్తప్పుడు కొడ్తప్పుడు

యద్యప్యర్థకాలు : యద్యప్యర్థంలో వచ్చినా/వచ్చినప్పటికీ, పోయినా/పోయినప్పటికీ మొదలైన రూపాలతోపాటు తెలంగాణంలో వచ్చినా, పోయినా అనే యద్యప్యర్థక పదాలపై కూడా, కాని అనేవి అనుబంధాలుగా చేరిన రూపాలు కూడా వాడుకలో వినిపిసవి.

వచ్చినాగాని } వచ్చినాగూడ
చేసినాగాని } చేసినాగూడ
పోయినాగాని } పోయినాగూడ

చేదర్థకరూపాలమీద కూడా 'కూడ' అనేది చేరి ఈ రూపాలు ఏర్పడడం తెలంగాణా వ్యవహారంలో ఉన్నది.

ఉదా : వస్తెగూడ, చేస్తెగూడ, పోతెగూడ

తెలంగాణా జిల్లాల్లోని గ్రామీణుల తెలుగు పలుకుబళ్ళను సూక్ష్మంగా పరిశీలిస్తే మరికొన్ని అంశాలు తెలిసే అవకాశం లేకపోలేదు.

(ఆంధ్రసారస్వతపరిషత్తు స్వర్ణోత్సవ సంచిక (1997) లో ముద్రితమైన వ్యాసం.)

# సంకలన గ్రంథంగా

ప్రాచీన తెలుగు సాహిత్య చరిత్రకు సంబంధించిన అనేక నూత్న విషయాలను వెలికితీయడంలో ఛందోగ్రంథాలు, సంకలన గ్రంథాలు ఎంతగానో ఉపకరించే అధారాలు. ఈ గ్రంథాలను పరిశీలించినప్పుడు తెలుగు సాహిత్యానికి ఎంత నష్ట జాతకముందో మనకర్థమౌతుంది. ఎన్నెన్ని మహా కావ్యాలు నామ రూపాలు లేకుండా కాలగర్భంలో కలిసిపోయినాయో? నామమూ, కొంతరూపమూ మిగిలిన కావ్యాలను గురించి లోకానికి వెల్లడిచేసిన కీర్తి కొంత ఛందో గ్రంథాలకు కూడా దక్కుతుంది. ఆయా లాక్షణికులు తమ లక్షణాలకు చెప్పిన లక్ష్యపద్యాల ఆకరాలను పేర్కొనడంలో పూర్తి నిష్పక్షపాతవైఖరిని అవలంబించలేదనీ, అక్కడక్కడా అభూతగ్రంథాల సృష్టికీ, అభూతపద్యసృష్టికీ అభూత పాత్ర సృష్టికీ వెనుకాడలేదనీ పండితలోకంలో ఒక ప్రథ ఉంది. కనుక అజ్ఞాత కావ్యాలకూ, అజ్ఞాతకవులకూ సంబంధించిన ప్రామాణికమైన సమాచారం అందించడంలో ఛందో గ్రంథాలకన్నా సంకలన గ్రంథాలు ఎక్కువగా తోడ్పడుతాయనడంలో సందేహం లేదు.

'కవి తనకు పూర్వమందున్న కవుల కావ్యాలనుండి వర్ణనాంశాలనుగాని, శాస్త్ర విషయాలనుగాని సేకరించి వానిని వర్గీకరించి ఏకాకారమైన ఒక కృతిగా సమకూర్చు సాహిత్య ప్రక్రియ సంకలన గ్రంథము' - అని నిడుదవోలువారు సంకలన గ్రంథ స్వరూపాన్ని నిర్వచించినారు. తెలుగులో వెలసిన సంకలన గ్రంథాల సంఖ్య పరిమితమే ఐనా వాటి ప్రయోజనం మాత్రం అపరిమితం. తెలుగు కవులు ఈ సంకలన ప్రక్రియను సంస్కృతంనుంచో, ప్రాకృతంనుంచో గ్రహించినారని చెప్పవచ్చు. హాలుడు రెండు వేల ఏండ్లకిందట సంతరించిన గాథా సప్తశతి రూపంలో తెలుగునాట సంకలన ప్రక్రియకు అంకురార్పణం జరగటం విశేషం. సంస్కృతంలో శార్ఙ్గధరుని శార్ఙ్గధరపద్ధతి, కవీంద్రాచార్యుని కవీంద్రవచన సముచ్చయం, మల్లికార్జునుని సూక్తి సుధార్ణవం, బిల్హణుని సూక్తి ముక్తావళి, వల్లభదేవుని సుభాషితావళి ప్రసిద్ధమైన సంకలనగ్రంథాలు.

తెలుగులో సంకలన ప్రక్రియకు శ్రీకారం చుట్టినవాడు క్రీ.శ. 14 వ శతాబ్దికి చెందిన మడికి సింగన. ఈతడు కూర్చిన 'సకల నీతి సమ్మతం' నీతి శాస్త్ర గ్రంథాల్లోని విషయాలకు సంబంధించిన పద్యాల సంకలనం. ఆ తరువాత వచ్చిన ప్రాచీన సంకలన గ్రంథాల్లో పెదపాటి జగ్గన ప్రబంధ రత్నాకరం, అజ్ఞాతకర్తృకమైన ఉదాహరణ పద్యాలు, కళావతి ప్రబంధ సార శిరోమణి, ప్రబంధమణిభూషణం ప్రసిద్ధమైనవి. ఆధునిక కాలంలో వచ్చిన సంకలన గ్రంథాల్లో వేటూరివారి ప్రబంధరత్నావళి, చాటుపద్యమణిమంజరి, దాసరి లక్ష్మణస్వామి వర్ణసరత్నాకరం, కట్టమంచి, సుబ్రహ్మణ్యరెడ్డిగారి భారత సారముక్తావళి, భాగవతసారముక్తావళి, దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి చాటుపద్య రత్నాకరం పేర్కొనదగ్గవి.

అదునిక తెలుగు విమర్శకుల్లో ఎంతో శ్రమకోర్చి సంకలన గ్రంథాలను కూర్చి ఎంతోమంది అజ్ఞాత కవులను, ఎన్నో అజ్ఞాత కావ్యాలను గూర్చిన విశేషాలను వెలువరించి, ప్రాచీన తెలుగు సాహిత్యానికి, సాహిత్య చరిత్ర రచనకు ఎనలేని ఉపకారం చేసిన విద్వాంసులు ఇద్దరే ఇద్దరు. వారు ప్రాతః స్మరణీయులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు. ప్రస్తుతం ప్రభాకరశాస్త్రిగారు సంతరించిన 'ప్రబంధరత్నావళి' సంకలన గ్రంథ స్వరూపాన్ని, దాని వైశిష్ట్యాన్నిగురించి తెలుసుకుందాం.

శాస్త్రిగారి ప్రబంధరత్నావళి మొట్టమొదట 1918లో, అంటే శాస్త్రిగారి ముప్పయవ ఏట ముద్రింపబడింది. ఈ సంకలన గ్రంథం తక్కిన సంకలన గ్రంథాలకన్నా విలక్షణమైంది. సాధారణంగా సంకలన కర్తలు పూర్వ కావ్యాల్లోని ఆయా విషయాలకు సంబంధించిన మంచి పద్యాలను ఏరి కూర్చి సంకలన గ్రంథాలుగా కూర్చడం పరిపాటి.అంటే, సంకలనకర్త తాను సంకలనం చేస్తున్న పద్యాలను ఆ యా మూల గ్రంథాలనుండే సేకరిస్తాడన్నమాట. కాని, శాస్త్రిగారి ప్రబంధ రత్నావళి ఈ కోవకు చెందిన సంకలన గ్రంథం కాదు. ఇది రెండు సంకలనగ్రంథాలకు సంకలన గ్రంథం. పెదపాటి జగ్గన సంకలనంచేసిన ప్రబంధ రత్నాకరంలోని పద్యాలను, ఆంధ్ర సాహిత్య పరిషత్తు (కాకినాడ) వారి గ్రంథాలయంలో గ్రంథనామమూ, గ్రంథకర్త నామమూ లేని ఒక సంకలన గ్రంథం (దీనికి గ్రంథాలయం వారు 'ఉదాహరణ పద్యములు' అని నామకరణం చేసి

నారు) లోని పద్యాలను శాస్త్రిగారు సంకలనం చేసి ప్రబంధ రత్నావళిని సంతరించినారు. శాస్త్రిగారి యీ ప్రబంధ రత్నావళి సంకలన గ్రంథానికి పెదపాటి జగ్గన ప్రబంధరత్నాకరం, అజ్ఞాతకర్తృకమైన ఉదాహరణ పద్యములు అనే రెండు సంకలన గ్రంథాలు మూలమన్న మాట. వీటిలో జగ్గకవి ప్రబంధ రత్నాకరం తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీలో భద్రపరచబడి ఉంది. ఇందులో నారాయణస్తుతి, శంకరస్తుతి, త్రిపుర విజయం మొదలైన విషయ విభాగంతో పూర్వకవుల కావ్యాలనుండి అనేక పద్యాలు సేకరింపబడి సంకలనం చేయబడ్డాయి. ఇది ఐదాశ్వాసాల గ్రంథం కాని, మనకు లభ్యమైన గ్రంథం మూడాశ్వాసాలు మాత్రమే, ఈ గ్రంథ సంధాత 16 శతాబ్దికి చెందిన వాడు. దాదాపు 78 కావ్యాల్లోని పద్యాలు ఇందులో సంకలనం చేయబడ్డాయి. ప్రబంధ రత్నావళికి రెండో ఆకరమైన 'ఉదాహరణ పద్యాలు' అన్న గ్రంథంలో మనకు ప్రస్తుతం లభ్యమౌతున్న మహా భారతాది గ్రంథాల్లో నుండే కాక లభ్యం కాని అనేక ప్రాచీన కావ్యాలనుండి కూడా అనేక పద్యాలు సంకలితమై ఉన్నాయి.

అయితే, శాస్త్రిగారు సంకలనం చేసిన ప్రబంధ రత్నావళి కేవలం పై రెండు సంకలన గ్రంథాలకు యథాతథమైన సంకలనం మాత్రం కాదు. ఈ రెండు సంకలనాల్లో ముద్రితాలై సుప్రసిద్ధాలైన నన్నయాదుల భారతాదుల్లోని పద్యాలను వదలి ముఖ్యంగా సాహిత్య చరిత్రలో చేరని అనేక కవుల కావ్యాల్లోని పద్యాలను మాత్రమే శాస్త్రిగారు ప్రబంధ రత్నావళిలో చేర్చినారు. ప్రబంధరత్నాకరం, ఉదాహరణ పద్యాలు - ఈ రెండూ వేర్వేరు పద్ధతులకు చెందినవి కావడంవల్ల ఆ రెండింటిలోని పద్యాలను ఒకే విషయానుక్రమణికలోకి చేర్చడంలో చిక్కులు ఉండడంవల్ల శాస్త్రిగారు తమ సంకలనంలో పద్యాలను విషయానుగుణమైన శీర్షికల్లో కాకుండా కవినామ శీర్షికల్లోకి మార్చడం జరిగింది. కవుల శీర్షికలను, ఆయా కవుల పద్యాలను అకారాదిక్రమంలో కూర్చి పరిశోధకులకు ఎంతో సౌకర్యం కలిగించినారు శాస్త్రిగారు. అంతేకాదు, ఆయా కవుల శీర్షికల పక్కనే వారిని పేర్కొన్న సంకలన కర్తల పేర్లను, సంకలితం చేయబడ్డ పద్యాలను, సేకరించిన మూలసంకలన గ్రంథకర్తల పేర్లను పేర్కొన్నారు. ఈ సంకలనంలో పేర్కొబడ్డ కవులు, కావ్యాలు, పద్యాలు మొదలైన వివరాలు ఈ విధంగా ఉన్నాయి:

| | |
|---|---|
| మొత్తం కవులు | 69 |
| మొత్తం కావ్యాలు | 89 |
| కర్త పేరు పేర్కొ బడ్డ కావ్యాలు | 81 |
| కర్త పేరు పేర్కొనబడని కావ్యాలు | 8 |
| కావ్యం పేరు చెప్పక పేర్కొబడ్డ కవులు | 4 |
| గ్రంథనామమూ, కర్తృనామమూ తెలుపకుండా పేర్కొబడ్డ పద్యాలు | 67 |
| సంకలనం చేయబడ్డ మొత్తం పద్యాలు | 609 |

గ్రంథం చివర రెండు అనుబంధాలు చేర్చబడ్డాయి. మొదటి అనుబంధంలో ప్రబంధరత్నావళికి మూలగ్రంథాల్లో ఒకటైన జగ్గన ప్రబంధరత్నాకరం అవతారికా భాగం చేర్చబడింది. దీనివల్ల పరిశోధకులకు, సాహిత్యచరిత్రకారులకు జగ్గనను గురించిన వివరాలు తెలుసుకునే అవకాశం కలుగుతుంది. ఇక రెండో అనుబంధంలో ఉదాహరణ పద్య గ్రంథకర్త ఉదాహరించక కేవలం జగ్గన కవి మాత్రమే ఉదాహరించిన కవులను, కావ్యాలను; జగ్గన ఉదాహరించక ఉదాహరణ పద్య గ్రంథకర్త మాత్రమే ఉదాహరించిన కవులను, కావ్యాలను; ఇరువురూ ఉదాహరించిన కవులను, కావ్యాలను పేర్కొన్నారు.

ఈ సంకలనానికి శాస్త్రిగారు మిక్కిలి విలువైన పీఠిక రచించినారు. సంకలితపద్యకర్తలైన కవులను అకారాదిక్రమంలోకూర్చి వారిని గూర్చిన విలువైన విషయాలను తెలిపి కవుల చరిత్రకు దోహదం చేసినారు. ఆధునిక యుగంలో పరిశోధకులనుసరిస్తున్న పద్ధతులను శాస్త్రిగారు డెబ్బై ఏండ్లక్రితమే అనుసరించడం వారి ప్రతిభకు నిదర్శనం.

శాస్త్రిగారు సంకలనం చేసిన ఈ ప్రబంధరత్నావళి తెలుగు సాహిత్య పరిశోధకులకు ఎన్నో అజ్ఞాత కావ్యాలను, ఎంతోమంది అజ్ఞాత కవులను పరిచయం చేసి తెలుగు సాహిత్య చరిత్రకు మహోపకారం చేసింది. లక్షణ గ్రంథాలవల్ల తెలియవచ్చే గ్రంథాలను మినహాయిస్తే మొత్తం దాదాపు యాభై కావ్యాలను ప్రథమంగా లోకానికి తెలియజేసిన కీర్తి ప్రబంధరత్నావళి సంకలన కర్తలు శ్రీ ప్రభాకరశాస్త్రిగారికే దక్కుతుంది. ఆ గ్రంథాలను, గ్రంథకర్తలను, సంకలనంలో ఉదాహరింపబడిన పద్యాలసంఖ్యను దిగువ పేర్కొంటాను;

| గ్రంథం | గ్రంథకర్త | పద్యాల |
|---|---|---|
| అమరుకము | కానుకొలను అన్నమరాజు | 3 |
| సకలపురాణసారము | కూచిరాజు ఎఱ్ఱయ | 1 |
| కుమారనైషధము | పెదపాటి ఎఱ్ఱాప్రెగడ | 17 |
| కళావతీశతకము | తేళ్లపూడి కసవరాజు | 8 |
| కువలయాశ్వచరిత్ర | కేతన | 1 |
| వీరమాహేశ్వరము | నిశ్శంక కొమ్మన | 14 |
| కుశలవోపాఖ్యానము | చిరుమూరి గంగరాజు | 2 |
| బాలభారతము | కాకమాని గంగాధరుడు | 15 |
| సౌగంధికాపహరణము | రాయసం గణపయ | 1 |
| నవగ్రహస్తవము | గౌరనకవి | 2 |
| సాముద్రికశాస్త్రము/నందనచరిత్ర | గంగరాజు చౌడయ్య | 8 |
| కాంచీమాహాత్మ్యము | కుడిచెర్ల తిప్పరాజు | 6 |
| శివకాంచీమాహాత్మ్యము | దగ్గుపల్లి దుగ్గన | 2 |
| హరిశ్చంద్ర కథ | దేవరాజభట్టు | 2 |
| షోడశరాజచరిత్ర | ఆవుడూరి నరసింహభట్టు | 1 |
| శ్రీవిష్ణు పురాణము | పశుపతి నాగనాథుడు | 1 |
| జినేంద్రపురాణము | పద్మకవి | 1 |
| ప్రద్యుమ్నచరిత్ర | పొన్నాడ పెద్దిరాజు | 22 |
| అనిరుద్ధచరిత్ర | పెమ్మన భావన | 64 |
| అనంతమాహాత్మ్యము | బొడ్డపాటి పేరయ్య | 1 |
| పద్మినీవల్లభము | బొడ్డపాటి పేరయ | 6 |
| మంగళగిరి శతకము | | 1 |
| శంకరవిజయము | | 7 |
| సూర్యశతకము | ,, | 1 |
| భేతాళపంచవింశతి | ఘోతరాజు | 9 |

| | | |
|---|---|---|
| పర్వతపురాణము | పోలమరాజు | 1 |
| ఇందుమతీ కల్యాణము | అంగర బసువయ | 5 |
| సావిత్రి కథ | తులసి బసువయ | 26 |
| హరిదత్తోపాఖ్యానము | నందూరి మల్లయ్య | 1 |
| రామలింగ శతకము | ఎలుకుర్తి రామరాజు | 1 |
| కందర్పకేతు విలాసము<br>హరిలీలా విలాసము | తెనాలి రామలింగడు | 4 |
| త్రిపురవిజయము | పోతరాజు వీరయ్య | 21 |
| శ్రీరంగమాహాత్మ్యము | చెన్నమల్లు శ్రీగిరన్న | 4 |
| వల్లభాభ్యుదయము | శ్రీనాథుడు | 1 |
| ఆదిపురాణము | సర్వదేవుడు | 2 |
| విరాటము | సర్వదేవుడు | 1 |
| షష్ఠస్కంధము (భాగవతము) | మలయమారుతం సర్వన్న | 6 |
| శాకుంతలము | సిద్దన ప్రెగ్గడ | 1 |
| కన్నప్ప చరితము | కంచిరాజు సూరయ్య | 4 |
| భరతము | దామరాజు సోమయ్య | 9 |
| త్రిపురవిజయము | ,, | 1 |
| శివజ్ఞానదీపిక | ,, | 3 |
| రేవతీ పరిణయము | మద్దికాయల మల్లయ | 3 |
| జలపాలి మాహాత్మ్యము | ఘటసాని మల్లుభట్టు | 3 |
| పద్మావతీ కల్యాణము | నెల్లూరి ముత్తరాజు | 1 |
| అష్టమహిషీ కల్యాణము | రెడ్డిపల్లె ముద్దమరాజు | 2 |
| విష్ణుకథానిధానము | బైతరాజు ముమ్మయ | 43 |
| బృహన్నారదీయము | వాసిరాజు రామయ్య | 3 |
| విష్ణుకాంచీ మాహాత్మ్యము | ఆంధ్రకవి రామయ్య | 11 |

ఈ విధంగా దాదాపు 54 కొత్త కావ్యాలను సర్వప్రథమంగా శాస్త్రిగారి ప్రబంధ రత్నావళీ సంకలన గ్రంథమే తెలుగు లోకానికి తెలియజేసింది. పెద పాటి జగ్గన, ఉదాహరణ పద్యకర్తల కాలానికి - అంటే పదహారో శతాబ్దికి ఈ కావ్యాలన్నీ ఉండినట్లే భావించాలి, లేకపోతే, 16 వ శతాబ్దికి చెందిన జగ్గన ఈ కావ్యాలనుండి పద్యాలను సంకలనం చేయడం అసాధ్యమే కదా! ఈ పై గ్రంథాలన్నీ నేడు మనకు అలభ్యాలే. ఐనా, ఆ యా కృతుల్లోని కొన్ని పద్యాలైనా సంకలితమైనందుకు మనం సంతోషించాలి.

ప్రభాకరశాస్త్రిగారు 'నా రచనలు' అనే శీర్షికతో తాము రాసిన, రాయవలసిన రచనలను ఉట్టంకిస్తూ స్వహస్తంతో రాసి ఉంచుకున్న విశేషాలను ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు మణిమంజరి రెండో సంచిక (ఆగస్టు 1981)లో ప్రచురించినారు. ఇందులో ప్రబంధ రత్నావళిని గురించి శాస్త్రిగారు ఈ విధంగా రాసుకున్నారు:

"తెలుగు కవిత పుట్టిన నాటినుండి కృష్ణదేవరాయల దాక కల కవులలో ఇప్పుడు పేరైన తెలియరాని కవుల గ్రంథములనుండి ప్రాచీనులు సేకరించిన పద్యరత్నముల గని. దీనికి కవి చరిత్ర పరిశీలనలో గొప్ప పీఠిక వ్రాసి ప్రకటించినాను, భాషాచరిత్రపరిశీలకులందరు దీనినారాధింతురు."

ఈ వాక్యాలవల్ల సాహిత్యచరిత్రకారులకిది ఎంత ఉపయోగకరమో తెలుసుకోవచ్చు. కవిజనాశ్రయ మొక్కటే మనకు జైనప్రసక్తగ్రంథంగా తెలియవచ్చిన గ్రంథం. శాస్త్రిగారి ప్రబంధ రత్నావళి మూలంగానే పద్మకవి జినేంద్ర పురాణం, పద్మదేవుని ఆదిపురాణం తెలియవచ్చి, తెలుగులో జైనవాఙ్మయపు ఉనికిని ప్రకటిస్తున్నాయి. నిడుదవోలు వెంకటరావుగారు తమ తెలుగు కవుల చరిత్రలో నన్నయపూర్వయుగ జైన సాహిత్యాన్ని గూర్చి వ్రాయడానికి ఈ కావ్యాలే దోహదం చేసినాయని ప్రబంధరత్నావళి పీఠికలో తెలియజేసినారు.

ప్రబంధ రత్నావళి ప్రేరణంవల్లే తరువాతి పరిశోధకులు అందులో పేర్కొబడ్డ కొన్ని కొన్ని కావ్యాలను గుర్తించి ప్రకటించడం జరిగింది. తాళ్ళపాక అన్నమయ్య వేంకటేశ్వర శతకం, అప్పన చారుచర్య, ధావిపాటి

త్రిపురాంతకుని అంబికా శతకం. దగ్గుపల్లి దుగ్గన నాసికేతూపాఖ్యానం అట్టి వాటిలో కొన్ని. తిక్కనకాలానికి చెందిన చారుచర్యను శాస్త్రిగారే సంపాదించి, సంస్కరించి, పీఠికరాసి ముక్త్యాలరాజుగారిచే ప్రకటింపజేసినారు. ప్రబంధరత్నావళిలో రంగనాథునివిగా పేర్కొబడ్డ మూడుపద్యాల ఆధారంగానే శాస్త్రిగారు 'రంగనాథుని శివకవిత్వం' అనే పరిశోధన వ్యాసాన్ని రచించినారు. ప్రబంధ రత్నావళి ప్రేరణవల్లనే శ్రీ రావూరి ప్రసన్న సత్యనారాయణగారు, 'విస్మృతాంధ్రకవినీరాజనం' అనే పేర పూర్వాంధ్రకవులను గూర్చి వ్యాసపరంపరను ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలో వెలయించినారు.

ప్రబంధరత్నావళివల్ల తెలియవచ్చే గ్రంథాల్లో ఎన్నో రసవత్తరమైన కావ్యాలు ఉన్నాయి. కొన్ని శాస్త్రగ్రంథాలు కూడా కనిపిస్తాయి, శాస్త్రగ్రంథాల్లో 'భరతం' అన్న పేరుతో ఒక గ్రంథం ఉంది. దీని కర్త దామరాజు సోమయ్య. ఇందులోనుండి మొత్తం ఐదు పద్యాలు ఉదాహరింపబడ్డాయి. వీటిలో మూడు స్తుత్యాత్మకాలు, తక్కిన రెండు పద్యాలు నాట్యవిషయానికి సంబంధించినవి. వీటిని బట్టి ఇది భరతుని నాట్యశాస్త్రంలోని విషయాలను తెలిపే శాస్త్రగ్రంథ మని తెలుస్తుంది. ఇందులో నటుని లక్షణాలు పేర్కొబడ్డ ఈ పద్యాన్ని గమనించండి:

మొదలి పుష్పాంజలి ముదమునఁ గావించి
        కరబాళి మొగబాళి సరవులెత్తి
ఉరుపృథుబాళములొగిఁ బిల్లమురువును
        హస్త ప్రకణము లే ననువుపరచి
కడకట్టు శబ్దంబు కడగి దర్వును జిందు
        బాగైన గీత ప్రబంధములును
కుండలి బహురూప దండలాస్య విలాస
        దేశిమార్గంబుల తెరువు లెఱిగి
నయము బిఱుసును సంగతుల్ కడిదిగాను
తిరువుమురువును నిలుకడ తిన్ననగుచు
పాత్రఁగొనిపించఁగొనగను ప్రౌఢియైన
వాడె నటుఁడనఁబరగు నీ వసుధయందు.

'భరతం' అనే ఈ నాట్యశాస్త్ర గ్రంథం లభ్యంకాకపోవడం విచారించదగ్గ విషయం. మరెన్నో లభ్యంకాని అపూర్వ గ్రంథాలు, వాటిలోని పద్యాలు ప్రబంధరత్నావళిలో పేర్కొబడ్డాయి. వీటిలో నన్నెచోడుని కళావిలాసం, తిక్కన విజయసేనం, నంది మల్లయ మదనసేనం, చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనం, భాస్కరుని కేతనప్రగ్గడ కాదంబరి మొదలైన గ్రంథాలు ఎప్పటికైనా లభిస్తాయని ఆశిద్దాం.

ప్రభాకరశాస్త్రిగారు ప్రబంధరత్నావళిని సంకలనం చేసి ఎంతోమంది అజ్ఞాతకవులను, వారి కావ్యాలను తెలుగు లోకానికి పరిచయం చేసి, తెలుగు సాహిత్యచరిత్రనిర్మాణానికి దోహదంచేసి,ఎంతోమంది పరిశోధకులనుఈ దిశలో ప్రభావితం చేసి, వారిని అజ్ఞాతసారస్వతంపై పరిశోధన చేయడానికి, అజ్ఞాత గ్రంథాలను సంపాదించడానికి స్ఫూర్తినిచ్చి, తెలుగు పరిశోధన రంగానికి చేసిన సేవ స్థిరమైనది, చిరస్మరణీయమైనది.

ప్రభాకర స్మారిక IV (1990) లో ప్రచురింపబడిన వ్యాసం.)

# తెలుగులో అనుకరణవాచకాలు

ఆంధ్ర శబ్దచింతామణి, వైకృత చంద్రిక, బాల వ్యాకరణం మొదలైన వ్యాకరణ గ్రంథాల్లో అనుకరణ పదాలకు సంబంధించిన సంధి విశేషాలు చెప్పబడ్డాయి. కాని అవి సంస్కృతంలోని పదాన్నో, వాక్యాన్నో తెలుగులో అనుకరించినప్పుడు సంధిలో వచ్చే మార్పును వివరించేవే కాని దేశ్యాలైన ధ్వన్యనుకరణ పదాల స్వరూపాన్ని కానీ, ఆ పదాలకు సంధిలో వచ్చే మార్పులనుకానీ వివరించేవి మాత్రం కావు. ఈ విషయంలో కొన్ని విశేషాలను వివరించిన వ్యాకర్తలు వికృతి వివేక కర్త, ప్రౌఢవ్యాకర్త - ఈ ఇద్దరు మాత్రమే. ఈ సందర్భంలో ప్రౌఢవ్యాకర్త మూడు సూత్రాలనూ, వికృతి వివేకకర్త ఒక కారికనూ చెప్పినారు. వీటిలోనూ ధ్వన్యనుకరణ పదాల్లోని వైచిత్రినీ, వాటి ప్రయోగరీతులనూ పూర్తిగా విశ్లేషణ చేసి చూపడం జరుగలేదు. ఆ విశ్లేషణ ప్రయత్నమే ఈ వ్యాసంలోని ప్రధానాంశం.

అనుకరణ శబ్దాలు ధ్వనిని అనుకరించేవైనా, కాంతి, వేగం, బాధ, మొదలైన ధ్వనీతరాలను అనుకరించేవైనా వాటన్నింటినీ ధ్వన్యనుకరణ పదాలుగానే ప్రౌఢ వ్యాకర్త వ్యవహరించినాడు. అతడు చూపిన తళతళ, వడవడ అనే ఉదాహరణపదాలు ఇందుకు సాక్ష్యాలు. ఇవి ధ్వనిని అనుకరించే పదాలు కావు. వడవడ అనేది శరీర కంపనాన్ని, తళతళ అనేది కాంతిని అనుకరించే శబ్దాలు. కనుక ప్రౌఢవ్యాకర్త పేర్కొన్న ధ్వన్యనుకరణవాచక శబ్దాల్లో కేవలం ధ్వన్యనుకరణ వాచకాలే కాక కాంత్యాద్యనుకరణ వాచకాలు కూడా ఉన్నాయి. ప్రౌఢ వ్యాకర్త ధ్వన్యనుకరణ వాచకాలుగా భావించిన పదాలనన్నింటినీ ఈ క్రింది విధంగా విశ్లేషణ చేయవచ్చు:

ధ్వన్యనుకరణ వాచకాలు - కిలకిల మొ॥

కాంత్యనుకరణ వాచకాలు - తళతళ మొ॥

వాసనానుకరణ వాచకాలు - గమగమ మొ॥

బాధానుకరణవాచకాలు - కలుక్కు మొ॥

వేగానుకరణవాచకాలు - చకచక మొ॥

దాహానుకరణ వాచకాలు - భగభగ మొ

ఆకస్మికతానుకరణవాచకాలు - దిగ్గున మొ॥

కనుక వీటిని ధ్వన్యనుకరణవాచకాలనడంకంటే ధ్వన్యాద్యనుకరణ వాచకాలని వ్యవహరించి ఉంటే బాగుండేది. ఐతే అనుకరణశబ్దాల్లో చాలా శబ్దాలు ధ్వనిని అనుకరించేవే కనుక ధ్వన్యనుకరణ శబ్దంలోని ధ్వనిశబ్దం తక్కినవాటికి కూడ ఉపలక్షణమని చెప్పుకోవలసి ఉంటుంది. వికృతివివేకకర్త మాత్రం వీటిని కాంతి శబ్దాది శబ్దాలని పేర్కొనడం యుక్తంగా ఉంది. ఐతే ఈతడు అనుకరణశబ్దాలకు సంబంధించిన సంధివిశేషాలు మాత్రం వివరించలేదు.

"ధ్వన్యనుకరణశబ్దముల కనుధాతువు పరంబగుచోఁ గొన్ని యెడల ముగాగమంబగు" (ప్రౌ. వ్యా. సంధి 19) అనే సూత్రంలో ప్రౌఢవ్యాకర్తచే ధ్వన్యనుకరణ పదాలకు అనుధాతువు పరమైనప్పుడు ముగాగమం విధింపబడింది. ఉదా :- కనకనమను, వలవలమను మొ॥ కాని, కొన్ని పదాలపై ముగాగమంతో పాటు రుగాగమం కూడా కనిపిస్తుంది.

ఉదా : దిగ్గురను, చివుక్కురను
భగ్గురను, ఖంగురను మొ॥

ప్రౌఢవ్యాకర్త ఈ రుగాగమాన్ని విధించలేదు.

ప్రౌఢవ్యాకర్త ముగాగమానికి ఇచ్చిన ఉదాహృతులనుబట్టి చూస్తే ద్విరుక్తమైన పదాలతో ఏర్పడే అనుకరణ పదాలకు మాత్రమే ముగాగమం వస్తుందని తెలుస్తుంది. కాని అద్విరుక్తంగా ఉన్న అనుకరణపదాలపై కూడా ముగాగమం రావడం సర్వసాధారణమైన విషయం.

ఉదా : భగ్గుమని, బుర్రుమని
పక్కుమని. జల్లుమని మొ॥

పై పదాల్లో ముగాగమం వైకల్పికం - ముగాగమం రాని 'భగ్గని' మొదలైన రూపాలుకూడా ఉంటవి.

ప్రౌఢవ్యాకర్త కనకన, సల సల మొదలైన ద్విరుక్తరూపాలను మాత్రమే ధ్వన్యనుకరణ పదాలుగా భావించినట్లు ఇంతకుముందు చెప్పుకున్నాం. అంతేకాక తరువాతి సూత్రమైన "ధ్వన్యనుకరణ శబ్దంబులు ద్విరుక్తంబుల యగు" (ప్రౌ వ్యా. సంధి 20) అనే సూత్రంలో ఈ విషయాన్ని వాచ్యంగానే చెప్పినాడు కూడా. అనుకరణవాచకాలు ఎప్పుడూ ద్విరుక్తంగానే ఉంటాయన్న ప్రౌఢ వ్యాకర్త అభిప్రాయాన్ని పరిశీలిద్దాం. సూత్రంలోని 'ద్విరుక్తంబుల' అనే అవధారణార్థకంవల్ల అనుకరణవాచకాలు అద్విరుక్తంగా ఉండడానికి వీల్లేదని తెలుస్తుంది. కాని అద్విరుక్తంగా ఉండే అనుకరణపదాలు కొల్లలుగా కనిపిస్తున్నాయి.

ఉదా:- జిగేలుమని, భగ్గుమని, బుస్సుమని
గొల్లుమని, పెఠిల్లని, జుమ్మని మొ॥

ప్రౌఢవ్యాకర్త ఉదాహరించిన గడగడ, వడవడ మొదలైనవి ద్విరుక్తమైనప్పుడు మాత్రమే అనుకరణవాచకాలౌతవి. అద్విరుక్తంగా ఉన్నప్పుడు వీటికి అనుకరణవాచకత్వం ఉండదు. కనుక ధ్వన్యనుకరణవాచకపదాలను కేవల ద్విరుక్తాలు, కేవల అద్విరుక్తాలు, ద్విరుక్త - అద్విరుక్తాలు అని మూడు విధాలుగా విభజించడానికి అవకాశం ఉంది.

కేవల ద్విరుక్తాలు:- వడవడ, జలజల, గడగడ
గిజగిజ, కిటకిట, కహకహ, కిచకిచ
కిలకిల, మలమల, తుకతుక, నిగనిగ
చకచక, వలవల, విలవిల, గునగున మొ॥

కేవల అద్విరుక్తాలు - కిక్కురు మొ॥ 'కిక్కురు' అనేది స్వల్పధ్వనిని అనుకరించే పదం. దీనికి వ్యతిరేక క్రియతోనే ప్రయోగం ఉండడం విశేషం.

ఉదా :- కిక్కురుమనకుండా.

## ద్విరుక్త - అద్విరుక్తాలు

| | | |
|---|---|---|
| (అ) | చెంగుచెంగున | చెంగున |
| (ఆ) | గజగజ | గజ్జున |
| | గిరగిర | గిర్రున |
| | చురచుర | చుర్రున |
| | దబదబ | దబ్బున |
| | పకపక | పక్కున |
| | భగభగ | భగ్గున మొ॥ |

ద్విరుక్త - అద్విరుక్తాలుగా పేర్కొబడ్డ పై పదాల్లో ద్విరుక్తానికీ, అద్విరుక్తానికీ అర్థచ్ఛాయలో కొంత భేదం కనిపిస్తుంది. ద్విరుక్తమైనప్పుడు ఆ పదం బోధించే క్రియలో అవిచ్ఛిన్నత గోచరిస్తుంది. అద్విరుక్తంగా ఉన్నపుడు అవిచ్ఛిన్నత కానరాదు. 'ఆ' లో చూపబడ్డ అద్విరుక్త పదాల్లో ద్విరుక్త పదాల్లోని ఒక పదం శేషించి చివరి హల్లు ద్విత్వోత్వాలను పొందడం, దానిపై నకారం చేరడం కనిపిస్తుంది.

"ధ్వన్యనుకరణ శబ్దాలు ద్విరుక్తంబుల యగు" (ప్రౌ. వ్యా. సంధి 20) అనే సూత్రం వల్ల ద్విరుక్తం కావలసిన శబ్దానికే - అంటే అద్విరుక్త స్థితిలో ఉన్నప్పుడే ధ్వన్యనుకరణవాచకత్వం ఉన్నట్లుగా తెలుస్తుంది. కాని ఈ సూత్రానికిచ్చిన ఉదాహృతుల్లో అద్విరుక్తంగా ఉన్న గడ, నడ మొదలైన శబ్దాలకు అనుకరణవాచకత్వం లేదుకదా? కనుక ప్రౌఢవ్యాకర్త ఈ సూత్రాన్ని "కొన్ని యెడల ద్విరుక్తంబులగు పదంబుల ధ్వన్యనుకరణవాచకంబులగు" అని సూత్రించి ఉంటే బాగుండేది.

ద్విరుక్త రూపంలో ఉండే కొన్ని అనుకరణ వాచకాల్లో పూర్వపదంలోని అంత్యాచ్చు వికల్పంగా దీర్ఘమౌతుంది.

| | | |
|---|---|---|
| ఉదా : కిలాకిల | కిలకిల | |
| కికాకిక | కికకిక | |
| పకాపక | పకపక | మొ॥ |

అనుకరణ పదాలకు అనుప్రయుక్తమయ్యే పదాలు సాధారణంగా ఆయా అనుకరణ పదాలకు సంబంధించిన విశేషక్రియాపదాలై ఉంటవి.

ఉదా:- మిలమిల మెఱయు, కనకన మండు మొ॥ ఈ విశేషక్రియా పదాలకు మారుగా అను, ఆడు, కొను, కొట్టు, ఇంచు మొదలైన అనుబంధ క్రియలు కూడ అనుప్రయుక్తమౌతవి. వీటిలో 'ఇంచు' అనే ప్రయోగం చాలా విరళం.

అను:- మిలమిలమను. కనకనమను, గాంౘుమను మొ॥

ఆడు:- తళతళలాడు, గడగడలాడు, రెపరెపలాడు మొ॥

కొను:- గిజగిజకొను మొ॥

కొట్టు:- గిజకొట్టు, కిలకొట్టు మొ॥

ఇంచు:- గమగమించు మొ॥

పోవు:- గజగజలు పోవు మొ॥

అనుధాతువు అనుప్రయుక్తమైనపుడు అనుకరణవాచక పదానికి ముగాగమమూ, 'ఆడు' ధాతువు అనుప్రయుక్తమైనప్పుడు టుగాగమమూ వస్తవి. ద్విరుక్తరూపంలో ఉన్న ధ్వన్యనుకరణ వాచకంమీద చేరే అను, ఆడు అనేవి కొన్నిచోట్ల పరస్పరవ్యత్యయాన్ని పొందడం కనిపిస్తుంది.

ఉదా:- కనకనమనె........కనకనలాడె మొ॥

అనుకరణపదాల్లో కొన్నింటికి - అవి ద్విరుక్తాలైనా, అద్విరుక్తాలైనా తత్సంబంధి క్రియాపదం పరంగా ఉన్నప్పుడు 'న' అనేది ఆగమంగా వస్తుంది.

భగ్గు(భగ్గుభగ్గు)న మండు
చెంగు(చెంగుచెంగు)న ఎగురు మొ॥

ఈ 'న' ఆగమం ఉకారాంతమైన అనుకరణ పదంపైనే వస్తుంది. భగ్గున, చెంగున మొదలైన రూపాలు భగ్గని, చెంగని అనే రూపాలకు పరరూపాలు కావచ్చునేమో?

ఇంతవరకూ చెప్పుకున్న ద్విరుక్తాలైన అనుకరణ పదాల్లో పూర్వపదమూ, ఉత్తరపదమూ ఒకటిగానే ఉన్నాయి. కాని, కొన్ని చోట్ల పూర్వపదం ఒకటీ, ఉత్తరపదం మరొకటీ ఉన్న అనుకరణపదాలుకూడా కనిపిస్తున్నాయి.

ఉదా : చిటపట కటపెట

గజిబిజి కళపెళ

గలబెల కసిబిసి

రంగురింగు కసపుస

చెటుకుపొటుకు మొ॥

ఆకస్మికతార్థాన్ని బోధించే అనుకరణవాచకపదాలపై, 'అలు' అనే శబ్దమూ 'న' వర్ణమూ ఆగమాలుగా వస్తాయి. అనుకరణవాచకం ద్విరుక్త రూపంలో ఉన్నప్పుడు మాత్రం 'అలు' ఆగమం ద్విరుక్తరూపాలు రెండిటిపైన చేరుతుంది. 'న' మాత్రం ఆమ్రేడితంపైనే చేరుతుంది.

ఉదా : (1) తటాలున, గబాలున మొ॥

(2) తటాలుతటాలున. గబాలుగబాలున మొ॥

కొన్ని అనుకరణ వాచకాలు అడు, కొను మొదలైన అనుబంధక్రియలు చేర్చడంవల్ల క్రియలుగా మారినట్లే 'లు' ప్రత్యయం చేరినప్పుడు నామవాచకాలుగా మారడం కనిపిస్తుంది. అంటే - క్రియావిశేషణాలుగా ప్రయోగింపబడే అనుకరణపదాలు నామవాచకాలుగా మారడమన్నమాట! నామవాచకాలుగా ప్రయోగింపబడినప్పుడు మాత్రం అవి ద్విరుక్తరూపంలోనూ, బహువచనరూపంలోనూ మాత్రమే ఉంటాయి.

ఉదా : గమగమలు, గుటగుటలు

కిలకిలలు, రుసరుసలు

భగభగలు, ధగధగలు

చకచకలు మొ॥

తెలుగుకవు లీ అనుకరణపదాలను కొన్నింటిని వ్యస్తంగానే కాకుండా సంస్కృత కృదంతరూపాలుగానూ మార్చి తమ రచనల్లో వాడుకున్నారు. కొన్నింటిని క్రింద ఉదాహరిస్తాను:

ధగద్ధగాయమానంబులు (భాగవతం - 1-1744)
సిమసిమచ్ఛబ్దంబుతో (మనుచరిత్ర 111-22)
ఝుళంఝుళత్కటకసూచిత (మనుచరిత్ర 11-26)
ఘుమఘుమాయితములై (భాస్కరరామాయణం - 1491)
చిమచిమాయిత ఛటచ్ఛటారావంబుల (హరివంశం ఉ.భా. 1-90)

అనుకరణపదాలు కొన్ని కృదంతాలుగానేకాక భావార్థకతద్ధితాంతాలుగా కూడా తెలుగులో చోటు చేసుకున్నాయి.

| | |
|---|---|
| ఉదా : చకచక | చాకచక్యము |
| నిగనిగ | నైగనిగ్యము |
| ధళధళ | ధాళధళ్యము |

ఈ విధంగా విశ్లేషణచేసి చూస్తే అనుకరణపదాల్లో ఎంతో వైచిత్రి కనిపిస్తుంది. వీటిని సందర్భానుగుణంగా ప్రయోగించినప్పుడు వాక్యానికి బిగువూ, జీవమూ, శ్రోత్రపేయతా కలుగుతాయి. కింది ఉదాహృతులను పరిశీలించండి.

కటపెట తొటతొట రాలెడు
పొటపొట చినుకుల ధరిత్రి పొడ నట్టువడన్
సొటసొట నాకట సోలుచుఁ
దటతటపడు చాతకముల దైన్యము వాసెన్
(వైజయంతీవిలాసం. 2-146)

పెటపెటఁగా సెగ్రవి
పటపటపటమనుచు గిరులు పగిలెన్ రగిలెన్
చిటచిటచిటమనుచున్ వని
గిటగిటగిటమనుచు జనము గృశియించె సెగన్
(రాజవాహనవిజయం 5-98)

(ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ పరిశోధన పత్రిక 'వివేచన' (1981)లో ప్రచురితమైన వ్యాసం.)

# ప్రాకృతాంధ్ర భాషాసాహిత్యాలు

తెలుగులో ఉభయ భాషలు, అష్టభాషలు అనే వ్యవహారం ఉంది. సంస్కృతం, తెలుగు ఉభయభాషలు. షడ్విధప్రాకృతాలూ, సంస్కృతాంధ్రాలూ కలిసి అష్టభాషలు. నన్నయ్య, తిక్కనలకాలంలో ఉభయభాషలనే వ్యవహారం మాత్రమే ఉంది. క్రీ.శ. 14 వ శతాబ్దినుండే అష్టభాషలనే వ్యవహారం ఏర్పడింది. తెలుగుకవులు సంస్కృతాంధ్రాలతోపాటు ప్రాకృతభాషల్లో కూడా పాండిత్యాన్ని సంపాదించిన వెనుక ఈ వ్యవహారం ప్రచారంలోకి వచ్చివుంటుంది అప్పకవి అష్టభాషలను ఈవిధంగా పేర్కొన్నాడు;

"సంస్కృతము ప్రాకృతంబును శౌరసేని
జగతిపై మాగధియును బైశాచికయును
జూళికయు నపభ్రంశంబు సొరిది నాంధ్ర
భాషయును నివి చనునష్టభాషలనగ" (1-77)

దీనిప్రకారం సంస్కృతాంధ్రాలు, ప్రాకృతం-శౌరసేని-మాగధి-పైశాచి-చూళిక - అపభ్రంశం అనే షడ్విధపాకృతాలు అష్టభాషలు. తాళ్లపాక అన్నమాచార్యుల మనుమడు చిన తిరుమలాచార్యుడు (1537) తన అష్టభాషాదండకంలో పేర్కొన్న అష్టభాషలు అప్పకవి పేర్కొన్న ప్రాకృతభాషలతో కొద్దిగా భేదిస్తున్నాయి. అప్పకవి చెప్పిన చూళిక, అపభ్రంశ ప్రాకృతాలను చినతిరుమలాచార్యుడు ప్రాచి, అవంతి అనీ, ఆంధ్రభాషకు బదులుగా సార్వదేశిభాష అనీ పేర్కొన్నాడు. విజయరాఘవునికాలంలో ఉన్న రంగాజమ్మ (1633-1673) తన మన్నారుదాసవిలాసంలో అప్పకవి పేర్కొన్నవాటినే పేర్కొన్నా - ఆంధ్ర భాషకు బదులుగా 'దేశి' అని పేర్కొన్నది. మొత్తంపైన షడ్విధప్రాకృతాలు-ఆ భేదాల్లో కొద్దిభేదం కనిపించినా - సంస్కృతాంధ్రాలూ కలిసి అష్టభాషలనే వ్యవహారం ఏర్పడింది. మొట్టమొదట తెలుగుభాషకు సంస్కృత భాషతో సంబంధం లేనట్లుగానే ప్రాకృతభాషతోనూ సంబంధం లేకుండింది. కాని,

తెలుగులో తద్భవరూపాలు ఏర్పడేకాలంనాటికి ప్రాకృతభాషతో సంబంధం ఏర్పడి అది క్రమంగా వృద్ధిపొందిందని చెప్పవచ్చు. ఆదికవి నన్నయభట్టారకుడు తనను 'ఉభయభాషా కావ్యరచనాభి శోభితుడ'నని చెప్పుకున్నాడు. 'ఉభయ కావ్యప్రౌఢి బాటించు శిల్పమునన్ బారగుడన్' అన్ని తిక్కన స్వయంగానూ, 'ఉభయకవిత్వతత్వ విభవోజ్జ్వలు' అని మారనా పేర్కొనడంవల్ల తిక్కనకు కూడా ప్రాకృత భాషతో సంబంధమున్నట్లుగా కానరాదు. కనుక నన్నయ, తిక్కనల కాలం తరువాతనే తెలుగు కవులు సంస్కృతాంధ్రాలతో పాటు ప్రాకృత భాషల్లోనూ పాండిత్యాన్ని సంపాదించడం, అందులో కవితా వ్యాసంగం చేయడం అధికమైందని చెప్పవచ్చు.

ప్రాకృతభాషా పాండిత్యమూ, కవితా వైదగ్ధ్యమూ సంపాదించినవాళ్ళు తెలుగుకవుల్లో ఎంతోమంది ఉన్నారు. వీరిలో భారత రచనలో నన్నయభట్టుకు బాసటగా నిలిచిన నారాయణభట్టు- ఆయన రచించిన గ్రంథమొక్కటీ మనకు లభించకపోయినా - సంస్కృతాంధ్ర కన్నడాలతోపాటు ప్రాకృత పైశాచిక భాషల్లోను 'కవి రాజశేఖరుడనే' విషయం నన్నయ రచితమైన నందంపూడి శాసనం (క్రీ. శ. 1063) లోని 'యః సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్రభాషాసు, కవి రాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వవిభవేన' (25 శ్లో) అనే శ్లోకంవల్ల తెలుస్తుంది.

నవీన గుణనాథుడైన నాచన సోమన (1390) ఉత్తర హరివంశం ఆశ్వాసాంతగద్యలో తనను సకలభాషాభూషణుణ్ణిగా చెప్పుకున్నాడు. సకల భాషాశబ్దం అష్టభాషలకు సూచకమని చెప్పవచ్చు. బుక్కరాయలు పెంచు కలదిన్నె గ్రామాన్ని నాచన సోమనకు అగ్రహారంగా ఇచ్చిన వృత్తాంతాన్ని తెలిపే పెంచుకలదిన్నె శాసనంలో నాచన సోమన 'అష్టభాషా కవిత్వ శ్రీవాణీవిజిత....' అని కీర్తింపపడడం దీనికి ప్రమాణం.

బాలభాగవత రచయిత దోనూరి కోనేరు కవి (1547) బాసుర సంస్కృత ప్రాకృతాదిక శాస్త్రభాషాకవిత్వసౌభాగ్య నిపుణుడనీ. సకలక్ష్మాకవినాథయూథ

ములు మెచ్చన్ సంస్కృత ప్రాకృతాదిక భాషామయ కావ్యకర్త అనీ, వినుతాష్టభాషాకవిత్వప్రచండుడనీ అతని బాలభాగవత పీఠికవల్ల తెలుస్తుంది.

శ్రీనాథుడు తన కావ్యాల్లో తాను ప్రాకృతభాషావిదుడనని చెప్పుకోకపోయినా, దుగ్గన నాసికేతోపాఖ్యానంలో చెప్పిన 'సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య భాషాపరిజ్ఞాన పాటవంబు' (1 - 18) అన్న వాక్యం శ్రీనాథుని ప్రాకృతభాషా ప్రజ్ఞతను వెల్లడిచేస్తుంది. అంతేకాదు, అతని 'శాలివాహన సప్తశతి' ఆతని ప్రాకృతభాషా పాండిత్యాన్ని సూచిస్తుంది. ఈ విషయాన్ని తరువాత ముచ్చటిస్తాను.

ధరణిదేవుల రామమంత్రి దశావతార చరిత్రలో 'సంస్కృతప్రాకృతాద్యష్టభాషాకవిత్వతత్వసంవేది' (1 - 16) నని చెప్పుకోవడమేకాక, అందులో అష్టభాషాసీసాన్ని రచించి, తన ప్రాకృతభాషా కవితానైపుణ్యాన్ని ప్రదర్శించినాడు. తాళ్ళపాక చిన తిరుమలాచార్యుడు (క్రీ. శ. 1537) రచించిన 'అష్టభాషా దండకం' అతని ప్రాకృతకవితావైశారద్యాన్ని తెలుపుతుంది.

కొరవి గోపరాజు (15 శ.) 'సింహాసనద్వాత్రింశిక'లో తాను అష్టభాషావిదుడనని చెప్పుకోవడమేకాక ప్రాకృత పదాలను వాడుతూ ఈ కింది పద్యం చెప్పినాడు:

"దండశూకాధిపోద్దండ భుజాదండ
భూరివిశ్వంభరాభారధుర్య
జంభారిపరికీర్తితాంభోజినీమిత్ర
సూణుసమాహియ దాణరాయ
అక్కిణహృదయ దండొక్క కేళః క్కేళి
పతివః కణీవళః పక్కడక్క
అంకక్కదిక్కమహాలదసాందన
ళవలవప్పహితతులః కధీర

ధీరసంపదస్తు, దేవబంధకహిమ
దఃక సౌక్కు మోరిదర్శనిచయ
యనుచు నాల్గు భాషలను రాజు దీవించి
నయనసంజ్ఞ నాసనమున నుండి (2-46)

గణపవరపు వేంకటకవి (1620-1660) ప్రబంధరాజ విజయ విలాసంలో రెండు గీతపద్యాల్లో సంస్కృతాంధ్రాలను, తక్కిన ఆరు పాదాల్లో షడ్విధ ప్రాకృతాలను వాడుతూ చెప్పిన అష్టభాషాసీసం (876 పద్యం) కనిపిస్తుంది. తెలుగు దేశిచ్ఛందోభేదమైన సీసపద్యంలో ప్రాకృత కవితను అవతరింపజేయడం ఒక విశేషం.

రంగాజమ్మ (1633 - 1673) షడ్విధ ప్రాకృతాలలో కవితను సంతరించగల సమర్థురాలు. ఈ కవయిత్రి మన్నారుదాస విలాసంలో షడ్విధ ప్రాకృతాలలో రచించిన ఆరు పద్యాలు కనిపిస్తున్నాయి. ఈ పద్యాలు ఉషా పరిణయ గద్యలో 'అతులితాష్ట భాషాకవితా సర్వంకషమనీషా విశేష విశారదనని' చాటుకున్న ఆమె ప్రాకృతభాషాకవితామనీషను నిరూపిస్తున్నాయి.

భాస్కర రామాయణ కవులలో నొకడైన మల్లికార్జునభట్టు తాను అష్ట భాషా కవి మిత్రుడననీ, వైకృత చంద్రికా కర్త మంచెళ్ళ వాసుదేవకవి అష్ట భాషా కవిత్వ సామ్రాజ్య పట్ట భద్రుడననీ చెప్పుకున్నారు. సకల కథా నిధానమును, కొక్కోకమును రచించిన కూచిరాజు ఎఱ్ఱయ కూడా అష్ట భాషాకవితా నిపుణుడే. (వివిధాష్ట భాషా కవిత్వ వాచాప్రౌఢిఁ బూర్వకవీంద్రుల బోలినాడ, వఖిల; సకలకథానిధానము - పీఠిక.)

మంచెళ్ళ వాసుదేవకవి ప్రాకృతభాషా పరిచయం వైకృత చంద్రికలోని తెలుగుతద్భవాల నిరూపణవిషయంలో స్పష్టంగా కానవస్తుంది.

ఆంధ్రపాణిని బిరుదాంచితుడు నివర్తి శేషసుమతి కూడా అష్టభాషాకవితా కోవిదుడుగా ప్రసిద్ధుడు. గద్వాల సంస్థానంలో కవీశ్వరుడుగా ఉండి యథాశ్లోక తాత్పర్యరామాయణ రచనకు ఆధ్వర్యవం వహించి ,అందులో కిష్కింధాకాండను రచించిన కామసముద్రం అప్పలాచార్యులు తాను "మాగధిభాండీర మాళవీ

ప్రభృతి సప్తప్రాకృతముల ప్రబంధములు కొన్ని రచించినట్లుగా చెప్పుకున్నాడు. ఈయన తండ్రి కృష్ణార్యుడు. యథాశ్లోక తాత్పర్యరామాయణంలోని సుందర కాండను రచించిన తిరుమల కృష్ణమాచార్యుడు వనపర్తి సంస్థాన ప్రభువు రాజా బహిరీగోపాలరావు. అచలాత్మజాపరిణయకర్త బుక్కపట్టణం కిరీటివేంకటాచార్యులు ప్రాకృత కవితానిర్మాణధురంధరులే.

ఎలకూచి బాలసరస్వతి తనను సకలభాషాకవిగా పేర్కొనడంవల్ల ఇతనికి ప్రాకృత భాషల్లో కవితానైపుణ్యం ఉన్నట్లుగా చెప్పవచ్చు. ఆంధ్రకౌముదీ కారుడు మండ లక్ష్మీనరసింహాచార్యులు తనను 'అష్టభాషా సరస్వతి'గా చెప్పుకొన్నాడు. (మయా వేగినాటీయేన మండకులకలశజలధి సుధాకరేణ, శ్రీమదష్టభాషా సరస్వతినా సహస్రావధానినా సరస కవిశేఖరేణ, కవిరాజ కంఠీరవేణ, ఆంధ్రభాషాకవితా పితామహశిరోమణి.... లక్ష్మీనృసింహ విద్వత్కవీంద్రేణ")

ఈ విధంగా సంస్కృతాంధ్రాలతోపాటు షడ్విధప్రాకృతాలలోనూ పాండిత్యాన్ని, కవితాశక్తిని సంపాదించిన తెలుగుకవులు ఎంతోమంది ఉన్నారు. ఈనాడు ఆంగ్లాది పాశ్చాత్యభాషల జ్ఞానం అదనపు అర్హతగా భావించినట్లే ఆనాటి తెలుగు ప్రాకృతభాషాపాండిత్యమూ, కవితారచనా అదనపు అర్హతలుగా భావింపబడేవని చెప్పవచ్చు.

కొందరు కవులు తాము ప్రాకృత భాషల్లో పాండిత్యం కలవాళ్ళమని చెప్పుకోకపోయినా కావ్యావతారికల్లో ప్రాకృత కవులను స్మరించి ప్రాకృత కవిత్వంపైన గౌరవాన్ని వ్యక్తంచేసినారు అట్టివారిలో జక్కన ప్రథముడు.

ఈ విధంగా తెలుగు కవులు ప్రాకృత భాషల్లో కవిత చెప్పే పద్ధతి నెలకొనడంవల్ల తెలుగు సాహిత్యానికి ప్రాకృత సాహిత్యానికి సన్నిహితత్వం ఏర్పడిందని చెప్పవచ్చు.

ఆదికవియైన నన్నయకానీ, శివకవులుకానీ, తిక్కనకానీ తమ కృతుల్లో ప్రాకృతాన్ని గురించిన ప్రస్తావన చేసినట్లు అగపడదు. శివకవుల సాహిత్యంలో ప్రాకృతభాషా దేశిపదాలకన్న తమిళ కన్నడ పదాలే ఎక్కువగా చోటు చేసుకున్నాయి. ఎర్రన నృసింహ పురాణంలోని 'భాసుర భారతార్థ బహు భంగుల

నిక్కమెఱుంగ నేరమిన్, గాసట బీసటే చదివి గాథలు త్రవ్వె తెలుంగువారికిన్' అన్న పద్యంలోని గాసట శబ్దానికి గాథాసప్తశతి అనీ, బీసట శబ్దానికి బేతాళ పంచవింశతి అనీ అర్థాలు వివరించినారు నిడుదవోలు వెంకటరావుగారు. ప్రాకృత భాషా సంప్రదాయం ప్రకారం ఈ తద్భవరూపాలు సాధువులే అని కూడా సమర్థించినారు. వేలూరి శివరామశాస్త్రిగారీ వ్యుత్పత్తిని ఆమోదించినారట. గాసట బీసటకు ఈ అర్థమే యథార్థమైతే నన్నయ భారత రచనకు పూర్వం తెలుగు వారు ప్రాకృతకావ్యాలైన గాథాసప్తశతిని, బేతాళపంచవింశతిని బాగా ఆదరించి నట్లు భావించవచ్చు.

ప్రాకృతాంధ్ర సాహిత్యాల తులనాత్మక పరిశీలనలో శ్రీనాథుడు ఒక ముఖ్య ఘట్టమని పేర్కొనాలి. ఈతడు ప్రాకృతశౌరసేనీ ముఖ్య భాషా పరిజ్ఞాన పాటవం కలవాడని దుగ్గన నాసికేతోపాఖ్యానంలో కీర్తించినాడు. అంతేకాదు, నూనూగుమీసాల నూత్న యౌవనంలోనే హాలుని గాథా సప్తశతిని 'శాలివాహన సప్తశతి' అనేపేర సొంతం అనువదించినాడు. కానీ ఆ గ్రంథం నేటికి లభ్యం కాకపోవడం ఆంధ్రుల దురదృష్టాలలో ఒకటి. తెలుగు సాహిత్యానికి నష్టజాతకం ఉండడం తెలుగుజాతికి దురదృష్టం అన్న జి.ఎన్. రెడ్డిగారి మాట నిత్యసత్యం. ఆచార్య బి. రామరాజు గారు తాము సంస్కరించి, ప్రకటించిన శివరాత్రి మాహాత్మ్య పీఠికలో 'మా యింటినుండి శ్రీనాథుని శాలివాహన సప్తశతి పోవుట నే నెరుగుదును' అని వ్రాసినారు. ప్రస్తుత మా ప్రతి ఎక్కడ ఉన్నదో, ఏమైనదో తెలియరాదు. శ్రీనాథుని గ్రంథం మనకు లభించకపోయినా, లక్షణ గ్రంథకారుల పుణ్యమా అని మన కా గ్రంథంలోని ఐదు పద్యాలైనా దొరుకు తున్నందుకు సంతోషించాలి. వీటిలో ఒకటైన 'వారణసేయదావగౌనవా' అన్న పద్యాన్ని శాలివాహన సప్తశతిలోనిదిగా మొట్టమొదట గుర్తించి లోకానికి వెల్లడి చేసిన మానవల్లి రామకృష్ణకవిగారు ఈ పద్యాన్ని నాలుగో ఆశ్వాసం లోనిదిగా పేర్కొనడంవల్ల కవిగారు కూడా ఈ గ్రంథాన్ని చూచి ఉండవచ్చు ననే సంభావించవచ్చు.

శ్రీనాథుని తరువాత గాథాసప్తశతి అనువాదానికి సాహసించినవారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, తల్లావజ్ఝల శివశంకర శాస్త్రిగారు, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, దిగుమర్తి సీతారామస్వామిగారు, ఘట్టి లక్ష్మీనరసింహ

శాస్త్రిగారు. గాథాసప్తశతి అనువాదా లన్నింటిలో ఘట్టి లక్ష్మినరసింహశాస్త్రి గారిది తప్ప తక్కిన అనువాదాలన్నీ ఏకదేశానువాదాలు మాత్రమే. వీటిలో రాళ్ళపల్లివారి అనువాదం చాలా ప్రసిద్ధిని పొందింది. వీరి అనువాదశైలికి ఒక్క ఉదాహరణం

'పూని యూదెడు నెరజాణ; ప్రొయ్యిమీద
నలుక గొనబోకు, రక్తపాటల సుగంధ
మైన నీ యూర్పు జవులకు నాసగొనుచు
పొగ లెగయు గాని మండదీ ప్రొయ్యి నగ్గి.'

సుందరమైన మూలగాథా భావమూ, ఆ భావాన్ని అనువాదంలోకి తెచ్చిన రీతీ సహృదయులను ఆకట్టుకుంటుందనటం సత్యోక్తి.

గాథాసప్తశతిలోని ఒక్కొక్క గాథను రమణీయంగా వివరిస్తూ ఇటీవల తిరుమల రామచంద్రగారు వ్రాసిన వ్యాఖ్య 1985లో పల్లకి వారపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడి సహృదయుల మన్ననలను పొందింది.

గుణాఢ్యుడు పైశాచికభాషలో అసంఖ్యాక కథలతో రచించిన బృహత్కథ భారతీయ కథా కావ్యాలన్నింటిలో మొట్టమొదటిది. అటు సంస్కృతంలోనూ, ఇటు దేశభాషల్లోనూ వెలువడిన కథా సాహిత్యానికి తొలి భిక్ష పెట్టిన కథాకావ్యం బృహత్కథాకావ్యమే అనడంలో సందేహంలేదు. ఐతే, ఈ బృహత్కథ మనకిప్పుడు లేదు. క్రీ.శ. తొమ్మిదో శతాబ్దికి చెందిన బుధస్వామి పైశాచీ బృహత్కథను అనుసరించి బృహత్కథా సంగ్రహాన్ని సంస్కృతంలో రచించినాడు. క్షేమేంద్రుని బృహత్కథామంజరి, సోమదేవుని కథాసరిత్సాగరం సంస్కృతానువాదాలు. పైశాచీ బృహత్కథను ఏమాత్రమూ అతిక్రమింపక కథాసరిత్సాగరాన్ని రచించినట్లుగానూ, సంక్షిప్తత - భాషాంతరీకరణాల్లో మాత్రమే తన గ్రంథం మూలంతో భేదిస్తున్నట్లుగానూ సోమదేవుడు తెలిపినాడు. వేదం వెంకటరాయశాస్త్రి, శివశంకరశాస్త్రి, కృత్తివాసతీర్థులు కథాసరిత్సాగరాన్ని సరళమైన వచనంలో ఆంధ్రీకరించినారు. మొదటి ఐదు లంబకాలకు తెలుగులో పద్యానువాదం కూడా వచ్చింది. పరోక్షంగా ఈ

ఆంధ్రానువాదాలన్నీ బృహత్కథకు అనువాదాలే. మదునాపంతుల సత్య నారాయణశాస్త్రిగారు తమ ఆంధ్రపురాణంలో కథాసరిత్సాగరంలోని గుణాఢ్యుని వృత్తాంతాన్ని సుందరమైన కావ్యఖండంగా మలచినారు.

తెలుగులో వెలసిన కథాకావ్యాలపై బృహత్కథాప్రభావం ఎంతగానో ఉన్నది. కదిరీపతి వ్రాసిన తెలుగు శుకసప్తతికి సంస్కృత శుకసప్తతి మూలమే ఐనా అందులో లేని కథలెన్నో తెలుగు శుకసప్తతిలో చోటు చేసుకున్నాయి. తెలుగు శుకసప్తతిలోని కథలను పోలిన కొన్ని కథలు కథాసరిత్సాగరంలో కనిపిస్తాయి. కథాసరిత్సాగరంలోని కథలు బృహత్కథలోని కథలకే సంగ్రహ రూపం కనుక శుకసప్తతిలోని కొన్ని కథలకు మూలం పరోక్షంగా బృహత్కథే అని చెప్పవచ్చు. సంస్కృత శుకసప్తతికి మూలమనదగ్గ అత్యంత ప్రాచీన మైన ప్రాకృత శుకసప్తతి కథాసంగ్రహం ఉండవలెనని పరిశోధకుల ఊహ. మొత్తంపై తెలుగు శుకసప్తతి కథలకు ప్రాకృత సంబంధముండడం అసంగతమేమీ కాదు.

ఇట్లే సంస్కృత విక్రమార్క చరిత్రలోని కథలు కొన్ని జక్కన విక్రమార్క చరిత్రలో కనిపించినా ఇందులోని ఎన్నో కథలు సంస్కృతంలో కానరావు. సంస్కృతంలోని కథలెన్నో తెలుగు విక్రమార్క చరిత్రలో లేవు. తెలుగు విక్రమార్క చరిత్రలోని కొన్ని కథలకు మూలమనదగ్గ కథలు కథా సరిత్సాగరంలో కనిపిస్తున్నాయి. తెలుగు బేతాళ పంచ వింశతి కథలకు కూడా మూలం కథా సరిత్సాగరంలో కనిపిస్తుంది. అందువల్ల కొన్నింటికి ప్రత్యక్షంగా కథాసరిత్సాగరమూ, పరోక్షంగా పైశాచీ బృహత్కథా మూలం అనవచ్చు.

వాకాట దేశాధీశ్వరుడైన ప్రవరసేన మహారాజు (15 శ.) మహారాష్ట్రి ప్రాకృతంలో సేతుబంధమనే కావ్యరత్నాన్ని రచించినాడు. దీనికి రావణవహో, దహముహ వహో అని నామాంతరాలు. రామాయణంలోని యుద్ధ కాండ వృత్తాంతం ఇందులోని ప్రధాన వస్తువు. దండి, బాణుడు ఈ కావ్యాన్ని ఎంతో ప్రశంసించినారు. ఈ ప్రాకృత కావ్యాన్ని మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు సంపూర్ణంగా ఆంధ్రీకరించినారు. ఆంధ్రీకరణ మూల విధేయంగా ఉండి

ప్రాకృత కావ్యంలోని భావాలను మనకు యథాతథంగా అందచేస్తుంది. ఒక్క ఉదాహరణం పరిశీలించండి:

"చాపతుల్యాకృతి వహించు సంద్రమునకు, సంహిత శరోపమము పార్వ సంఘటితము, గుణమువలె నున్న వింధ్యాద్రి కుధరవరము, జూచె రాఘవుడ త్తరి జూడ్కు-లలర" రఘునాథనాయకుని రామాయణంలో సముద్ర వర్ణన సంద ర్భంలో సేతు బంధంలోని వర్ణనలకు పోలికలున్నట్లుగా నిడుదవోలువారు వ్రాసినాడు. కాని రఘునాథనాయకుని రామాయణం పూర్తిగా లభించలేదు. లభించిన భాగంలో మాత్రం శ్వేత ద్వీపవర్ణన ఉన్నా, అందులో సేతుబంధం లోని సముద్రవర్ణన సందర్భంలోని భావాలు కానరావు.

సంస్కృతాంధ్ర ప్రాకృతభాషా విద్వాంసులు, మహాకవులు శ్రీ అవధానం చంద్రశేఖరశర్మగారుకూడా సేతుబంధ కావ్యాన్ని ఆంధ్రీకరించి ఇటీవలే ప్రకటించినారు.

మనకు లభించిన కొద్ది ప్రాకృత కావ్యాలలో లీలావతీకావ్యం ఒకటి. కుతూహలుడనే కవి (క్రీ.శ, 1000) ఈ కావ్యకర్త. ఇందులో 1800 అనుష్టుప్ శ్లోకాలు ఉన్నాయి. ఆశ్వాసవిభజన కానరాదు. శాతవాహనరాజు, సింహళద్వీప రాజపుత్రి లీలావతి - ఈ ఇద్దరి ప్రేమగాథ ఇందులోని ఇతివృత్తం. తిరుమల రామచంద్రగారీ కావ్యాన్ని ఆంధ్రీకరిస్తున్నట్లుగా తెలిసింది. హేమచంద్రుని కుమారపాలచరితం. వాక్పతిరాజు గౌడవధ, జయవల్లభుని వజ్జాలగ్గం తెలుగు లోకి వస్తే ఇంచు మించుగా ప్రధాన ప్రాకృత కావ్యాలన్నీ తెలుగులోకి వచ్చి నట్లుగా భావించవచ్చు.

జైన బౌద్ధమతాలు బాగా వ్యాప్తిలో ఉన్నప్పుడు జైన బౌద్ధ రామాయణా లకు తెలుగుదేశంలో మంచిప్రచారం ఉండేదనిచెప్పవచ్చు. అందువల్లే తెలుగులో 'రామాయణమంతా విని రామునికి సీత ఏమౌతుందని అడిగినాడట'అనే సామెత ఏర్పడింది. ఈ సామెత తమిళభాషలో కూడా కనిపిస్తుంది. 'విదియ విదియ రామాయణం కెట్టు రమనుక్కు-సీతై ఎన్న ఆకవేనుం ఎన్ను కెట్టనమ్.' రామాయ ణంలో పిడకలవేట- అనే సామెతలు ఏర్పడ్డాయి. పాళీభాషలో రచింపబడ్డ సాహిత్యంకూడా కొంత తెలుగులోకి వచ్చింది. జాతకకథలను వచనంలో

శివశంకరశాస్త్రిగారు, పద్యరూపంలో సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు అనువదించినారు. ముక్త్యాలరాజాగారు, బులుసు వెంకటరమణయ్యగారు ధమ్మ పదానికి, తిరుమల రామచంద్రగారు అవదాన కల్పలతకు ఆంధ్రానువాదాలు సంతరించినారు. ఈ అనువాదాలు తెలుగులో బౌద్ధసాహిత్యానికి శ్రీకారం చుట్టినాయని చెప్పవచ్చు.

పాళీభాషలో వ్రాయబడిన జాతక కథల్లో తెలుగుపదాలు కొన్ని అక్కడక్కడా కనిపిస్తున్నాయని శివశంకరశాస్త్రిగారు ఈ కింది వాటిని ఉదాహరించినారు:

బొంది - శరీరం (మహతీప తతే బొంది నచో పఞ్ఞా తద్రూపికా)
ఓర - పక్క (దీపకస్స ఓరతో నదీమజ్జే ఏకో పిట్టిపాసాణో అత్థి)
లంచం ఖాదిత్వా - లంచం తిని
కాలం కృత్వా - కాలంచేసి, మరణించి.

తిరుమల రామచంద్రగారు గాథాసప్తశతిలోని తెలుగు పదాలను, పరవస్తు వెంకట రామానుజస్వామి దేశీ నామమాలలోని తెలుగు పదాలను గురించి విలువైన వ్యాసాలు వ్రాసినారు.

ప్రాకృతభాషా పదాలను, తెలుగుభాషా పదాలను తులనాత్మకంగా అధ్యయనంచేస్తే, మనం దేశ్యపదాలుగా భావిస్తున్న ఎన్నో పదాలు ప్రాకృత భవాలుగానో, ప్రాకృతసమాలుగానో తేలవచ్చు.

ప్రాచీన సంస్కృత గ్రంథాలలో అవతారికా సంప్రదాయం కానరాదు. అవతారికల్లో ఇష్టదేవతా స్తుతి, సుకవి ప్రశంస, కుకవి నింద, వంశ వర్ణనం, కృతిపతి వర్ణనం మొదలైనవి ప్రధాన విషయాలు. అవతారిక సంస్కృతంలో కాదంబరి మొదలైన ఒకటి, రెండు కావ్యాల్లో మాత్రం కానవస్తుంది. తెలుగు కావ్యాలలో ఈ అవతారికా సంప్రదాయం కొన్ని కావ్యాలలో తప్ప - నియతంగా పాటింపబడినట్లుగా చెప్పవచ్చు. ఈ అవతారికా సంప్రదాయం గౌడవధలోనూ, సేతుబంధంలోనూ కనిపిస్తుంది. గౌడ వధలో ఇష్టదేవతా స్తుతి 61 శ్లోకాలలో, కవి ప్రశంస 37 శ్లోకాలలో, కుకవి నింద కొన్ని శ్లోకాలలో చోటుచేసు

కున్నాయి. ఈ అవతారికా సంప్రదాయం ప్రాకృతం నుండి కన్నడంలోకి, ఆ తరువాత తెలుగులోకి ప్రవేశించినట్లుగా చెప్పవచ్చు. ఐతే, తెలుగు కావ్యాలలో కనపడే షష్ఠ్యంతపద్ధతి మాత్రం ప్రాకృతంలోకానీ, కన్నడంలోకానీ కనపడదు.

మహారాష్ట్రి ప్రాకృతంలో వ్రాయబడిన సేతుబంధాది కావ్యాలు నిర్వచనంగానే వ్రాయబడ్డాయి. కాని, తెలుగులో చంపూ పద్ధతిలోనే కావ్య రచన ప్రసిద్ధం. సంస్కృతంలో విరళమైన ఈ పద్ధతి కన్నడ కావ్యాల్లో కనిపిస్తుంది. సాధారణంగా ప్రాకృత గ్రంథాల్లో ప్రతి ఆశ్వాసంలోనూ కనిపించే ఏకవృత్తత తెలుగు కావ్యాల్లో కనిపించదు. అంతేకాదు, తెలుగులో ఒకే ఆశ్వాసంలో భిన్న భిన్న ఛందస్సులను వాడుకునే సంప్రదాయం ఉంది.

సంస్కృత పద్య మహాకావ్యాలు సర్గలుగా విభజింపబడతాయి. కాని తెలుగు కావ్యాలలో సర్గ విభాగంకాక ఆశ్వాసవిభాగం ఎక్కువగా కనిపిస్తుంది. ఈ ఆశ్వాస విభజన ప్రాకృత కావ్యమైన సేతుబంధంలో ఉన్నది. ఆశ్వాసాలుగా విభజింపబడే పద్ధతి ప్రాకృతంనుండి కన్నడం ద్వారా తెలుగులోకి వచ్చి ఉండవచ్చు.

ప్రాకృత సాహిత్యంలో విశేష కృషి చేసిన విద్వాంసులు తెలుగువారిలో ఎంతోమంది ఉన్నారు. హాలుని గాథాసప్తశతి ఆంధ్రభాషలో రచింపబడక పోయినా చరిత్ర కందినంతవరకూ అది ఆంధ్రుల రచనల్లోనే ప్రాచీనమని చెప్పవచ్చు. ఆధునికుల్లో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, పరవస్తు వెంకట రామానుజస్వామి, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, నిడుదవోలు వెంకటరావు, పుట్టపర్తి నారాయణాచార్యులు, తిరుమల రామచంద్ర, తూమాటి దొణప్ప, అవధానం చంద్రశేఖరశర్మ, చీమకుర్తి శేషగిరిరావు, ఎస్. ఎస్. కృష్ణమూర్తి గారలు ప్రాకృతభాషా సాహిత్యాలకు సంబంధించిన వివిధ రంగాలలో పరిశ్రమ చేసిన విద్వాంసులు. పేరి కాశీనాథశాస్త్రి, వేంకట రామకృష్ణకవులు ఆధునికయుగంలో ప్రాకృతంలో కవిత చెప్పిన మహనీయులు.

జైన బౌద్ధమతాల కారణంగా అతి ప్రాచీన కాలంలోనే తెలుగుదేశానికి ప్రాకృతభాష రాజభాష అయినా, ప్రాకృత కావ్యరత్నమైన గాథాసప్తశతిలో కొంత భాగమైనా తెలుగునేలపై వెలసినా, ఆచార్య నాగార్జునుడు తెలుగుదేశంలో

నివసించినా తెలుగు సాహిత్యంపై ప్రాకృతభాషా సాహిత్యపు మౌలికమైన ప్రభావం తెనుగు సాహిత్యం మీద పడలేదు. వైదికమత ప్రభావంతో జైన బౌద్ధమతాలకు ఆదరణ లేకపోవడం దీనికి కారణం కావచ్చు.

ఏమైనా తెలుగు ప్రాకృత భాషలను గూర్చి భాషావిషయకంగా కొంత తులనాత్మక పరిశీలన జరిగినా సాహిత్యపరమైన పరిశోధన జరగవలసినంతగా జరగలేదు. ఈ దిశలో పరిశోధన జరగవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

(ఆచార్య తూమాటి దొణప్ప షష్టిపూర్తి సంచిక 'అభినందన' (198) లో ప్రచురింపబడ్డ వ్యాసం.)

# తెలంగాణంలోని
# తెలుగు పలుకుబళ్లు

నేటి వ్యవహారంలోని తెలుగు భాషా స్వరూపాన్ని జాగ్రత్తగా పరిశీలించినట్లైతే భాషా విషయకమైన ఎన్నో అంశాలు మనం తెలుసుకోవడానికి అవకాశం ఉన్నది. చదువు సంస్కారాలేమీ లేని గ్రామీణుల పలుకుబడిలో అనేక గ్రాంథిక రూపాలు కొద్ది రూపభేదంతోనూ, భేదరహితంగానూ ఇప్పటికీ సజీవంగా ఉండడం భాషాదృష్టి గల పండితులు గమనించవచ్చు. గ్రాంథిక భాషా ప్రయోగాలకూ, నేటి వ్యవహారంలోని ప్రయోగాలకూ ఉన్న సాన్నిహిత్యాన్ని కింది ఉదాహరణలతో నిరూపించడానికి చేసిన ప్రయత్నమే ఈ వ్యాసం. ఉదాహరలుగా ఇవ్వబడ్డ పదాలు చాలావరకు తెలంగాణాప్రాంత వ్యవహారంలోనివే.

## 1. అంగలార్చు :

'దుఃఖించు' 'దుఃఖంతో ఏడ్చు' అనే అర్థాల్లో ఇది ఎక్కువగా పామర వ్యవహారంలో వినబడుతుంది. ఉదా : కొడుకు చనిపోయినందుకు ఆమె ఎంతో అంగలార్చింది. ఈ అర్థంలో శ్రీనాథాదుల ప్రయోగాలు ఎన్నో ఉన్నవి.[1]

## 2. అరుసు (ర్సు) కొను :

ఇది 'తెలుసుకొను' అనే అర్థంలో బాగా వాడుకలో ఉన్న క్రియాపదం. 'అక్కడి సంగతులన్నీ అరుసుకొని రా' అనీ; భోజనాల సమయంలో 'మారు అ(రుసు)ర్సుకో' అనీ మనం నిత్యమూ వినే వాక్యాలే. 'అరయు' అనే ధాతువు ఆత్మనేపదరూపమైన 'అరసికొను' అనే గ్రాంథిక రూపమే వ్యవహారంలో కొంత మార్పు పొంది అర్సుకొను, అరుసుకొను అని ఏర్పడి ఉంటుంది. కొందరి వ్యవహారంలో 'అర్చుకొను' అనే రూపం కూడా ఉన్నది.

## 3. అఱ్ఱ :

'గది' అనే అర్థంలో ఈ పదం తెలంగాణ మంతటా వ్యవహారంలో ఉన్నది. నిఘంటువుల్లో అఱ, అఱ్ఱ - ఈ రెండు పదాలకూ 'గది' అనే అర్థం చూపబడింది. కాని 'అఱ్ఱ' అనే ద్విత్వఱకార సహితరూపమే పై అర్థంలో వ్యవహారంలోనూ, కావ్యాల్లోనూ కనిపిస్తుంది.[2] 'అఱ' అనే పదానికి తీరాంధ్రంలో 'పెట్టె మొదలైనవాటి లోపలి అఱ' అనే అర్థంలోనే వాడుక ఉన్నది.

## 4. ఊసులు :

ఇది నేత్రమలమనే అర్థంలో ప్రయోగింపబడే బహువచనరూపం, ఇది పుసులు (దీనికి 'పుసి' అనేది ఏకవచనరూపం) అనే గ్రాంథికరూపంలో పదాది పకారం లోపించి ఉకారం దీర్ఘంకాగా ఏర్పడ్డ రూపం కావచ్చు. 'పుసులు' అనే శబ్దానికి గోపరాజు సిం. ద్వా.లో ప్రయోగం కనిపిస్తుంది.[3]

## 5. ఎంచు :

దీనికి శబ్ద రత్నాకరంలోనూ, సూర్యరాయాంధ్ర నిఘంటువులోనూ ఇతరార్థాలతోపాటు గణించు (లెక్కపెట్టు) అనే అర్థం కూడా చూపబడింది. పామర వ్యవహారంలో ఈ అర్థంలో ఇది అతి ప్రచురంగా వినబడుతుంది. దీనికి 'ఏంచు' అనే రూపాంతరం కూడా ఉన్నది. ఉదా:- రూపాయలు ఏంచుకో మొ॥

## 6. ఎనుగు :

పశువులు రాకుండా పొలంచుట్టూ వేసే కంచె అనే అర్థంలో ఈ పదం వాడుకలో ఉన్నది. దీనికి 'వెలుగు' అనే గ్రాంథిక రూపం మూలం కావచ్చు. 'వెలుగు'లో పదాదివకారం లోపించి లకారం నకారంగా మారి 'ఎనుగు' అనే రూపం ఏర్పడి ఉండవచ్చు. (వెలుగు - ఎలుగు - ఎనుగు). లకారం నకారంగా మారని 'ఎలుగు' అనే రూపం హైదరాబాదు జిల్లాలో ఎక్కువ వాడుకలో ఉన్నది. కంచె అనే అర్థంలో 'వెలుగు' శబ్దానికి నాచన సోమన, కొరవి గోపరాజు మొదలైన కవుల కావ్యాల్లో ప్రయోగాలు ఉన్నవి[4] కృష్ణా జిల్లాలో 'కంచె వేయడం' అనే అర్థంలో ఎనుగట్టు (ఎనుగు + కట్టు) అనే క్రియాపదం వాడుకలో ఉన్నది. కాని 'ఎనుగు' అనే పదానికి వ్యస్తంగా వాడుక లేదు.

## 7. ఎసల :

ఈ పదాన్ని మట్టిపాత్ర, మట్టికుండ అనే అర్థాలలో పామరులు వాడుతుంటారు. కూరెసల (కూర+వెసల) మొదలైన సమాసపదాలలో కూడ దీని ప్రయోగం కనిపిస్తుంది. దీని పూర్వ రూపం 'వెసల' కావచ్చు. ఈ పదం పై అర్థాలలో అనేక కావ్యాలలో కనిపిస్తుంది.[5]

## 8. ఎఱుక :

ఇది పామరుల వ్యవహారంలోనేకాక చదువుకున్నవాళ్ళ వ్యవహారంలో కూడా ఉన్న శబ్దం. ఉదా:- నీ కెఱుకేనా (నీకు తెలుసా), నా కెఱుకలేదు (నాకు తెలియదు) మొదలగునవి. 'ఎఱుగు'. ధాతువు కృదంతరూపమే ఈ 'ఎఱుక' ఇది తెలివిడి, పరిచయం, గుర్తు అనే అర్థాలను బోధిస్తుంది. ఎఱుకజేయు, ఎఱుకపడు మొదలైన 'ఎఱుక' శబ్దంతో కూడిన రూపాలు మహాభారతంలో కనిపిస్తవి.[6]

## 9. ఏటు :

శ.ర.లోనూ, సూ.ని.లోనూ ఈ పదానికి 'గొట్టె' అనే అర్థం చూపబడింది. ఈ పదం ఇప్పటికీ మనకు పామర వ్యవహారంలో కవినిపిస్తుంది. బసవపురాణంలో దీనికి ప్రయోగం కనిపిస్తుంది.[7]

## 10. ఏరాలు :

తోడికోడలని దీనికర్థం. తెలంగాణా పామర వ్యవహారంలో ఈ పదమే వాడుకలో ఉన్నది. శ.ర. కర్త దీన్ని 'ఎరవు+ఆలు'గా విభజిస్తే సూ.ని. కర్తలు 'యాతృ' అనే సంస్కృత శబ్దానికి వికృతిపదంగా చూపినారు. ఈ పదానికి వ్యుత్పత్తి ఏమైనా-ఇది అనేక కావ్యాలలో ప్రయోగింపబడింది.[8]

## 11. కర్రె :

నల్లనైన అని దీనికర్థం. ఈ అర్థంలో ఈ పదం చాలా వాడుకలో ఉన్నది. ఉదా:- 'వాడు కర్రెగా ఉన్నాడు' మొదలైనవి. నల్లని అనే అర్థంకల కరియ, కర్రి అనే గ్రాంథిక రూపాలకు పై పదం ఎంతో సన్నిహితంగా కని

పిస్తుంది. 'కరివేపాకు' మొదలైన సమాస పదాలలో 'కరి' పదానికి 'నల్లని' అనే అర్థమే. పై పదాలకు మహాభారతాది గ్రంథాలలో ప్రయోగాలు చాలా ఉన్నవి.[9]

## 12. కాడ - కాడికి :

గుడికాడ, గుడికాడికి మొదలైన ప్రయోగాలలో ఈ పదాలు నిత్యమూ వినిపించేవే. వీటిలో 'కాడ'కు దగ్గర అనీ, 'కాడికి'కి దగ్గరకు అనీ అర్థం. ఈ రెండూ కడ, కడకు అనే గ్రాంథిక రూపాలకు వికృతరూపాలు తెలంగాణ వ్యవహారంలో 'కడ' 'కాడ' గానూ, 'కడకు' 'కాడికి'గానూ మారి ఉంటుంది.

## 13. కోలె(న్) :

ఈ శబ్దం 'నాటగోలె' మొదలైన గ్రాంథిక ప్రయోగాల్లో పంచ్యమర్థంలో కనిపిస్తుంది. దీనికి 'కొలె' అనే రూపాంతరం కూడా ఉన్నది. ఈ రూపాలు సాధారణంగా కాలవాచక శబ్దాలపై, అధ్వవాచక శబ్దాలపై చేరడం గమనించవచ్చు. వీటిలో 'కోలె' అనే రూపం ఇప్పటికీ తెలంగాణా గ్రామీణుల వ్యవహారంలో సజీవంగా కనిపిస్తుంది. ఉదా:- 'ఇన్ని దినాలగోలె (నుండి) చెప్తున్న, నువ్వు నెరీ వింటలేవు' మొ॥ మహాభారతాది గ్రంథాలలో కోలె, కొలెరూపాలకు అనేక ప్రయోగాలు కనిపిస్తవి.[10]

## 14. కొంచబోవు :

'తీసుకొనిపోవు' అని దీనికర్థం. ఉదా : 'ఈ పుస్తకం కొంచబోయి (తీసుకొనిపోయి) ఆయనకు ఇవ్వు' మొ॥ 'కొనుచుపోవు' అనే గ్రాంథికరూపమే 'కొంచబోవు'గా వికృతి చెంది ఉంటుంది. (కొనుచుపోవు - కొన్(ం)చు పోవు - కొంచబోవు) ఈ అర్థంలోనే 'కొంటబోవు' అనే రూపం కూడా వ్యవహారంలో ఉన్నది. దీనికి 'కొంటుబోవు' అనేది మూలం, 'కొంటు' అనేది 'కొనుచు' అనే గ్రాంథిక శత్రర్థకానికి వ్యావహారిక రూపం. (కొనుచుపోవు - కొంటుపోవు - కొంటబోవు) 'ను' అంతమందుగల ధాతువులకు వ్యావహారిక భాషలో 'ంటు'తో కూడిన శత్రర్థకరూపా లేర్పడటం సహజమే. అంటున్నాడు (అను); తింటున్నాడు (తిను); వింటున్నాడు (విను) మొ॥)

## 15. గదువ(మ) :

'చిబుకం' అని దీనికర్థం. ఉదా : "వాడు గదువ(మ) పట్టుకొని బతిమి లాడినాడు" మొ॥ ఇది 'గద్దువ' అనే గ్రాంథిక రూపానికి వికృతి కావచ్చు. సంకుసాల నృసింహ కవి కవికర్ణ రసాయనంలో ఈ రూపం కనిపిస్తుంది.[11] తీరాంధ్రంలో ఈ అర్థంలో 'గడ్డం' అనే పదం వాడుతారు.

## 16. జాలారి(రు) :

ఇంట్లో పాత్రలు మొదలైనవి కడిగిన మురికినీరు పోవడానికి కట్టిన సన్నని కట్టడం కాలువను తెలంగాణంలో జాలారి(రు) అని అంటారు. **సూ**.ని.లో లో 'జలారి' అనే రూపం చూపబడింది. శ, ర. లో 'జలారి' అనే పదం లేకున్నా 'జలదారి' అనే శబ్దం ఉన్నది. దీనికి 'జలకము+దారి' అని పద విభాగం చూపబడింది. 'జలదారి' అనే రూపమే జలారిగానూ, జాలారి(రు)గానూ వ్యవహారంలో మారి ఉంటుంది. ('జలదారి - జలారి - జాలారి(రు') 'జలారి' పదానికి శ్రీనాథుని చాటుపద్యంలో ప్రయోగం కనిపిస్తుంది.[12]

## 17. జీ(జి)విలి :

కర్ణమలమని అర్థం. ఇది 'జిలిబి' అనే రూపానికి వికృతి కావచ్చు. సింహాసనద్వాత్రింశికలో ఈ రూపం (జిలిబి) కనిపిస్తుంది.[13]

## 18. తలికి :

"నేను వచ్చేతలికి ఆయన వెళ్ళిపోయిండు" మొదలైన పామరవ్యవహారాలలో 'తలికి' అనే రూపం ప్రచురంగా వినిపిస్తుంది. 'వచ్చేతలికి' అంటే 'వచ్చే సమయానికి' అని అర్థం. 'తఱి - కి' అనే గ్రాంథిక రూపానికి 'తలి - కి' వికృత రూపం కావచ్చు. 'తఱి' అంటే సమయం. 'వచ్చుతఱికి - వచ్చేతఱి-కి- వచ్చేతలి - కి' లేదా 'తలక్' అనే ఉర్దూ పదంతో దీనికి సంబంధం ఉన్నదేమో!

## 19. తాన :

'నా తాన లేదు' మొదలైన వాక్యాల్లో ఈ రూపం కనిపిస్తుంది. 'నా తాన' అంటే 'నా దగ్గర' అని అర్థం. ఇది "తావు" పదానికి సప్తమ్యంత రూపమైన "తావున" అనే పదంలో వు లోపింపగా ఏర్పడ్డ రూపమే. (తావున - తాన)

దీనితో పాటు 'తానికి' (దగ్గరకు) అనే రూపం కూడా ఉన్నది. ఇది 'తావు నకు' అనే షష్ఠ్యంతానికి పకృతి (తావునకు తానకు - తానికి). ఇవి జడవాచ కాలపై రావు.

## 20. దివిలి (దీలి) పండుగ :

ఇది దీపావళి పండుగ అనే అర్థంలో పామర వ్యవహారంలోఉన్న పదం. ఇది 'దివ్వెలపండుగ' అనే పదానికి వికృతిరూపం కావచ్చు. గోపరాజు సిం.ద్వా.లో 'దివ్వెల పండుగ' శబ్దం కనిపిస్తుంది.[14]

## 21. దూప :

ఈ పదం తెలంగాణంలో నా, రాయలసీమలోనూ 'దప్పి' అనే అర్థంలో వాడుకలో ఉన్నది. 'తాప' అనే సంస్కృత శబ్దానికిది వికృతి కావచ్చు. "దూప" పదానికి అనేక కావ్య ప్రయోగాలు ఉన్నవి.[15] దూపగొను, దూపటిల్లు, దూపిల్లు మొదలైన క్రియారూపాలన్నీ ఈ "దూప" జన్యాలే.

## 22. నెటి - నెటియ :

"వాడు నెటి (పూర్తిగా) వింటలేడు; వాడు నెటియ (పూర్తిగా) చెడి పొయిండు" మొదలైన వాక్యాల్లో ఈ రూపాలు కనిపిస్తవి. వీటిలోని "నెటి" పూర్ణార్థకమైన గ్రాంథిక రూపమే.

## 23. పారి :

ఇది ఆవృత్తి, పర్యాయం అనే అర్థాలను తెలుపుతుంది. ఉదా : ఒక పారి, ఈ పారి మొదలైనవి. ఇది సాధారణంగా ఏకార్థకశబ్ద పూర్వకంగానే ఉంటుంది. శ.ర.లో ఈ అర్థంలో పరి, పారి అనే రెండు రూపాలు చూపబడ్డవి. కావ్యాల్లో 'పరి' కే అధిక ప్రయోగాలు కనిపిస్తున్నా "పారి"కి ప్రయోగాలు లేక పోలేదు. కంకంటి పాపరాజు ఉత్తర రామాయణంలోనూ, హరి వంశంలోను "పారి" ప్రయోగం కనిపిస్తుంది.[16]

## 24. బొక్క :

ఇది "ఎముక" అనే అర్థంలో అధిక ప్రచారంలో ఉన్న శబ్దం. శ.ర.లో కానీ, సూ.ని.లో కానీ, వావిళ్ళ నిఘంటువులో కానీ "బొక్క" అనే పదానికి

"ఎముక" అనే అర్థం చూపబడలేదు. సింహాసన ద్వాత్రింశికలో పై అర్థంలో అనేక ప్రయోగాలు ఉన్నవి.[17] గోపరాజు కావ్యంలోని అనేక ప్రదాలను గ్రహించిన పై నిఘంటు కర్తలు "బొక్క" అనే సిం.ద్వా. ప్రయోగానికి "ఎముక" అనే అర్థం చూపకపోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈ నిఘంటువు లన్నింటా 'నోరు నిండిన పొడియగు తినుబండము, రంధ్రము' అనే అర్థాలు మాత్రమే చూపబడ్డవి. రంధ్రమనే అర్థంలో తెలంగాణంలో ఈ పదం పరుషానే కాని సరళాది కాదు.

## 25. తొక్కు :

తెలంగాణమంతటా ఈ పదం 'పచ్చడి' అనే అర్థంలో వాడుకలో ఉన్నది. 'ఉప్పును, కారమును చేర్చి రోటిలోవేసి చిదియగొట్టిన మామిడికాయలోనగు వాని ముద్ద అని శ.ర. తెలుపుతుంది. హం.విం. మొదలైన గ్రంథాల్లో దీనికి ప్రయోగాలు కనిపిస్తున్నాయి.[18]

## 26. తోడెం :

కొంచెం, స్వల్పం అని దీనికర్థం, ఇది 'థోడా' అనే ఉర్దూ పదానికి వికృతి రూపం. చిన్నయసూరి మొదలైనవాళ్ళ రచనల్లో దీనికి ప్రయోగం కనిపిస్తుంది.[19]

## 27. మొల :

ఇది ఇనుపచీల అనే అర్థంలో వాడబడే పదం. తెలంగాణంలో వాడబడే ఈ పదానికి మారుగా ఇతర ప్రాంతాలలో మేకు అనే పదం వ్యవహారంలో ఉంది. మేకు అనేది మేఖ్ అనే ఉర్దూ పదానికి వికృతిరూపం. మొల అనే పదానికి కు.సం. మొదలైన కావ్యాల్లో ఎన్నో ప్రయోగాలు లభిస్తాయి.[20]

ప్రాచీనాంధ్ర భాషా ప్రయోగాలతో సాన్నిహిత్యం ఉన్న కొన్ని పలుకుబళ్ళను మాత్రమే స్థాలీపులాక న్యాయంగా ఈ వ్యాసంలో చర్చించడం జరిగింది. పామరుల వ్యవహారంలో ఇప్పటికీ సజీవంగా ఉన్న పలుకుబళ్ళు - గ్రాంథిక ప్రయోగాలకు అతి సన్నిహితమైనవి తెలంగాణా వ్యవహారంలో ఇంకెన్నో ఉన్నవి. వాటిని మరోసారి పరిశీలిస్తాను.

(వివేచన (1977) లో ప్రచురితమైన వ్యాసం)

## సూచికలు :

1. మాధుకర భిక్షాన్నంబు భక్షింపఁగా లేకున్నంగడు నంగలార్చెదవు మేలే (కాశీ. 7-162).

2. దూపవాసనల్ కదురు, కొను కెంపుటబ్బిలో గ్రొన్నన పాను, పున నుంచి (ద్విపద సారంగధరచరిత్ర).
అధిపుఁడబ్బి సొచ్చె (సిం. ద్వా. 4-270).

3. జిలిబిలికింబుసులకుఁ జీమిడికిని బుట్టయైన మొగంబు (సిం. ద్వా. 1-100).

4. వెలుగే తన చేను మేయు విధము (సిం. ద్వా. 1-175) ఇంక వెలుగు చేన్మేసిన, గాచువార లెందు గలరు జగతి (ఉ. హ. 4-40).

5. నీళ్ళ వెసల లోపల నించి (సిం. ద్వా. 3-45). వెస లలనామణి బంగరు వెసలల దొంతరలు డించి (విజ. వి. 2-152).
వెనకయ్య చేతికి వెసలిచ్చెననుమాట (ఉ. హ. 4-50).

6. వారు వెఱచి లోనికెఱుకచేసి (మ. భా; శాం. 6-263).
.... నా కెఱుక లేక యిట నేనింటన్, దయ్యమువలె నుండఁగ మా తొయ్యలితో నెట్లు గూడితో నేనెఱుగన్ (శు. స. 3-35).
గుఱు తెఱుకాయె నేమొ (ఉ. రా. 6-73).

7. కాటకోటండు నాఁగల డొక్క గొల్ల, యేఁటపెంట్రిక తన కీశ్వరుఁ డనుచు (2-417.)

8. ఏరాలిఁ బట్టి బిట్టెత్తి చెక్కిలి నొవ్వగఱచి వాఁడేడ్చిన (పాం. మా. 3-62).

9. కటియ జీలకట్టు, గఱివేము గుఱుజయింగువ (మ. భా; అను. 3-189)
తెల్ల దామరతేకు లట్లుల్లసిల్లు కన్నుదోయి నొప్పారెడు కట్టి యతఁడు (హ.వం.పూ. 9.45)

10. నాటంగోలె రాహువునకు (మ. భా. 1-2-20).
యోజనంబునఁ గోలె (మ. భా. 1-3-41).
నృపవర పెక్కునాళ్ళగోలె (భాగ. 9-317).

11. వెడలి గద్దువ మోవ పీడియంబులు చేసి (క. ర. 4-94).

12. ఇంగలమంచు వచ్చి యడియేనని తిరుకొంగటు జేసి జలారిచెంతనే.

13. జిలిబికిం బుసులకుఁ జీమిడికిని బుట్టమైన మొగంబు (సిం. ద్వా. 1-100).

14. దివ్వెల పండుగో యనన్ (8-47).

15. వికటంపు టెఱకల విసరున నుప్పొంగు తుప్పర డెందంబు దూపడంగ (హ. వం; ఉ. 5-149).

16. ఒక్క పరి వ్యాఘ్రమై వచ్చు నొక్కపారి దంష్ట్రియై తోచు (ఉ. రా. 3-54) ఎనిమిదవపాఱ వినినన్ (హరివంశం ఉ. 10-289)

17. ఒక్క బొక్క నిజాస్యంబున (సిం. ద్వా. 1-270) దౌడబొక్క (సిం. ద్వా. 1-274) బొక్కలు (సిం. ద్వా. 1-100)

18. ఊరగాయలు మామిడితొక్కులు నివి మొదలుగాగల పరికరంబులును (హం. విం 1-105)

చింతకాయతొక్కు చూచితేనే నోరూరు (తాళ్ళపాక. 6-234)

అంగములు గల్గి వారిజపాకు లులువతొక్కులు మిరియాలుమెతకాయ (ప్రబంధ. 133)

19. తోడెంబుతోడనె ప్రొద్దుపుచ్చుకొనియెద (మి.భే)

తోడెంపునవ్వుల దులకించు వెన్నెలల్ (సత్య. సాం - 446)

20 గఱిగాన నొడళుల విఱిగెడు నస్త్రముల్ దొలగు వెండి మొలలుగాగ (కు.సం. 11-125)

నలువ దాచిన వెండి మొలలనంగ (శివ.వి.)

రజతంపుమొలలు తారాగణంబు (కాశీ. 6-14)

పలుకలు నెఱయ నేర్పడిన పదార్థములు జెంచులును ఝుకరెల యిన్ప మొలలు (పండితా. పర్వత)

# తెలుగుకవుల సంస్కృతానుకరణాలు

లోకంలో అనుకరణమనేది అతి సహజమైన విషయం. పిపీలికాది బ్రహ్మపర్యంతమైన సమస్త ప్రాణిజాతమూ అనుకరణానికి లోనైనదే. ప్రపంచంలోని వివిధ వాఙ్మయాలలో పూర్వకవులను అనంతర కవులు అనుకరించిన ఘట్టాలు అనేకం. అసలు అనుకరణమే అభివృద్ధికి మూలమన్నా అతిశయోక్తి కాదేమో! మహాకవులుగా ప్రసిద్ధిపొందిన కాళిదాస భవభూత్యాదుల రచనల్లోనూ వ్యాసవాల్మీకుల అనుకరణలు ఎన్నో కనిపిస్తాయి. శాకుంతలాది నాటకాల్లో భాసనాటకాల్లోని వాక్యాలతోపాటు శ్లోకభావాలు కూడా గ్రహింపబడినవి. కాళిదాసు కుమారసంభవం ద్వితీయ సర్గలో దేవతలు బ్రహ్మను గూర్చి చేసిన స్తుతి శివపురాణంలోనిదే కదా! ఇట్లే తెలుగు కావ్యాలలోనూ పూర్వకవుల అనుకరణల నెన్నింటినో చూపవచ్చు. కీ. శే. డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్య గారు "సంవాదిరచనలు" అన్న వ్యాసంలో సంవాదిపద్యాల నెన్నింటినో, తెలుగు కావ్యాలనుండి సంగ్రహించి పేర్కొన్నారు. ఐతే, ఈ విధమైన అనుకరణను కొందరన్నట్లుగా గ్రంథచౌర్యమనటం న్యాయం కాదేమో! ఆయా కవులకు పూర్వకవులు చెప్పిన భావాలలో గల గౌరవభావమే ఈ అనుకరణలకు కారణమనటం న్యాయం. కవులలో అనుకరణ అనివార్యం. కనుకనే రాజశేఖరుడు కావ్య మీమాంసలో ఈ విషయాన్ని మూడధ్యాయాలలో చర్చించటం జరిగింది. తెలుగులో వెలసిన భారత భాగవత రామాయణాలు, పురాణాలు, కావ్యాలు - ఇవన్నీ సంస్కృత కృతులకు అనుకృతులే.ఈ అనుకృతి గ్రంథాల్లో వాటికి మూలమైన సంస్కృత గ్రంథాల్లోని శ్లోకాలకు అనువాద పద్యాలు ఉండటం సహజమే. కాని, అనువాద రూపాలు కాని తెలుగు కావ్యాల్లో కూడా అక్కడక్కడా ప్రసిద్ధ సంస్కృత శ్లోకాలకు అనువాద రూపాలైన పద్యాలు మనకెన్నో కనిపిస్తాయి. భావ సౌందర్యమూ, ఉక్తి చమత్కృతీ కలిగిన ఎన్నో సంస్కృత శ్లోకాలను తెలుగు కవులు సందర్భానురోధంగా తమ కావ్యాల్లో అనువదించుకొని కావ్య సౌందర్యాన్ని ఇనుమడింపజేసుకున్నారు. ఇది వారి కేమాత్రమూ న్యూనతాపాదకం కాదు. ప్రస్తుత వ్యాసంలో

సంస్కృత గ్రంథాల్లోని శ్లోకాలకూ, చాటు శ్లోకాలకూ అనువాదప్రాయాలైన తెలుగుకావ్యాల్లోని పద్యాలను గుర్తించి పరిశీలించటమే ప్రధానాంశం.

సంస్కృతంలోని సుభాషితాల నెన్నింటినో తెలుగు కవులు యథాతథంగా అనువదించుకొన్నారు. ఉదాహరణలను పరికించండి :

అప్పిచ్చువాడు వైద్యుడు
ఎప్పుడు నెడతెగక పారు నేరును ద్విజుడున్
చొప్పడిన ఊరనుండుము
చొప్పడకున్నట్టి ఊర జొరకుము సుమతీ!

ఇది సుమతి శతకంలోని ప్రసిద్ధమైన పద్యం. దీనికి -

తత్ర మిత్ర న వస్తవ్యం
యత్ర నాస్తి చతుష్టయమ్
ఋణదాతా చ వైద్యశ్చ
శ్రోత్రియః సజలా నదీ - అనే సంస్కృత సుభాషిత శ్లోకం మూలం.

భార్య భర్తయెడ ఏ విధంగా ప్రవర్తించాలో తెలిపే -

'కార్యేషు దాసీ కరణేషు మంత్రీ
భోజ్యేషు మాతా శయనేషు రంభా' - అన్న శ్లోక భాగాన్ని ఘట్టు ప్రభువు తన కుచేలోపాఖ్యానంలో ఇలా అనువదించుకున్నాడు:

"పనులు సేయునెడల బానిసవలె, బుద్ధి
గరపునెడ బ్రధానికరణి, భోజ
నంబులిడెడివేళ నంబకైవడి బ్రియం
బాచరింపవలయు నండ్రు సతులు."

విద్యాప్రాప్తికి గల మార్గాలను తెలిపే—

"గురు శుశ్రూషయా విద్యా
పుష్కలేన ధనేన వా
అథవా విద్యయా విద్యా

చతుర్థీ నోపలభ్యతే" అనే ఈ ముప్పై రెండక్షరాల అనుష్టుప్పద్యాన్ని అనంతామాత్యుడు నలభై నాలుగక్షరాల పద్యంగా అనువదించుకున్నాడు చూడండి.

"గురునకు సేవ జేయుట దగుం దగు విద్య బరిగ్రహింపగా
నరుదుగ నర్థమిచ్చి పడయందగునొండె, సువిద్య యిచ్చి వి
స్తరముగ విద్య గైకొనుట దానొక పక్షము, మూడు రీతులం
బరగుట దక్క నాలవయుపాయము లేదని చెప్పు శాస్త్రముల్."

సంగీత సాహిత్యాలు తెలియని మానవుడు పశుప్రాయుడన్న సత్యాన్ని తెలిపే భర్తృహరి నీతిశ్లోకం ఈ విధంగా ఉంది:

'సాహిత్య సంగీత కళా విహీనః
సాక్షాత్పశుః పుచ్ఛవిషాణహీనః
తృణం న ఖాదన్నపి జీవమాన
స్తద్భాగధేయం పరమం పశూనామ్' (నీతిశతకమ్, శ్లో - 11)

ఈ శ్లోకాన్ని కొరవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశికలో ఇలా అనువదించుకున్నాడు:

"సంగీతంబు గవిత్వతత్త్వమును సౌజన్యంబు భావంబు స
త్సాంగత్యంబు నెఱుంగడేని భువి నాశ్చర్యంబుగా వాలమున్
శృంగద్వంద్వము లేని యెద్దతడనంజెల్లుం దృణం బాతడ
య్యాంగికంబున మేయడా పసుల భాగ్యంబిచ్చుటం గల్గుటన్"(V-172)

అనువక్త పెద్ద వృత్తాన్ని ఎన్నుకోవటంవల్ల మూలంలో లేని అంశాలు కూడా అనువాదంలో చోటు చేసుకున్నాయి. సింహాసన ద్వాంత్రిశికలో ఇలాంటి అనువాదపద్యాలు కొల్లలు.

కావ్యం ఎట్లా ఉండాలో చెప్పే ఈ కింది ప్రసిద్ధ శ్లోకం అందరికీ తెలిసిందే:

'కిం కవేస్తస్య కావ్యేన
కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం
న ఘూర్ణయతి యచ్ఛిరః.'

నన్నెచోడుడు పై శ్లోక భావాన్ని తన కుమార సంభవంలో ఎలా అనుకరించినాడో చూడండి:

'ముదమున సత్కవికావ్యము
నదరగ విలుకాని పట్టినమ్ము ను బరహృ
ద్భిదమై తల యూపింపని
యది కావ్యమె మఱియు బట్టినదియున్ శరమే!' (1,ఆ41 ప)

ముదమున, అదరగ అనే రెండు పాదపూరణ పదాలు తప్ప తక్కిన దంతా సంస్కృతశ్లోకానికి అనువాదమే.

నన్నయ తన భారత రచనకు ఈ క్రింది సంస్కృత శ్లోకంతో శ్రీకారం చుట్టినాడు:

"శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితిమావహంత్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయామూర్తయస్త్రిపురుషాః సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరాః శ్రేయసే."

పోతన రచితంగా భావింపబడుతున్న వీరభద్ర విజయ ప్రారంభంలో సరిగ్గా ఈ శ్లోకానువాదం కనిపిస్తుంది. ఆ పద్యాన్ని పరికించండి:

"సిరియును వాణి గౌరియును జెన్నగు కన్యకు మేను వాకుఁ బె
న్నురమును నంకువిచ్చి ముదమొప్ప వరించి జగంబులన్నియుం
దిరములు సేయ బ్రోవఁదుది దీర్పగ ద్రష్టయుగేక్షణుండునై
హరివిధి శంభుమూర్తియగు నాద్యుడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్."
(1 - 2)

విమర్శిని అనే కావ్యాదర్శ వ్యాఖ్యలో సారాలంకార నిరూపణ సందర్భంలో ఈ కింది శ్లోకం కానవస్తుంది:

"కిం ఛత్రం కిన్ను రత్నం తిలకమథ తథా కుండలం కౌస్తుభం వా
చక్రం వా వారిజం వేత్యమరయువతిభిర్యద్బలిద్వేషి దేహే
ఊర్ధ్వే మౌలౌ లలాటే శ్రవసి హృది కటౌ నాభిదేశే చ దృష్టం
పాయాత్తద్వో ఒర్కబింబం స చ దనుజరిపుర్వర్ధమానః క్రమేణ."

పోతన ఈ శ్లోక భావాన్నే గ్రహించి రచించినాడా అన్నట్లుగా కనిపించే పద్య మొకటి భాగవతంలో కనిపిస్తుంది:

"రవిబింబంబుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతమై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుడు దా బ్రహ్మాండమున్ నిండుచున్."

(8 స్కం. - 621 వ.)

సూర్యోదయ, సూర్యాస్తమయ వర్ణన సందర్భాల్లో వివిధతెలుగుకవులు మయూరుని సూర్యశతకంలోని శ్లోకాలను అనువదించుకొనిన ఘట్టాలు అనేకం. ఒకటి, రెండుదాహరణలు మాత్రం మనవి చేస్తాను :

"మూర్ధ్న్యద్రేర్ధాతురాగ స్తరుషు కిసలయో విద్రుమౌఘః సముద్రే
దిఙ్మాతంగోత్తమాంగేష్వభినవనిహితః సాంద్రసిందూరరేణుః
సీమ్ని వ్యోమ్నశ్చ హేమ్నః సురశిఖరిభువో జాయతే యః ప్రకాశః
శోణిమ్నాసౌ ఖరాంశోరుషసి దిశతు వః శర్మ శోభైకదేశః." (41 శ్లో.)

కొరవి గోపరాజు, భాస్కరరామాయణకర్తల్లో యుద్ధకాండ శేషకర్త యైన అయ్యలార్యుడు ఈ శ్లోకాన్ని అనుకరించి, అనువదించుకొన్న రీతిని గమనించండి.

"గిరిశృంగంబుల గైరికాకృతిని, శాఖిశ్రేణిపైఁ బల్లవో
త్కరలీలం గరిరాజకుంభములమీదన్ రక్తచూర్ణాకృతిన్
శరధిద్వీపములం బ్రవాళరుచి గాసారంబులన్ శోణపు
ష్కరకాంతిం దరుణాతపం బడరె దిక్కాంతాంగకాశ్మీరమై."

(సిం. ద్వా. 5 - 88)

"తరువులయందు బల్లవపదస్థితి, నద్రులయందు ధాతు బం
ధురగతి, నంగనాజనపృథుస్తనమండలి గుంకుమంబునై
పరగుచు సాంధ్యశోణిమవిభాసురమై జలనాథదిక్తట
ద్విరదము కుంభసంభవ నవీనగళద్రుధిరంబునా దగెన్."

(భాస్కరరామాయణం 6 - 2648)

సూర్య శతకంలోని ఎన్నో శ్లోకాలను శ్రీనాథుడు తన కృతుల్లో అనువదించుకున్నాడు. ఒక్క ఉదాహరణం మాత్రం చూపుతాను:

"మీలచ్చక్షు ర్విజిహ్వశ్రుతి జడరసనం నిఘ్నితఘ్రాణవృత్తి
స్వవ్యాపారాక్ష మత్వక్పరిముఖితమనః శ్వాసమాత్రావశేషమ్
విస్రస్తాంగం పతిత్వా స్వపదహరతాదశ్రియం వో ఒర్కజన్మా
వాలవ్యాళావలీఢం జగదగద ఇవోత్థాపయన్ ప్రాక్ప్రతాపః."
(సూర్యశతకమ్ 3 శ్లో)

నేత్రంబు లున్మేషనిస్పృహత్వము నొంద
శ్రుతిపుటంబుల శక్తి చొక్కువడగ
ఘ్రాణేంద్రియజ్ఞానకళ యేరు సొరుగా
జిహ్వావివేకంబు చిరుతవోవ
నంతరంగమున మోహాంధకారము గ్రమ్మఁ
దనువు చేష్టాదరిద్రత వహింపఁ
బ్రాణముల్ శ్వాసమాత్రమున బర్యవసింపఁ
దలచీర యెఱుగని దశ ఘటిల్ల

పాము గఱచిన మూర్ఛిల్లి పడినయట్లు
పడిరి పాశ్చాత్యదేశంబు పంచజనులు
తరణి దీధితిలేమిఁ జైతన్య మెడలి
వితతనిద్రాసమావేశ నిహతులగుచు." (కాశీఖండం)

ఇదే విధంగా శివమహిమ స్తోత్రంలోని శ్లోకాలను కూడా తెలుగు కవులు తమ కావ్యాలలో సందర్భానుసారంగా అనువదించుకొని కావ్యశోభను ఇనుమడింపజేసినారు.

ఒక ఉదాహరణం :

క్రియాదక్షో దక్షః క్రతుపతిరధీశ స్తనుభృతాం
ఋషీణామార్త్విజ్యం శరణ దసదస్యాః సురగణాః

క్రతుర్భేష స్త్వత్తః క్రతుష ఫలదా న వ్యసనినో
ధ్రువం కర్తుః శ్రద్ధావిధురమభిచారాయ హి మఖాః."

దీనికి నన్నెచోడుని అనువాదాన్ని చూడండి:

"తనరఁ గ్రియాతిదక్షుఁ డగు దక్షుడు తత్క్రతువల్లభుండు స
న్మునితతి ఋత్విజుల్ సురసమూహి సదస్యులు తత్ఫలంబులిం
దనిశమునిచ్చు నీవడచితట్టె మఖంబిది కర్త భక్తిమై
దనరని యజ్ఞమైన దుది దానభిచారము గాకపోవునే." (కు.సం. 2-92)

జనుల సుఖదుఃఖ స్థితులను చక్కగా అభివర్ణించిన కింది శ్లోకం కాళిదాసు అభిజ్ఞానశాకుంతలంలో కానవస్తుంది:

"యాత్యేకతోఽ స్తశిఖరం పతిరోషధీనా
మావిష్కృతోఽరుణపురస్సర ఏకతోఽర్కః
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇవాత్మదశాంతరేషు."

పై శ్లోకభావమే కల నన్నెచోడుని ఈ క్రింది పద్యాన్ని పరిశీలించండి:

"అస్తగిరి బొందె రాజుదయాద్రి నెక్కె
నినుడు తేజస్వులగువారి కెల్లప్రొద్దు
మానితంబగు నిల నొక్కమాట పొందు
హానివృద్ధులు సూచించునట్ల పోలె" (కు. సం. VIII - 190)

పెద్దన మనుచరిత్ర ప్రారంభంలో గజాస్యుడైన విఘ్నేశ్వరుణ్ణి కొలుస్తూ చెప్పిన—

"అంకముజేరి శైలతనయా స్తనదుగ్ధములానువేళ బా
ల్యాంకవిచేష్ట దొండమున నవ్వలిచన్గబళింపబోయి యా
వంక గుచంబుగానకహివల్లభహారము గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్."

అన్న పద్యానికి సరిగ్గా మూలమనదగ్గ ఈ క్రింది శ్లోకం చెన్నూరు దేవాలయ శాసనంలో (రాయలు వేయించినది) కనిపిస్తుంది:

"పాయాద్వో గణనాయకః పశుపతేరంకే చిరం సంస్థితో
వామార్ధాంగవిరాజితాం గిరిసుతాం జ్ఞాత్వా నిజాం మాతరమ్
తుండాగ్రం ప్రతిసార్య సస్మితముఖః పీత్వా స్తనం చాపరం
పాతుం ప్రీతమనాః స్తనం మృగయతే విఘ్నాంతకః సర్వదా."

ఐతే, ఈ రెండు పద్యాలూ ఇంచుమించుగా సమకాలానికి చెందినవి కావటం వల్ల ఏది దేనికి అనువాదమో స్పష్టంగా చెప్పలేం. సంస్కృత శ్లోక కర్తకూడా పెద్దనయే కావచ్చునేమో!

కవితాకన్యక వైయాకరణుణ్ని, తార్కికుణ్ని, మీమాంసకుణ్ని, వేద పండితుణ్ని వరించదని చమత్కారసహితంగా వర్ణించే కింది ప్రసిద్ధ సంస్కృత శ్లోకం ఒకటి ఉంది:

"నైవ వ్యాకరణజ్ఞమేతి పితరం న భ్రాతరం తార్కికం
మీమాంసానిపుణం నపుంసకమితి జ్ఞాత్వా నిరస్తాదరా
దూరాత్సంకుచితైవ గచ్ఛతి పునశ్చండాలవచ్ఛాందసా
త్కావ్యాలంకరణజ్ఞమేవ కవితాకన్యా వృణీతే స్వయమ్."

ముకుందవిలాస ప్రబంధంలో కాణాదం పెద్దన సోమయాజి ఈ శ్లోకాన్ని యథాతథంగా ఎలా అనువదించుకున్నాడో చూడండి:

"తనరన్ వ్యాకరణజ్ఞు దండ్రియనుచున్ దర్కజ్ఞునిన్ భ్రాతయం
చును మీమాంసకుని న్నపుంసకుడటంచున్ వీడి దూరంబునం
గని యస్పృశ్యుని బోలె ఛాందసుని వేడ్కం గావ్యలీలారస
జ్ఞు నిజేచ్ఛం గవితావధూమణి వరించున్ భావగర్భంబునన్" (2 ఆ)

ముక్కును గూర్చి ముచ్చటైన పద్యాన్ని చెప్పిన భట్టుమూర్తి ఈ కింది పద్యం అందరికీ తెలిసిందే:

"నానాసూనవితానవాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకం దపంబూని యో
షానాసాకృతి దాల్చి సర్వసుమన స్సౌరభ్యసంవాసియై
పూనెం బ్రేక్షణమాలికా మధుకరీపుంజంబు లిర్వంకలన్."

అగస్త్యకవి రచించిన నలకీర్తి కౌముదిలోని ఈ క్రింది శ్లోకం పై పద్యానికి మూల మనటంలో సందేహం లేదు:

"భృంగానవాప్తి ప్రతిపన్నఖేదా
కృత్వా వనే గంధఫలీ తపోఽలమ్
తన్నాసికాభూదనుభూతగంధా
స్వపార్శ్వనేత్రీకృత భృంగసేవ్యా." (11-74)

వసుచరిత్రలో శాకుంతలాది నాటకాలలోని శ్లోకాలకు భాషాంతరీకరణం కానవస్తుందని నిడుదవోలువారూ, శ్రీహర్షుని నైషధంలోని పద్యాలను కొన్నింటిని శ్రీనాథుడు వదిలితే వసుచరిత్రకారుడు వాటిని అనువదించినట్లుగా ఆరుద్రగారూ పేర్కొన్నారు. కనుక వసుచరిత్రలో సంస్కృతశ్లోకాల అనువాదపద్యాలు ఉన్నాయనటం సత్యోక్తి.

గిరిక చెలికత్తెనోట వసుచరిత్రకారుడు మగవారి చిత్తవృత్తిని వర్ణించిన ఈ పద్యాన్ని గమనించండి:

"మాయాశీలురు చంచలాత్మ లనుకంపాశూన్యు లాత్మైక కా
ర్యాయతుల్ సమయానుకూల హృదయ వ్యాపార గోపాయనో
పాయజ్ఞుల్ మగవార లాపయి మహీపాలుర్ మహావైభవ
శ్రీయోగాంధులు సెప్పనేల మగవారిన్ నమ్మగావచ్చునే?"

పై పద్యానికి మూలమనదగ్గ ఈ కింది శ్లోకం వసుచరిత్ర ఉపోద్ఘాతంలో చూపబడింది:

"మాయాశీలాః ప్రకృతిచపలా నిర్దయా ధూర్తవాచః
స్వార్థాయత్తా స్సమయ హితకృద్గోపనోపాయదక్షాః
సాధారణ్యాదితి హి పురుషాస్తత్ర చాపి క్షితీశాః
శ్రీయోగాంధాః కిముత పురుషా నైవ విశ్వాసయోగ్యాః"

సీతావిరహ కారణంగా పరితపిస్తున్న రామునిస్థితిని ప్రశ్నోత్తరరూపంగా వర్ణించే ఈ క్రింది శ్లోకం జయదేవుని ప్రసన్నరాఘవనాటకంలో కానవస్తుంది:

"సౌమిత్రే నను సేవ్యతాం తరుతలం చండాంశురుజ్జృంభతే
చండాంశోర్నిశి కా కథా రఘుపతే చంద్రోఽయమున్మీలతి

వత్తైస్తద్విదితం కథం ను భవతా ధత్తే కురంగం యతః
క్వాసి ప్రేయసి హా కురంగనయనే చంద్రాననే జానకి"

భాస్కర రామాయణకర్త ఈ శ్లోకాన్ని ప్రశ్నోత్తర రూపంగానే యథాతథంగా ఎలా అనువదించుకున్నాడో చూడండి:

"తపనుడు వేపజొచ్చె నను దమ్మిడ వృక్షము క్రింద బెట్టు నా
దపనుడు రేయి లేదు వసుధావర చంద్రుడుగాని చంద్రునిన్
నృపసుత యెట్లెఱింగితివి నీవు మృగాంకము జూడనున్కి హా
చపలమృగాక్షి చంద్రముఖి! జానకి యెక్కడ నున్నదానవే?"
(3-2-264)

(ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖ పరిశోధన పత్రిక 'వివేచన' (1984) లో ముద్రితమైన వ్యాసం)

# పాణినీయంలో లాఘవం

అల్పాక్షర మసందిగ్ధం
సారవ ద్విశ్వతోముఖమ్
అస్తోభ మనవద్యం చ
సూత్రం సూత్రవిదో విదుః॥

పై శ్లోకంలో శాస్త్రాలలోని సూత్రాల లక్షణాలు చెప్పబడ్డాయి. పై ఆరు లక్షణాలలో అల్పాక్షరత్వమనే లక్షణాన్ని మొట్టమొదట పేర్కొనటంవల్ల సూత్రాలు సాధ్యమైనంత చిన్నవిగా ఉండటం సూత్రాల ప్రథమ లక్షణమని తెలుతుంది. ఈ అల్పాక్షరత్వమనే లక్షణానికి సూత్రాకారులు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడంవల్లనే శాస్త్రాలలోని సూత్రాలు మరీ సంక్షిప్తరూపంలో ఉండి కేవలం వ్యాఖ్యాగమ్యాలు కావడం మనం గమనిస్తూనే ఉన్నాం. కనుకనే ఎవరైనా అతి సంక్షిప్తంగా మాట్లాడినప్పుడు 'సూత్రప్రాయంగా మాట్లాడినాడు' అని అంటూ ఉంటాం. ఐతే శాస్త్రాలలోని సూత్రాలలో ఇంత సంక్షిప్తత ఎందుకు? అనే ప్రశ్న రావచ్చు. శాస్త్రాలలో అతి సూక్ష్మమైన విషయాలు అనేకం చెప్పడం జరుగుతుంటుంది. వాటి నన్నిటిని జిజ్ఞాసువు స్మృతిలో ఉంచుకోవటం సూత్రాలు చాలా సంక్షిప్తంగా ఉన్నపుడే సాధ్యమౌతుంది. కనుక సూత్రకారులు తమ శాస్త్రాలలో సూత్రాలను అతిసంక్షిప్తంగా రచించి ఉంటారు. అందులోను వైయాకరణులు సూత్ర రచనలో ఈ సంక్షిప్తతా లక్షణానికి ఇతర శాస్త్రకారులకంటె అత్యంత ప్రాధాన్యం ఇచ్చినారన్న విషయం మనకు తెలిసిందే.[1]

సంస్కృత భాషకు అనేక వ్యాకరణాలున్నప్పటికీ పాణినీయ వ్యాకరణమే అత్యంత ప్రసిద్ధినీ, ప్రచారాన్నీ పొంది, సమస్త వ్యాకరణగ్రంథాలలో మూర్ధన్యమైనదని భారతీయ పండితులచేతనేకాక పాశ్చాత్య పండితులచేతను ప్రశంసింపబడింది. దీనికి అష్టాధ్యాయి, అష్టకము, శబ్దానుశాసనము, వృత్తిసూత్రము అనే వేర్వేరు పేర్లున్నా 'అష్టాధ్యాయి' అనే పేరనే పాణినీయం ప్రచారాన్ని పొందింది. ఇందులో సూత్ర రచన చాలా శాస్త్రీయమైన పద్ధతిలో సాగింది.

ఇందలి సూత్రాలలో ఎక్కడా ఒక్క అనర్థకమైన వర్ణం కూడా ఉండదని భగవత్పతంజలియే మహాభాష్యంలో స్పష్టపరచినాడు.[2] ఐతే ఒక్క అనర్థకమైన వర్ణం కూడా లేకుండా శాస్త్రమంతటా లాఘవాన్ని సాధించడానికి పాణిని తన వ్యాకరణంలో అనుసరించిన పద్ధతులేవో పరిశీలించడమే ఈ వ్యాసంలోని ప్రధానాంశం.

సూత్రాలలోను, తద్ద్వారా వ్యాకరణ నిర్మాణంలోను లాఘవాన్ని సాధించడానికి పాణిని ఏర్పరచుకొన్న అంశాలలో ముఖ్యంగా క్రింద పేర్కొన్నవాటిని చెప్పవలసి ఉంటుంది.

| | |
|---|---|
| 1. సంజ్ఞాసూత్రాలు | 2. పరిభాషా సూత్రాలు |
| 3. అధికార సూత్రాలు | 4. అనువృత్తి |
| 5. ప్రత్యాహారాలు | 6. గుణపాఠము |
| 7. ధాతుపాఠము | 8. ఉదిత్తులు |

## సంజ్ఞాసూత్రాలు :

వ్యాకరణంలోని సూత్రాలు సంజ్ఞా, పరిభాషా, విధి, నియమ, అతిదేశ, అధికార సూత్రాలని ఆరు విధాలు.[3] వీటిలో సూత్ర రచనలోను, వ్యాకరణ నిర్మాణంలోను లాఘవ సాధనకు ఉపయోగపడేవి సంజ్ఞా, పరిభాషా, అధికార సూత్రాలు మాత్రమే, పాణిని వాడుకొన్న సంజ్ఞలు అనేకం. వీటిలో పాణిని స్వయంగా కల్పించుకొన్నవి కొన్ని, పూర్వాచార్యులనుండి గ్రహించినవి మరి కొన్ని. వీటిని లఘు సంజ్ఞలు, అలఘుసంజ్ఞలు (మహా సంజ్ఞలు) అని రెండు విధాలుగా విభజించవచ్చు. సర్వనామము, ప్రాతిపదికము మున్నగునవి అలఘు సంజ్ఞలు. టి, ఘు, ఘ మున్నగునవి లఘుసంజ్ఞలు. మహా సంజ్ఞలే అవయవార్థం కలిగి అర్థవంతాలుగా ఉంటాయి.[4] కాని లఘు సంజ్ఞల కట్టి అవయవార్థం లేక సూత్రకారుడు చెప్పిన పారిభాషికమైన అర్థమే ఉంటుంది. ఆయా విధి సూత్రాలలో సూత్రకారుడు సంజ్ఞలను వాడటంవల్ల సూత్రాలలో అపరిమితమైన లాఘవం ఏర్పడుతుంది. ఉదా: "అచోఽంత్యాది టి' అనే సూత్రంచే ఒక శబ్దంలోని అచ్చుల్లో అంత్యాచ్చు మొదలుకొని ఉండే భాగానికి 'టి' అనే సంజ్ఞ విధింపబడింది. ఈ సంజ్ఞను విధించని పక్షంలో ఆయా విధి సూత్రాలన్నింటా

'టి'కి రావలసిన వ్యాకరణ కార్యం 'శబ్దంలోని అంత్యాచ్చు మొదలుకొని ఉండే భాగానికి వస్తుంద'ని చెప్పవలసి ఉంటుంచి. అట్లా కాకుండా 'టి' అనే సంజ్ఞను కల్పించుకొని ఆ యా విధి సూత్రాలన్నింటా ఆయా వ్యాకరణ కార్యాలు 'టి'కి వస్తవి అని చెప్పడంతో సూత్రాలలో లాఘవం సిద్ధిస్తుంది. ఈ విధంగా పాణిని అనేక సంజ్ఞలను కల్పించుకొని శాస్త్రమంతటా లాఘవాన్ని సాధించినాడని చెప్పవచ్చు.

## పరిభాషా సూత్రాలు :

ఆయా విధి సూత్రాలతో సమన్వయిస్తూ వాటికి సంపూర్ణార్థతను కలిగించేవి పరిభాషా సూత్రాలు. ఇవి ప్రజ్వలితమైన దీపం మాదిరిగా ఒక స్థానంలో ఉంటూ సమస్తశాస్త్రాన్ని ప్రజ్వలింపజేస్తవి.[5] తస్మాదిత్యుత్తరస్య (అష్టా. 1-1-87) తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య (అష్టా 1-1-88) మొదలైన పరిభాషా సూత్రాలు పంచమీసప్తమ్యాది నిర్దేశాలున్న విధిసూత్రాలలో సమన్వయించి వాటి అర్థానికి సంపూర్ణతను కలిగిస్తవి ఆయా విధిసూత్రాలన్నింటా ఆయా పరిభాషా నియమాలను పునరావృత్తంచేస్తే సూత్రాలు మరింత దీర్ఘం కావడం, తన్మూలంగా సూత్రాల అల్పాక్షరత్వ లక్షణానికి భంగం కలగడం జరుగుతుంది. కనుక ఒకచోట చెప్పిన పరిభాషా సూత్రం ఆయా విధి సూత్రాలన్నింటా సమన్వయించడంవల్ల సూత్రాలకు దీర్ఘతాదోషం కలుగదు.

## అధికారసూత్రాలు :

అధికారమంటే వ్యాపించడమని అర్థం.[6] స్వస్థలంలో ప్రయోజనం లేకుండా తరువాతి సూత్రాలలో వ్యాపించి, వాటితో ఏక వాక్యతను పొందేవి అధికార సూత్రాలు-తద్ధితాః (4-1-76) ధాతోః (3-1-91) కృత్యాః (3-1-95) మొదలైనవి అధికార సూత్రాలు. వీటివల్ల కూడా తరువాతి సూత్రాలకు లాఘవమేర్పడుతుంది. అంతేకాక తద్ధితాలు, సమాసాలు, కృత్యప్రత్యయాలు ఇత్యాది విషయవిభాగాన్ని కూడా ఇవి సూచిస్తున్నవి.

## అనువృత్తి :

సూత్రాలలో అత్యధిక లాఘవాన్ని సాధించడానికి అనుసరింపబడ్డ పద్ధతుల్లో అనువృత్తి పద్ధతి కూడా ప్రధానమైందే. పూర్వ సూత్రంలోని పదాలు కొన్ని ఉత్తర సూత్రాలతో చేరటమే అనువృత్తి. సూత్రం మొత్తంకాని, సూత్రంలోని కొన్ని పదాలుకాని ఉత్తర సూత్రాలలో అనువర్తించవచ్చు. ఈ పద్ధతివల్ల పూర్వసూత్రాలలో చెప్పబడ్డ పదాలను తిరిగి ఉత్తరసూత్రాలలో చెప్పడం తప్పుతుంది. అందువల్ల ఉత్తరసూత్రాలు పరిమిత పదాలతో మాత్రమే కూడి, సంక్షిప్తంగా ఉండే అవకాశం కలుగుతుంది, ఉదాహరణకు 'వృద్ధిరేచి' అనే సూత్రం తీసుకొందాం. వృద్ధిని విధించే ఈ సూత్రం ఆరవ అధ్యాయం మొదటి పాదంలో 88 వ సూత్రం. ఈ సూత్రం నుండి 93 వ సూత్రం వరకు ఐదు సూత్రాలలోను విధింపబడేది వృద్ధియే కనుక, ఈ సూత్రాలలో వృద్ధి పదాన్ని మళ్ళీ చెప్పవలసిన అవసరంలేదు. వృద్ధిరేచి (6-1-88) అనే సూత్రం నుండి వృద్ధి పదం తరువాతి ఐదు సూత్రాలలోనికి అనువర్తించి వాటికి అర్థసంపూర్తిని కలిగిస్తూ సంక్షిప్తతను కూడా ఆపాదిస్తుంది. ఈ విధంగా పాణినీయ మంతటా ఈ అనువృత్తి పద్ధతి ఆశ్రయింపబడి, తద్ద్వారా సూత్రాలలో అపరిమితమైన లాఘవం సాధింపబడింది.

## ప్రత్యాహారాలు :

"ప్రత్యాహ్రియంతే - సంక్షిప్యంతే వర్ణాః అనేన" అనే వ్యుత్పత్తి వల్ల వర్ణాలను సంక్షిప్తంగా చెప్పే సంజ్ఞనే ప్రత్యాహారమని చెప్పవచ్చు. ఈ ప్రత్యాహార పద్ధతి వల్ల ఒక వ్యాకరణ కార్యానికి కావలసిన ఎన్ని వర్ణాలనైనా ఒక ప్రత్యాహారంలో కుదించి, సంక్షిప్తంగా చెప్పడానికి వీలు కలుగుతుంది. సంస్కృతంలోని వర్ణాలన్నీ క్రింది పదునాలుగు సూత్రాలలో చెప్పబడ్డవి.

1) అఇఉణ్, 2) ఋఌక్, 3) ఏఓఙ్, 4) ఐఔచ్, 5) హయవరట్, 6) లణ్, 7) ఞమఙణనమ్, 8) ఝభఞ్, 9) ఘఢధష్, 10) జబగడదశ్, 11) ఖఫఛఠథచటతవ్, 12) కపయ్, 13) శషసర్, 14) హల్.

వీటిని చతుర్దశసూత్రి[7] అనీ, అక్షర సమామ్నాయమనీ,[8] ప్రత్యాహార సూత్రాలనీ, మహేశ్వర సూత్రాలనీ[9] వ్యవహరిస్తారు, ఇందులో మొదటి నాలుగు

సూత్రాల్లో అచ్చులూ, తరువాతి పది సూత్రాల్లో హల్లులూ-మొత్తం 12 వర్ణాలు చెప్పబడ్డవి. ఒక్క హ వర్ణం మాత్రం పునరుక్తమైంది. అట్ ప్రత్యాహారం లోనూ రల్ శల్ ఝల్ - వల్ ప్రత్యాహారాల్లోనూ హకారం చేరవలసి ఉంటుంది. కనుక హవర్ణం పునరుక్తి అవశ్యకమే.[10]

పై పద్నాలుగు సూత్రాల్లో ప్రతి సూత్రం చివరిహల్లు ఇత్సంజ్ఞకం, లణ్ సూత్రంలోని అకారంకూడా ఇత్సంజ్ఞకమే. ఈ ఇత్సంజ్ఞకాల ఆధారంగానే పాణిని తనశాస్త్రంలో ప్రత్యాహార పద్ధతిని ప్రవేశపెట్టినాడు. 'ఆదిరంత్యేన సహేతా' (1-1-71) అనేది ప్రత్యాహారాన్ని సాధించే సూత్రం. దీని ప్రకారం ఒక సూత్రం చివరనున్న ఇద్వర్ణానికి ముందు దానికి ముందున్న ఏ వర్ణమైనా (ఇద్వర్ణంకానివర్ణాన్ని) చేర్చినపుడు ఏర్పడే ప్రత్యాహారం తొలివర్ణంతోపాటు మధ్యనున్న వర్ణాలన్నింటిని బోధిస్తుంది. ఉదా :- అణ్, ఇణ్, అక్ మొ॥ ఐతే మధ్యనున్న ఇద్వర్ణాలు మాత్రం గ్రహింపబడవు.[11]

ఈ ప్రత్యాహార పద్ధతివల్ల పై మాహేశ్వర సూత్రాల్లో సుమారు 300 ప్రత్యాహారాలు ఏర్పడడానికి అవకాశమున్నా పాణిని వాడుకొన్న ప్రత్యాహారాలు 44 మాత్రమే. అవి యివి:-

| ఇద్వర్ణం | తొలివర్ణం | ఏర్పడే ప్రత్యాహారాలు |
|---|---|---|
| ణ్ (మొదటి సూత్రంలోనిది) | అ | 1 |
| క్ | | |
| ఙ్ | అ ఇ ఉ | 3 |
| | ఏ | 1 |
| చ్ | అ, ఇ, ఏ, ఐ | 4 |
| ట్ | అ | 1 |
| ణ్ (లణ్ సూత్రంలోనిది) | అ, ఇ, య | 3 |
| మ్ | అ, య, ఞ, ఙ | 4 |

| | | |
|---|---|---|
| | య | 1 |
| ష్ | ఝ, భ | 2 |
| | అ, ఝ, జ, బ, వ, హ | 6 |
| వ్ | ఛ | 1 |
| య్ | య, మ, ఝ, ఖ, చ | 5 |
| ర్ | య, ఝ, ఖ, చ, శ | 5 |
| ల్ | అ, హ, వ, ర, ఝ, శ | 6 |
| అ | ర | 1 |
| | | 44 |

వీటినే వాసుదేవ దీక్షితు డీక్రింది శ్లోకంలో సంగ్రహించి చూపినాడు.

"స్యాదేకో జఞణవద్యైః
షేణ ద్వౌ త్రయ ఇహ కణాభ్యామ్
చత్వారశ్చ చమాభ్యాం
పంచ యరాభ్యాం శలాభ్యాం షట్" (బా.మ;సంజ్ఞా)

లాఘవంకోసం ఉద్దేశింపబడ్డ ఈ ప్రత్యాహార పద్ధతి మాహేశ్వర సూత్రాల్లోనేకాక ఇతరత్రా కూడా కనిపిస్తుంది. ఉదా:- సుట్, ఆమ్, జమ్, సుప్, తిజ్, తజ్ మొదలైనవి. ఇవి సుబ్విభక్తుల్లోను, తిఙ్విభక్తుల్లోను ఏర్పడే ప్రత్యాహారాలు. విభక్తి ప్రత్యయాలలో ఏర్పడే ఈ ప్రత్యాహారాలను తెలుగు వ్యాకరణాలలో (సంస్కృతంలో వ్రాయబడినవాటిలో మాత్రమే) కూడా అనుసరించడం కనిపిస్తుంది. ఉదా:- టాసశ్చేతః, జేసః కయి కొఱకూ, జసిస ఉచ్యతే వలనః, జమః కురనితామ్ (ఆం. శ. చిం. 3-22, 23, 24, 26) మొదలైనవి. విభక్తి ప్రత్యయాల్లో సకారతవర్గాక్షరాలకు ఇత్సంజ్ఞను నిషేధిస్తూ 12 పాణిని వాటితో ప్రత్యాహార విధానాన్ని అంగీకరింపకపోగా, తెనుగు వ్యాకర్తలు (చింతామణి కర్త మొ॥) మాత్రం ఈ నియమాన్ని పాటించకపోవడం పై ఉదాహరణలవల్ల స్పష్టమౌతుంది. దీనికి కారణం సూత్రాల్లో లాఘవసాధనమే.

## గణపాఠము :

ఒక వ్యాకరణ కార్యం అనుగతంగా రావలసిన శబ్దాలు అనేకం ఉన్నపుడు వాటి నన్నిటిని ఒకే సూత్రంలో చెప్పితే అల్పాక్షరత్వ నియమానికి భంగం కలుగుతుంది. కనుక పాణిని అనుగతంగా ఒకే కార్యం రావలసిన శబ్దాలనన్నింటిని ఒక గణంగా చెప్పి, వాటిలోని తొలి పదాన్ని మాత్రం తీసుకొని దానికి ఆది పదాన్ని చేర్చి సూత్రరచన చేయటం జరిగింది. ఉదా:- సర్వాదీని సర్వనామాని (1-1-27) మయూరవ్యంసకాదయశ్చ (2-1-72) మొ॥ ఇట్టి సూత్రాలకు అనుబంధంగా చెప్పబడ్డ గణాలు మొత్తం 205. ఈ గణపాఠాల కల్పన కూడా లాఘవ సాధనకోసమే. తెనుగు వ్యాకర్తలుకూడా తమ వ్యాకరణాల్లో ఈ గణపాఠ పద్ధతిని ఆశ్రయించడం కనిపిస్తుంది. ఉదా:- పేదాదులు (బా.వ్యా. సంధి 30) ఒకండ్వాదులు (ప్రౌ.వ్యా;సమా. 22) కుశాదులు (ఆం.శ.చిం. 3.54) మొ॥

అష్టాధ్యాయికి అనుబంధంగా చెప్పబడ్డ వాటిలో ధాతుపాఠం ప్రధానమైంది. ఆయా ధాతువుల స్వరూప స్వభావాంనుబట్టి ధాతువులు పది గణాలుగా విభజింపబడ్డవి. ధాతుపాఠంకూడా లాఘవసాధన కోసం ఉద్దేశింపబడిందే.

## ఉదిత్తులు :

ప్రత్యాహార సూత్రాల్లో వర్గాక్షరాలు వర్ణమాలలోని క్రమంలో కాక భిన్నంగా చెప్పబడ్డవి. ముందు ఆయా వర్గాల పంచమాక్షరాలు, తరువాత చతుర్థాక్షరాలు ఆ తరువాత తృతీయాక్షరాలు ఈ రీతిగా వ్యుత్క్రమంగా చెప్పబడ్డవి. ఆయా వ్యాకరణ కార్యాలకు అవసరమైన కొన్ని ప్రత్యాహారాలు[13] సిద్ధించడానికి వీలుగా ఉండడమే ఈ వ్యుత్క్రమానికి కారణం. ఐతే ఒక వర్గంలోని ఐదక్షరాలను చెప్పవలసి వచ్చినపుడు వాటిని సంగ్రహించే ప్రత్యాహారం మాత్రం మాహేశ్వర సూత్రాలవల్ల సిద్ధించడానికి అవకాశం లేదు (ఒక వర్గలోని అక్షరాలన్నీ ప్రత్యాహార సూత్రాల్లో వరుసగా చెప్పకపోవడంవల్ల). కనుక పాణిని వర్గ ప్రథమాక్షరాలను ఉదిత్తులుగా (కు, చు, టు, తు, పు అనే రూపంలో) చెప్పి, ఉదిత్తులైనవి తమ సవర్ణాలను గ్రహింపజేస్తాయని తెలిపినాడు.[14] కనుక 'కు' అంటే క వర్గ మొత్తమూ గ్రహింపబడుతుంది. ఇట్లే 'చు' మున్నగు ఉదిత్తులుకూడా ఆయా వర్గక్షరాలను మొత్తం గ్రహింపజేస్తాయి.

ఈ విధంగా పాణిని తన వ్యాకరణంలో లాఘవం సాధించడానికి ఆశ్ర యించిన రీతులన్నీ ఎంతో శాస్త్రీయమైన పద్ధతిలో సాగి, పాణినీయానికి సమస్త శాస్త్ర గ్రంథజాలంలోనే అద్వితీయమైన స్థానాన్ని సమకూర్చినవని చెప్పడం అతిశయోక్తి కాదు.

## సూచికలు :

1. అర్ధమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యంతే వైయాకరణాః (పరి. శే. 3-133).
2. ప్రమాణభూత ఆచార్యో దర్భపవిత్రపాణిః, శుచావవకాశే ప్రాఙ్ముఖ ఉపవిశ్య మహతా ప్రయత్నేన సూత్రాణి ప్రణయతి స్మ, తత్ర అశక్యం వర్ణేనాప్యనర్థకేన భవితవ్యమ్, కిం పునరియతా సూత్రేణ (మ. భాష్య. 3 ఆహ్నికము).
3. సంజ్ఞా చ పరిభాషా చ విధిర్నియమ ఏవ చ
   అతిదేశోఽధికారశ్చ షడ్విధం సూత్రలక్షణమ్॥
4. తత్ర మహత్యాః సంజ్ఞాయాః కరణే ఏతత్ప్రయోజనమ్, అన్వర్థ సంజ్ఞా విజ్ఞాయేత సర్వాదీని సర్వనామ సంజ్ఞాని భవంతి సర్వేషాం నామానీతి చాతః సర్వనామాని (మ. భా. సర్వాదీని సర్వనామాని సూత్రభాష్యము.)
5. పరిభాషా పునరేకదేశస్థా సతీ కృత్స్నం శాస్త్రమభిజ్వలయతి ప్రదీపవత్ తద్యథా ప్రదీపః సుప్రజ్వలితః ఏకదేశస్థః సర్వం వేశ్మాభిజ్వలయతి (మ. భాష్య.)
6. అధికారః వ్యాపృతిః. శబ్దస్య చ ఉత్తరసూత్రేషు అనువృత్తిరేవ వ్యాపృతిః (బా. మ. 'స్వరితేనాధికారః' సూత్రవాఖ్య.)
7. బా. మ. 'ఆదిరంత్యేన సహేతా' సూత్రవ్యాఖ్య.
8. సోఽయమక్షర సమామ్నాయః వాక్సమామ్నాయః పుష్పితః ఫలిత శ్చంద్రతారకవత్ ప్రతిమండితో వేదితవ్యో బ్రహ్మరాశిః (మ. భాష్య. "ఇమఙణనమ్" సూత్రభాష్యము.)
9. ఇతి మాహేశ్వరాణి సూత్రాణ్యణాది సంజ్ఞార్థాని (సి. కౌ. సంజ్ఞా.)

10. హకారస్య పరోపదేశే అడ్గ్రహణేషు హ గ్రహణమ్, పూర్వోపదేశే కిత్వక్సే డ్విధయో ఝల్ గ్రహణాని చ (మ. భాష్య.) "హయవరట్" సూత్ర భాష్యం.)
11. ప్రత్యాహారేష్వితాం న గ్రహణమ్, అనునాసిక ఇత్యాది నిర్దేశాత్ (సి.కౌ. సంజ్ఞా.)
12. న విభక్తౌ తుస్మాః (1-3-4)
13. ఞమ్, ఝష్, జశ్, చయ్ మొ॥
14. "అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః" (1-1-69)

(వివేచన (1978) లో ప్రచురితమైన వ్యాసం.)

# మహమ్మదీయుల సంస్కృత సాహిత్య సేవ

ప్రాచీన భారతీయ విజ్ఞానానికి పట్టుగొమ్మయైన సంస్కృత సాహిత్యాన్ని ఆదరించి, తద్వ్యాప్తికి తోడ్పడిన వారిలో ముస్లిం ప్రభువులకు గూడా గణనీయ మైన స్థానం ఉన్నది. మన దేశంలో ముస్లిం ప్రభువులు సంస్కృతానికి అనేక విధాలుగా సేవ చేసినారు. కవిత్వం, దర్శనాలు, జ్యోతిశ్శాస్త్రం మొదలైన వాటిలో ప్రసిద్ధులైన సంస్కృత విద్వాంసులను పోషించి, వారిచే అనేక గ్రంథా లను వ్రాయించినారు. ఎన్నో సంస్కృత గ్రంథాలను అరబ్బీ, పారసీకాది భాషల్లోకి అనువదింపజేసినారు. మరికొందరు సంస్కృతంలో మంచి వైదుష్యం సంపాదించి, స్వతంత్ర గ్రంథాలను కూడా రచించినారు. ఈ విధంగా మూడు దశల్లో సాగిన ముస్లింల సంస్కృత సాహిత్య సేవను పరిశీలిద్దాం.

ముస్లిం రాజుల ఆస్థానాన్ని అలంకరించిన సంస్కృత కవుల్లో భాను కరుడు, అక్బరీయ కాళిదాసు, జగన్నాథ పండితరాయలు, అమృతదత్తుడు, పుండరీక విఠలుడు, హరినారాయణ మిశ్రుడు, వంశీధర మిశ్రుడు, చతు ర్భుజుడు, లక్ష్మీపతి ముఖ్యులు.

పదహారోశతాబ్దికి చెందిన భానుకరుడు షేర్షా, నిజాంషాల ఆదరణను పొందినట్లుగా ఆధారాలు కన్పిస్తున్నాయి. ఈతడు కావ్యదీపిక, గీతాగౌరీశం, రసమంజరి, రసతరంగిణి, కుమార భార్గవీయం, అలంకార తిలకం, శృంగార దీపిక అనే గ్రంథాలను రచించినాడు. వీటిలో మొదటి నాలుగు ముద్రితాలు.

అక్బరీయ కాళిదాసుగా ప్రసిద్ధిపొందిన గోవిందభట్టు మొగల్ పాదుషా యైన అక్బర్ చక్రవర్తికి సమకాలికుడు. అక్బరుకు ఈతడు చాలా ఇష్టుడైన కవి అని ఈతని పేరే సాక్ష్యమిస్తుంది. ఈతని రచనల్లో 'రామచంద్రయశః ప్రశస్తి' కావ్యం మాత్రమే లభించింది. రీవాను పరిపాలించిన రామచంద్రుని గూర్చి వ్రాసిన కావ్యమిది.

'ఢిల్లీవల్లభ పాణిపల్లవతలే నీతం నవీనం వయః', 'ఢిల్లీశ్వరో వా జగదీశ్వరో వా మనోరథాన్ పూరయితుం సమర్థః' అని చెప్పుకున్న జగన్నాథ పండిత రాయలు షాజహాన్ చక్రవర్తి (1628 - 58) ఆస్థానాన్ని అలంకరించిన సుప్రసిద్ధ పండిత కవి. ఈతడు షాజహాన్ మంత్రియైన ఆసఫ్ ఖాన్ చరిత్రను 'ఆసఫ్ విలాస' కావ్యంగా రచించి, షాజహాన్ వల్ల 'పండితరాజ' బిరుదాన్ని సంపాదించినాడు. జగన్నాథు డీ విషయాన్ని 'నవాబ్ ఆసఫ్ ఖాన్ మనఃప్రసాదేన సార్వభౌమ శ్రీ షాజహా ప్రసాదాధిగత పండితరాజ పదవీవిరాజితేన జగన్నాథపండితేన'అనే ఆసఫ్విలాస కావ్యాంతగద్యలో స్వయంగా చెప్పుకున్నాడు.

వంశీధరమిశ్రుడు, హరినారాయణ మిశ్రుడు, కవీంద్రాచార్య సరస్వతి మొదలైన కవి పండితులు షాజహాన్ ఆదరణను పొందినట్లుగా తెలుస్తుంది.

అందవల్లిని రాజధానిగా చేసుకొని పరిపాలించిన బురహన్‌ఖాన్ పుండరీక విఠలుడనే కవిని ఆదరించి పోషించినాడు. ఈ కవి పదహారో శతాబ్దికి చెందినవాడు. సంగీత శాస్త్రంలో ప్రవీణుడు. ఇతని గ్రంథాలలో ఒక్క 'రసమంజరి' మాత్రమే ప్రస్తుతం లభ్యమౌతుంది.

చతుర్భుజుడనే సంస్కృతకవి ఔరంగజేబు మేనమామ యైన షహిస్తఖాన్ ఆస్థానంలోని కవీంద్రుడు. పదిహేడో శతాబ్దికి చెందినవాడు. 'రసకల్పద్రుమం' అనే ఇరవై అధ్యాయాలు, వేయి శ్లోకాలు కల గ్రంథాన్ని రచించినాడు. ఇది అముద్రితం.

రుద్రకవి, శ్రీకృష్ణ పండితుడు జహంగీర్ చక్రవర్తి (1606-27) ఆస్థానాన్ని అలంకరించిన పండితులు. వీరిలో రుద్రకవి 'జహంగీర్ చరిత్ర' నవాబ్ ఖాన్ ఖానన్ చరిత్ర, కీర్తి సముల్లాసము, దాన సాహచర్త్రిత మొదలైన గ్రంథాలను రచించినాడు. వీటిలో కీర్తిసముల్లాసం జహంగీరు పాదుషా కుమారుడైన ఖుర్రమ్‌ను గూర్చిన ప్రశంస. దానసాహచరిత్రలో అక్బర్ కుమారుడైన దానసాహుని ప్రశంస ఇతివృత్తం. శ్రీకృష్ణ పండితుడు భాస్కరాచార్యుని బీజగణితానికి 'బీజనవాంకుర' వ్యాఖ్యను సంతరించినాడు.

ఔరంగజేబు (1618 - 1707) చే ఆదరింపబడ్డ ఈశ్వరదాస పండితుడు ముహూర్త రత్నాన్ని, రఘునాథ పండితుడు ముహూర్తమాలను రచించినట్లు తెలుస్తుంది. ఈ రెండు గ్రంథాలు జ్యోతిశ్శాస్త్రానికి సంబంధించినవి.

ఔరంగజేబు కుమారుడు మహమ్మద్‌షాకు మంత్రియైన అబ్దుల్లా గొప్ప సంస్కృతాభిమాని. ఈతని ఆస్థానంలో ఉన్న లక్ష్మీపతికవి అబ్దుల్లా చరిత్ర మనే పేరుతో తన ప్రభువు చరిత్రను రచించినాడు. ఈతడు సంస్కృతంలోనే కాక అరబ్బీ, పారశీక భాషల్లో కూడా మంచి ప్రవేశం కలవాడని అబ్దుల్లా చరిత్రలో అతడు ప్రయోగించిన అరబ్బీ, పారశీక పదాలు తెలియజేస్తున్నాయి. ఆయా భాషల పదాలు ప్రయుక్తమైన కొన్ని శ్లోక పాదాలు దిగువ ఉదాహరిస్తాను:

వజీరేషు చ యోషిత్సు దుష్మనీయైర్విధీయతే
యతస్తతో మయా భుక్త్వా జహరం త్యజ్యతే వరమ్
గుహనామంతరా త్యక్తుం కరోతి స్వస్య దిల్లకే।
పంజరస్థిత శేరవత్
జవాబం కిం ప్రదాస్యతి॥

క్రీ. శ. పన్నెండో శతాబ్దిలో పరిపాలించిన సహబుద్దీన్ అమృతదత్తుడనే కవిని ఆదరించి పోషించినట్లుగా తెలుస్తుంది. ఈతడు రచించిన కొన్ని శ్లోకాలు శ్రీధరదాసుని సదుక్తి కర్ణామృతంలోను, జల్హణుని సూక్తి ముక్తావళిలోను కనిపిస్తాయి.

ఈ విధంగా మహమ్మదీయ ప్రభువులు తమ ఆస్థానాల్లో సంస్కృత కవులకు స్థానం కల్పించి, వారిని పోషించి వారిచే సంస్కృతంలో ఎన్నో గ్రంథాలను రచింపజేయడమే కాక అనేక సంస్కృత గ్రంథాలను అరబ్బీ, పారసీ భాషల్లోకి అనువదింపజేసి సంస్కృత భాషకు ఎంతో సేవ చేసినారు. వీరిలో మధ్యయుగంలో వంగదేశాన్ని పరిపాలించిన ముస్లిం పాదుషాలు ముఖ్యులు. 1782-1825 మధ్యకాలంలో వంగదేశాన్ని పరిపాలించిన నాసిర్‌షా విద్యాపతి పండితునిచే సంస్కృత మహాభారతాన్ని వంగ భాషలోకి అనువదింపజేసినాడు. ఇందులో విద్యాపతి నవాబును, సుల్తాన్ గయాజుద్దీన్‌ను ప్రశంసించినాడు.

మాలాధరబసు పండితుడు హుసేన్ షా పాదుషా ప్రోత్సాహంతో భాగవత పురాణాన్ని సంపూర్ణంగా వంగ భాషలోకి పరివర్తితం చేసినాడు. ఈ పాదుషా ప్రోత్సాహంతోనే కవీంద్రపరమేశ్వరుడు మహాభారతాన్ని స్త్రీపర్వం దాకా వంగ భాషలోకి అనువదించినాడు. పరాగల్ ఖాన్ కుమారుడు చుటీఖాన్ చిటగాంగ్‌లో గవర్నర్‌గా ఉన్నప్పుడు శ్రీకరనందిచే భారతాశ్వమేధ పర్వాన్ని వంగభాష లోనికి పరివర్తింపజేసినాడు.

ఢిల్లీ పాదుషాలు సంస్కృత సాహిత్యానికి ఎంతో దోహదం చేసినారు. మొగల్ వంశ స్థాపకుడైన బాబర్‌కు ఖగోళ శాస్త్రంపైన అభిమానం అధికం. అందువల్ల ఆయన ఎంతోమంది సంస్కృత పండితులను పోషించి వారిచే ఖగోళశాస్త్ర సంబంధమైన ఎన్నో సంస్కృత గ్రంథాలను అరబ్బీ, పారసీ భాషల్లోకి అనువదింపజేసినాడని విజ్ఞుల అభిప్రాయం.

హుమాయూన్ కుమారుడైన అక్బర్ హైందవ సంస్కృతిపైన అభి మానం కలవాడు. సూర్యోపాసకుడు. ఇతడు సంస్కృత భాషకు చేసిన సేవ అపారమైనది. సంస్కృత మహాభారతాన్ని సొంతంగా పార్సీ భాషలోనికి అనువ దింపజేసిన కీర్తి అక్బరుకే దక్కుతుంది. నకీబ్ ఖాన్ అనే విద్వాంసుడు దీని అనువాదకుడు. ఈ అనువాదానికి అక్బర్ 'రజ్మనామా' అని పేరు పెట్టినాడు, రజ్మనామా అంటే యుద్ధాన్ని వర్ణించే గ్రంథమని అర్థం. ఈ అనువాదంలో నకీబ్ ఖానుకు అబ్దుల్లా ఖాదర్, ముల్లా షేరీ, సుల్తాన్ ఖాజీ, షేక్ ఫైజీ అనే పండితులు తోడ్పడినారు. ఈ గ్రంథం కోసం అక్బర్ 40,000 బంగారు నాణాలు వెచ్చించినాడట. (కలకత్తా రాయల్ ఏషియాటిక్ సొసైటీవారి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో "తర్జుమా-ఇ-మహాభారత" అనే ఒక పర్షియన్ భారత ప్రతి ఉన్నది.) అక్బర్ పాదుషా అబ్దుల్ ఖాదర్ అనే పండితుణ్ణి ప్రోత్సహించి, అతనిచే వాల్మీకి రామాయణాన్ని పార్సీ భాషలోనికి అనువదింప జేసినాడు. అబ్దుల్ ఖాదర్ ఒక దాక్షిణాత్య పండితుని సాహాయ్యంతో అథర్వ వేదాన్ని కూడా పార్సీలోకి తర్జుమా చేసినట్లుగా తెలుస్తుంది. అక్బర్ ప్రోత్సా హంతోనే ఫైజీ లీలావతీ గణిత శాస్త్రాన్ని, మౌలానా ఇమాముద్దీన్ కల్హణుని రాజతరంగిణిని, నసరుల్లా ముస్తఫా హరివంశాన్ని, మౌలానా హుసేనీ కలీలా దామనా అనే పేరుతో పంచతంత్రాన్ని, అబ్దుల్ ఖాదరీ సింహాసన ద్వాత్రింశతిని

పారసీలోకి అనువదించినారు. ఫైజీ పండితుడు అక్బర్ ఆజ్ఞానుసారం భగవద్గీతను కూడా పార్సీలోకి అనువదించినట్లుగ జ్ఞాన్‌ప్రకాశ్ అనే ఉర్దూ భగవద్గీతానువాదంలో తత్కర్త పేర్కొన్నాడు. (ఈ అనువాద ప్రతి ఆం. ప్ర. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది. (నెం. 22644 అనువాదకుడు ఉమ్మీద్ రాయ్ కాయస్థ్ మాథుర్.)

అక్బరు అనువాదాలనేకాక, స్వతంత్ర రచనలను కూడా ఎంతో ప్రోత్సహించినాడు. ఈతని ప్రోత్సాహం వల్లనే భానుచంద్ర, సిద్ధచంద్రులు కాదంబరీ వ్యాఖ్యను, బేహారి కృష్ణదాసు పార్శీ ప్రకాశమనే జ్యోతిష గ్రంథాన్ని, గంగాధర పండితుడు నీతిసారాన్ని, పుండరీక విఠలుడు నర్తన నిర్ణయాన్ని రచించినట్లుగా తెలుస్తుంది.

అక్బర్ మంత్రులలో ఒకడైన రామదాస భూపాలుని ప్రోత్సాహంతో రామచంద్రకవి రామవినోద మనే జ్యోతిష గ్రంథాన్ని, ఈ కవి సోదరుడైన నీలకంఠుడు అక్బర్ మంత్రియైన తోడర్‌మల్ సమాదరణతో తోడరానంద తాజిక నీలకంఠీ కృతులను, అక్బర్ సేనాధిపతియైన జగన్నాథుని ఆదరణతో సూరిమిశ్రుడు జగన్నాథప్రకాశాన్ని రచించినారు.

ముస్లిం ప్రభువులు, వారి సామంతులు సంస్కృత కవిపండితులను పోషించి, వారిచే సంస్కృత గ్రంథాలను సంతరింపజేయడం, అరబ్బీ, పారసీ భాషల్లోకి అనువదింపజేయడం మాత్రమే కాక స్వయంగా పండితులై, కవులై సంస్కృత గ్రంథరచన చేసినట్లుగా ఆధారాలు ఉన్నాయి.

షాజహాన్ కుమారుడైన దారా షుకో (1615 - 1659) సంస్కృతంలో మంచి వైదుష్యం సంపాదించినాడు. జగన్నాథ పండితరాయల అంతేవాసిత్వం చేసినాడు. ఈతడు సంస్కృత పండితుల సాహాయ్యంతో ఎన్నో ఉపనిషత్తులను పారసీలోకి అనువదించినాడు. ఈ అనువాద గ్రంథానికి 'సిర్ ఉల్ అక్బర్' అని పేరు. దారాషుకో యోగవాసిష్ఠాన్ని పారసీలోనికి అనువదించడమేకాక 'సముద్ర సంగమ'మనే ఉద్గ్రంథాన్ని రచించినాడు. హిందూ, ముస్లింల మత సిద్ధాంతాల సమన్వయం ఇందులోని ప్రధానాంశం. ఇది 1954 లో డా॥ జె. బి.

చౌదరి, డా॥ రమాచౌదరి సంపాదకత్వంలో ఆంగ్లానువాద, విమర్శ సహితంగా ముద్రింపబడింది. వేదాలను కూడా దారా షికో పర్షియన్ భాషలోనికి అనువదించడం ప్రశంసింపదగ్గ విషయం. ఈ పర్షియన్ అనువాదప్రతి ఆం. ప్ర. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో భద్రపరుపబడి ఉంది. (నెం. 216 & 217 మహజిబ్.) దారా షుకో వాల్మీకి రామాయణాన్ని 'కషాపుల్ కుమజ్' అనే పేరుతో అనువదించినట్లుగా ఉమ్మిద్ రాయ్ కాయస్థ్ మాథుర్ ఉర్దూలో రచించిన జ్ఞాన్ ప్రకాశ్ అనే భగవద్గీతానువాదంలో పేర్కొనబడింది. దీని ప్రతి ఆం. ప్ర. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది (నెం. 22644.) సంస్కృత భాషపై తనకున్న అపారమైన ప్రేమకు చిహ్నంగా ఈతడు తన ఉంగరంపైన 'ప్రభు' అనే సంస్కృత పదాన్ని చెక్కించుకున్నాడట.

దారా షుకో మేనమామ షహిస్తఖాన్ (1689) కూడా గొప్ప సంస్కృత విద్వాంసుడు, కవి. చతుర్భుజుని రసకల్పద్రుమంలో ఈతని శ్లోకాలు కొన్ని ఉదాహరింపబడ్డాయి.

పదహారో శతాబ్దికి చెందిన అబ్దుల్ రహీం ఖాన్ - ఇ - ఖానన్ ముస్లిం సంస్కృత కవులలో మూర్ధన్యుడు. ఈతని గ్రంథాల్లో రహీం కావ్యం, ఖేట కౌతుకం, మదన శతకం ముఖ్యమైనవి. ఇవి సంస్కృత, హిందీ మిశ్రితాలు.

పండితులై స్వతంత్రంగా అలంకార శాస్త్ర గ్రంథాలను రచించిన ముస్లింలలో అక్బర్షా పేరు ముందుగా చెప్పుకోవాలి. ఈతడు పదిహేడో శతాబ్దికి చెందినవాడు. బడే సాహెబ్ ఇతని నామాంతరం. ఈయన సంస్కృతంలో 'శృంగార మంజరి' అనే చక్కని అలంకార శాస్త్ర గ్రంథాన్ని రచించినాడు. ఇందులో నాయికా భేదాలు ఎంతో వివరంగా, విమర్శనాత్మకంగా చర్చింపబడ్డాయి.

భారతీయులైన చక్రవర్తులు, ప్రభువులు, అధికారులు సంస్కృతభాషను పోషించడంలో విశేషమేమీ లేదు. కాని, అన్యమతస్థులైన ముస్లింలు అనేక సంస్కృత కవులను ఆదరించి, పోషించి, ఎన్నో స్వతంత్ర గ్రంథాలను వ్రాయించి, అనువదింపజేసి, స్వయంగా ఎన్నో సంస్కృత గ్రంథాలను వ్రాసి సంస్కృతభాషకు దోహదం చేయడం ప్రశంసింపదగ్గ విషయం. విజ్ఞానం

ఏ భాషలో ఉన్నా, ఏ మతస్థులు చెప్పినా గ్రాహ్యమే అన్న ఉదారభావాన్ని అలవరచుకుంటే విజ్ఞానం అభివృద్ధి చెందుతుంది.

(మహామంత్రి మాచన్న త్రిశతవర్ధంతి ప్రత్యేక సంచిక (మార్చి 1987) లో ముద్రింపబడ్డ వ్యాసం.)

# మాధవీయ ధాతువృత్తి

అష్టకం గణపాఠశ్చ ధాతుపాఠ స్తథైవ చ
లింగానుశాసనం శిక్షా పాణినీయమమీ క్రమాత్.

అనే శ్లోకం అష్టాధ్యాయి, గణపాఠం, ధాతుపాఠం, లింగానుశాసనం, శిక్ష - ఈ ఐదూ పాణినీయాలనే విషయాన్ని తెలుపుతుంది. వీటిలో అష్టాధ్యాయీ గ్రంథం ప్రధానమైంది. తక్కిన గణపాఠం, ధాతుపాఠం, లింగానుశాసనం, శిక్ష అనేవి అష్టాధ్యాయికి అనుబంధ గ్రంథాలు. వీటిలో ధాతుపాఠం ప్రధానమైంది.

సంస్కృత భాషలోని చాలా శబ్దాలు వ్యుత్పన్నాలు. అంటే, అవి ఏదో ఒక మూలధాతువు నుండి పుట్టిన శబ్దాలన్నమాట. అందువల్ల సంస్కృత శబ్దాలకు చెప్పుకునే అర్థాలు చాలావరకు అన్వర్థత ఉన్నవే కాని, కేవల సంకేతాలు కావు. తెలుగులో మనం వాడుకునే ఇల్లు, చెట్టు, బడి, గుడి, ఊరు, పేరు, పులి, పిల్లి మొదలైన శబ్దాలకు చెప్పుకునే అర్థాలు కేవలం సంకేతార్థాలు మాత్రమే. ఆయా శబ్దాలు ఆయా అర్థాలనే ఎందుకు బోధిస్తున్నాయంటే మనం కారణం చెప్పలేం. సంస్కృతంలో అట్లాకాదు - ఏదో కొంత శబ్దజాలానికి తప్ప చాలా శబ్దాలకు మనం వ్యుత్పత్తి చెప్పవచ్చు. అంటే, అవి తెలిపే అర్థాలు కావన్నమాట. దీనికి కారణం సంస్కృత శబ్దాలు చాలావరకు ధాతుజన్యాలు కావడం. కనుక శబ్దస్వరూప నిర్ణయంలోనూ, శబ్దార్థ నిర్ణయంలోనూ సంస్కృతంలో ధాతువులకు ఎంతో ప్రాధాన్యం ఉంది. శాకటాయనుడనే వ్యాకరణాచార్యుడు సంస్కృతంలోని ప్రతిశబ్దమూ ధాతుజన్యమే అని చెప్పినాడు. "సర్వం ధాతుజమాహ శకటస్య చ తోకమ్" అని వ్యాకరణాభిజ్ఞుల ఉక్తి. కనుక సంస్కృత భాషలో ధాతువులకున్న స్థానం ఎంతటిదో మనం అర్థం చేసుకోవచ్చు.

నామం. నిత్య నైమిత్తిక కామ్యకర్మల అనుష్ఠానాల్లో మాత్రమే వాడబడేది నక్షత్ర నామం. సాయణుడనేది వ్యవహారనామం, యజ్ఞనారాయణుడనేది నక్షత్రనామం అయి ఉంటుంది. కుండినార్యుడనే పేరున్న శ్లోకం చాలా తాళపత్రప్రతుల్లో కనబడకపోవడంవల్ల అది ప్రక్షిప్తం కావచ్చు. ఈ సమన్వయం ఉచితంగానే కనిపిస్తుంది. సాయణు లీ ధాతువృత్తిని సోదరుడైన మాధవుని ప్రేరణవల్లనో, అతని తోడ్పాటుతోనో రచించి ఉండవచ్చు. అందువల్ల సాయణు లీ ధాతువృత్తికి మాధవీయధాతువృత్తి అని నామకరణం చేసి ఉంటారు.

పాణిన్యాచార్యుడు ధాతుపాఠంలో చెప్పిన మొత్తం 1944 ధాతువులు ఈ ధాతువృత్తిలో వ్యాఖ్యానింపబడ్డాయి. పాణినీయధాతుపాఠానికి ఇది సమగ్రమైన, విస్తృతమైన వ్యాఖ్య. ఆయా ధాతువులకు వివిధలకారాల్లో ఏర్పడే రూపభేదాలను పేర్కొనడం మాత్రమే ఈ ధాతువృత్తి ప్రధాన లక్ష్యం కాదు. ధాతువులకు సంబంధించిన సమస్త విషయాలను చర్చించడం ఈ ధాతువృత్తిలోని విశిష్టత. ఒక విధంగా ఇది సిద్ధాంతకౌముదిలోని ఉత్తరార్ధానికి సమమైన గ్రంథం. ఉత్తరార్ధంలో చర్చించబడ్డ అంశాలన్నీ ఇందులో చర్చించబడ్డాయి. ఆయా ధాతువులకు కేవలం కర్త్రర్థంలోని రూపాలనేకాక, భావకర్మార్థాల్లో, యఙ్, ణిచ్, సన్, యఙ్లుగాద్యర్థాల్లో ఏర్పడే క్రియారూపాలను, కృదంతరూపాలను అవసరమైన ప్రక్రియా విశేషాలతోపాటు నిర్దేశించడం ఈ ధాతువృత్తి విషయ సమగ్రతకు నిదర్శనం. భట్టోజీ దీక్షితుల సిద్ధాంతకౌముదిలోకూడా పై రూపాలన్నీ ప్రక్రియాపూర్వకంగా నిర్దేశింపబడ్డా అవన్నీ భిన్నభిన్న ప్రకరణాల్లో ఉండి జిజ్ఞాసువుకు ఒక ధాతువుకు సంబంధించిన రూపవిజ్ఞానాన్నంతా ఒకేచోట అందించడం కనిపించదు. ధాతురూప విషయాలను వివిధ విభాగాలుగా విభజించుకోవడమే దీనికి కారణం. మాధవీయ ధాతువృత్తిలో ఒక్కొక్క ధాతువును గ్రహించి వ్యాఖ్యానించడంవల్ల ఒక ధాతువు సమస్తరూపాలు ఒకేచోట తెలుసుకునే అవకాశం ఉంది. దీనివల్ల జిజ్ఞాసువుకు ఒక ధాతువుకు సంబంధించిన సమగ్రమైన అవగాహన కలుగుతుంది. యఙ్, ణిచ్ సనాద్యంతధాతురూపాలకు కూడా వివిధలకాలాల్లో ఏర్పడే రూపాలు ఇందులో చూపబడ్డాయి. ధాతువులకు ఉపసర్గయోగంవల్ల వచ్చే అర్థభేదమూ, ఆత్మనేపద - పరస్మైపద విధానమూ నిర్దేశింపబడ్డాయి. మాధవీయ ధాతువృత్తిలోని మరో విశేషమేమంటే-ణిచ్, సన్ యఙాద్యంత ధాతురూపాలకు కూడా భావకర్మార్థాల్లో వివిధ లకార రూపాలను

చూపడం. వివిధ ధాతురూపాలను వివరించిన తీరు తెలుసుకోవడానికి భూధాతువుకు చూపబడ్డ ఈ కింది క్రియారూపాలను పరిశీలిస్తే స్పష్టమౌతుంది.

1. కర్త్రర్థంలో సర్వలకారాలకు ప్రధానరూపాలు
2. ఆత్మనేపద - పరస్మైపద ప్రక్రియారూపాలు - వ్యతిభవతే మొ॥ వీటికి అన్ని లకారాల్లో ప్రధానరూపాలు.
3. భావకర్మార్థాల్లో అన్ని లకారాల ప్రధానరూపాలు.
4. శతృశానజంతరూపాలు
5. సన్నంతరూపాలు - బుభూషతి మొ॥
6. సన్నంతరూపాలకు భావకర్మార్థాల్లో రూపాలు - బుభూష్యతే మొ॥
7. యఙ్ప్రత్యయాంతరూపాలు - బోభూయతే మొ॥
8. యఙ్లుగంతరూపాలు - బోభవీతి, బోభోతి మొ॥
9. యఙ్లుగంతరూపాలకు ఆత్మనేపద ప్రక్రియలో అన్ని లకారాల్లో ప్రధాన రూపాలు
10. యఙ్లుగంతరూపాలకు సత్ (శతృ, శానచ్) ప్రత్యయాంతరూపాలు బోభువత్ మొ॥
11. ణిజంతరూపాలు - భావయతి, భావయతే మొ॥
12. ణిజంతరూపాలకు కర్మార్థకరూపాలు - భావ్యతే మొ॥

ఈ విధంగా వివిధ క్రియా రూపభేదాలను, శత్రాద్యంతరూపాలను పేర్కొన్న తరువాత ఆయా ధాతువుల కృదంతరూపాలు, ఉణాదిరూపాలు పేర్కొబడ్డాయి. ఈ రూపాలనన్నింటినీ కేవలం నిర్దేశించడం మాత్రమేకాక వాటి ప్రక్రియను కూడా అవసరమైనంతమేరకు ప్రదర్శించడం కనిపిస్తుంది. ఒక్క భూధాతువుకే ఇందులో నలభై ఐదు నిండుపుటల వ్యాఖ్యానం ఉందంటే ధాతురూపాల సమగ్ర నిరూపణంలో మాధవీయ ధాతువృత్తికి గల విశిష్టస్థానాన్ని మనం ఊహించుకోవచ్చు.

ఆయా ధాతురూపాలను కేవలం నిర్దేశించడమే కాకుండా వాటి ప్రయోగంలో కనిపించే కారక విశేషాలను కూడా చూపడం ఈ వృత్తిలోని మరో విశేషం. కొన్ని ఉదాహరణలు:

1. ఞి భీ భయే - చోరాత్ బిభేతి, భీత్రార్థానాం భయహేతుః ఇతి భయ హేతోః కారకస్య అపాదానత్వమ్.
2. అత సాతత్యగమనే - సాతత్యగమనం - సంతతగమనం - గ్రామమతతి - గ్రామాయ అతతి, గత్యర్థకర్మణి ద్వితీయాచతుర్థ్యౌ.
3. రుచ దీప్తావభిప్రీతౌ చ - రోచతే దేవదత్తాయ మోదకః; రుచ్యర్థానాం ప్రీయమాణః ఇతి ప్రీయమాణస్య సంప్రదానత్వాచ్చతుర్థీ.
4. స్మృ చింతాయామ్ - మాతుః స్మరతి ఇత్యాది - అధీగర్థ ఇతి కర్మణి శేషే షష్ఠీ.

ఆయా ధాతువుల అర్థవిషయంలో సందేహానికి తావు ఉన్నప్పుడు వాటిని వివరించడం కనిపిస్తుంది. ఇది జిజ్ఞాసువు కెంతో తోడ్పడుతుంది. ఈ కింది ఉదాహరణలను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టపడుతుంది.

1. భూ సత్తాయాం - సత్తా ఇహ ఆత్మభరణమ్.
2. షుచ అభిషవే - అవయవానాం శిథిలీకరణం, సురాయాః సంధానం వా అభిషవః, అభిషవః స్నానమితి చంద్రః.
3. ఉబిందుర్ నిశామనే - నిశామనం చక్షుర్విజ్ఞానమ్.
4. కృష విలేఖనే - విలేఖనమిహాకర్షణమ్.
5. శవ ఆక్రోశే - ఆక్రోశో విరుద్ధానుధ్యానమ్.
6. మ్లేచ్ఛ అవ్యక్తే శబ్దే - ఇహ అవ్యక్తశబ్దః అస్ఫుటశబ్దః అపశబ్దః.
7. ఖుట సంచలనే - సంచలనం ప్రకృతివిపర్యాసో మథనం చ.

ఈ విధంగానే ఆయా కాలాల రూపాలను నిర్దేశించేప్పుడు అవి ఏయే అర్థాలలో వస్తాయో వాటిని చక్కగా వివరించడం ధాతువృత్తిలో కనిపిస్తుంది. ఇది జిజ్ఞాసువులకెంతో ఉపయోగకారి. విధినిమంత్రణామంత్రణాధీష్ట సంప్రశ్న ప్రార్థనేషు లిఙ్ అన్న సూత్రంలో విధ్యాదిశబ్దాల వివరణం, లిఙ్ నిమిత్తే లృఙ్ క్రియాతిపత్తౌ అనే సూత్రంలోని క్రియాతిపత్తి శబ్దవివరణం మొదలైనవి ఇందుకు ఉదాహరణలు.

ధాతువుల అర్థవిషయంలోనే కాకుండా ధాతుస్వరూప విషయంలో సందేహానికి అవకాశం ఉన్నచోట్ల దాన్ని నివారించడానికి వివరణ అనివార్యంగా కనిపిస్తుంది. ఉదాహరణకు కొన్నింటిని గమనించండి:

రోసి చుంబనే ఇదిద్దంత్యాంతః
వృజీ వర్జనే దంత్యోష్ఠాది;
పృచీ సంపర్చనే ఓష్ఠ్యాదిరీదిత్
వృష దాహే దంత్యోష్ఠ్యాదిః మూర్ధన్యాంతశ్చ
శిక్ష్ నిశానే తాలవ్యాదిరయం

ఆయా సందర్భాల్లో భగవత్పతంజలి, భర్తృహరి, హేలారాజు, కైయటుడు, జినేంద్రబుద్ధి, హరదత్తుడు మొదలైన సుమారు నూటయాభై మంది ప్రామాణికశాస్త్రకారుల గ్రంథాల్లోని అభిప్రాయాలు ఇందులో ప్రమాణంగా చూపబడ్డాయి. మాధవీయ ధాతువృత్తి ప్రామాణికతకు, సాయణాచార్యుల వ్యాకరణప్రజ్ఞకూ ఇది గొప్ప నిదర్శనం.

దేశంలో భట్టోజీ దీక్షితుల సిద్ధాంతకౌముది పఠనపాఠనాదుల్లో వ్యాప్తి పొందక పూర్వం మాధవీయ ధాతువృత్తికి ఎక్కువ ప్రచారం ఉండేది. నేడు అధ్యయనాధ్యాపనాదుల్లో మాధవీయ ధాతువృత్తికి అంతగా ప్రచారం లేక పోయినా ధాతువిజ్ఞానాన్ని సమగ్రంగా అందజేసే పాణినీయధాతుపాఠవ్యాఖ్యాన గ్రంథాల్లో మాధవీయ ధాతువృత్తికి సాటియైన గ్రంథం మరొకటి లేదనడంలో అతిశయోక్తి ఏ మాత్రమూ లేదు.

(కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగుశాఖ ప్రచురించిన 'విద్యారణ్య భారతి' (1990) లో ముద్రింపబడిన వ్యాసం.)

# తెలుగులో భగవద్గీతలు

భారతీయ తత్వశాస్త్ర గ్రంథాల్లో భగవద్గీతకున్న స్థానం విశిష్టమైంది. ప్రాచీనకాలంనుంచి నేటిదాకా దీనికి సంస్కృతంలోనూ, ప్రాంతీయభాషల్లోనూ అనేక వ్యాఖ్యానాలు రచింపబడ్డాయి. వేదాంత ప్రతిపాదకమైన ప్రస్థాన త్రయంలో భగవద్గీత బహుళప్రచారం పొందిన గ్రంథం. భగవద్గీతను అన్ని భాషలవారూ తమతమ భాషల్లోకి అనువదించుకున్నారు. ఒక భాషలో ఒకరి అనువాదంతో ఇది ఆగిపోలేదు. తెలుగులో రామాయణానికి వలెనే భగవద్గీతకు కూడా ఎన్నో అనువాదాలు వెలిశాయి. పద్యం, గద్యం, ద్విపద, గేయం మొదలైన వివిధ సాహితీ ప్రక్రియల్లో భగవద్గీతను తెలుగులో ఎందరో రచించినారు.

భగవద్గీత మహాభారతంలోని భీష్మపర్వంలో పద్దెనిమిదధ్యాయాల్లో 700 శ్లోకాల్లో చెప్పబడింది. యుద్ధరంగంలో శ్రీకృష్ణుడు అర్జునునికి చేసిన ఉపదేశమే భగవద్గీత. నన్నయ మహాభారతాన్ని 'అధ్యాత్మవిదులు వేదాంత మనియు' అని ప్రశంసించడం మహాభారతంలో తాత్త్వికవిషయప్రతిపాదకాలైన భగవద్గీత, సనత్సుజాతీయం మొదలైన భాగాలు చోటు చేసుకోవడంవల్లనే అని చెప్పవచ్చు.

తెలుగులో భగవద్గీతానువాదం మనకు రెండు పద్ధతుల్లో కనిపిస్తుంది. 1. మహాభారతానువాదంలో అంతర్గతంగా, 2. స్వతంత్ర గ్రంథంగా. పంచమ వేదంగా భావింపబడే సంస్కృత భారతాన్ని కవిత్రయంవారు (నన్నయ, తిక్కన, ఎర్రన) తెనిగించినారు. ఇది తెలుగులో అవతరించిన ఆదికావ్యమే కాక మొట్టమొదటి వ్యాసభారతానువాదం కూడా. కవిత్రయ భారతం యథా మూలానువాదం కాదు. మూలంలోని విషయాన్ని గ్రహిస్తూ స్వతంత్ర గ్రంథంగా రచించిన గ్రంథం. కనుక ఒక విధంగా దీనిని అనువాదం అనడంకంటె అనుసృజనం అనడం యుక్తం. ఇతిహాస రూపంగా ఉన్న

సంస్కృత భారతాన్ని కావ్యంగా రచించే దృష్టివల్లనో మరే కారణంవల్లనో మూలభారతంలోని తాత్విక ఘట్టాలు తెలుగు భారతంలో సంగ్రహింపబడ్డాయి. సనత్సుజాతీయం వంటి కొన్ని ఘట్టాలు పూర్తిగా విడిచిపెట్టబడ్డాయి.

మహా భారతంలోని తాత్త్విక ఘట్టాల్లో భగవద్గీత చాలా ప్రధానమైంది. తెలుగులో మొట్టమొదటగా భగవద్గీతను చెప్పేభాగ్యం కవిబ్రహ్మయైన తిక్కనకు లభించింది. కాని, తిక్కన భగవద్గీతను యథాశ్లోకంగా అనువదించ లేదు. పద్దెనిమిది అధ్యాయాలుగల భగవద్గీతలోని ఏడువందల శ్లోకాలను తిక్కన సుమారు 60 గద్యపద్యాల్లో (భీష్మపరం 1171 నుండి 1230 వరకు) సంగ్రహంగా అనువదించినాడు. ఈ అరవై గద్యపద్యాలలోని అంశాలను కింది విధంగా విభజించుకోవచ్చు.

| | | |
|---|---|---|
| అర్జున విషాదయోగసారం | 19 గద్యపద్యాలు 171-180 | |
| సాంఖ్యయోగసారం | 11 గద్యపద్యాలు 190-200 | |
| కర్మయోగవిషయం | 1 పద్యం 201 | |
| జ్ఞానయోగవిషయం | 1 పద్యం 202 | |
| విశ్వరూప సందర్శనం | 17 గద్యపద్యాలు 205-221 | |
| భక్తి, క్షేత్రక్షేత్రజ్ఞగుణత్రయ విభాగ, పురుషోత్తమ ప్రాప్తి, దైవాసురసంపద్విభాగం | 1 తేటగీతి 220 | |
| శ్రద్ధాత్రయ విభాగయోగాలు మోక్షసన్యాసయోగం | 8 గద్యపద్యాలు 223-230 | |

తిక్కన తెలుగు అనువాదంలో కర్మసన్యాస, ఆత్మసంయమ, విజ్ఞాన అక్షర పరబ్రహ్మ రాజవిద్యా రాజగుహ్యవిభూతియోగాలను పూర్తిగా విడిచి వేసినాడు. వీటి స్థానంలో ఒక చిన్న గద్యాన్ని, ఒక చిన్న కందపద్యాన్ని మాత్రం రచించినాడు. వివేకంవల్ల దుఃఖనివృత్తి, ఆత్మయొక్క సత్యత్వ నిత్యత్వాలు, దేహమిథ్యాత్వం, జీవ పరమాత్మల ఏకత్వం మొదలైన అద్వైత ముఖ్య సూత్రాలు తిక్కనగారి అనువాదంలో స్పష్టంగా చెప్పబడ్డాయి. అర్జున విషాదయోగంనుండి మోక్షసన్యాస యోగంవరకు ఉన్న విషయ సారాంశం జ్ఞానంవల్ల అజ్ఞానం తొలగింపబడి శాంతి లభించడమే. గీతాసారాంశమైన

ఈ విషయాన్ని తిక్కన వివరంగా కాకుండా స్వల్పంగా చెప్పినా అద్వైతతత్త్వ ముఖ్యసూత్రాల బోధ అంతా ఇందులో ఇమిడి ఉన్నట్లుగా భావించవచ్చు.

భగవద్గీతను అందరూ చదువరాదనో, వేదాంతభాగం అధికంగా ఉండడంవల్ల కావ్యౌచిత్యానికి భంగం కలుగుతుందనో తిక్కన భగవద్గీతను ఎక్కువ సంగ్రహించినాడని కొందరి అభిప్రాయం. భగద్గీతను అందరూ చదువరాదనే సంకుచితభావం తిక్కనకున్నట్లుగా భావించడం యుక్తం కాదు. ఉంటే ఆ నిషేధం శ్రుతి విషయంలో ఉండవచ్చుకాని అనువాదవిషయంలో ఉండడానికి వీలులేదు. ఇక కావ్యౌచిత్యాన్ని పాటించడం కోసం భగద్గీతను తిక్కన సంగ్రహించినాడని చెప్పడం కూడా యుక్తం కాదు. తత్త్వవిషయాన్ని వివరంగా వర్ణించినంతమాత్రాన కావ్యౌచిత్యానికి భంగం కలుగకుండా రసవత్తరంగా వర్ణించగల శక్తిసామర్థ్యాలు తిక్కనకు పుష్కలంగా ఉన్నాయనే విషయం మనందరికీ తెలిసిందేకదా! కనుక తిక్కన చేసిన భగవద్గీతా సంగ్రహీకరణకు కావ్యౌచిత్యం కారణమని చెప్పలేము. దీనికి కారణాలు సన్నివేశానికీ, పాత్రకూ సంబంధించినవిగా గ్రహించాలి. యుద్ధరంగంలో అర్జునుణ్ణి ఆవేశించిన మోహరూపమైన అజ్ఞానాన్ని పోగొట్టడానికి అవసరమైన తత్త్వజ్ఞానమే కాని ఆ తత్వానికి పోషకాలైన వివిధ అంశాల అవసరం కనిపించదు. కనుక కృష్ణుడు చేసిన తత్త్వబోధతో కొంత భ్రమ నశించిందని అర్జునుడు చెప్పి విశ్వరూపాన్ని చూపగోరినాడు. విశ్వరూపదర్శనంలో ఆతనికంతకు పూర్వం బోధింపబడిన తత్త్వం అనుభవమై దృఢమైనది. అనుభవమైన తత్త్వం దృఢం కావడానికి తక్కిన విషయాలను వదలిపెట్టినా విశ్వరూపసందర్శనాన్ని మాత్రం తిక్కన అనువాదంలో విడిచిపెట్టలేదు. శాస్త్రాన్నంతా బోధించక సారాంశాన్ని బోధించి దానిని మనస్సులో దృఢమయ్యేట్లుచేసి కర్తవ్యోన్ముఖుణ్ణి చేయడం ముఖ్యం. దానికి తగినట్లుగా తిక్కన విషయాన్ని సంగ్రహంగా చెప్పినాడు.

ప్రధానంగా మహాభారతానువాదం చేస్తూ అవాంతరంగా భగవద్గీతను కూడా యథోచితంగా అనువదించడం తిక్కన తరువాతి భారతాల్లో కూడా కనిపిస్తున్నది. కాలక్రమాన్నిబట్టి చూస్తే తిమ్మయ, సోమన, బాలసరస్వతులు రచించిన ద్విపదభారతం (1600 - 1650) లో భగవద్గీతానువాదం తిక్కన

భారతంలోలాగే సంగ్రహంగా కానవస్తుంది. తెలుగులోని కవిత్రయ భారతానికి ఇది ద్విపదలో పరివర్తనం కనుక ఈ సంగ్రహీకరణం ఉచితమే. భగవద్గీతగల భీష్మపర్వం సోమన కవి రచించినాడు. ఇతడు 17 వ శతాబ్దిపూర్వభాగానికో, మధ్యభాగానికో చెందినవాడు.

ఇదికాక లింగకవి ఒక ద్విపద భారతం రచించినట్లుగా తెలియవస్తుంది. కాని, ఆ గ్రంథం లభించలేదు. కనుక లింగకవి భగవద్గీతను అనువదించినాడో లేక వదిలివేసినాడో అనువదిస్తే ఎలా అనువదించినాడో చెప్పడం సాధ్యం కాదు.

మహాభారతాన్ని అనువదించిన ఆధునిక కవుల్లో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ప్రసిద్ధులు. భారతభాగవత రామాయణాలను మూడింటిని తెలుగులోకి అనువదించిన కీర్తి శ్రీ శాస్త్రిగారికే దక్కుతుంది. కవిత్రయంవారు మూల మహాభారతంలోని కొన్ని భాగాలను వదలివేసి, కొన్నింటిని మార్చి, కొన్నింటిని చేర్చి స్వతంత్ర కావ్యంగా అనువదించినారు. శాస్త్రిగారు అలాకాక మూల భారతాన్ని శ్రీకృష్ణ భారతమనే పేర యథాతథంగా రసవత్తరంగా అనువదించినారు. ఇది యథా మూలానువాదం కావడంవల్ల ఇందులోని భగవద్గీత శాస్త్రిగారు యథా మూలంగా అనువదించినట్లు ప్రత్యేకంగా పేర్కొనవలసిన పని లేదు.

శ్రీ కృష్ణభారతం తరువాత పేర్కొదగ్గ భారతం శ్రీ బులుసు వెంకటేశ్వర్లు గారు రచించిన నిర్వచనాంధ్ర శ్రీ మహాభారతం. ఇది వచనం లేని కేవల పద్యకావ్యం. సంస్కృత భారతాన్ని పరిశీలిస్తూ, కవిత్రయ భారతాన్ని సంగ్రహిస్తూ రచించిన గ్రంథం. ఇది తిక్కనకన్నా భారతాన్ని సంగ్రహంగా చెప్పినా భగవద్గీతను మాత్రం శ్రీ వెంకటేశ్వర్లుగారు తిక్కనకన్నా విస్తృత పరచి అనువదించినారు. తిక్కన భగవద్గీతాసారాన్ని అరవై పద్యాల్లో చెప్పితే బులుసువారు మొత్తం 280 పద్యాలలో (భీష్మ 83-360) వివరించినారు. మూలంలోని అద్వైతభావాలు ఇందులో చాలావరకు ప్రకటింపబడ్డాయి.

మహాభారతాన్ని అనువదిస్తూ తదంతర్గతమైన భగవద్గీతను యథాతథంగానో. సంక్షిప్తంగానో అనువదించడంతోపాటు విడిగా భగవద్గీతను

మాత్రమే స్వతంత్ర గ్రంథంగా తెలుగులోకి అనువదించిన కవులు ఎంతోమంది ఉన్నారు. వీరు భగవద్గీత సామాన్యజనానికి అందుబాటులో లేని సంస్కృత భాషలో ఉండడంవల్ల అందులోని విశేషాలను తెలుగులో చెప్పి భగవద్గీతా తత్వాన్ని తెలుగు దేశంలో ప్రచారం చేసినారు. ఇటువంటి భగవద్గీతానువాదాల్లో అతి ప్రాచీనమైందిగా తెలియవస్తున్నది 16వ శతాబ్ది ఉత్తరార్ధానికి చెందిన కంభంపాటి నారప్ప రచించిన భగవద్గీతా సారోద్ధారం. తెలుగులోని పద్య భగవద్గీతానువాదాల్లో ఇది ప్రథమని చెప్పవచ్చు. భగద్గీతా శ్లోకాలను ఆధారంగా చేసుకొని తమకు తెలిసిన వేదాంత విషయాలను కలిపి రచించిన అనువాదం ఇది. కనుక ఇది భగద్గీతకు యథాతథానువాదం కాక వ్యాఖ్యానరూపమైన అనువాదం అని చెప్పవచ్చు. గీతలోని 18 అధ్యాయాలు ఇందులో ఆరా శ్వాసాలుగా విభజింపబడ్డాయి. కొన్ని సందర్భాల్లో మూలంలో లేని అంశాలను కూడా స్వతంత్రించి కూర్చినాడు. ఉదాహరణకు:

"శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే" అన్న శ్లోకాన్ని అనువదిస్తూ—

"అట్టి జ్ఞానయోగమభ్యాసమొనరించు
మార్గమునకు దివ్యమైన సాంఖ్య
తారకామనస్కసారవిచార సం
యుక్తుడౌ మహాత్ము భక్తు గొలిచి
మొదట సాంఖ్యయోగ పదవిని నిండార
గాంచి పిదప తారక ప్రభావ
సరణి దెలిసి చిత్తచలనంబు నెడబాప
వలయు జ్ఞానయోగవాంఛితుండు"

అని మూలంలోని సాంఖ్యతారకా మనస్కయోగములను పేర్కొని సాంఖ్యాన్ని వివరిస్తాడు. ఈ అనువాదంలోని రచన సరళంగా, సులభ గ్రాహ్యంగా ఉంది. దీని ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నట్లుగా ఆరుద్ర పేర్కొన్నారు.

కాలక్రమంలో దీని తరువాత పేర్కొనదగ్గ గీతానువాదం పూడూరి కృష్ణయామాత్యుడు రచించిన భగవద్గీతార్థదర్పణం. కృష్ణయామాత్యుడు 17 వ శతాబ్ది పూర్వార్ధానికి చెందినవాడు. ఇది అముద్రితం. ఈ గ్రంథాన్నిగురించి, కవిని గురించి బి. రామరాజుగారు 'చరిత్ర కెక్కని చరితార్థులు' అన్న గ్రంథంలో ఎన్నో వివరాలు తెలియజేసినారు.* ఇది పదిహేడధ్యాయాల గ్రంథం. ఇందులో ప్రథమాధ్యాయం అనూదితం కాలేదు. ఇది భగవద్గీతకు యథాతథానువాదంకాక టీకాప్రాయంగా ఉన్న సరళ సుందరమైన అనువాదం. ఇవికాక మాధవయ్య రచించిన భగవద్గీతాసారం, అమ్మ సోమయ్య రచించిన ఆంధ్ర భగవద్గీత మొదలైనవి అముద్రితంగా ఉన్న భగవద్గీతానువాదాలు.

భగవద్గీతను వివరణాత్మకంగా కాక యథా మూలంగా తెలుగులో అనువదించిన కవులెంతో మంది ఉన్నారు. ఈ విధమైన అనువాదకుల్లో ఎక్కువ మంది ఆధునికులే అని చెప్పాలి. యథా మూలానువాదాల్లో మిక్కిలి మల్లికార్జున కవి రచించిన శ్రీ కృష్ణార్జునీయం ఒకటి. ఇంతకుముందెవ్వరూ భగవద్గీతను అనువదించలేదని చెప్పుకోవడంవల్ల ఈ కవి తన అనువాదాన్ని ప్రథమాంధ్ర పద్యానువాదంగా భావించినట్లు తెలుస్తుంది. ఈ కవి 19 వ శతాబ్దికి చెందినవాడు, కాని, 16వ శతాబ్దిలోనే భగవద్గీతకు అనువాదాలు రావడం కనిపిస్తుంది. ఈ అనువాదం మూలంలోని శ్లోకానికొక పద్యం చొప్పున మొత్తం మూడాశ్వాసాల్లో సాగింది. ఈ పద్ధతిలో రచింపబడిన భగవద్గీతానువాదాల్లో ఇది ప్రథమమని భావించి ఉండవచ్చు.

భగవద్గీతకుగల ఆంధ్రానువాదాల్లో ఆదిపూడి సోమనాథరావు రచించిన శ్రీమద్భగవద్గీత ప్రసిద్ధమైంది. ఈ అనువాదం మూలశ్లోకానికొక పద్యం చొప్పున 700 తేటగీతి పద్యాల్లో తేట తెలుగులో సులభశైలిలో రచింపబడింది. ఇది మూలానికి యథాతథంగా సాగిన అనువాదం. అనువాద పద్యాలకు తాత్పర్యంతోపాటు కొన్నిచోట్ల విశేషాలుకూడా వివరింపబడ్డాయి. వీరి అనువాదం ఎంత సరళంగా. మూలానుసారిగా రచింపబడిందో ఒక్క ఉదాహరణ పరిశీలించండి:

* పుటలు 44-52.

"యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః"
దీనికి సోమనాథరావుగారి అనువాదం-
"అంతటను నీరు పూర్ణమై యలరుచుండ
నెంత ఫలకారియై నూయి యొసగగలదొ
బ్రహ్మవిదుడయి పరగెడు బ్రాహ్మణునకు
సర్వవేదమ్ములంతయే సాయపడును."

ఈ విధంగా యథామూలంగా శ్లోకానికో పద్యంచొప్పున లలితమైన శైలిలో రచింపబడ్డ అనువాదాల్లో శ్రీ కబ్బరాజు హనుమంతరాయశర్మగారి శ్రీ హనుమద్భగవద్గీత, కోరంకి కుప్పుస్వామయ్యగారి ఆంధ్రభగవద్గీత, విద్వాన్ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారి గీతాసప్తశతి, సెట్టి నరసింహంగారి శ్రీమద్భగవద్గీత, మిక్కిలి మల్లికార్జునకవి శ్రీకృష్ణార్జునీయం, వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాద్ గీతామృతం మూలాన్ని సులభంగా, యథాతథంగా అవగతం చేసుకోవడానికి ఉపకరించేవిగా ఉన్నాయి.

భగవద్గీతాహృదయాన్ని యథాతథంగా జిజ్ఞాసువులకు తెలియజేయాలనే ప్రయత్నంతో కొందరు అనువదిస్తే మరికొందరు తమకభీష్టమైన సిద్ధాంత పరంగా భగవద్గీతను అనువదించినారు.

1800 ప్రాంతంలో వేముగంటి దత్తోజీ పండితుడు భగవద్గీతాయోగ శాస్త్రం అనే పేరుతో భగవద్గీతను అనువదించినాడు. ఐతే, ఇది ద్వైతసిద్ధాంత పరంగా రచింపబడిన రచన. ఇందులో వివిధవృత్తాలు, సీసాలు, వచనమూ ప్రయోగింపబడ్డాయి, రచన సులభశైలిలో సాగింది.

దత్తోజీపండితుడు భగవద్గీతను ద్వైతసిద్ధాంతపరంగా అనువదిస్తే గోపీనాథకవి (1820 - 1895) యాచమనాయకుని ప్రేరణతో అద్వైతపరంగా అనువదించినాడు. అద్వైతతత్వం ఇందులో ప్రధానంగా ఉంది కనుక కవి ఈ అనువాదానికి 'భగవద్గీతాశాస్త్రం' అని పేరుపెట్టినాడు. భగవద్గీత మొదటి అధ్యాయంలో భగవద్గీత అని చెప్పదగ్గ శ్రీకృష్ణోపదేశమేమీ లేకపోవడంచేత

నేమో - అర్జునవిషాదయోగం ఇందులో అనువదింపబడలేదు. గ్రంథం ద్వితీయా ధ్యాయంనుండే ప్రారంభమైంది. కాని, ఈ అనువాదంలో భావపుష్టి కొంత కొరవడినట్లుగాను, కొన్ని ముఖ్యమైనచోట్ల అద్వైతపరంగా అనువదించడంతో ఈ అనువాదం విఫలమైనట్లుగాను పండితులు భావిస్తున్నారు.

అద్వైతపరంగా, శాంకరభాష్యానుసారంగా, వివరణాత్మకంగా రచింపబడ్డ అనువాదాల్లో పిశుపాటి నారాయణశాస్త్రిగారు, పాటిబండ సూర్యనారాయణామాత్యులు రచించిన ఆంధ్ర భగవద్గీతలు పేర్కొదగ్గవి. ఈ రెండింటిలో అద్వైతభావాలు చక్కగా ప్రకటింపబడ్డాయి. ఈ అనువాదాలు యథామూలాలు కాక వివరణాత్మకాలుగా ఉన్నాయి.

ఇంతవరకూ పేర్కొన్న భగవద్గీదానువాదాలన్నీ పద్యానువాదాలు. తెలుగుతో 'ద్విపద' పాడుకోవడానికి చాలా అనువైన ఛందస్సుకనుక సామాన్య జనుల్లో భగవద్గీతాతత్వాన్ని వ్యాప్తిచేయడానికి ఎందరో కవులు భగవద్గీతను ద్విపదలో అనువదించినారు. స్వతంత్రగ్రంథంగా ద్విపదలో అనువదింపబడ్డ తొలి తెలుగు అనువాదం కర్పూరం కృష్ణామాచార్యులు రచించిన భగవద్గీత. ఈతను క్రీ.శ. 1650 ప్రాంతానికి చెందినవాడు. దీని గురించిన వివరాలు గోలకొండకవుల సంచికలో కనిపిస్తాయి. కాని, ప్రస్తుతం ఈ అనువాదం ఎక్కడుందో తెలియరాదు.

ఇంద్రకంటి వెంకటశాస్త్రిగారు రచించిన 'హరిసూక్తితరంగిణి' ద్విపదలో రచింపబడిన అనువాదం. భగవద్గీతలోనున్నవి హరిసూక్తులు కనుక ఈ అనువాదానికి 'హరిసూక్తితరంగిణి' అనే పేరు సార్థకమైంది. దీనికి తగినట్లుగా ఇందులోని అధ్యాయాలు తరంగములుగా పేర్కొబడ్డాయి. సంస్కృత భాషాపరిజ్ఞానంలేని పామరుల హితంకోసం ఈ గ్రంథాన్ని రచించినట్లుగా గ్రంథకర్త చెప్పుకున్నాడు. ఇందులో కొన్ని శ్లోకాలు యథాతథంగా అనువదింపబడ్డా - కొన్ని సందర్భాల్లో అనువాదం వివరణాత్మకంగా సాగింది.

"ఊర్ధ్వమూలమధః శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్

ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్" (15-1) అనే శ్లోకానువాదాన్ని పరిశీలించండి:

మహిమ దేజరిలు బ్రహ్మంబు మూలమయి
మహదహంకారనామకశాఖలమరి
క్షణికవిధ్వంసియై సంసారవృక్ష
మణుమాత్రము నశింపదని పల్కుచుంద్రు
వేదంబూలకులై వెలయునత్తరి.

ఇందులో మూలశ్లోకంలోని ఊర్ధ్వమూలమనేదానికి బ్రహ్మమూలమయి అనీ, అధశ్శాఖ అనే దానికి మహదహంకార నామకశాఖమయి అనీ, అశ్వత్థ మనే దానికి క్షణికవిధ్వంసియవు సంసారవృక్షమనీ అనువదించడం వివరణాత్మ కతను నిరూపిస్తాయి. అద్వైతపరంగా సాగిన ఈ అనువాదం సుబోధమైన శైలిలో రచింపవడింది.

కోసూరి పట్టాభిరామశర్మకవి 'భగవద్గీతామంజరిని'ని మంజరీ ద్విపదలో రచించినారు. ఇందులో 327 ద్విపదలున్నాయి. రచయిత "వనితల కతిసులభం బగునట్లు, గీతార్థమంజరి కృతి చేసియిచ్చె" అని చెప్పుకోవడంవల్ల ప్రధానంగా స్త్రీలకోసమే ఈ గ్రంథం రచింపబడినట్లుగా భావించవచ్చు. అందువల్ల ఇందలి రచన ఎంతో సరళమైన శైలిలో సాగింది.

తెలుగులో భగవద్గీత పద్యంలో, ద్విపదలోనేకాక వచనంలోకూడా అనువ దింపబడింది. 18 వ శతాబ్ది పూర్వార్ధానికి చెందిన తుపాకుల అనంతభూపాలుడు దీని కర్త. ఇది స్వతంత్రగ్రంథం కాక కఱవె వీరరాజుతో ఈతడు కలిసి రచించిన వచన భారతంలోనిది.

మొత్తం భగవద్గీతను వచనంలో స్వతంత్ర గ్రంథంగా అనువదించిన కీర్తి తాళ్లపాక పెద తిరుమలాచార్యులకు (1468 - 1553) చెందుతుంది. ఆంధ్రంలోని ప్రథమ వేదాంతరచనగా, భగవద్గీతకు మొదటి తెలుగు వచనాను వాదంగా, ధారాళమైన - మనోజ్ఞమైన వ్యావహారికంలో రాయబడ్డ మొదటి తెలుగు వ్యావహారిక గ్రంథంగా దీని ప్రాముఖ్యం గణనీయమైంది. రామానుజ

భాష్యక్రమాన గీతార్థాన్ని తెలుగు చేయటమే తాన్నీగ్రంథంలో కావించిందని గ్రంథకర్త స్వయంగా పేర్కొన్నాడు.

వివిధ ప్రక్రియల్లో తెలుగులో వచ్చిన భగవద్గీతానువాదాలు మరెన్నో ఉన్నాయి. ఇవన్నీ తెలుగు ప్రజల్లో భగవద్గీతాతత్త్వాన్ని ప్రచారం చేయడానికి ఎంతో దోహదం చేసినాయని చెప్పవచ్చు.

('తెలుగు' సాహిత్య మాసపత్రిక (ఆగస్టు 1955) లో ప్రచురితమైన వ్యాసం)

# పోతన భాగవతేతర భాగవతాలు

తెలుగునాట పోతన భాగవతానికున్నంత ప్రచారమూ, విశ్వజనీనతా తెలుగుసాహిత్యంలో మరే గ్రంథానికీ లేవనడం అత్యుక్తికాదు. ఇందులోని మధురమైన శైలీ, భక్తిమయమైన వస్తువూ దీనికి కారణం. పోతన మహాభక్తుడు కావటంవల్ల భక్తులను వర్ణించే సందర్భాల్లో ఆవేశపూరితుడై, మూలంలో లేని అనేక విషయాలను వివరించటం కనిపిస్తుంది. అందువల్ల పోతనభాగవతం వ్యాసభాగవతంకన్న చాలా విస్తృతిని పొందింది. వ్యాసభాగవతాన్ని యథా మూలంగా అనువదించవలెననే ఉద్దేశంతో కొందరు, భగవల్లీలలను వర్ణించి తరించవలెనని మరికొందరు భాగవతాన్ని తెలుగులో సంతరించినారు. అంతేకాని, పోతన భాగవతంకన్న మిన్నగా తాము అనువదిస్తామనే దృష్టితో కాదు. కొందరు భాగవతంలోని ఏకదేశాన్ని అనువదిస్తే మరికొందరు సంపూర్ణంగా అనువదించినారు. కొందరు ద్విపదలో సంతరిస్తే మరికొందరు చంపువులోనూ, మరికొందరు నిర్వచనంగానూ సంతరించినారు. ప్రస్తుత వ్యాసంలో తెలుగులో వెలుగుచూచిన పోతన భాగవతేతర భాగవతాలను పరిశీలిద్దాం.

## ద్విపద భాగవతాలు

### ద్విపద భాగవతము :

మడికి సింగన దీని కర్త. దశమస్కంధ వృత్తాంతం ఇందులో వర్ణింపబడింది. ద్విపదచ్ఛందసులో రచింపబడ్డ భాగవతాల్లో ఇది మొట్టమొదటిది. అంతేకాక, సింగన క్రీ.శ. 1420 కి పూర్వమే దీనిని రచించి ఉండటంవల్ల ఈ ద్విపదభాగవతాన్ని పోతన భాగవతానికి ముందుగానే వెలసిన భాగవతంగా పేర్కొనవచ్చు. ఈ రీతిగా ద్విపదచ్ఛందస్సులో వెలసిన భాగవతాలకేకాక తెలుగులో వెలసిన భాగవతాలకే ఈ గ్రంథం శ్రీకారం చుట్టిందన్నమాట. శ్రీకృష్ణుని లీలలను పండితపామరులందరూ వీనులవిందుగా పాడుకొని

ఆనందించవలెననే భావంతో సింగన సరళమైన ద్విపదలో ఈ భాగవతాన్ని రచించి ఉంటాడు. అంతేకాక. అంతకుముందే వెలసి జనసామాన్యంలోనూ బాగా వ్యాప్తిపొందిన రంగనాథరామాయణ ప్రభావమూ ఈ ద్విపదరచనకు కారణం కావచ్చు. ఇది ఔబళమంత్రి కంచామాత్యునికి అంకితం చేయబడింది. దశమస్కంధపూర్వోత్తర భాగాల్లోని విషయాలు ఇందులో మధురాకాండం, కల్యాణకాండం, జగదభిరక్షాకాండం అనే మూడుకాండల్లో విభజింపబడ్డవి. కంసుడు తన చెల్లెలు దేవకిని, వసుదేవుని రథారూఢులనుచేసి, మంగళనాదాలతో భర్తృగృహానికి తానే సారథియై రథాన్ని నడిపే ఘట్టంతో ప్రారంభమౌతుంది. శ్రీకృష్ణావతార ఘట్టం, శ్రీకృష్ణుని బాల్యం, పూతనాది రాక్షసమథనం మొదలైన అనంతర ఘట్టాలను సింగన మరో కాండంలో వర్ణించి ఉంటాడు. కాని, ఆ భాగం ఖిలమైపోయింది. కళ్యాణ జగదభిరక్షా కాండల్లో ఉత్తరభాగ కథలు వర్ణితాలు. శిశుపాలవధ వృత్తాంతంతో ఈ గ్రంథం సమాప్తమౌతుంది. ఉత్తర భాగంలో చేరిన సాల్వమథనం, దంతవక్త్రి సంహారం, కుచేలోపాఖ్యానం మొదలైన వృత్తాంతాలు వర్ణింపబడ్డ మరో కాండం కూడా సింగన రచించి ఉంటాడు. కాని, ఆ భాగంకూడా మనకు లభ్యం కాలేదు.

పోతన భాగవతంతో భేదించే అంశాలు కొన్ని సింగన భాగవతంలో కనిపిస్తాయి. శ్రీకృష్ణుడు సాందీపుని దగ్గర విద్యాభ్యాసం పూర్తిచేసిన తరువాత గురువును దక్షిణ కోరుమని శ్రీకృష్ణుడే స్వయంగా కోరటం, శ్రీకృష్ణుడు బాణాసురుని బాహువులను తెగనరికినప్పుడు, ఈశ్వరు డాతనికి నాలుగు చేతులు ప్రసాదింపుమని కృష్ణుణ్ణి ప్రార్థించటం మొదలైన అంశాలు ఇందుకు నిదర్శనం.

సింగన రచన దీర్ఘమైన సంస్కృత సమాసాలు లేకుండా, చక్కని దేశీయ పదాలతో కూడి సాధారణులకు కూడా అర్థమయ్యే రీతిలో ఉంటుంది. ఉదాహరణకు: మధురాపురిలో ప్రవేశిస్తున్న శ్రీకృష్ణ బలరాములను చూచి పౌరాంగనలు తమలో తాము మాట్లాడుకునే ఘట్టాన్ని వర్ణించే ఈ ద్విపదలు పరిశీలించండి:

ఈతడే యెలనాగ యిసుమంతనాడు
పూతనపాల్ ద్రావి పొరిగొన్నవాడు

సకియరో ఈతడే శకటియై వచ్చు
ప్రకటదానవు(ద్రుళ్ళిపడ దన్నినాడు.

బాలభాగవతము :

క్రీ. శ. 1540 ప్రాంతానికి చెందిన దోనూః కోనేరునాథ కవి ఈ కృతి కర్త. శ్రీమదహోబల నృసింహస్వామి భక్తుడు. సంస్కృతంలోనూ, తెలుగులోనూ చక్కని కవిత ల్లగల సమర్థుడు, కవిసార్వభౌమ బిరుదాంచితుడు. ఈతడు తొలుత బాలభాగవతమనే పేరుతోనే భాగవత కథను ప్రబంధంగా రచించి వాసిగాంచి, ఆ తరువాత చంద్రగిరి తిరుమలరాజు ప్రేరణతో ఆయన తమ్ముడైన తిమ్మరాజు పేర ఈ ద్విపద బాలభాగవతాన్ని రచించినట్లుగ ఇందలి అవతారికా ద్విపదలు తెలియజేస్తున్నవి. అవతారికారహితంగా ఈ గ్రంథం (నాలుగాశ్వాసాలు మాత్రం) ముద్రింపబడింది అవతారికలో అరవీటి రాజుల వంశ చరిత్ర ఉన్నందువల్ల, నేలటూరి వెంకట రమణయ్యగారు అరవీటి వంశ చరిత్రను తెలుసుకోవటానికి ఇది మంచి ఆధారమని భావించి, దీనిని భారతిలో ప్రకటించినారు. వేదాంత విషయాలను ప్రతిపాదించే సందర్భాల్లో కోనేరునాథుడు విశిష్టాద్వైత సంప్రదాయ సరణినే విశేషంగా అనుసరించినాడు. ధ్రువోపాఖ్యానం, నృసింహావతారం, పురంజనోపాఖ్యానం, దక్షాధ్వర ధ్వంసం మొదలైన ఘట్టాల్లో ఈతని విశిష్టాద్వైత తత్త్వాభినివేశం కనిపిస్తుంది. ఇందులో మొత్తం ఆరాశ్వాసాలు ఉన్నవి. బాలభాగవతానికి, పోతన భాగవతానికి కథా నిర్వహణలో అంతగా భేదం కానరాదు. పెక్కుచోట్ల పోతన భాగవతానుకరణలు చోటుచేసుకొన్నవి.

భాగవతము (దశమస్కంధము) :

పదిహేడో శతాబ్దికి చెందిన రత్నాకరం గోపాలరాజు ఈ కృతికర్త. ఈతడు సకల లక్షణ సారసంగ్రహమనే లక్షణ గ్రంథాన్ని కూడా రచించినాడు. దశమ స్కంధంలోని పూర్వభాగ వృత్తాంతం మాత్రమే ఈ ద్విపద భాగవతంలో వర్ణింపబడింది. రుక్మిణీ వివాహ ప్రస్తావంతో గ్రంథం ప్రారంభమై, కల్యాణంతో సమాప్తి చెందుతుంది. సంస్కృత సమాస భూయిష్ఠమైన శైలిపై

గోపాలకవికి మక్కువ ఎక్కువ. మధురాపురాన్ని వర్ణించే గ్రంథారంభంలోని ఈ క్రింది ద్విపదలను పరిశీలించండి:

"కలధౌత నవహేమకలితవిశాల
నలినారి మండలోన్నత సౌధచయము
తారాపథోన్నత తపనీయతార
సారభాసురరత్న సౌధజాలములు
కమలానివాస సత్కల్యాణవిభవ
రమణీయమందిరా రామభూములును

మహిమల విలసిల్లు మధురాపురంబు."

అముద్రితమైన ఈ గ్రంథం తాళపత్ర ప్రతి తిరుపతి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది.

**భాగవతము (మొదటి నాలుగు స్కంధాలు) :**

టేకుమళ్ళ రంగశాయి రచితమైన ఈ భాగవతం అముద్రితం, దీని ప్రతులు మదరాసు, తిరుపతి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాలలో ఉన్నాయి. గ్రంథరచనలో తనకు పుష్పగిరి తిమ్మన తోడ్పడినట్లుగా రంగశాయి కృత్యవతరణికలో తెలుపుకున్నాడు.

"ఎనలేని వేడ్క మమ్మేలవేల్పటంచు
ననిశంబు గొలుచు విద్యానిధి పుష్ప
గిరి తిమ్మసుకృతి యీ కృతికి సాహాయ్య
పరుడుగా స్కంధముల్ పదియును రెండు."

పై ద్విపదలవల్ల రంగశాయి పన్నెండు స్కంధాలను పూర్తిగా రచించినట్లు చెప్పుకున్నా-ప్రస్తుతం లభ్యమౌతున్నది మొదటి నాలుగాశ్వాసాల భాగం మాత్రమే. నాల్గో స్కంధంకూడా సాంతంకాక పృథుచక్రవర్తిచరిత్ర వరకు

మాత్రమే ఉన్నది. పండిత జనులకు కూడా సంస్కృతం అర్థం కాదనీ, సంస్కృతాంధ్రాలు సరిగా తెలిస్తేనేకాని పద్యకావ్యం సుగమం కాదనీ అందుకే తాను లోకోపకారార్థం ఈ ద్విపద భాగవతరచనకు పూనుకున్నట్లుగా రంగశాయి తన రచనకు గల కారణాన్ని వివరించినాడు.

రంగశాయి పోతన భాగవతాన్ని అనుసరించే ద్విపద రచన సాగించినాడు. ఈ ద్విపద భాగవతం తిరుపతి వేంకటేశ్వరస్వామికి అంకితమైనది.

శ్రీభాగవతము :

వాసిష్ఠ రామాయణం, వేంకటాచలమాహాత్మ్యం మొదలైన గ్రంథాలను రచించిన విద్వత్కవయిత్రీ, పరమభక్తురాలూ ఐన తరిగొండ వెంకమాంబ ఈ ద్విపద భాగవతకర్త్రి. పోతనవలె ఈమె సహజ పాండిత్య శోభితయేకాని గురుముఖంగా విద్యనభ్యసించలేదని శ్రీభాగవతంలోని క్రింది ద్విపద తెలియజేస్తుంది.

"నా చిన్ననాడు నోనామాలు నైన
నాచార్యులెవరు నాకానతీలేదు."

ఒకనాడు మధ్యాహ్నవేళ వేంగమాంబ మోక్షచింతన చేస్తూ ఉండగా విష్ణుమూర్తి కలలో బ్రాహ్మణ రూపంలో కనిపించి, భాగవత తత్త్వాదులను పామరులు తెలియజాలరనీ, అందువల్ల వాటిని సంక్షేపిస్తూ, శ్రీహరి మహత్త్వాన్ని విస్తరిస్తూ భాగవతాన్ని రచించమనీ ఆజ్ఞాపించినాడట. భగవంతుని ఈ పలుకులను మననం చేసుకుంటూ భాగవతాన్ని రచించే శక్తిని తనకు ప్రసాదించవలసిందిగా శ్రీ వేంకటేశ్వరుణ్ణి ప్రార్థిస్తుండగా, స్వామి బాలకృష్ణుని రూపంలో కన్పించి భాగవత గ్రంథాన్ని ఆమెకు సమర్పించి దానిని ద్విపద కావ్యంగా రచించమని సూచించినాడట. పోతన భాగవతాన్ని ఆమూలాగ్రం సమర్థంగా అనుసరించిన కృతి వెంగమాంబ కృతి ఒక్కటేననీ, పోతన భాగవత ప్రతిలోని పాఠాలను గుర్తించడానికి ఈమె ఎంతో ఉపకరిస్తుందనీ పరిశోధకుల అభిప్రాయం. ఈ ద్విపద భాగవతం తరిగొండ నృసింహస్వామికి అంకితం చేయ్య

బడింది. నేటికీ అముద్రితంగానే ఉన్న ఈ భాగవతాన్ని లభించినంతవరకైనా ముద్రించడం ఎంతైనా అవసరం. దీని శిథిలప్రతి తిరుపతి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది.

## చంపూ భాగవతాలు

**బాలభాగవతము :**

బాలభాగవతమనే పేరుతో భాగవతాన్ని ద్విపదగా రచించిన దోనూరి కోనేరునాథుడు ఆ పేరుతోనే భాగవతాన్ని చంపూరూపంలోనూ సంతరించినాడు. వీటిలో చంపూ రచనే ప్రథమరచన. ఇది శ్రీమద్భాగవత సంగ్రహరూపమైన తెనుగుసేత. భాగవతంలోని పన్నెండు స్కంధాల్లోని కథావిషయం ఇందులో ఆరాశ్వాసాలలో చక్కని ప్రబంధశైలిలో వర్ణింపబడింది. ఆరో ఆశ్వాసం చివరి భాగం కొంత లుప్తమైపోయింది. కథావిషయకంగా కోనేరునాథుడు మార్పు లేమీ చేయకపోయినా, తత్వోపదేశ సందర్భాల్లో మాత్రం భక్తిప్రపత్తులు లేకుండా ముక్తి కలుగదనే విశిష్టాద్వైత తత్త్వాన్ని అవకాశం చిక్కినప్పుడల్లా బోధిస్తూ రచన సాగించినాడు. ఇందుకు ప్రహ్లాద చరిత్రలో నృసింహావతార వర్ణన సందర్భంలో రచితమైన సంస్కృత దండకం ఒక ఉదాహరణం. ఇందులో కవి శ్రీ రామానుజ భాష్య పంక్తులను యథాతథంగా ప్రయోగించడం ఆయన విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదన ప్రవణతను సూచిస్తుంది. "సకలక్ష్మా కవినాథయూథములు మెచ్చగా ప్రాకృతాదికభాషామయకావ్యకర్త"గా ప్రసిద్ధి పొందిన కోనేరునాథుని కవితాశైలి ఎట్టిదో పరికించండి:

**హేమంతవర్ణనం :**

శీతవిద్రావితాశేషమందోష్ణాతి
శయసమారూఢయోషాస్తనంబు
పల్లవకాంక్షితప్రౌఢాంగనాపీన
కుచకుంభగాఢోపగూహనంబు

కుటఖండసంభృతోత్కటకరీషానలో
    ద్యద్ధూమసంచాదితాంబరంబు
జానుసంవ్యాజితశాతోదరీకృత
    వ్యాయ స్తదుర్బలవార్ధకంబు
జనవరసీకృతోరుహ సంకితంబు
హవ్యవాటోక్షణసంశ్రితాహస్కరంబు
దీర్ఘ దీర్ఘ విభావరీదీపితంబు
నవ్యహేమంతవేళా సమాగమంబు (V - 126)

**సముద్ర వర్ణన :**

కనియెన్ గృష్ణుండు గాఢాగ్రహఘటిత ముఖ్యాఘాతమాతంగనక్ర
ధ్వని తాంభోధిభ్యదభ్యుద్రవదహిబహుపూత్కార ఘోరానిలోద్య
ద్వనభంగోత్సంగ రంగత్కమఠఝషతిమిగ్రాహ పాఠీనసంచా
లనని రచ్చన్మణి శ్రీలలితవృషత కల్యాణముద్రున్ సముద్రున్.

(1-

**కవుల షష్ఠము :**

నంది మల్లయ, ఘంట సింగనలు రచించిన భాగవతషష్ఠస్కంధమే ఈ గ్రంథం. దీనికి శృంగారషష్ఠమనీ, రాచమల్లువారి కవులషష్ఠమనీ పేర్లు ఉన్నాయి. ప్రస్తుతం మనకీ గ్రంథం లభ్యంకాకపోయినా ఆయా లక్షణకర్తల పుణ్యమా అని మనకిందులోనివి దాదాపు ఇరవై ఏడు పద్యాలైనా లభ్యమౌతున్నందుకు సంతోషించవలె.

**సర్వన భాగవతము :**

(షష్ఠస్కంధము) పదహారో శతాబ్దికి చెందిన మలయమారుతం సర్వన కవి కూడా భాగవత షష్ఠస్కంధాన్ని రచించినట్లు ప్రబంధరత్నావళివల్ల తెలుస్తుంది. సర్వన భాగవతంలోని ఒక్క పద్యం మాత్రమే మనకిప్పుడు లభ్యమౌతుంది.

**హరిభట్టు భాగవతము :**

(షష్ఠైకాదశద్వాదశ స్కంధములు)

మత్స్యవరాహపురాణాది బహుగ్రంథాధారంగా హరిభట్టు భాగవతంలోని షష్ఠైకాదశ ద్వాదశ స్కంధాలను రచించాడు. షష్ఠస్కంధాన్ని జగన్నాథునికీ, ఏకాదశ ద్వాదశ స్కంధాలను హనుమంతునికి అంకితం చేసినాడు. పోతన భాగవతంలో లుప్తమైన భాగాలను పూరించడానికే హరిభట్టు ఈ స్కంధాలను అనువదించి ఉంటాడు, కాని, పోతన భాగవత ప్రతుల్లో ఎక్కువగా ఏర్చూరి సింగన రచించిన షష్ఠస్కంధానికీ, వెలిగందల నారయ రచించిన ఏకాదశ ద్వాదశ స్కంధాలకూ స్థానం లభించింది. పోతన భాగవతాన్ని అద్వైత సిద్ధాంతాను గుణంగా శ్రీధర వ్యాఖ్యననుసరించి వ్రాయగా హరిభట్టు విశిష్టాద్వైత సిద్ధాంతాను గుణంగా పై మూడు స్కంధాలను పూరించినాడు. సింగన, గంగనల రచనలు పోతన రచనవలె అద్వైత వేదాంతానుగుణంగా ఉండడంవల్ల వీటికి అధిక ప్రచారం లభించింది. హరిభట్టు రచన ధారాశుద్ధిశోభితమైనది. అందువలన కొందరు భాగవతాన్ని వ్రాసుకొనేప్పుడు నారయ, గంగనల రచనలకు బదులుగా హరిభట్టు రచనను వ్రాసుకున్నారు. నారయ రచనలో పెక్కుచోట్ల హరిభట్టు రచనో లేక దానిననుసరించిన రచనో కనిపిస్తుంది. హరిభట్టు శైలీ విన్యాసానికి షష్టస్కంధంలోని ఒక్క పద్యాన్ని ఉదాహరిస్తాను:

ఓ రాజీవదళాభిరామనయనా యో సత్యసన్మంగళా
యో రాత్రించరకంఠనాశదశనా యో సర్వలోకాధిపా
యో రత్నాకరమేఖలాపరివృఢా యో భక్తకల్పద్రుమా
యో రాకాహరిణేందురమ్యవదనా యో పద్మనాభామృతా.

**తాండవకృష్ణభాగవతము (దశమస్కంధము):**

ఇది శేషాద్రిశర్మగారు యథామూలంగా అనువదించిన భాగవత దశమ స్కంధం; పలువురు పండితులు తమ భాగవత వ్యాఖ్యానాల్లో వివరించిన విశేషాలను కూడా తమ అనువాదంలో నిబంధించినట్లు శర్మగారు చెప్పుకున్నారు. పదలాలిత్యమూ, ధారాశుద్ధీ కలిగి ఇందలి కవిత కదళీపాక సమ్మితమై, సహృదయరంజకంగా ఉంటుందనడం సహజోక్తి మాత్రమే.

## శ్రీమద్గురుభాగవతము (ఏకాదశ, ద్వాదశ స్కంధములు) :

మిన్నికంటి గురునాథశర్మగారు ఈ భాగవతకర్త. సంస్కృత భాగవతంలో ఏకాదశ, ద్వాదశస్కంధాల్లో కలిసి దాదాపు 1900 శ్లోకాలు ఉండగా ఈ భాగాన్ని అనువదించిన నారయ రచన కేవలం 173 పద్యాల్లో ముగిసింది. అందువల్ల మూలంలోని అనేక విషయాలు నారయ అనువాదంలో పరిహృతమైనాయనే చెప్పవచ్చు. ఈ లోపాన్ని పూర్తిస్తూ శర్మగారు యథామూలంగా ఈ భాగవతాన్ని సంతరించినారు. శర్మగారి పద్యరచన అడుగడుగునా జాతీయమైన పలుకుబడికి ఆకరమై అమాయకమైన భక్త్యావేశాన్ని స్ఫురింపజేస్తుంది.

## భాగవతము (ఏకాదశస్కంధము) :

విద్వత్కవులైన శ్రీ కోవూరి పట్టాభిరామశర్మగారు ఈ భాగవత కర్తలు. యథామూలంగా సాగిన అనువాదాల్లో శర్మగారి అనువాదం ఒకటి. మూలంలో దాదాపు 1200 శ్లోకాలున్న ఏకాదశస్కంధాన్ని శర్మగారు 1035 పద్యాల్లో తెనిగించినారు. ఇందులోని యథామూలానువాదానికి ఒక్క ఉదాహరణం:

మూలం—
న జన్మ యస్య జన్మకర్మాభ్యాం న వర్ణాశ్రమజాతిభిః
సజ్జతే అస్మిన్నహంభావో దేహీ వైస హరేః ప్రియః
శర్మగారి అనువాదం—
జన్మకర్మ వర్ణాశ్రమజాతి సంగ
మెవనికిది నాయది యటంచు నెపుడు గలుగ
దీ తనువు దా ననుచు నెవ్వడెపుడు నెంచ
డతడె భగవత్ప్రియుండు ధన్యాత్ముడవని. (ప. 87)

మూలంలోని ఏకాదశస్కంధ విషయాన్ని యథాతథంగా తెలుసుకోగోరే జిజ్ఞాసువుల కీ గ్రంథం ఎంతో ఉపకరిస్తుంది.

## శ్రీభాగవతం

ఇది శతావధాని సంపన్ముడుంబ సింగరాచార్యులుగారిచే యథామూలంగా అనువదింపబడ్డ భాగవతం. ఇందులో ప్రథమ, ద్వితీయ, పంచమ, దశమ, ఏకాదశ, ద్వాదశ స్కంధాలు మాత్రమే ఉన్నాయి.

**శ్రీకృష్ణభాగవతం :**

ఇది శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు రచించిన సంపూర్ణ భాగవతానువాదం. భక్తిరసం ఉట్టిపడే పోతన భాగవతం ఉండగా శాస్త్రిగారి అనువాదం చర్వితచర్వణమే కదా అనే శంక కలుగవచ్చు. కాని, పోతన భక్తిపారవశ్యంలో అనేక సందర్భాల్లో పెంపులూ, మార్పులూ చేసి అనువదించినాడనే విషయం సర్వవిదితమే. మూలంలో ఉన్నది ఉన్నట్లుగా ఆంధ్రదర్పణంలో ప్రతిబింబింపజేయటం శాస్త్రిగారి కృతిలోని విశిష్టత. ఇంత పెద్ద గ్రంథాన్ని శాస్త్రిగారు నాలుగు నెలల్లోనే పూర్తిచేసినారంటే వారి ప్రతిభావైదుష్యసంపదను మనం ఊహించుకోవచ్చు. వీరి అనువాదం మూలవిధేయంగా సాగినది.

మహావిష్ణువు భూలోకావతరణ సందర్భంలో పోతన పెంచి వ్రాసిన లక్ష్మీదేవి సౌందర్యవర్ణననూ, శృంగార చేష్టావర్ణననూ శాస్త్రిగారు పరిహరించి భక్తిరసానికి మంచి పుష్టిని కలిగించినారు. శాస్త్రిగారి ఈ కృతి అనువాదమే ఐనా ఒక స్వతంత్రకావ్యంగా సహృదయులను అలరింపజేస్తుందనటం సహజోక్తి మాత్రమే.

**భాగవతకథామృతం :**

పన్నెండుస్కంధాల్లోని ప్రధానమైన అంశాలనన్నింటినీ పొందుపరుస్తూ కల్లూరి విశాలాక్షమ్మగారు సంతరించిన సంక్షిప్తభాగవతం ఇది. విశాలాక్షమ్మగారు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి కుమార్తె. వీరు భాగవతాన్నే కాకుండా భారత కథామృతం, శ్రీరామకథామృతం అనే పేర్లతో భారతరామాయణాలను కూడా సంక్షిప్తరూపంలో అనువదించినారు. భారత భాగవత రామాయణాలను మూడింటిని వచనరూపంలోనూ వీరనువదించినారు. భారతీయులందరూ పరమ పవిత్రంగా భావించే ఈ మూడు గ్రంథాలను పద్యంలోనూ, వచనంలోనూ అనువదించిన కీర్తి విశాలాక్షమ్మగారికే దక్కింది. వ్యర్థపదాలు లేకుండా చిన్న చిన్న పదాలతో చక్కని భావాన్ని వ్యక్తంచేయటం వీరి కవితలోని వైశిష్ట్యం.

సంజీవరాయకవి, శ్రీరామనృసింహమూర్తి కవి, కొక్కిరేణి నరసింహరాయకవి మొదలైన కవులు చంపూరూపంలో వెలయించిన భాగవతానువాదాలు కూడా పేర్కొదగ్గవి.

# నిర్వచన భాగవతాలు

## నిర్వచనాంధ్ర భాగవతము :

బులుసు వేంకటేశ్వర్లు ఏతద్భాగవతకర్త. ఇందులో మొదటి ఎనిమిది స్కంధాలు మాత్రమే ఉన్నాయి. వేంకటేశ్వర్లుగారు మూలాన్ని సన్నిహితంగా అనుసరిస్తూ, అవకాశమున్నచోట్ల సంక్షేపిస్తూ, అవసరమని తోచినచోట్ల యథాతథంగా రచన సాగిస్తూ ఈ భాగవతాన్ని నిర్వచనంగా సంతరించినారు. తత్త్వ వేదాంతాది రహస్యాలను చెప్పే సందర్భాల్లో వీరవలంబించిన సంగ్రహీకరణ పద్ధతి ఎంతో యుక్తంగా ఉంది. ఇందలి రచన ధారాశోభితమై, సుబోధకమైన శైలిలో సాగింది.

## శ్రీమద్భాగవతసారామృతము:

ఇది శ్రీ టంకాల సత్యనారాయణగారు నిర్వచనంగా సంతరించిన భాగవత దశమస్కంధ పూర్వభాగం. గ్రంథమంతా సీస పద్యంలో సాగటం, సీసపద్యానుబంధంగా గీత పద్యాన్ని మాత్రమే గ్రహించటం ఇందులోని విశేషం. పోతన భాగవతం, శతఘంటంవారి వచనభాగవతం, వ్యాసభాగవతం, వీటి నన్నింటినీ సమన్వయపరచి అధస్సూచికలలో అనేక నూతన విషయాలను సత్యనారాయణగారు పేర్కొనటం వారి పరిశోధన దృక్పథాన్ని వ్యక్తం చేస్తుంది.

# అచ్చతెలుగు భాగవతాలు

ఇంతవరకూ మనం చెప్పుకున్న భాగవతాలన్నీ తత్సమాది త్రివిధ శబ్ద జాలంతో కూడినట్టివి. సంస్కృత సమశబ్దాలు కాక ప్రాకృతసమ, తద్భవ, దేశ్యాలతో కూడిన అచ్చతెలుగులోనూ భాగవత రచన సాగింది. అల్లంరాజు రామకృష్ణ కవి రచించిన భాగవతం ఈ ప్రక్రియలో ప్రసిద్ధంగా తెలియ వస్తున్న రచన.

ఈ విధంగా భాగవత కథ ద్విపద, చంపువు, నిర్వచనము, అచ్చ తెలుగు, ఏకవృత్తము మొదలైన వివిధ ప్రక్రియలలోనే కాక స్త్రీల పాటలు. యక్షగానాలు, వచనం మొదలైన ప్రక్రియల్లోకూడా వెలసి తన విరాడ్రూపాన్ని ప్రదర్శించుకొన్నది.

(ఆం. ప్ర. ప్రభుత్వ సమాచార, పౌర సంబంధశాఖ వారు ప్రచురించిన 'పోతన'లో ముద్రితమైన వ్యాసం.)

## ఆధార గ్రంథాలు

శ్రీ విష్ణు భాగవతము (1914) కొక్కొండ నరసింహరాయ కవి, పియర్లెస్ ముద్రాశాల

భాగవతము (1923) కోప్పూరి పట్టాభిరామశర్మ

ద్విపద భాగవతము (1950) మడికి సింగన, పరిష్కర్త:- శ్రీవాసిష్ఠ - అ.మహాదేవశాస్త్రి, తంజావూరు సరస్వతీమహల్ ప్రచురణము - 27.

శ్రీ భాగవతము (1937-1938) శతావధాని సంపన్ముడుంబ సింగరాచార్యులు, భారతీముద్రాక్షరశాల, తెనాలి.

భాగవత కథామృతము (1968) కల్లూరి విశాలాక్షమ్మ.

బాలభాగవతము (1954) దోనూరి కోనేరునాథుడు; పరిష్కర్త:- వంగనామాల బాలకృష్ణమూర్తి. తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి.

శ్రీ మద్గురుభాగవతము (1952) మిన్నికంటి గురునాథశర్మ

ఆంధ్ర ద్విపదసాహిత్య చరిత్ర (1979) డా॥ టి. సుశీల

ద్విపద వాఙ్మయము (1967) డా॥ జి. నాగయ్య

సంస్కృత భాగవతము, గీతాప్రెస్, గోరఖ్‌పూర్.

# తెలంగాణా మాండలికంలో

# సమాపకక్రియారూపాలు

కోస్తాప్రాంతం వాడుకలోనూ, న. జి. వాడుకలోనూ కనిపించే వివిధ కాలాలకు సంబంధించిన క్రియాపదాలు దిగువ చూపబడుతున్నాయి. వీటిని పోల్చి చూచినప్పుడు న. జి. వాడుకలో ఉన్న క్రియాపదాల విలక్షణతను స్పష్టంగా గుర్తించవచ్చు.

వర్తమానార్థకాలు :

మహదర్థం.

| | తెలంగాణం | | కోస్తా | |
|---|---|---|---|---|
| | ఏ. వ. | బ. వ. | ఏ. వ. | బ. వ. |
| ప్ర. పు. | వస్తున్నడు<br>వస్తుండు | వస్తున్నరు<br>వస్త్రను | వస్తున్నాడు | వస్తున్నారు |
| మ. పు. | వస్తున్న (వ్) వు<br>వస్తున్న | వస్తున్నరు<br>వస్తున్నం | వస్తున్నా (వ్)<br>వస్తున్నా | వస్తున్నారు<br>వస్తున్నాం |

అమహదర్థం :

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. పు. | వస్తున్నది<br>వస్తుంది | వస్తున్నయ్ | వస్తుంది | వస్తున్నాయి |

వర్తమానార్థక క్రియారూపాల్లో ధాతువుపై చేరిన ఉన్నాను బంధంలోని దీర్ఘం హ్రస్వం కావడం తెలంగాణా వాడుకలో ప్రధానంగా కానవచ్చే లక్షణం. వస్తున్నాడు మొదలైన ఉన్నానుబంధం దీర్ఘాంతంగా ఉన్న రూపాలుకూడా తెలంగాణా వాడుకలో లేకపోలేదు. ఐతే వాటికి కొన్ని నియమితమైన అర్థ విశేషాల్లో మాత్రమే ప్రయోగం కనిపిస్తుంది.

వస్తున్నాడు। ఆయన సంగతి చెప్త.

పోతున్నాడు। ఆయనకేం గతి పడ్తదో చూస్త.

పై వాక్యాల్లోని వచ్చెవాడు, పోయినాడు అనే క్రియాపదాల్లో నకారంమీది ఆకారాన్ని కాకుస్వరంతో ఉచ్చరించడంవల్ల సంభావనార్థంతోపాటు కర్తకు అయా క్రియల విషయంలోకల అనిష్టత కూడా వ్యక్తమౌతుంది.

వర్తమానార్థంలో మహత్ ప్ర. పు. ఏకవచనంలో వస్తుండు, బహువచనంలో వస్తున్రు అనే రూపాలు తెలంగాణాలో వాడుకలో ఉన్నాయి. ఈ రూపాల్లో ఉన్నానుబంధంలోని నకార ద్విత్వమూ, ఆకారమూ లోపించడం ఈ రూపాల్లో జరిగిన పరిణామం.

వస్తు + న్న + ఆడు > వస్తు + న్న్ + ఆడు > వస్తున్ + డు = వస్తుండు
వస్తు + న్న + ఆరు > వస్తు + న్న్ + ఆరు > వస్తున్ + రు = వస్తున్రు

కోస్తావాడుకలోని 'వస్తుంది'లో జరిగిన అకారలోపపరిణామమే తెలంగాణా వాడుకలోని 'వస్తుండు', 'వస్తున్రు' రూపాల్లో కూడా జరిగింది. ఉండు ధాతువుకు వర్తమానార్థంలో ప్ర. పు. ఏకవచనంలో ఉంది (ఉన్నాడు అని అర్థం) అనే రూపం కూడా ఈ విధంగా ఏర్పడ్డదే.

వర్తమానార్థక అమహదర్థక క్రియల్లో ప్ర. పు. ఏకవచనంలో వస్తున్నది, వస్తుంది అనే రెండు రూపాలకూ వాడుక ఉన్నా 'వస్తున్నది'కే ఎక్కువ వాడుక. కోస్తా ప్రాంతంలో 'వస్తుంది'కి తప్ప 'వస్తున్నది'కి వాడుక లేదు. వస్తుంది అనే రూపం తద్ధర్మ, భవిష్యదర్థాల్లో కూడా వాడబడుతుంది.

కాకువు వల్ల అర్థవిశేషం సూచింపబడుతున్నప్పుడు అమహదర్థంలోనూ దీర్ఘాంతమైన ఉన్నానుబంధరూపాలకు వాడుక ఉన్నది.

వస్తున్నాది। వస్తున్నాయి।

**భూతార్థకక్రియలు :**

మహదర్థం

| | తెలంగాణం | | కోస్తా | |
|---|---|---|---|---|
| | ఏ.వ. | బ.వ. | ఏ.వ. | బ.వ. |
| ప్ర. పు. | వచ్చిండు | వచ్చిన్రు | వచ్చాడు | వచ్చారు |
| | వచ్చినాడు | వచ్చినారు | | |
| | వచ్చె | వచ్చిరి | | |

| | | | | |
|---|---|---|---|---|
| మ. పు. | వచ్చినవ్<br>వచ్చినావు<br>వస్తివి | వచ్చిన్రు<br>వచ్చినారు<br>వస్తిరి | వచ్చావు | వచ్చారు |
| ఉ. పు. | వచ్చిన<br>వచ్చినాను<br>వస్తి | వచ్చినం<br>వచ్చినాం<br>వస్తిమి | వచ్చాను | వచ్చాం |

అమహదర్థం

| | | | |
|---|---|---|---|
| వచ్చింది<br>వచ్చె | వచ్చినయ్<br>వచ్చినాయ్<br>వచ్చినాయి | వచ్చింది | వచ్చాయి |

భూతార్థక మహత్ప్రథమ పురుషైక వచనంలో కోస్తా జిల్లా వాడుకలో ఉన్న 'వచ్చాడు' అనే రూపమూ, తెలంగాణా వాడుకలో ఉన్న 'వచ్చిండు' అనే రూపమూ 'వచ్చినాడు' అనే రూపం నుండి ఏర్పడ్డవే. తెలంగాణా వాడుకలో వచ్చినాడు వచ్చినడుగా మారి, నకారం మీది ఆకారం లోపించి 'వచ్చిండు' అనే రూపం ఏర్పడితే కోస్తా వాడుకలో వచ్చినాడులో నకారం లోపించి 'వచ్చాడు' ఏర్పడింది.

వచ్చి + న్ + ఆడు > వచ్చి + న్ + అడు > వచ్చి + న్ + డు = వచ్చిండు

వచ్చి + న్ + ఆడు > వచ్చి + ఆడు = వచ్చాడు

'వచ్చినది'లో నకారం మీది అకారం లోపించి 'వచ్చింది' ఐనట్లుగానే 'వచ్చి నడు'లో అకారం లోపించి 'వచ్చిండు' ఐనదన్నమాట.

భూతార్థక మహత్క్రియ లన్నింటిలోనూ కోస్తా ప్రాంత వ్యవహారంలో నకారం లోపించడం, తెలంగాణా వ్యవహారంలో లోపించక పోవడం కని పిస్తుంది. నకారం లోపించకపోవడమేకాక ప్ర. పు.లో నకారం మీది ఆకారం లోపించడం, మధ్యమ పురుషలోనూ (బహువచనం తప్ప) ఉత్తమ పురుష లోనూ నకారం మీది దీర్ఘం హ్రస్వం కావడం తెలంగాణా వ్యవహారంలో కనబడే విలక్షణతలు. వచ్చినాడు, వచ్చినారు మొదలైన భూతార్థక మహద్రూపాలు అన్ని పురుషల్లోనూ తెలంగాణా వ్యవహారంలో కనిపిస్తాయి. కాకువుచే అర్థ విశేషం సూచింపబడినప్పుడు వీటి వాడుక ఎక్కువగా కన్పిస్తుంది.

అట్లాగే కోస్తా ప్రాంతం వ్యవహారంలో లేని వచ్చె, వచ్చిరి, వస్తివి, వస్తిరి, వస్తిని, వస్తిమి అనే భూతార్థకక్రియలు కూడా తెలంగాణ వ్యవహారంలో ఉన్నాయి. ఐతే, వీటికి అర్థ విశేషాల్లో ప్రయోగం ఉండడం గమనించదగ్గ అంశం.

క్త్వార్థంపై ఉండు ధాతువు భూతార్థక రూపాలు చేరి ఏర్పడిన భూతార్థక రూపాలు తెలంగాణా వ్యవహారంలో కనిపిస్తాయి. ఈ రూపాల్లో పర్యాయంగా పూర్వరూప సంధి, నకారాగమం రావడం గమనించవలసిన అంశాలు.

వచ్చిండె (వచ్చి+ఉండె) (వచ్చిండిరి) (వచ్చి ఉండిరి)
వచ్చినుండె (వచ్చి + ఉండె) వచ్చిండిరి (వచ్చి ఉండిరి)

శత్రర్థకంపై ఉండె, ఉండిరి మొదలైన ఉండు ధాతువు భూతార్థక రూపాలు చేరి ఏర్పడిన చేస్తుండె, చేస్తుండిరి మొ॥ రూపాలు చేస్తూ ఉండినాడు, చేస్తూ ఉండినారు మొదలైన అర్థాలతోపాటు చేసి ఉండేవాడు, చేసి ఉండేవారు మొదలైన అర్థాల్లో కూడా ప్రయోగింపబడటం తెలంగాణంలో కనిపిస్తుంది.

1. నువ్వు ముందు అడిగింటె ఆయన ఉద్యోగం ఇప్పిస్తుండె (ఇప్పించి ఉండే వాడు)
2. ముందు చెప్పింటె ఆ పని నేను చేస్తుంటి (చేసి ఉండేవాణ్ణి)
3. బాగా చదివింటె ఫస్టు క్లాసుల వస్తుంటివి (వచ్చి ఉండేవాడివి)

నుజ్యంతమైన ధాతువుపై 'వచ్చు' అనే తద్ధర్మార్థక క్రియారూపం చేరి ఏర్పడ్డ చెయ్యొచ్చు, పోవచ్చు, రాయొచ్చు మొదలైన రూపాలకు అనుమత్యాద్యర్థాలోనేకాక చేసి ఉంటాడు/చేసి ఉంటుంది మొదలైన భూతార్థాల్లో కూడా వాడుక కనిపిసుంది.

1. ఆయన ఇప్పటికి పది పుస్తకాలు రాయొచ్చు.
(ఆయన ఇప్పటికి పది పుస్తకాలు రాసి ఉంటాడు.)
2. ఆయన ఇప్పటికి కోట్లు సంపాదించొచ్చు.
(ఆయన ఇప్పటికి కోట్లు సంపాదించి ఉంటాడు)

## సంభావనార్థకాలు :

నుజ్యంత క్రియారూపంపై 'కల' అనుబంధంచేరి రాగలడు మొ॥ సంభావనార్థకాలు ఏర్పడడం ఆంధ్రదేశం అన్ని ప్రాంతాల్లో ఉన్నా, న. జి. వ్యవహారంలో ప్రథమపురుషైకవచనప్రత్యయం లోపించడం విశేషం.

వాడు రాగల, వాడు తినగల, వాడు కొట్టగల

వీటికి క్రమంగా వాడు వస్తాడేమొ, వాడు తింటాడేమొ, వాడు కొడతాడేమొ అనే సంభావనార్థం ఉంది.

ఈ రూపాల్లో 'గ' కారం మీది అకారం దీర్ఘంగా మారిన రూపాలు కూడా వాడుకలో ఉన్నాయి. తినగాల, రాగాల మొ॥

ఈ అర్థంలో నుజ్యంతంపై 'దిక్క' అనే పదం చేరిన రూపాలు కూడా తెలంగాణా వాడుకలో కనిపిస్తాయి.

ఉదా : రాదిక్క, పోదిక్క, కొట్టదిక్క, పడదిక్క మొ॥

## భవిష్యదర్థకక్రియలు/తద్ధర్మార్థకక్రియలు

## మహదర్థం :

| | తెలంగాణం | | కోస్తా | |
|---|---|---|---|---|
| | ఏ.వ. | బ.వ. | ఏ.వ. | బ.వ. |
| ఎ) | | | | |
| ప్ర. పు. | వస్తడు<br>వస్తాడు | వస్తరు<br>వస్తారు | వస్తాడు | వస్తారు |
| మ. పు. | వస్తవు<br>వస్తావు | వస్తరు<br>వస్తారు | వస్తావు | వస్తారు |
| ఉ. పు. | వస్త/వస్తను<br>వస్తాను | వస్తం | వస్తా/వస్తాను | వస్తాం |
| బి) | | | | |
| ప్ర. పు. | వచ్చు | వద్దురు | | |
| | వద్దువు | వద్దురు | వద్దువు | వద్దురు |
| | వద్దు/వద్దును | వద్దుం | | |

అమహదర్థం :

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. పు. | వస్తది | | వసుంది | వసాయ్ |
| | వస్తాది | సయ్ | | |
| ఉ.పు. | — | | | |
| | వచ్చు | వచ్చు | | |

వాడుక తెలుగులో భవిష్యదర్థాన్ని తెలియచేసే క్రియలు లేవు. తద్ధర్మార్థక క్రియలే భవిష్యదర్థంలోనూ వాడబడతాయి. కోస్తా భాషలో ధాతువు మీద 'తా' ప్రత్యయంచేరి ఈ క్రియారూపాలు ఏర్పడతాయి. తెలంగాణా వాడుకలో 'తా' లోని దీర్ఘం హ్రస్వమౌతుంది. ఉదా:- వస్తాడు-వస్తడు మొ॥ ఈ మార్పు తెలంగాణమంతటా కనిపిస్తుంది. తెలంగాణాలో వస్తాడు మొ॥ హ్రస్వం రాని రూపాలకు కూడా కాకువుచే అర్థవిశేషం సూచితమైనప్పుడు ప్రయోగం ఉంది.

పై వాటిలో అమహదర్థక ప్ర. పు. ఏకవచన రూపమైన 'వస్తుంది' అనే రూపంలో 'తు'లోని ఉకారం తెలంగాణా వ్యవహారంలో అకారంగా మారినప్పుడు బిందువు లోపించడం గమనించాలి.

వస్తుంది వస్తంది వస్తది

పైన 'బి' భాగంలో చూపబడిన క్రియలు తద్ధర్మక క్రియలే ఐనా వాటికి తెలంగాణాలో తద్ధర్మార్థంలోకాక ల్రుజర్థంలో వాడుక ఉండడం గమనించదగ్గ అంశం.

1. నిన్ననే చెప్పింటె ఆయన ఇవ్వాళ వచ్చు.
   (నిన్ననే చెప్పి ఉంటే ఆయన ఇవ్వాళ వచ్చి ఉండేవాడు)
2. ముందే చెప్పింటె వాండ్లు రేపొద్దురు కద?
   (ముందే చెప్పి ఉంటే వాళ్ళు రేపు వచ్చేవాళ్ళు కదా!)
3. నిన్ననే చెప్పింటె ఇవ్వాళ పోదు.
   (నిన్ననే చెప్పింతే ఇవ్వాళ పోయ్యేవాణ్ణి.)
4. ముందు చెప్పింటె రేపొద్దు.
   (ముందు చెప్పి ఉంటే రేపు వచ్చేవాణ్ణి)

లృజర్థంలో పై విధంగా తద్ధర్మార్థక క్రియలే కాక వస్తుండె, వస్తుండిరి మొదలైన రూపాలు కూడా వాడుకలో ఉన్నాయి.

నిన్ననే చెప్పింటె ఆయన ఇవ్వాళ వస్తుండె.

ముందే చెప్పింటె వాండ్లు ఇవ్వాళ వస్తుండిరి. మొ॥

**విధ్యర్థకాలు :**

ధాతువుపై 'అలి' అనే రూపం చేరి ఏర్పడిన విధ్యర్థక రూపాలు కోస్తా జిల్లా వాడుకలో కనిపిస్తే, తెలంగాణా వాడుకలో 'అలె' అనేది చేరిన రూపాలు కనిపిస్తాయి. ఈ రెండూ 'వలయును' అనే ప్రాచీన విధ్యర్థక రూపానికి వికృతి రూపాలే.

| కోస్తా | తెలంగాణం |
|---|---|
| చదవాలి | చదువాలె |
| రాయాలి | రాయాలె |
| పోవాలి | పోవాలె |
| రావాలి | రావాలె |

చదువు మొదలైన మూడక్షరాల ధాతురూపాల్లో చివరి అక్షరంలో ఇకారేతర అచ్చు ఉన్నప్పుడు మధ్యాక్షరంలోని ఉకారం కోస్తా వ్యవహారంలో ఆకారంగా మారుతుంది. తెలంగాణాలో మాత్రం ఉకారంగానే ఉంటుంది.

| కోస్తా | న.జి. |
|---|---|
| చదవాలి | చదువాలె |
| చదవక | చదువక |
| చదవడం | చదువడం |

**ఆజ్ఞాద్యర్థకాలు :**

ఆంధ్రదేశం అన్ని ప్రాంతాల్లోనూ ఆజ్ఞాద్యర్థకాలు ఒకే రూపంలో ప్రయోగింపబడుతున్నా తెచ్చు,వచ్చు, పోవు మొ॥ ధాతువుల మధ్యమపురుష బహువచనరూపాల్లో మాత్రం తెలంగాణా వ్యవహారంలో కొంతభేదం కనిపిస్తుంది.

| కోస్తా | న.జి. |
| --- | --- |
| తెండి | తేండి/తెండి |
| రండి | రాండి/రండి |
| పొండి | పోండి/పొండి |
| లెండి | లేండి/లెండి |

కోస్తా వాడుకలోని రూపాల్లో ధాతురూపం హ్రస్వాంతంగా ఉంటే తెలంగాణావాడుకలో దీర్ఘాంతంగానూ, హ్రస్వాంతంగానూ ఉంటుంది.

## వ్యాపారసాతత్యబోధకక్రియలు:

ఆదే పనిగా అవిచ్ఛిన్నంగా జరిగే వ్యాపారాన్ని తెలిపే క్రియలను వ్యాపారసాతత్యబోధక క్రియలు అని వ్యవహరించవచ్చు. తెలంగాణా భాషలో నుజ్యంత క్రియపై 'పట్టు' అనే అనుబంధ క్రియ చేరిన రూపాలూ, శత్రర్థకంపై 'చేరు' అనే అనుబంధం చేరిన రూపాలూ వాడుకలో ఉన్నాయి.

పట్టు : చెప్పబట్టె, చేయబట్టె, రాయబట్టె మొ॥
చేరు : తినుకుంట జేరిండు, రాసుకుంట జేరిండు, చేసుకుంట జేరిండు మొ॥

## సామర్థ్యబోధకక్రియలు :

అన్ని ప్రాంతాల వాడుకలోనూ సామర్థ్యార్థంలో ధాతువుపై 'కలుగు' అనే క్రియతో పాటు 'చాలు' అనే అనుబంధక్రియ కూడా చేరుతుంది. ఐతే తక్కిన ప్రాంతాల్లో 'చాలు' అనేది వ్యతిరేక క్రియల్లో మాత్రమే చేరుతుంది. ఉదా: చేయజాలడు, రాయజాలడు మొ॥ కాని తెలంగాణా వాడుకలో వ్యతిరేకార్థం లేని సందర్భంలో కూడా 'చాలు' అనుబంధక్రియ చేరుతుంది.

ఉదా : చేయజాల్తడు, రాయజాల్తడు, పోజాల్తడు.

## క్రియాతిపత్తిక్రియలు :

చదువాల్సి ఉండింది, తినాల్సి ఉండింది మొదలైన అర్థాల్లో నుజ్యంత క్రియలపై ఉండుధాతువు భూతార్థక రూపాలు అనుబంధంగా చేరిన రూపాలు తెలంగాణా వాడుకలో కనిపిస్తాయి.

| | |
|---|---|
| చదువనుండె | చదువనుండిరి |
| చదువనుంటివి | చదువనుంటిరి |
| చదువనుంటి(ని) | చదువనుంటిమి |

ఈ అర్థంలో చదివేదుండె, రాసేదుండె మొదలైన క్రియా రూపాలు కూడా వాడుకలో ఉన్నాయి. ఐతే, ఇవి పురుష వచన భేదాన్ని బట్టి మార్పు పొందక అన్ని పురుషరూపాల్లో ఒకేవిధంగా ప్రయోగింపబడతాయి.

సుదూర భూతార్థాన్ని తెలియజేయడానికి క్త్వార్థంపై ఉండు ధాతువు భూతార్థకరూపం అనుబంధంగాను, నకారం ఆగమం వైకల్పికంగానూ చేరుతుంది. నకారాగమం రాని పక్షంలో పూర్వరూప సంధి రావడం ఈ రూపాల్లోని విలక్షణత.

నకారాగమం :

| | |
|---|---|
| చదివినుండె | చదివినుండిరి |
| చదివినుంటివి | చదివినుంటిరి |
| చదివినుంటి(ని) | చదివినుంటిమి |

పూర్వరూపసంధి :

| | |
|---|---|
| చదివిండె (చదివి ఉండె) | చదివిండిరి (చదివి ఉండిరి) |
| చదివింటివి (చదివి ఉంటివి) | చదివింటిరి (చదివి ఉంటిరి) |
| చదివింటిని (చదివి ఉంటిని) | చదివింటిమి (చదివి ఉంటిమి) |

వీటి అర్థంలో చదివిండు, చదివె మొదలైన రూపాలు కూడా వాడుకలో ఉన్నాయి.

## వ్యతిరేకార్థకక్రియలు

వర్తమానక్రియలు :

మహదర్థం

| | తెలంగాణం | | కోస్తా | |
|---|---|---|---|---|
| | ఏ.వ. | బ..వ. | ఏ.వ. | బ.వ. |
| ప్ర. పు. | వస్తలేడు | వస్తలేరు | రావడంలేదు | రావడంలేదు |
| మ. పు. | వస్తలేవు | వస్తలేరు | | |
| ఉ. పు. | వస్తలే(న్)ను | వస్తలేం | | |

**అమహదర్థం :**

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. పు. | వస్తలేదు | వస్తలేవు | రావడంలేదు | రావడంలేదు |
| మ. పు. | వస్తలేవు | వస్తలేరు | ,, | ,, |
| ఉ. పు. | వస్తలే(న్)ను | వస్తలే(ం)ము | ,, | ,, |

కోస్తా వ్యవహారంలో వ్యతిరేక వర్తమానక్రియలు భావార్థక కృదంత రూపాలపై లేదు/లేడు మొ॥ చేర్చడంవల్ల ఏర్పడితే, తెలంగాణా వాడుకలో శత్రంత ధాతురూపాలపై లేదు/లేడు మొ॥ చేర్చడంవల్ల ఏర్పడుతాయి. తెలంగాణా వ్యవహారంలో వర్తమాన క్రియారూపానికి సమాన రీతిలో వ్యతిరేక క్రియారూపం ఉండడం గమనించదగ్గ అంశం.

వస్తున్నాడు (వస్తు ఉన్నాడు) - వస్తలేడు (వస్తు లేడు)
తింటున్నాడు (తింటు ఉన్నాడు) - తింటలేడు (తింటు లేడు)

**భూతక్రియలు :**

వ్యతిరేక భూతార్థంలో సాధారణంగా అన్ని ప్రాంతాల్లోనూ ధాతువుకు 'లే' అనేది అనుప్రయుక్తమౌతుంది.

ఉదా :- రాలేదు, చదువలేదు, తినలేదు మొ॥ అన్ని పురుషల్లోనూ, అన్ని వచనాల్లోనూ ఈ రూపం ఒకే రూపంలో ఉంటుంది.

తెలంగాణంలో వ్యతిరేక తద్ధర్మక్రియపై అగు ధాతువు భూతార్థక క్రియా, వ్యతిరేకక్త్వార్థకక్రియపై 'పోవు' ధాతువు భూతార్థక క్రియా అనుబంధాలుగా చేరి వ్యతిరేకభూతార్థకరూపాలుగా ఏర్పడడం కూడా కనిపిస్తుంది.

| | ఏ.వ. | బ.వ. |
|---|---|---|
| 1. | చెప్పకపోయె | చెప్పకపోయిరి |
| 2. | చెప్పడాయె/చెప్పదాయె | చెప్పరైరి/చెప్పరాయె మొ॥ |

పై భూతకాలిక క్రియలు కేవలం వ్యతిరేకార్థాన్నే కాక అర్థవిశేషాన్ని కూడా సూచిస్తున్నాయి. ఎదురుచూస్తున్న క్రియావ్యాపారం జరుగనప్పుడే ఈ రకమైన క్రియారూపాలకు ప్రయోగం కనిపిస్తుంది. ప్రాచీనమైన ఈ క్రియారూపాలకు నేటి వ్యవహారంలో అర్థభేదం కలిగిందన్నమాట. భారతంలో ఈ విధమైన క్రియారూపాలు ఎన్నో ఉన్నాయి.

నల్ల లేదయ్యేనేని (1-2-32)
ఏల బోధింపవైతివి (1-2-159)
దంష్ట్రలు నాటవయ్యె (1-3-13)
నమ్మనేరనయ్యెద (1-4-30)

2. వ్యతిరేక తద్ధర్మార్థాన్ని, వ్యతిరేక భవిష్యదర్థాన్ని తెలియజేసే ఉత్తమపురుష క్రియల్లో ఉత్తమపురుష ప్రత్యయమైన 'ను' వర్ణకం తెలంగాణా వ్యవహారంలో నిలుస్తుంది. ఉదా:- చదవను, తినను, వెళ్ళను, రాయను మొ॥ కాని, తెలంగాణా వాడుకలో 'ను' వర్ణక రూపాలతో పాటును వర్ణకం లోపించిన రూపాలు కూడా ఉన్నాయి.

ఉదా :- చదువను/చదువ తినను/తిన
వెళ్ళను/వెళ్ళ రాయను/రాయ

3. సుదూరభూతార్థాన్ని తెలియజేయడానికి క్త్వార్థం మీద ఉండు ధాతువు భూతార్థక క్రియారూపాలు చేరి చదివిండె, చదివింటివి, చదివింటి (ని) మొదలైన రూపాలు ఏర్పడతాయని ముందు తెలుసుకున్నాం. వీటి వ్యతిరేకార్థక క్రియలు కూడా ఇదే రీతిలో, అంటే వ్యతిరేకార్థక క్రియమీద ఉండు ధాతువు భూతార్థక క్రియారూపాలు చేరి ఏర్పడతాయి.

చదువకుండె (చదువక ఉండె)
చదువకుంటివి (చదువక ఉంటివి)
చదువకుంటిని (చదువక ఉంటిని)
ఉదా:- నువ్వు బాగ చదువకుంటివి. అందుకే మంచి మార్కులు రాలేదు.

('పేర్వారం సాహితీ నీరాజనం' (1995) లో ప్రచురితమైన వ్యాసం.)

# సంస్కృత సాహిత్యంలో స్మృతికవిత్వం

మృత్యువుచే విడదీయబడ్డ వ్యక్తుల గాఢమైన అనుబంధాన్ని వ్యక్తం చేయడమే స్మృతిరచనల ఉద్దేశం. వీటిని ఆంగ్లంలో Elegies అంటాం. సంసార చక్రంలో మృత్యువు అంతిమ ఘట్టం. మృత్యువు ఎవరికైనా అపరిహార్యమనే విషయం తెలిసినా అది కలిగించే దుఃఖం అపారమైంది. ఆప్తులైన వారి తాత్కాలిక విరహాన్ని ఒక్కొక్కపుడు దుర్భరంగా భావిస్తాం. అటువంటపుడు ఎంతో అనుబంధం పెంచుకున్నవాళ్ళు తమనుండి హఠాత్తుగా శాశ్వతంగా దూరమైనపుడు ఆ దుఃఖానికి అవధులుండవనే చెప్పవచ్చు. వాళ్ళకు లోకమంతా శూన్యంగానే కనిపిస్తుంది. భార్య చనిపోయిన ఒక కర్షకుని స్థితిని ఒక ప్రాకృత కవి ఇలా వర్ణిస్తాడు.

నిష్కర్మణోఽపి క్షేత్రాత్ పామరో నైవ వ్రజతి వసతిమ్
మృతప్రియజాయా శూన్యీకృత గేహదుఃఖం పరిహరన్.

(ఒకానొక కర్షకుడు పొలానికి వెళ్ళి, అక్కడ పనిలేకున్నా తన కత్యంత ఆప్తురాలైన భార్య మరణించడంవల్ల శూన్యంగా ఉన్న ఇంటికి రావడమే లేదట.)

లోకంలో ఎన్నోరకాల దుఃఖాలున్నా మరణం వల్ల కలిగే దుఃఖం ఇతర దుఃఖాలకన్నా ఎంతో తీవ్రమైంది. ఈ మరణ జన్యమైన దుఃఖం రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి మహాత్ములు మరణించినపుడు పొందే దుఃఖం. ఇది సమష్టిలో భాగం. ఈ దుఃఖం త్వరలోనే ఓదార్పు పొందుతుంది. ఇక రెండోది రక్తసంబంధం కల ఆప్తబంధువులు మరణించినపుడు కలిగే దుఃఖం. ఇది వైయక్తిక జీవితానికి సంబంధించింది. ఈ దుఃఖం త్వరలో ఓదార్పు పొందేది కాదు. కొన్ని యేండ్ల తరవాత కూడా జ్ఞాపకం వచ్చినప్పుడు హృదయాన్ని శల్యంలాగా బాధిస్తూనే ఉంటుంది. మృతునితో ఉండే అనుబంధపు గాఢతను బట్టి ఈ దుఃఖం యొక్క తీవ్రత ఉంటుంది. అంతేకాక ఆయా వ్యక్తుల సంవేదనాశీలాన్ని బట్టికూడా దుఃఖతీవ్రత వాళ్ళల్లో చోటుచేసుకునే ఉంటుంది.

సమష్టిలో భాగమైన దుఃఖం, వైయక్తిక జీవితానికి సంబంధించిన దుఃఖం - ఈ రెండు స్మృతి రచనల్లో వస్తువు కావచ్చు.

ప్రాచీన సంస్కృత వాఙ్మయంలో లభిస్తున్న స్వతంత్ర స్మృతి కావ్యం ఒక్కటే ఐనా - స్మృతి కవితకు మాత్రం కొదువలేదు. సంస్కృతంలో అతి ప్రాచీనమైన ఋగ్వేదంలో మనకు మొట్టమొదటి స్మృతి గీతం కనిపిస్తుంది. ఒక వీరుడు మరణించినప్పుడు అతని అనుచరులు అతని మరణం నుండి ప్రేరణ పొందుతూ అంత్యక్రియలు చేస్తున్న సందర్భంలో ఈ స్తుతిగీతం రచింపబడింది. ఆ స్తుతిగీతం ఇది:

ధనుర్హస్తాదాదదానో మృతస్యాస్మే క్షత్రాయ వర్చసే బలియ
అత్రైవ త్వమిహ వయం సువీరా విశ్వాః స్పృధో అభిమాతీర్జయేమ
ఉపసర్ప మాతరం భూమిమేతాం ఉరువ్యచసీం పృథివీం సుశేవామ్
ఊర్ణమ్రదా యువతిర్దక్షిణోవత ఏషా త్వా పాతు నిర్ఋతే రుపస్థాత్
ఉచ్ఛ్వంచస్వ పృథివి! మా నిబాధథాః సూపాయనాస్మై భవసూపవంచనా
మాతా పుత్రం యథా సిచాభ్యేనం భూమ ఊర్ణుహి
(దశమమండలం 18 సూ. 9, 10, 11)

దీనికి సుప్రసన్నగారు చేసిన అనువాదం:

వర్చస్సుకోసం బలంకోసం శక్తికోసం
ఈ మృతవీరుని హస్తంనుంచి ధనుస్సును గ్రహిస్తున్నాం
మీరు, మేమూ - మనం విశ్వమంతా నిండిన
వైరిచక్రాన్ని అతిక్రమిస్తాం
ఇతన్ని మాతృభూమి ఒడిలోకి
అధిక వర్చస్సును ప్రసరింపజేసేందుకు చేరుస్తున్నాం.
పృథివీ! ఇతన్ని బలంగా నొక్కకు
ఊపిరి పీల్చుకుని
సులభంగా సుకుమారంగా ప్రవేశించనీ
అవనీ! తల్లి బిడ్డను పొత్తిళ్ళలో
ఒదిగినట్లు ఒదిగించుకో.

ఈ స్మృతిగీతంలో అంతగా దుఃఖవ్యక్తీకరణ లేకపోయినా మరణ సందర్భంలో వీరుల నోట వచ్చిన గీతం కనుక దీన్ని స్మృతి గీతంగానే భావించవచ్చు.

లౌకిక సంస్కృత వాఙ్మయంలో వాల్మీకి రామాయణం ఆది కావ్యం. ఈ కావ్యంలో పెక్కు చోట్ల మనకు స్మృతి రచన కనిపిస్తుంది. రామాయణ కావ్యావిర్భావమే స్మృతి గీతంతో జరిగిందంటే అతిశయోక్తి కాదు. తమసా నదీ తీరంలో ఆనంద మగ్నమైన క్రౌంచపక్షుల్లో కామ మోహితమై ఉన్న ఒక మగపక్షిని బోయవాడు చంపడం చూచిన వాల్మీకి శోకపూరిత హృదయుడై చెప్పిన-

"మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః
యత్ క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్"

అన్న శ్లోకాన్ని స్మృతి గీతంగా భావించవచ్చు. ఒక తిర్యగ్జాతికి చెందిన పక్షి మరణాన్ని చూచి మహర్షి పొందిన మనః క్షోభ ఇందులో వ్యక్తమౌతుంది. తిర్యగ్జాతికి సంబంధించిన పక్షి మరణానికే ఒక హృదయం శోకంతో అట్లా స్పందిస్తే- అత్యంత గాఢమైన అనుబంధం ఉన్న ఆప్తుల మరణం వల్ల మనస్సు ఎట్లా వికలమౌతుందో మనం ఊహించుకోవచ్చు. భర్త మరణం వల్ల భార్యకు, భార్య మరణం వల్ల భర్తకు, కుమారుని లేక కుమార్తె మరణంవల్ల తల్లిదండ్రులకు, తల్లిదండ్రుల మరణంవల్ల సంతానానికి- ఇలా అతి సన్నిహితుల మరణం హృదయాన్ని కలచి వేస్తుంది.

లోకంలో మనం అందరికన్నా ఎక్కువగా ఇష్టపడే వ్యక్తి కుమారుడు. 'పుత్రః ప్రియాణామధికః' అని భారతం (విరాట.) కుమారుడే తల్లిదండ్రులకు హృదయం. 'పుత్రో హి హృదయం' అని కృష్ణయజుర్వేద బ్రాహ్మణం. అలాంటి పుత్రమరణంవల్ల కలిగే దుఃఖం దుర్భరంగా ఉంటుంది. దశరథుడు తెలియకుండా వృద్ధమునిదంపతుల కుమారుడైన శ్రవణ కుమారుణ్ణి చంపుతాడు. అప్పుడా వృద్ధముని మరణించిన తన ఏకైక కుమారుణ్ణి స్మరించుకుంటూ కుమిలిపోతాడు. రామాయణంలో వా

ఈ ఘట్టాన్ని ఎంతో చక్కగా చిత్రించినాడు. మరణించినవాళ్లను స్మరించుకు నేప్పుడు అతడు నిత్యం చేసే పనులను స్మరించుకుంటూ, ఆ పనులు చేసేవాళ్ల ఇప్పుడెవరని విలపించడం సహజం. వృద్ధముని కూడా నిత్యమూ హృదయంగ మంగా వేదశాస్త్రాదులను అధ్యయనం చేసే తన కుమారుని గొంతు ఇక విన పడదుకదా! సంధ్య, అగ్నిహోత్రం మొదలైన నిత్యకృత్యాలు తీర్చేవారిక ఉండరుకదా! ఏ పనీ చేసుకోలేని స్థితిలోఉన్న తనకిక నిత్యమూ కందమూలాదులు తెచ్చియిచ్చి తినిపించేవారుండరుకదా! పుత్రునియందే అన్ని ఆశలూ పెట్టుకున్న వృద్ధురాలైన తల్లిని ఓదార్చేవారెవరు? ఈ దుఃఖాన్ని నేనెలా భరించేది. అని విలపిస్తాడు.

అధీయానస్య మధురం శాస్త్రం వాన్యద్విశేషతః
కస్య వా పరరాత్రేఽహం శ్రోష్యామి హృదయంగమమ్
కో మాం సంధ్యాముపాస్యైవ స్నాత్వా హృతహృతాశనః
శ్లాఘయిష్యత్యుపాసీనః పుత్రశోకభయార్దితమ్
కందమూలఫలం హృత్వా యో మాం ప్రియమివాతిథిమ్
భోజయిష్యత్యకర్మణ్యం అప్రగ్రహమనాయకమ్
ఇమామంధాం చ వృద్ధాం చ మాతరం తే తపస్వినీమ్
కథం పుత్ర భరిష్యామి? కృపణాం పుత్రగర్ధినీమ్

(అయోధ్యా. 65, 32-34)

భాగవతంలో చిత్రకేతూపాఖ్యానం ఉంది. శూరసేన దేశపు రాజు చిత్రకేతుడు. ఇతని భార్య కృతద్యుతి. వీరికి చాలాకాలానికి పుత్ర సంతతి కలుగుతుంది. సపత్నులకు కృతద్యుతిపై ఈర్ష్యాసూయలు కలిగి, ఆమె కుమారు నికి విషమిచ్చి చంపుతారు. కుమారుని మృతికి తల్లి కృతద్యుతి తల్లడిల్లుతూ బ్రహ్మను ప్రశ్నిస్తూ ఈ విధంగా విలపిస్తుంది.

అహో విధాతస్త్వమతీవ బాలిశః
యస్త్వాత్మసృష్ట్యప్రతిరూప మీహసే
పరేఽనుజీవత్యపరస్య యా మృతిః
విపర్యయశ్చేత్త్వమసి ధ్రువః పరః

నహి క్రమశ్చేదిహ మృత్యుజన్మనోః
శరీరిణామస్తు తదాత్మకర్మభిః
యః స్నేహపాశో నిజసర్గవృద్ధయే
స్వయం కృతస్తే తమిమం వివృశ్చసి (6 స్కం.)

ఓ బ్రహ్మ! నీవు సృష్టించిన సృష్టినే నీవు తుంచివేసుకోవడం, పెద్దలైన తల్లిదండ్రులుండగా బాలుడు మరణించడం నీ బాలిశత్వాన్ని - మూర్ఖత్వాన్ని తెలియజేస్తుంది. మృత్యువు విషయంలో నీవు పద్ధతి ప్రకారంగానే ప్రవర్తిస్తున్నానంటావా? అప్పుడు నీవు మాకు శత్రువువే కాని మిత్రుడవేమాత్రమూ కావు. ప్రాణుల మరణవిషయంలో నియమితమైన ఒక పద్ధతి అంటూ ఉండదంటావా? ప్రతిదీ ప్రాణి చేసుకున్న కర్మనుబట్టే జరుగుతున్నప్పుడు ఇక మధ్యలో నీ ప్రమేయం ఏమిటి? సృష్టి పెరుగుదలకోసం నీవు సృష్టించిన ఈ స్నేహబంధాన్ని, స్నేహపాశాన్ని ప్రాణులను తల్లిదండ్రులనుండి శాశ్వతంగా దూరం చేస్తూ తుంచడం నీకు భావ్యమా! ఈ విధంగా కృతద్యుతి తన కుమారునికోసం పరితపిస్తుంది.

పుత్రశోకం ఎంతో దుస్సహమైంది. నవమాసాలు మోసి కన్న పుత్రుడు అతిబాల్యంలోనే మరణిస్తే ఆ దుఃఖాన్ని కొద్ది కాలంలో మరచిపోవచ్చు. కాని, ఎదిగివచ్చిన కుమారుడు మరణిస్తే ఆ దుఃఖం శాశ్వతంగా హృదయాన్ని శల్యంగా బాధిస్తూనే ఉంటుంది. భారతంలో అభిమన్యుని మరణానికి తల్లి సుభద్ర ఎంతో విలపిస్తుంది. తల్లి కుమారుని లాలిస్తూ పొందే ఆనందాన్ని తాను పూర్తిగా అనుభవించలేదనీ, అభిమన్యుడలా జన్మించి - ఇలా మరణించినాడనీ, స్వప్నంలో ధనం కనిపించి మాయమైనట్లుగా అభిమన్యుడు మాయమైనాడనీ, మనుష్య జన్మ జలబుద్బుదంలాగా అతి చంచలమైందనీ కుమారుణ్ణి స్మరిస్తూ దుఃఖిస్తుంది.

హా వీర దృష్టో నష్టశ్చ ధనం స్వప్న ఇవాసి మే
అహో అనిత్యం మానుష్యం జలబుద్బుదచంచలమ్ (ద్రోణ.)

అర్జునుడు కూడా సుకుమారమైన తన కుమారుని రూపసంపదను చూచే భాగ్యమూ, అతని మధురమైన కంఠాన్ని వినే అదృష్టమూ తనకిక లేవు కదా, ఇక తనకు శాంతి ఎక్కడిదని విలపిస్తాడు.

సునసం సులలాటాంతం స్వక్షిభ్రూదశనచ్ఛదమ్
అపశ్యత స్తద్వదనం కా శాంతిర్హృదయస్య మే
తంత్రీస్వనసుఖాం రమ్యం పుంస్కోకిలసమధ్వనిమ్
అశ్రుతత్వాత్ స్వనం తస్య కా శాంతి ర్హృదయస్య మే.

ఈ సందర్భాన్నే తిక్కన ఒక పద్యంలో ఎంత చక్కగా వర్ణించినాడో చూడండి:

"హా యను ధర్మరాజతనయా యను నన్నెడబాయ నీకు చ
న్నే యను తల్లినేప జనునే? యను గృష్ణుడు వీడె వచ్చె రా
వేయను, నొంటిపోవ( దగవే యను నేగతి బోవువాడనే
నోయభిమన్యుడా యను బ్రియోక్తుల నుత్తర దేర్పవే యనున్.

మానవజీవితంలో దాంపత్య ధర్మం ఎంతో విశిష్టమైంది. భవభూతి ఉత్తర రామచరిత్ర నాటకంలో దాంపత్య ధర్మవైశిష్ట్యాన్ని ఎంతో చక్కగా వర్ణించాడు.

అద్వైతం సుఖదుఃఖయో, రనుగతం సర్వాస్వవస్థాసు యత్
విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యో రసః
కాలేనావరణాత్యయాత్పరిణతే యత్స్నేహసారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హి తత్ప్రార్థ్యతే.

( )

సుఖదుఃఖాలు రెండింటిలోనూ దాంపత్య ధర్మం అద్వైత రూపంలో ఉంటుంది. అంటే, భార్యాభర్తల్లో ఒకరి సుఖమే షరొకరి సుఖంగాను, ఒకరి దుఃఖమే మరొకరి దుఃఖంగానూ భావింపబడుతుందన్నమాట! ఏ అవస్థలోనైనా - సంపదలు వచ్చినా, ఆపదలు వచ్చినా ఈ దాంపత్య ధర్మం విచ్ఛిత్తి లేకుండా సాగిపోతూనే ఉంటుంది. కష్టం వచ్చినా సుఖం వచ్చినా ఒకరొకరితో తలపోసు కొని ఊరట చెందుతారు. ముసలితనం పైబడుతున్నా భార్యాభర్తల్లో ఒకరిమీద

ఒకరికి ప్రేమ తగ్గదు. కాలక్రమంలో ఆవరణలన్నీ తొలగిపోయి, భార్యాభర్తల ప్రేమ పండి, స్థిరత్వాన్ని పొందుతుంది. ఇలాంటి దాంపత్య ధర్మసారాన్ని లోకంలో ఎవరు కోరుకోకుండా ఉంటారు? అని ఈ శ్లోక తాత్పర్యం. దాంపత్య ధర్మ వైశిష్ట్యాన్ని ఇంత చక్కగా చెప్పిన శ్లోకం మరొకటి కనిపించదు. దాంపత్య మనడానికి భవభూతి ఈ శ్లోకంలో 'సుమానుషం' అనే చక్కని పదాన్ని వాడినారు. మానుషం అంటే మానవ ధర్మం. సుమానుష మంటే మంచి మానవ ధర్మం. అంటే, మానవ ధర్మానింటిలోనూ దాంపత్యధర్మం చాలా ఉత్తమ ధర్మమన్న అర్థాన్ని ఈ పదం తెలియజేస్తుంది. ఈ దాంపత్య ధర్మానికి భార్యాభర్తలిద్దరూ ఆలంబనం. ఒకానొక ప్రాకృత కవి భార్యాభర్తల్లో ఎవరైనా మరణిస్తే జీవించి ఉన్నవాళ్ళ బాధను ఇలా వర్ణిస్తాడు:

"సమసౌఖ్యదుఃఖపరివర్ధితయోః కాలేన రూఢప్రేమ్ణోః
మిథునయోర్మ్రియతే యత్తత్ఖలు జీవతి, ఇతరన్మృతం భవతి.

("సమానంగా సుఖదుఃఖాలను అనుభవిస్తూ, క్రమంగా పరస్పరం ప్రేమలు పెంచుకుంటూ, ఎదిగిన జంటలో ఎవరైనా మరణిస్తే, ఆ మరణించిన వ్యక్తే జీవించినట్లు, జీవించిన వ్యక్తే మరణించినట్లు!")

జీవించి ఉన్న వ్యక్తి బాధ ఎలాంటిదో ఈ శ్లోకం అద్దంపట్టినట్లుగా చూపుతుంది. ఇద్దరికీ సమాన ప్రాధాన్యం ఉన్నా, ఈ దాంపత్య ధర్మంలో గృహిణికే ఎక్కువ ప్రాధాన్యం కనిపిస్తుంది. మహాభారతాది గ్రంథాల్లో గృహిణి ప్రాధాన్యాన్ని, వైశిష్ట్యాన్ని తెలియజేసే వాక్యాలు మనకు కొల్లలుగా కనిపిస్తాయి. కొన్నింటిని ఇక్కడ ఉదాహరిస్తాను:

1. నరో హి గృహిణీహీనః అర్ధదేహ ఇతి స్మృతః
   (భార్యలేని మానవుడు అర్ధదేహుడే.) (స్కంద. మా.కౌ. 3-62)
2. ఏవం యో భార్యయా హీనస్తస్య గేహం వనాయతే
   (భార్యలేనివాని ఇల్లు అడవే.) (పద్మ. 2-59-23)
3. పుత్రపౌత్రవధూభృత్యై రాకీర్ణమపి సర్వతః
   భార్యాహీనం గృహస్థస్య శూన్యమేవ గృహం భవేత్
   (భారతం. శాంతి.)

(ఎంతమంది పుత్రులు, పౌత్రులు, భృత్యులు, వధువులు ఉన్నా, భార్య లేని గృహస్థుని యిల్లు శూన్యమే.)

4. న గృహం గృహమిత్యాహుః గృహిణీ గృహముచ్యతే
గృహం తు గృహిణీహీనం అరణ్యసదృశం మతమ్

(గృహాన్ని గృహం అని అనం. గృహిణినే గృహమని అంటాం. గృహిణి లేని యిల్లు అడవితో సమానం.)

5. వృక్షమూలేఽపి దయితా యస్య తిష్ఠతి తద్ గృహమ్
ప్రాసాదోఽపి తయా హీనః కాంతార ఇతి నిశ్చితమ్

(చెట్టుకిందే వాసం చేస్తున్నా, భార్య ఉన్నవాడికి అది అతనికి గృహమే. భార్య లేనివాడు పెద్దమేడలో నివసిస్తున్నా అది ఆతనికి అడవిలాంటిదే.)

దాంపత్యజీవితంలో ఇంత ప్రాధాన్యం వహిస్తున్న గృహిణి మృత్యువు వాత పడినప్పుడు భర్త పొందిన విషాదస్మృతిని వస్తువుగా గ్రహించి రచించిన ఘట్టాలు సంస్కృత వాఙ్మయంలో అనేకం కనిపిస్తాయి. వీటిలో ప్రధానంగా చెప్పుకోదగింది రఘువంశం అష్టమసర్గలోని అజవిలాప ఘట్టం. అజుడు రఘు రాజు. దశరథుని తండ్రి. ఈతని భార్య ఇందుమతి. ఈమె ఆకాశంనుండి తనపై బడిన పుష్పమాల కారణంగా మరణిస్తుంది. ప్రియురాలి మరణశోకంతో అజుడెంతగానో విలపిస్తాడు. కాళిదాసు ఈ ఘట్టంలో రచించిన సుమారు ముప్పై శ్లోకాలు ఒక విషాదస్మృతి ప్రధానమైన లఘు ఖండకావ్యంగా చెప్పుకోవచ్చు. సంస్కృతంలోని తరువాతి స్మృతిరచనలకు ఇది ప్రేరణగా నిలిచింది. కాళిదాసే ఈ విలాపాన్ని కరుణార్ద్రగ్రథితమని వాచ్యంగా చెపుతాడు. అంతేకాక ఆయన దుఃఖం వృక్షాలను కూడా దుఃఖింపజేసిందా అని ఉత్ప్రేక్షిస్తాడు.

విలపన్నితి కోసలాధిపః కరుణార్థగ్రథితం ప్రియాం ప్రతి
అకరోత్ పృథివీరుహానపి స్రుతశాఖారసబాష్పదూషితాన్ (రఘు 8-70)

స్మృతిరచనలో మరణించిన వారి గుణగణాలనూ, వారితో తనకు గల పూర్వ అనుభవాలను గుర్తుకు తెచ్చుకోవడం సహజం. కుటుంబాన్నంతా చూచుకునే గృహిణిగా, ఆలోచనలను అందించే మంత్రిగా, సమస్తభోగాలను

సమకూర్చే నర్మసచివుడుగా, మనోజ్ఞమైన లలితకళల్లో శిష్యురాలిగా - ఇలా ఎన్నో విధాలుగా సర్వ ఆనందాలకూ సమష్టినిలయమైన ఇందుమతీదేవిని మృత్యుదేవత ఏ మాత్రమూ కారుణ్యంలేక అపహరించడం తన సర్వస్వాన్నే అపహరించినట్లుగానూ, తనకిక జీవితంలో ఏమీ మిగిలి లేనట్లుగానూ ఆమె గుణగణాలనూ, అనుకూల్యాన్ని స్మరిస్తూ విలపించినట్లుగా కాళిదాసు ఎంతో చక్కగా చిత్రించినాడు. ఆ శ్లోకం చూడండి:

గృహిణీ సచివః సఖీ మిథః ప్రియశిష్యా లలితే కళావిధౌ
కరుణావిముఖేన మృత్యునా హరతా త్వాం వద కిం న మే హృతమ్

ఇందుమతి గుణగణాలనూ, అనుకూల్యాన్ని స్మరించడమేకాక ఆమె ప్రీతితో చేసిన పనులను కూడా అజుడు స్మరణకు తెచ్చుకొని విలపిస్తాడు.

ఇందుమతీదేవి తన ఉద్యానవనంలో ఒక మామిడిచెట్టునూ, ప్రియంగు లతనూ తల్లిలాగా ఎంతో వాత్సల్యంతో పెంచి, వాటిని భార్యాభర్తలుగా భావిస్తూ వచ్చింది. వాటికిప్పుడు యుక్తవయస్సు వచ్చింది. వాటికి పెళ్ళి చేయకుండానే ఇందుమతి శాశ్వతంగా వెళ్ళిపోయింది. తల్లిలేని ఆ చెట్టుకూ, లతకూ ఇక దిక్కెవరు? అని అజుడు పరితపిస్తాడు.

మిథునం పరికల్పితం త్వయా సహకారః ఫలినీ చ నన్విమౌ
అవిధాయ వివాహసత్క్రియామనయోర్గమ్యత ఇత్యసాంప్రతమ్
(రఘు. 8 - 61)

మరణించిన వ్యక్తితోడి పూర్వపు మధురానుభూతులనూ, ప్రస్తుత దుఃస్థితినీ చెపుతూ కవి దుఃఖౌత్కట్యాన్ని ప్రకటింపచేయడం కూడా స్మృతి కావ్యాల్లో కనిపిస్తుంది.

అజుడు తాను రుచిచూచి ఇచ్చిన రసవంతమైన మధువును సేవిస్తూ ఉండే ఇందుమతి ఇప్పుడు బాష్పదూషితమై వేడిచెందిన తన తిలోదకాలను పరలోకంలో ఎలా సేవిస్తుందో అని పూర్వ అనుభవాలను స్మృతికి తెచ్చుకొని ప్రస్తుతస్థితికి పరితపిస్తాడు.

మదిరాక్షి మదాసనార్పితం మధు పీత్వా రసవత్కథం మమే
అనుపాస్యసి బాష్పధూషితం పరలోకోపనతం జలాంజలిమ్

మద్యాన్ని సేవించిన తరువాత గోరువెచ్చని నీరు త్రాగటం మంచిదని ఆయుర్వేదం చెపుతుంది. అంటే, మద్యానికి గోరువెచ్చని నీరు అనుపానమన్న మాట! ఈ అనుపానం ఇందుమతికి భూలోకంలోనైతే సరిపోయేదికాని, పరలోకంలో ఎలా యుక్తమౌతుంది? అని ఈ శ్లోకంలో కాళిదాసు మరో అర్థాన్ని కూడా ధ్వనింపజేస్తున్నాడు.

ఈ విధంగా కాళిదాసు ఈ ఘట్టంలోని ప్రతి శ్లోకంలోనూ అజుని విషాద స్మృతిని ప్రతిభావంతంగా చిత్రించాడు.

మరణం వల్ల కలిగే విషాదం కేవలం మానవుల్లోనే కాకుండా, పశుపక్ష్యాదుల్లో కూడా కనిపిస్తుంది. వాటికి కూడా మానవులకు మాదిరిగా సుఖదుఃఖాలు, సంతోష విషాదాలూ మొదలైన వివిధ అనుభూతులూ ఉంటాయి. అసలు మానవుడు ఏకపత్నీ వ్రతాన్ని పక్షులనుండీ, శాకాహారాన్ని మృగాలనుండీ నేర్చుకున్నాడంటే, అవి మానవుల కెంత ఆదర్శమో భావించుకోవచ్చు.

మహాభారతం శాంతి పర్వంలో కపోతాలకు సంబంధించిన ఒక కథ ఉంది. ఈ కథను చెప్పడంలో వ్యాసుని ఉద్దేశం శరణాగత రక్షణ గొప్పతనాన్ని చెప్పడమే ఐనా, భార్య భర్తపైనా, భర్త భార్యపైనా చూపవలసిన, చూపే అన్యోన్యత ఈ ఘట్టంలో పరాకాష్ఠనొందిందని చెప్పవచ్చు. ఈ కథలో ఆకలితో బాధపడుతున్న బోయకు, అగ్నిలో దూకి మగ కపోతం ఆహారమైన దృశ్యాన్ని వ్యాసుడు మహత్తరంగా చిత్రించినాడు. ఆడకపోతం, మగ కపోతంతోడి పూర్వఅనుభవాలను స్మరిస్తూ తాను పర్వత గుహల్లో, నదీప్రవాహాల్లో, అందమైన చెట్ల కొనల్లో మగ కపోతంతో లాలింపబడుతూ అనుభవించిన ఆ సుఖాలు తన కిక లేవు కదా అని విలపిస్తుంది.

లాలితాహం త్వయా నిత్యం బహుమానాచ్చ పూజితా
వచనైర్మధురైః స్నిగ్ధై రసంక్లిష్ట మనోహరైః

కందరేషు చ శైలానాం నదీనాం నిర్ఝరేషు చ
ద్రుమాగ్రేషు చ రమ్యేషు రమితాహం త్వయా సహ
ఆకాశగమనే చైవ విహృతాహం త్వయా సహ
రమామి స్మ పురా కాంత తన్మే నాస్త్యద్య కించన

అంతేకాక, స్త్రీకి తండ్రికానీ, సోదరుడు కానీ, కుమారుడు కానీ ఇచ్చే ఆనందం చాలా పరిమితమైందనీ, అమితమైన ఆనందాన్ని కలిగించేవాడు భర్త మాత్రమేననీ భర్త గొప్పతనాన్ని పేర్కొంటూ అట్టి భర్తను కోల్పోయిన తన జీవితం వ్యర్థమేనని అంటుంది.

మితం దదాతి హి పితా మితం భ్రాతా మితం సుతః
అమితస్య చ దాతారం భర్తారం కా న పూజయేత్
న కార్యమిహ మే నాథ జీవితేన త్వయా వినా

జగన్నాథ పండిత రాయలు నిజంగా సంస్కృత వాఙ్మయ జగన్నాథుడే! రస గంగాధరకర్తగా గొప్ప ఆలంకారికుడుగానే కాక భామినీవిలాసాది కావ్యకర్తగా రసవత్కవిగా కూడా కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించినవాడు. షాజహాన్ కొలువులో పండిత స్థానాన్ని సంపాదించి పార్సీ, అరబ్బీ మొదలైన భాషల పోకడలు తెలుసుకున్నవాడు. ఈతడు తన భార్య మరణానికి దుఃఖితుడై 'కరుణ విలాస' మనే ఒక చక్కని స్మృతి కావ్యాన్ని రచించినాడు. స్వభార్యా వియోగ దుఃఖాన్ని స్మరిస్తూ కావ్యంగా శిల్పీకరించిన కవుల్లో జగన్నాథుడు ప్రథముడు. సంస్కృత వాఙ్మయంలో ఆయా కావ్యాల్లో అక్కడక్కడా స్మృతి కవిత్వం అనుబంధంగా కొంత చోటు చేసుకున్నా స్వతంత్రంగా వెలసిన ప్రాచీన స్మృతి కావ్యాలలో జగన్నాథుని కరుణవిలాసం ప్రథమకావ్యమనే కాక ఏకైక కావ్యమని కూడా చెప్పవచ్చు. కరుణ విలాసమనే కావ్యం పేరే దీని స్మృతికావ్య లక్షణాన్ని సూచింపజేస్తుంది.

ఇందులో జగన్నాథుడు తన భార్యయైన కామేశ్వరి మరణాన్ని పురస్కరించుకొని తన విషాద స్మృతులను ప్రతిభావంతంగా ప్రకటించినాడు. ఈ కావ్యంలో 19 శ్లోకాలే ఉన్నా అవన్నీ రత్నాలే. తన భార్య

కామేశ్వరి గుణగణాల్లో తన కవితలాంటిదట. గుణాలు, రసభావాలు, అలంకారాలు, చెవులకింపైన అక్షరాలు కలిగి, దోషాలు లేకుండా మనస్సును హరించే తన కవితలాగా తన భార్య తన హృదయంలోనుండి తొలగిపోవడంలేదట! ఆ శ్లోకాన్ని వినండి:

నిర్దూషణా గుణవతీ రసభావపూర్ణా
సాలంకృతిః శ్రవణకోమలవర్ణరాజిః
సా మామకీనకవితేవ మనోభిరామా
రామా కదాపి హృదయాన్మమ నాపయాతి (6 శ్లో)

భార్య కామేశ్వరి భూమిపై తాను జీవించి ఉన్నప్పుడు ఎంతో ప్రేమతో రమణ, నాథ, మనోహర అని సంబోధిస్తూ నన్ను స్వర్గానికి ఎక్కించేది. ఇప్పుడో తాను స్వర్గానికి ఎక్కి కూర్చుని, నన్ను భూమిపై ఉండే ధూళిలోకి తోసివేస్తుంది అని ఆమె ఆత్యంతిక వియోగాన్ని ఎంతో చక్కగా ప్రకటిస్తాడు.

భూమౌ స్థితా రమణ నాథ మనోహరేతి
సంబోధనైర్యమధిరోపితవత్యసి ద్యామ్
స్వర్గం గతా కథమివక్షిపసి త్వమేణ
శాబాక్షి! హా! ధరణిధూళిషు మామిదానీమ్

స్వప్నంలో కూడా తనను తప్ప పరపురుషుణ్ణి ఆసక్తితో చూడని కామేశ్వరి అయ్యో! ఇప్పుడు గుణహీనుడైన పరపురుషుణ్ణి పొందడానికి వెళ్ళింది అని జగన్నాథుడు వాపోతాడు. ఇందులో జగన్నాథుడొక చమత్కృతిని కల్పించినాడు. స్వప్నంలో కూడా భర్తను తప్ప మరొకణ్ణి చూడని తన కామేశ్వరి నిర్గుణుడైన పరపురుషుణ్ణి పొందడానికి వెళ్ళింది అనడంలో విరోధం ఉంది. నిర్గుణుడైన పరమపురుషుణ్ణి పొందడానికి వెళ్ళింది అని చెపితే ఆ విరోధం పోతుంది. విరోధాభాసాలంకారంతో చెప్పిన ఆ శ్లోకం చూడండి:

స్వప్నాంతరేఽపి ఖలు భామిని పత్యురన్యం
యా దృష్టవత్యసి న కంచన సాభిలాషమ్

సా సంప్రతి ప్రచలితాసి గుణైర్విహీనం
ప్రాప్తుం కథం కథయ హంత పరం పుమాంసమ్.

గుణైర్విహీనం, పరం పుమాంసం అన్న పదాలలో చమత్కారమంతా నిండి ఉంది. ఈ విధంగా జగన్నాథుడు ఈ కావ్యాన్ని ప్రతి శ్లోక చమత్కృతి విలసితంగా రచించినాడు. The sweetest words are those that come from the sadest thoughts అన్న షెల్లీ వాక్యాలకు జగన్నాథుని కరుణ విలాసం చక్కని ఉదాహరణం.

భర్త మరణంవల్ల భార్య శోకతప్తయై తన విషాదస్మృతిని ప్రకటించిన స్వతంత్ర కావ్యాలు సంస్కృత వాఙ్మయంలో లేకపోయినా అట్టి ఘట్టాలు అనేకం సంస్కృతకావ్యాలలో మనకు లభిస్తాయి.

ఆది కావ్యమైన వాల్మీకి రామాయణంలో రావణుడు చనిపోయినప్పుడు ఆయన భార్య, పట్టమహిషి మండోదరి విలపించిన ఘట్టం ప్రధానంగా పేర్కొ వచ్చు. ఇందులో వాల్మీకి మండోదరి విషాదస్థితిని హృదయాన్ని స్పృశించే విధంగా చిత్రించినాడు. మండోదరి గొప్ప పతివ్రత. ప్రాతః స్మరణీయులైన పంచకన్యల్లో ఒకతెగా గౌరవం సంపాదించుకుంది. మండోదరి రావణుణ్ణి స్మరించుకుంటూ చెప్పిన ఒక శ్లోకం చూడండి :

ఇంద్రియాణి పురా జిత్వా జితం త్రిభువనం త్వయా
స్మరద్భిరివ తద్వైరం ఇంద్రియైరేవ నిర్జితః (యుద్ధ.)

రావణుడు తన ఇంద్రియాలనన్నింటినీ జయించి, గొప్ప తపస్సు చేసి త్రిభువనమంతా జయించినాడు కదా! తమను జయిస్తాడా ఈ రావణుడు అని కక్షపట్టి రావణునిపై ప్రతీకారం తీర్చుకోవడానికో అన్నట్లుగా ఇంద్రియాలన్నీ ఆయన్ని జయించినాయట. అంటే-ఇంద్రియలోలుపత్వం కారణంగా ఈ దుఃస్థితి ఏర్పడిందని సూచన.

మరణించిన రావణుని రూపసంపదను - ప్రత్యేకించి ముఖంలోని ఆయా అవయవాల సొబగును స్మరించుకుంటూ, ప్రస్తుతం కళావిహీనమైన అతని ముఖాన్ని చూస్తూ విలపిస్తుంది.

హే రాజన్ సుకుమారం తే సుభ్రు సుత్వక్సమున్నసమ్
కాంతిశ్రీద్యుతిభిస్తుల్యం ఇందుపద్మదివాకరైః
కిరీటికూటోజ్జ్వలితం తామ్రాస్యం దీప్తకుండలమ్
మదవ్యాకుల లోలాక్షం భూత్వా యత్పానభూమిషు
వివిధస్రగ్ధరం చారు వల్గు స్మితకథం శుభమ్
తదేవాద్య తవైవం హి వక్త్రం న భ్రాజతే ప్రభో!
(రామాయణం, యుద్ధ. 111 వ సర్గ)

వాల్మీకి రామాయణంలో మనకు కనిపించే మరో విషాద స్మృతిఘట్టం తారావిలాప ఘట్టం. తార కూడా పంచకన్యల్లో ఒకతె. 'లోకవిశ్రుతా తారా' అని వాల్మీకి తారను ప్రశంసాపూర్వకంగా పేర్కొంటాడు.

తాను శూరునికి భార్య ఐన కారణంగా భర్తను పోగొట్టుకోవలసి వచ్చిందనీ, కనుక వివేకం ఉన్న ఏ తండ్రి కూడా శూరునికి కుమార్తెను ఇవ్వడం సముచితం కాదని విలపిస్తుంది.

శూరాయ న ప్రదాతవ్యా కన్యా ఖలు విపశ్చితా
శూరభార్యాం హతాం పశ్య సద్యో మాం విధవాం కృతామ్.

సింహం వచ్చి వృషభాన్ని చంపివేస్తే, దూడతో ఉన్న గోవులా నిస్సహాయ స్థితిలో ఉన్నానని దీనంగా విలపిస్తుంది.

సింహేన విహతం సద్యో గౌః సవత్సేవ గోవృషమ్.

ఈ ఉపమానంతో వాల్మీకి ఆమె దుఃఖాతిరేకాన్ని ఉచ్చకోటికి తీసుకు వెళ్ళినాడు.

స్మృతి కవిత్వానికి చక్కని లక్ష్యాలు అనదగ్గ రెండు ఘట్టాలను కాళిదాసు తన కావ్యాలలో ఎంతో సమర్థతతో చిత్రించినాడు. ఒకటి అజవిలాపం. రెండోది రతి విలాపం. అజవిలాపంలో భార్య మరణానికి భర్త పొందే విషాద స్మృతులు చిత్రీకరించబడ్డాయి. దీన్ని గురించి మనం ఇంతకు

ముందు చెప్పుకున్నాం. రతీ విలాపంలో భర్త మరణానికి భార్య పొందే విషాద స్మృతులు చిత్రీకరించబడ్డాయి. కుమారసంభవం చతుర్థ సర్గలో సుమారు నలభై శ్లోకాలలో రతీ విలాపం వర్ణింపబడింది. ఈ ఘట్టం కారుణ్యరసవాహినిగా సాగింది.

మన్మథుడు హరతపోభంగం కలిగించి అతని నేత్రాగ్నిచే భస్మమౌ తాడు. భర్త మరణానికి వివశమై అతనితోడి తన పూర్వ అనుభూతులను స్మరించుకుంటూ విలపించే ఘట్టంలోని ఒక శ్లోకాన్ని గమనించండి:

హృదయే వససీతి మత్ప్రియం
యదవోచ స్తదవైమి కైతవమ్
ఉపచారపదం న చేదిదం
త్వమనంగః కథమక్షతా రతిః.

ఎల్లప్పుడూ నా ఎదలోనే ఉంటావు అని మన్మథుడు రతితో చెప్పిన మాట సత్యం కాదట. ఎందుకంటే మన్మథుడు మరణించినా/భస్మమైనా తాను (రతీ దేవి) బ్రతికే ఉంది కనుక. మన్మథుని హృదయంలో ఎప్పుడూ రతీదేవి ఉన్నట్లైతే అతడు మరణించినప్పుడు రతిదేవి కూడా మరణించాలి కదా! మరణించలేదు. అంటే, మన్మథుడు చెప్పిన మాట వట్టి ఉబుసుపోకకు చెప్పిన మాటే కదా! అని రతిదేవి తన పూర్వ అనుభవాన్ని కొంత కోపరస సమ్మిళితం చేసి పరితపిస్తుంది.

తల్లి మరణాన్ని పురస్కరించుకొని రచింపబడిన స్మృతి కవితలు కూడా సంస్కృతంలో ఉన్నాయి. మాతృదేవత వైశిష్ట్యాన్ని ఉగ్గడిస్తూ మనువు ఒక చక్కని శ్లోకం చెప్పినాడు:

ఉపాధ్యాయాన్ దశాచార్యః ఆచార్యాణాం శతం పితా
సహస్రం చ పితౄన్ మాతా గౌరవేణాతిరిచ్యతే (మను. 2-145)

"లౌకికమైన చదువులు చెప్పే అధ్యాపకునికన్నా శ్రౌతవిద్యలు నేర్పే బోధించే ఆచార్యుడు పదిరెట్లు గొప్ప. అట్టి ఆచార్యునికన్నా తండ్రి వందరెట్లు గొప్ప. అట్టి తండ్రికన్నా తల్లి వేయిరెట్లు గొప్ప." భారతదేశంలో తల్లికిచ్చిన గౌరవం అటువంటిది.

ఇటీవలే ప్రస్తుత వ్యాసకర్త తన పదకొండవ ఏట మరణించిన తల్లిని స్మరిస్తూ 'మాతృగీతం' అనే పేరుతో ఒక స్మృతి కవితను రచించినాడు. 108 శ్లోకాల ఈ కృతిలో మొదటి 26 శ్లోకాల్లో మాతృస్మృతి ఉంది.

ముక్కోటి దేవతలకన్నా మాతృదేవి గొప్పదనీ, అట్టి మాతృదేవి ప్రేమకు దూరమైన తన దురదృష్టానికి విలపిస్తూ తల్లితో తన అనుబంధాన్ని ప్రకటించుకోవడం ఇందులోని అంశం. ఒకటి, రెండు పద్యాలు ఉదాహరిస్తాను.

ప్రేమాఖ్యం పీయూషం
సంతత్యై జనని భూరి వర్షంత్యా
కోటిత్రయమపి దైవం
తుల్యం తద్భవతి మాతృదేవ్యా కిమ్?

యస్యా వచాంసి మధురాణి పరం సుధాయా
యస్యా దృశశ్చ మనసో హి రసాయనాని
యా చైవ దైవమిహ పూజ్యతమం తయాద్య
మాత్రా తు జీవితగతీ రహితా వృథైవ.

చాలామందికి తెలియని ఒక అంశం మనవి చేస్తాను. ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు సంస్కృతంలో కూడా కవిత్వం రాసేవారు. వారు రచించిన రెండు స్మృతి గీతాలు నాకు వారి అభినందన సంచికలో లభ్యమైనాయి. ఈ రెండు గీతాలు హిందూ కాలేజీ మాగజైన్‌లో (1948లో) అచ్చైనవట. దాదాపు నలభైయైదేళ్ళ క్రితం రాసినవి. తన తండ్రి మరణానికి విలపిల్లుతూ చెప్పిన స్మృతిగీతాలు ఇవి.

తన తండ్రి తననెంతో కష్టపడి చదివించి ఒక స్థితికి తెచ్చి, తాను పెంచిన రసాల వృక్ష ఫలాన్ని ఆదరించకుండానే ఈ లోకాన్ని వీడిపోయినాడని చెప్పుకుంటాడు:

"భవతా బహుకష్టవారిణా
వవృధేఽహం స్థితి మీదృశం గతః
అపి చైక మనా దృతం ఫలం
స్వపరీపుష్టరసాలసాలతః."

ఆధునిక సంస్కృత కవుల్లో కూడా స్మృతి కావ్యాలను రచించిన కవులు ఎందరో ఉన్నారు. వారిలో డా॥ రాఘవన్, ఎమ్. ఎమ్. గోకుల్‌నాథ్ ఝూ, ఉపాధ్యాయ, ఎమ్.ఎమ్., పరమేశ్వర్ ఝూ, బుద్ధినాథమిశ్రా, పండిత్ గణేశ్వర్ ఝూ మొదలైనవారు ప్రముఖులు. వారి గ్రంథాలు వ్యాస కర్తకు లభ్యం కాక పోవడం వల్ల వాటిని గూర్చి వివరించడం జరగలేదు.

స్వతంత్రంగా రచింపబడ్డ స్మృతి కవిత్వమే కాక ఇతర భాషల నుండి అనువాద రూపంలో వెలసిన స్మృతి కవిత్వం కూడా మనకు సంస్కృతంలో కనిపిస్తుంది. గుండేరావు హర్కారేగారు ఆంగ్లంలోని Thomas grey elegy ని సంస్కృతంలో చైత్యగీతమనే పేరుతో అనువదించినారు.

సంస్కృతంలో స్మృతి కవిత్వాన్ని గురించి ఒక పెద్ద గ్రంథమే రాయవచ్చు. ఈ వ్యాసంలో రేఖా మాత్రంగా మాత్రమే ఈ విషయాన్ని పరామర్శించడం జరిగింది.

(తెలుగువిశ్వవిద్యాలయం ఏర్పాటుచేసిన రావూరి కాంతమ్మ స్మారకోపన్యాసం)

# సంస్కృతనిఘంటువులు – వైవిధ్యం

"అస్మాత్పదాదయమర్థో బోద్ధవ్య ఇతీశ్వరసంకేతః శక్తిః" అని తార్కికుల వచనం, 'ఈ పదం వల్ల ఈ అర్థం అవగతం కావాలి.' అనే ఈశ్వర సంకేతాన్ని 'శక్తి' అంటారు. ఈశ్వరుని సంకేతం కాదు- కేవల సంకేతమే శక్తి అని కొందరి అభిప్రాయం. "శక్తిగ్రహం వ్యాకరణోపమానకోశాప్త వాక్యాద్వ్యవహారతశ్చ, వాక్యస్య శేషాద్వివృతేర్వదంతి సాన్నిధ్యతః సిద్ధపదస్య వృద్ధాః" అనే వాక్యాన్నిబట్టి వ్యాకరణం, ఉపమానం, కోశం, ఆప్తవాక్యం, వ్యవహారం. వాక్యశేషం, వివృతి, సిద్ధపదసాన్నిధ్యం అనే ఈ తొమ్మిది శక్తి గ్రాహకాలని తెలుస్తుంది. అంటే - ఇవి ఏ శబ్దానికి ఏ అర్థాన్ని బోధించే శక్తి ఉందో తెలియజేస్తాయన్నమాట. ఈ శక్తిగ్రాహకాల్లో 'కోశం' చాలా ప్రధానమైనది.

భాషకు కోశం, రాజుకు ధనాగారం ముఖ్యమంటారు. 'కోశవానాచార్యః' అని సంస్కృత సూక్తి. కోశాన్ని చదివినవాడే పండితుడని దీని తాత్పర్యం. 'కోశమైనా చూడు లేక దేశమైనా చూడు' అని కన్నడసూక్తి. వీటినిబట్టి విజ్ఞాన ప్రాప్తికి కోశాలు ఎంత అవసరమో మనం అర్థం చేసుకోవచ్చు.

కోశానికి అనుశాసనం, అభిధానం, నిఘంటువు అనే నామాంతరాలు ఉన్నాయి. వీటిలో నిఘంటుపదం చాలా ప్రాచీనమైంది. ఈ పదానికి తొలుత వైదికపరంగానే వాడుక ఉన్నా ప్రస్తుతం లౌకికపద నిఘంటువులకు కూడా నిఘంటువులనే వ్యవహారం ఏర్పడింది. 'నిశ్చయేన వేదమంత్రార్థాన్ నిగమయంతి ఇతి నిగంతవః' - నిశ్చయంగా వేదమంత్రాల అర్థజ్ఞానాన్ని కలిగించేవి కనుక ఇవి నిగంతువులు. నిగంతుశబ్దమే నిఘంటువుగా మారింది. లేదా 'నితరాం ఘట్టయంతి భాషయంతి శబ్దార్థం ఇతి నిఘంటువః' అనే వ్యుత్పత్తికూడా చెప్పవచ్చు. సూటిగా అర్థాన్ని చెప్పేవి నిఘంటువులని దీని తాత్పర్యం.

వేదాల్లో ప్రయుక్తమైన శబ్దాలకు అర్థాలను వివరించే నిఘంటువులే సంస్కృతంలో మొట్టమొదట వెలువడిన నిఘంటువులు. కశ్యప ప్రజాపతి రచించిన నిఘంటువు వైదిక నిఘంటువుల్లో మొట్టమొదటిదని విమర్శకుల అభిప్రాయం. ఇందులో గవాదిదేవపత్న్యంత శబ్దాలకు సమానార్థక శబ్దాలు చూపబడ్డాయి. దీనికి సమామ్నాయమనే పేరుకూడా ఉన్నది. ఈ నిఘంటువులోని పదాలకే యాస్కుడు (క్రీ.పూ. 700) నిరుక్తరూపంలో వ్యాఖ్యానం వ్రాసినాడు. యాస్కుడు నిరుక్తారంభంలో 'సమామ్నాయః సమామ్నాతః స వ్యాఖ్యాతవ్యః' తమిమం సమామ్నాయం నిఘంటవ ఇత్యాచక్షతే' అని చెప్పినాడు. ఈ సమామ్నాయం తానే చెప్పిందికూడా కావచ్చునేమో! యాస్కుని నిరుక్తంలో దాదాపు పదహేడుగురు వైదిక నిఘంటుకారుల పేర్లు పేర్కొనబడ్డాయి. కాని, ఆయా ఆచార్యుల నిఘంటువులుమాత్రం ప్రస్తుతం లభ్యం కావు. పద్దెనిమిదో శతాబ్దికి చెందిన భాస్కరరాయ పండితుడు వైదిక శబ్దాలకు ఒక నిఘంటువును అనుష్టుప్వృత్తంలో రచించినాడు.

ఆధునిక యుగంలో ఆధునిక పద్ధతుల్లో అకారాదిక్రమంగా వైదిక పదకోశాలు సంతరింపబడ్డాయి. వీటిలో విశ్వబంధుశాస్త్రి వైదికశబ్దార్థ పారిజాతం, వేదార్థశబ్దకోశం అనేవి ప్రధానమైనవి.

ఇక లౌకిక భాషకు వెలసిన ప్రాచీన నిఘంటువులను పరిశీలిద్దాం. లౌకిక భాషకు సంతరింపబడిన ప్రాచీన నిఘంటువులు ఎన్నో ఉన్నాయి. పురుషోత్తమ దేవుని త్రికాండ శేషవ్యాఖ్య సారార్థచంద్రికాకర్త శ్రీ శీలస్కంధ యతివరుడు 192 కోశాలను పేర్కొన్నాడు. వీటిలో కొన్ని ముద్రితాలు, కొన్ని అముద్రితాలు. కొన్ని లభ్యాలు, కొన్ని అలభ్యాలు. ప్రాచీన కోశాలన్నీ ధారణ కనుకూలంగా ఉండాలనే దృష్టితో ఛందస్సులోనే నిబంధింపబడినాయి. వీటిలో ముఖ్యమైన నిఘంటువులను కొన్నిటిని గూర్చి తెలుసుకుందాం.

విషయ వైవిధ్యాన్నిబట్టి ప్రాచీన సంస్కృత నిఘంటువులను ఈ కింది ఐదు రకాలుగా విభజించవచ్చు:

1. పర్యాయ పదకోశాలు 2. అనేకార్థక పదకోశాలు
3. శాస్త్రపదకోశాలు 4. ద్విరూపకోశాలు
5. ఏకాక్షరకోశాలు 6. క్రియాకోశాలు

పర్యాయపదకోశాలు :- ఒక అర్థంలో వాడబడే పదాలన్నీ ఒకచోట నిర్దేశించటం ఈ కోశాల లక్ష్యం. పర్యాయ పదకోశాల్లో ప్రధానంగా చెప్పుకో దగ్గది అమరకోశం. నేటికీ సంస్కృతాభ్యాసం అమరకోశంతో ప్రారంభం చేయడం మనందరికీ తెలిసిన విషయమే. "అష్టాధ్యాయీ జగన్మాతాఽమరకోశో జగత్పితా" అనే నానుడివల్ల అమరకోశానికున్న ప్రాముఖ్యం అవగతమౌతుంది. అమరం రానిది సంస్కృతభాష అమరనంటుందట. అమరకోశానికి వెలసినన్ని వ్యాఖ్యలు మరే ఇతరకోశగ్రంథానికి రాలేదు. క్రీ. శ. ఆరో శతాబ్దంలోనే దీనికి చీనాభాషలో అనువాదం వచ్చిందట. అందువల్ల అమరకోశకర్త అమరసింహుడు ఆరో శతాబ్దికి పూర్వుడని తెలుస్తుంది. ఇందులో నామపదాల పర్యాయపదాలుకాక వాటి లింగ నిర్దేశంకూడా చూపబడింది. అందువల్ల నామలింగానుశాసనమనే దీని నామాంతరం సార్థకం. తనకు పూర్వమున్న ఇతర నిఘంటువులను సమాహ రించి సార్థక పదజాలంతో విస్తారమైన అర్థాన్ని సూచించే విధంగా వర్గములను విభజించి సమగ్రతతో ఈ నిఘంటువును సంతరించినాడు. ఈ విషయాన్ని-

"సమాహృత్యాన్యతంత్రాణి సంక్షిప్తైః ప్రతిసంస్కృతైః
సంపూర్ణముచ్యతే వర్గైర్నామలింగానుశాసనమ్"

అనే శ్లోకంలో వివరించినాడు. అమరకోశానికి క్షీరస్వామి, సర్వానందుడు సంత రించిన వ్యాఖ్యానాల్లో వ్యాడి, కాత్యుడు, వాచస్పతి, భాగురి, విక్రమాదిత్యుడు, ధన్వంతరి, అమరదత్తుడు, వరరుచి మొదలైన ఆచార్యులు స్మరింపబడడంవల్ల ఆయా ఆచార్యులు వ్రాసిన నిఘంటువుల నన్నింటినీ అమరసింహుడు పరిశీలించి నామలింగానుశాసనాన్ని రచించివుంటాడని భావించవచ్చు. వాచస్పతి శబ్దార్ణవ కోశాన్ని, వ్యాడి ఉత్పలినీకోశాన్ని, విక్రమాదిత్యుడు సంసారావర్తకోశాన్ని రచించినట్లుగ పురుషోత్తమదేవుని హారావళి తెలుపుతుంది. కాత్యుడు రచించిన కోశం నామమాల కావచ్చు.

అమరకోశంలో మూడు కాండలున్నాయి. విషయభేదాన్నిబట్టి మళ్ళీ ఇరవై ఐదు వర్గాలుగా అవాంతర విభాగం చేయబడింది. స్వర్గవర్గ, దిగ్వర్గ, వ్యోమ వర్గ, కాలవర్గ, ధీవర్గ, వాగ్వర్గ మొదలైనవి ఈ అవాంతరవర్గాలు. ఆయా శాస్త్రా లకు సంబంధించిన పదజాలాన్ని సేకరించి ప్రత్యేక నిఘంటువులను (కృషి కోశం, వాణిజ్యకోశం మొదలైనవి)సిద్ధంచేస్తున్న నేటి పద్ధతికి-అనగా విషయాన్ని బట్టి పదాలను వర్గీకరించి అర్థవివరణ చేయడమనే పద్ధతికి-అమరకోశాది ప్రాచీన కోశాలే బీజావాపం చేసినాయనడం యథార్థం. ప్రధానంగా ఈ కోశం పర్యాయ శబ్దకోశమే ఐనా మూడోకాండలో నానార్థ వర్గనుకూడా సంతరించడంవల్ల ఈ కోశానికి సమగ్రత లభించింది. 1539 శ్లోకాల్లో శాస్త్రీయపద్ధతిలో సమస్త విషయాలనూ విపులంగా, సంపూర్ణంగా వివరించడం జరిగింది. అందువల్లే మంచి ప్రసిద్ధిని పొందింది. అగ్ని పురాణంలో కూడా ఒక కోశసంకలనం కనిపిస్తుంది. ఇది అమరకోశానికి పరివర్తితరూపమే.

ఒక అర్థాన్ని ఇచ్చే పదాన్ని తీసుకొని దానికి ఇతర పదాలు చేర్చి భిన్నార్థక రూపాలను సృష్టించుకునే పద్ధతి సంస్కృతంలో అపరిమితంగా కాన వస్తుంది. ఉదాహరణకు భూమి అనే పదం ఉంది. దీనికి ధర అనే పదం చేరిస్తే 'భూధర' అనే పర్వతార్థక పదం ఏర్పడుతుంది. ఇట్లే భూమి, అచలా, రసా, విశ్వంభరా, స్థిరా, ధరా, ధరిత్రీ మొదలైన భూమి పర్యాయవాచక పదాలన్నిం టికి ధర అని చేరిస్తే ఏర్పడే పదాలు పర్వతార్థాన్ని తెలుపుతాయి. అలాగే భూమివాచక పదాలకు 'పతి' అనేపదం చేరిస్తే ఏర్పడే పదాలు 'రాజు' అనే అర్థాన్ని తెలుపుతాయి. ఈ పద్ధతిని వివరించిన నిఘంటువులు ఎక్కువగా కానరావు. ధనంజయ నిఘంటువులో ఈ పద్ధతి కానవస్తుంది. ఒక్క ఉదాహరణం:

"భూమిర్భూః పృథివీ పృథ్వీ గహ్వరీ మేదినీ మహీ
ధరా వసుంధరా ధాత్రీ క్షమా విశ్వంభరావనిః" అని భూపర్యాయ వాచకాలు పేర్కొని-

"తత్పర్యాయధరః శైలః తత్పర్యాయపతిర్నృపః

తత్పర్యాయదుహో వృక్షః శబ్దమన్యం చ యోజయేత్" అని భూపర్యాయ వాచకాలకు ధరాదిశబ్దాలు చేరిస్తే పర్వతాది పర్యాయవాచకాలు ఏర్పడుతాయని ఈ శ్లోకం తాత్పర్యం. ధనంజయుడు పేర్కొన్న ఈ పదయోజన పద్ధతి అమర కోశాదుల్లో కానరాదు. ఈ నిఘంటువులో నానార్థక పదాలుకూడా సేకరించ బడ్డాయి.

పర్యాయ వాచకపదాలు ప్రధానంగా, నానార్థక శబ్దాలు గౌణంగా కూర్చ బడిన కోశాల్లో హలాయుధకోశం పేర్కొదగింది. దీని కర్త హలాయుధుడు (10వ శతాబ్ది). దీనికే అభిధాన రత్నమాల అని నామాంతరం. పర్యాయపదాలు స్వర్గ, భూమి, పాతాళ, సామాన్యకాండల్లోనూ, నానార్థాలు అవ్యయాలు ఐదవకాండ లోనూ కూర్చబడ్డాయి. అమరకోశంమాదిరిగా ఈ కోశంలో లింగాన్ని నిర్దేశించే పద్ధతి కానరాదు. కనుక ఇది నామశాసనమేకాని లింగశాసనం కాదు.

అమరకోశపద్ధతిలోనే సంతరింపబడ్డ నిఘంటువుల్లో చాలా విపులమైనది వైజయంతీ నిఘంటువు. అమరకోశంకన్నా రెండింతల పరిమాణం కలది. మొత్తం 3216 శ్లోకాలు ఉన్నాయి. 11 వ శతాబ్దికి చెందిన యాదవప్రకాశుడు ఈ నిఘంటుకర్త. ఇది అమరకోశంకన్నా విస్తృతమూ, సమృద్ధమూ ఐన కోశమని పండితుల అభిప్రాయం. అమరకోశంలోని అధ్యాయ విభాగంకన్నా వైజయంతిలోని అధ్యాయవిభాగం వివరంగా ఉంది. ఉదాహరణకు అమరంలో స్వర్గానికి సంబంధించిన పర్యాయపదాలన్నీ స్వర్గ వర్గలో అవాంతర విభాగం లేకుండా కూర్చబడ్డాయి. కాని, వైజయంతిలో స్వర్గకాండలోనే మళ్ళీ ఆది దేవా ధ్యాయం, లోకపాలాధ్యాయం, యక్షాధ్యాయం ఇత్యాదిగా అవాంతర విభాగాలు కానవస్తాయి. ఇట్లాగే అంతరిక్షకాండం జ్యోతిరధ్యాయం, మేఘాధ్యాయం, ఖగాధ్యాయం, శబ్దాధ్యాయం అనే అవాంతర విభాగాలుగా విభజింపబడింది. ఈ విభాగం జిజ్ఞాసువు కెంతో ఉపయోగకారి. ఆయా విషయాలకు సంబంధించిన పర్యాయపదాలను చెప్పేప్పుడు వాటికి సంబంధించిన విషయాలను వివరంగా చెప్పడం ఈ నిఘంటువు ప్రత్యేకత. ఒక్క ఉదాహరణం చూపుతాను: అమర కోశంలో షడ్రసాలు మధురామ్లలవణ కటుకషాయతిక్తాలు మాత్రమే పేర్కొ బడ్డాయి. ఈ ఆరు మూల రసాలు మాత్రమే. కాని, వీటి పరస్పరమేళనాదుల వల్ల ఏర్పడే రుచులు ఎన్నో ఉన్నాయి కదా? అవన్నీ అమరకోశకారుడు

పేర్కొనలేదు. వైజయంతీకారుడు 68 రుచిభేదాలను పేర్కొనడమేకాక, వాటి పేర్లను కూడా నిర్దేశించడం విశేషం. వైదిక పదాలకు కూడా ఇందులో వివరణ ఉండడం మరో విశేషం. అకారాది క్రమంగా పదాలను నిర్దేశించడమనే ఆధునిక నిఘంటువుల్లో కనిపించే లక్షణం; ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షరాది పదాల క్రమనిర్దేశం ఈ నిఘంటువులో కానవస్తుంది. కాని, యీ పద్ధతి కేవలం నానార్థక శబ్దాలవిషయంలోనే కాని పర్యాయపదాల విషయంలో మాత్రం పాటింపబడలేదు. నానార్థక పదాలను వివరించే సందర్భంలో లింగాన్నిబట్టి పదాలను వర్గీకరించడం ఈ నిఘంటువులో కనిపించే మరో ప్రత్యేకత.

11 వ శతాబ్దిలోనే వెలసిన మరో నిఘంటువు అభిధానచింతామణి. సుప్రసిద్ధుడైన హేమచంద్రుడు దీని కర్త. ఇది పర్యాయపదాల నిఘంటువు. హేమచంద్రుడు అనేకార్థ సంగ్రహం, నిఘంటుశేషం అనే మరో రెండు నిఘంటువులను కూడా రచించినాడు. వీటిలో మొదటిది నానార్థ పదాలను, రెండవది ఓషధుల పేర్లను తెలిపే నిఘంటువు.

12 వ శతాబ్దికి చెందిన పురుషోత్తమదేవుడు అమరసింహుని నామలింగానుశాసనంలో చెప్పబడని పదాలనన్నింటినీ సంగ్రహించి త్రికాండశేషం అనే పేర ఒక నిఘంటువును రచించినాడు. అమరకోశానికి ఇది పరిశిష్టగ్రంథమని చెప్పవచ్చు. దీని రచన అమరకోశ పద్ధతిలోనే సాగింది. పురుషోత్తమ దేవుడు హారావళి అనే మరో నిఘంటువునుకూడా సంతరించినాడు. త్రికాండ శేషంలో ప్రసిద్ధ పదాలు సంగ్రహింపబడగా, హారావళిలో అప్రసిద్ధ పదాలు కూర్చబడ్డాయి. గోష్ఠుల్లో, వాదసమయాల్లో ఈ హారావళి మంచి వైదగ్ధ్యాన్ని కలిగిస్తుందని పురుషోత్తమదేవుడు ఇలా పేర్కొన్నాడు:

కిన్నైవ సంతి సుధియామభిధానకోశాః
కింతు ప్రసిద్ధవిషయవ్యవహారభాజః
గోష్ఠీషు వాదపరమోహఫలాసు కేషాం
హారావళీ న విదదాతి విదగ్ధిమానమ్.

నానార్థ పదాల వివరణకూడా ఇందులో చోటు చేసుకుంది. ఇంతవరకూ పేర్కొన్న నిఘంటువులు పర్యాయపదాలు ప్రధానంగానూ, నానార్థకపదాలు అప్రధానంగానూ వివరింపబడ్డ నిఘంటువులు. ఇట్టి నిఘంటువులు సంస్కృత భాషకు ఇంకెన్నో ఉన్నాయి. ప్రధానమైనవి కొన్నిమాత్రం ప్రస్తావింపబడ్డాయి.

పర్యాయపదాలు కాకుండా కేవలం నానార్థక పదాలను మాత్రమే వివరించిన నిఘంటువులు కూడా ఉన్నాయి. ఇక వాటినిగూర్చి తెలుసుకుందాం.

నానార్థ నిఘంటువుల్లో అతి ప్రాచీనమైనది శాశ్వత నిఘంటువు. దీనికి అనేకార్థ సముచ్చయమనే పేరుకూడా ఉన్నది. దాదాపు అమరసింహుని కాలంలోనే ఈ నిఘంటువు వచ్చి ఉంటుంది. అమరకోశంలోని నానార్థవర్గ క్లుప్తంగా ఉన్నదనే ఉద్దేశంతో శాశ్వతుడీ నానార్థ నిఘంటువును సంతరించి ఉంటాడు. అమర కోశంలోని నానార్థ వర్గకన్నా శాశ్వతకోశం రెండింతలు విస్తృతి కలిగి ఉంది.

నానార్థక పదాలను పేర్కొనేప్పుడు వాటి అద్యంతవర్ణాల ఆనుపూర్వి ఆధునిక నిఘంటువుల్లో మాదిరిగా పాటింపబడటం ఈ నానార్థ నిఘంటువుల్లో కొన్నింటిలో కనిపిస్తుంది. మేదినీకోశంలో చూపబడిన పదాల వరుసను గమనించండి.

అర్క, అంక, ఏక, కర్క, కంక, కల్క, కాక, కిష్కుః, కోకః.
అశోకః, అభీక, అనీక, అణుక, అలీక, అనూక, అంశుర, అంతిక, అలర్క.

"స్వరకాద్యాది కాద్యంతవర్ణైర్నానార్థసంగ్రహః
ఏకద్విత్రిచతుఃపంచ షడ్వర్ణానుక్రమాత్ కృతః" అని మేదినీకారుడు కైక, కద్విక, కత్రిక, కచతుష్క ఇత్యాది కాంత పదాలను అకారాది క్రమంలో చెప్పినట్లుగ చెప్పుకున్నాడు. అమరకోశంలోని నానార్థవర్గలో కాంత, గాంత ఇత్యాది పద నిర్దేశ పద్ధతి అనుసరింపబడ్డా పదాది-వర్ణాల ఆనుపూర్వికానీ, కద్విక, కత్రిక ఇత్యాది నియమం కానీ పాటింపబడినట్లు కానరాదు. ఉదా:-

వివస్వత్, సరస్వత్, గరుత్మత్, శకుంత, ధూమకేతు, జీమూత, హస్త, మరుత్ మొదలైన పదాల వరుసను గమనిస్తే అంతంలో ఉన్న వర్ణసామ్యం మాత్రమే పాటింపబడినట్లు కనిపిస్తుంది.

విశ్వేశ్వరుని విశ్వప్రకాశం (1111), మంఖుని అనేకార్థకోశం (12 శ.), అజయపాలుని నానార్థ సంగ్రహం (1140), కేశవస్వామి నానార్థార్ణవసంక్షేపం, హేమచంద్రుని అనేకార్థ సంగ్రహం, మేదినికరుని మేదినీకోశం మొదలైనవి సంస్కృతంలో వెలసిన కొన్ని అనేకార్థ నిఘంటువులు.

మేదినీకోశంలో చివర మేదినికరుడు ఎంతో మంది నిఘంటుకారులను, ఎన్నో నిఘంటువులను పేర్కొని, వాటి సాహాయ్యంతో తాను ఈ కోశాన్ని నిర్మించి నట్లుగ చెప్పుకున్నాడు. ఆయన స్మరించిన నిఘంటువులను, నిఘంటుకారులను గమనించండి:

ఉత్పలిని, శబ్దార్ణవం, సంసారావర్తం, నామమాల, భాగురి,
వరరుచి, శాశ్వతుడు, గోపాలుడు, రంతిదేవుడు, హరి,
అమరుడు, శుభాంకుడు, హలాయుధుడు, గోవర్ధనుడు,
రభసుడు, పాలుడు, రుద్రుడు, అమరదత్తుడు, జయుడు,
గంగాధరుడు, ధరణికోశం, హారావళి, త్రికాండశేషం,
రత్నమాల, విశ్వప్రకాశం, కాత్యాయనుడు.

నానార్థ నిఘంటువుల్లోని లింగనిర్దేశం అన్ని కోశాల్లో కనిపించదు. మేదినికరుడు మొదలైన కొందరు మాత్రం లింగాన్ని కూడా అనుశాసించడం కనిపిస్తుంది- ''ప్రవాలోఽస్త్రీ కిసలయే; విట్ పుంసి మనుజే వైశ్యే'' ఇత్యాదిగా.

కొన్ని నానార్థ నిఘంటువుల్లో ఒక్కొక్క లింగానికి సంబంధించిన పదాలను వర్గీకరించి చెప్పడం కనిపిస్తుంది. లింగాశ్రితమైన ఈ వర్గీకరణ పద్ధతి నానార్థార్ణవ సంక్షేపం మొదలైన కొన్ని నిఘంటువుల్లో కనిపిస్తుంది. నానార్థ నిఘంటువు లన్నింటిలోనూ కేశవస్వామి (12 శ.) రచించిన ఈ నానార్థార్ణవ సంక్షేపం చాలా విస్తృతమైన నిఘంటువు. ఇందులో దాదాపు 5800 శ్లోకాలు ఉన్నాయి. ఈ నిఘంటువులో వైదికపదాలు కూడా చోటు చేసుకున్నాయి.

## శాస్త్రపదకోశాలు :

ఆధునికయుగంలో కృషికోశం, రసాయనశాస్త్రకోశం, భౌతికశాస్త్ర పద కోశం ఇత్యాదిగా ఆయా శాస్త్రాలకు సంబంధించిన వివిధ కోశాలు సంతరింప బడుతున్న విషయం మనకు తెలిసిందే. విషయానుగుణంగా శబ్దాలను వర్గీకరిం చటమనే ఈ పద్ధతికి ప్రాచీన కాలంలోనే బీజావాపం జరిగింది. అమరకోశం, వైజయంతి మొదలైన పర్యాయపదకోశాల్లో శబ్దాలన్నీ విషయాన్ని ఆధారంగా చేసుకునే వర్గీకరింపబడ్డాయి. అంతేకాక, ఒక ప్రత్యేక శాస్త్రానికి సంబంధించిన పదజాలాన్ని సేకరించి ప్రత్యేక శాస్త్రపదనిఘంటువుగా కూర్చడమనే పద్ధతికి కూడా ప్రాచీన సంస్కృత నిఘంటువుల్లోనే అంకురార్పణం జరిగిందని చెప్ప వచ్చు. ధన్వంతరి నిఘంటువు, హేమచంద్రుడు తన అభిధాన చింతామణికి అను బంధంగా సంతరించిన నిఘంటుశేషం, నరహరి పండితుని రాజనిఘంటువు, మదనపాలుని నిఘంటువు ఆయుర్వేదశాస్త్ర నిఘంటువులు. ఉణాదికోశం వ్యాకరణశాస్త్ర నిఘంటువు. గణితనామమాల మొదలైనవి జ్యోతిషానికి, గణితానికి సంబంధించిన శాస్త్రనిఘంటువులు. ఆధునిక యుగంలో మీమాంసా కోశం మొదలైన శాస్త్రకోశాలు ఎన్నో వచ్చినాయి.

## ద్విరూపాదికోశాలు :

భాషలోని కొన్ని పదాలకు రూపాంతరాలు ఉండడం కద్దు. ఉదా:- భూమిః - భూమీ; ధరణిః - ధరణీ; అగారం - ఆగారం మొ॥ ఈ విధమైన రూపాంతరాలు కల పదాలను వివరించే కోశాలను ద్విరూపకోశాలని అంటారు. వీటిలో శ్రీహర్షకృతమైన ద్విరూపాదికోశం, పురుషోత్తమదేవుని ద్విరూపకోశం ప్రధానంగా కానవస్తున్నాయి. శబ్దాల్లోని ద్వైరూప్యాదులకు లింగ భేదం, అజ్భేదం, ప్రత్యయభేదం, హల్భేదం మొదలైనవి కారణాలు. ద్విరూపాదికోశంలో శబ్దనిర్దేశంచేసే పద్ధతికి ఒక్క ఉదాహరణం పరికించండి:

'మరుతశ్చ మరుచ్చాపి మరుత్వాన్మారుతస్తథా' - మరుచ్ఛబ్దానికున్న నాలుగు రూపభేదాలు ఇక్కడ పేర్కొనబడ్డాయి.

ఏకాక్షరకోశాలు :

శ్లేషకావ్యాల్లో అనేకార్థాలు చెప్పడానికి ఈ ఏకాక్షర కోశాలు చాలా ఉపయోగ పడతాయి. ఏకాక్షర నామమాల, పురుషోత్తముని ఏకాక్షర కోశం ఏకాక్షర నిఘంటువుల్లో పేర్కొనదగ్గవి. ఈ నిఘంటువుల ప్రయోజనం చాలా పరిమితమనే చెప్పాలి.

క్రియాకోశాలు :

ఇంతవరకు పేర్కొబడ్డ నిఘంటువులన్నీ కేవలం నామవాచకాలను మాత్రమే వివరించేవి. (నామాలలో అవ్యయాలు కూడా చేరతాయి.) వీటిలో ధాతువుల అర్థ ప్రసక్తి కానరాదు. శబ్దజాలంలో ధాతువులు చాలా ముఖ్యం. సంస్కృతంలో పదజాలమంతా ధాతువులనుంచే పుట్టింది. "సర్వం ధాతుజమాహ శకటస్య చ తోకం" - అని ప్రామాణిక వాక్యం. ధాతువుల అర్థనిర్ణయంచేసే క్రియానిఘంటువులు కూడా సంస్కృతంలో రాకపోలేదు. వీటిలో భట్టమల్లుని అఖ్యాత చంద్రిక, వీరపాండ్య భూపాలుని క్రియానిఘంటువు, దుర్గాదాస విద్యావాగీశుని ధాతుదీపిక చెప్పుకోదగ్గవి. క్రియానిఘంటువుల నిర్మాణ పద్ధతి తెలుసుకోవటానికి ఒక్క ఉదాహరణం గమనించండి.

"వేత్తి జానాతి జానీతే తత్త్వం బోధతి బోధతే
ప్రత్యేతి చోపలభతే బుధ్యతే ప్రతిపద్యతే."

అకారాదిక్రమ నిఘంటువులు :

ఆధునిక యుగంలో ఆంగ్లభాషా ప్రభావం వల్ల అకారాది క్రమంలో సంస్కృత నిఘంటువులను కూర్చే పద్ధతి బాగా వ్యాప్తిలోకి వచ్చింది. 1786 - 1833 సంవత్సరాల మధ్య కాలంలో ఎథీనియన్ డెమెట్రియన్ గలోనోస్ అనే విదేశీ విద్వాంసుని ప్రోత్సాహంతో ఒక కాశీ పండితుడు 25 వేల సంస్కృత పదాల పట్టికను అకారాది క్రమంలో సిద్ధం చేసినాడు. అకారాదిక్రమంలో కూర్చబడ్డ నిఘంటువుల్లో ఇది సర్వప్రథమమని పండితుల అభిప్రాయం. ఈ నిఘంటువు రాధాకాంతదేవ పండితుని శబ్దకల్పద్రుమానికి (1821 - 1857) తోడ్పడింది. సంస్కృత పదాలకు సంస్కృతంలో అర్థ వివరణ చూపే నిఘంటువుల్లో రాధాకాంతదేవుని శబ్దకల్పద్రుమం, తారానాథ తర్కవాచస్పతి సంతరిం

చిన వాచస్పత్యం (1873 - 1874) విస్తృతమైనవేకాక, పరమ ప్రామాణికాలు కూడా. ఈ రెంటినీ కేవలం అర్థ వివరణచేసే నిఘంటువులు కావు. సంస్కృత విజ్ఞాన కోశాలు అనడం యుక్తం.

సంస్కృత నిఘంటుక్షేత్రంలో తెలుగువాళ్ళ పాత్రకూడా గణనీయమనే చెప్పాలి. అసలు అకారాది పద్ధతిలో, ఆధునిక పద్ధతిలో మొట్టమొదటగా సంస్కృత నిఘంటువును కూర్చిన కీర్తి ఆంధ్రులదే అంటే అతిశయోక్తి కాదేమో! అకారాది క్రమంలో మొట్టమొదటగా 1821 - 1857 మధ్యలో వచ్చిన రాధాకాంతదేవుని శబ్దకల్పద్రుమానికి పూర్వమే మచిలీపట్టణానికి చెందిన మామిడి వెంకటాచార్యులనే విద్వాంసుడు 1818 లోనే 'శబ్దార్థకల్పతరువు' అనే సంస్కృత నిఘంటువును అకారాది క్రమంలో సిద్ధం చేసినారు. ఐతే, ఇది 1961కి గాని ముద్రణభాగ్యానికి నోచుకోలేదు. 1818 లోనే ముద్రణ జరిగి ఉన్నట్లయితే, అకారాది క్రమంలో ముద్రింపబడిన సంస్కృత నిఘంటువుల్లో అది మొట్టమొదటి స్థానాన్ని పొంది ఉండేది. ఇందులో సంస్కృత పదాలకు సంస్కృతంలోనూ, తెలుగులోనూ అర్థాలు చూపబడ్డాయి. శ్రీ పరవస్తు శ్రీనివాసాచార్యులుగారి సర్వశబ్ద సంబోధిని, ముడుంబ వేంకటాచార్యులు గారి సంస్కృత శబ్దార్థ కల్పతరువు సంస్కృత - సంస్కృత - ఆంధ్ర నిఘంటువుల్లో పేర్కొదగ్గవి.

సంస్కృత నిఘంటుక్షేత్రంలో అనుపమానమైన కృషి చేసినవారు చిరస్మరణీయులు మహామహోపాధ్యాయ శ్రీమాన్ పరవస్తు వెంకట రంగాచార్యులు గారు. వీరు 'లఘుశబ్దార్థ సర్వస్వం' అనే పేరుతో ఒక బృహన్నిఘంటువును రచించినారు. ఇది కేవలం నిఘంటువు మాత్రమే కాదు. పేరుకు తగిన రీతిగా గొప్ప సర్వస్వ కోశం అని చెప్పాలి. అ నుండి ఆ వరకు మాత్రమే రెండు సంపుటాలుగా చాలాకాలం క్రితం ముద్రింపబడింది. తక్కిన అముద్రిత భాగం ఆం. ప్ర. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది. ఇందులో వివరణ మంతా సంస్కృతంలోనే సాగింది.

అమరంలోని పదాలను అకారాదిగా కూర్చి సంస్కృతాంధ్రాలలో వ్యుత్పత్తులు, పర్యాయపదాలు సూచిస్తూ కొత్తపల్లి సుందరరామయ్యగారు 1915

లోనే అకారాద్యమర నిఘంటువును సిద్ధం చేసినారు. ఇది ప్రస్తుతం ఆం.ప్ర. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం వారిచే ముద్రింపబడుతుంది.

ప్రసిద్ధాలైన అమరకోశం, మేదినీకోశం, విశ్వకోశం మొదలైన నిఘంటువులన్నీ తెలుగుటీకలతో, అకారాదిపట్టికలతో సంతరింపబడ్డాయి. సంస్కృత పదాలకు ఆంగ్లభాషలో అర్థవివరణ ఉన్న నిఘంటువుల్లో సర్ మోనియర్ విలియమ్స్, మాక్డొవెల్, వి.ఎస్. ఆప్టేలవి అత్యంత గణనీయమైనవి.

సంస్కృతం అభ్యసించే తెలుగువారికి సంస్కృతాంధ్ర నిఘంటువులేకాక ఆంధ్ర సంస్కృత నిఘంటువులుకూడా అవసరం. ఒక సంస్కృతపదానికి అర్థం తెలియనప్పుడు, ఒకపదానికి ఉన్న పర్యాయపదాలను తెలుసుకోదలచుకున్నప్పుడు మాత్రమే ఈ పైన పేర్కొన్న సంస్కృత నిఘంటువులు ఉపకరిస్తాయి. కాని.ఒక తెలుగుపదం వాడే అర్థంలో వాడవలసిన సంస్కృతపదాలను తెలుసుకోదలచుకున్నప్పుడు మాత్రం ఈ నిఘంటువులు ఉపకరించవు. ఉదాహరణకు తెలుగులో 'చెదలు' అనే పదం ఉంది. దీనికి సంస్కృతంలో ఏ పదం వాడుతారు? అనే సందేహం వస్తే పై నిఘంటువులేవీ మన సందేహాన్ని తీర్చలేవు. అందువల్ల తెలుగులో ఆంధ్ర సంస్కృత నిఘంటువులుకూడా సంతరింపబడి తెలుగుదేశంలో సంస్కృత వ్యాప్తికి చాలా దోహదం చేసినాయి. వీటిలో కాశీ కృష్ణాచార్యులుగారి ఆంధ్ర సంస్కృత నిఘంటువు మొట్టమొదట వెలువడిన నిఘంటువు (1949). ఈ మధ్య డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు, శ్రీ కె. లక్ష్మణశాస్త్రిగారు సిద్ధం చేసిన ఆంధ్ర సంస్కృతకోశాన్ని ఆం.ప్ర. సాహిత్య అకాడమీవారు ముద్రించినారు. ఇందులో తత్సమపదాలను గ్రహించలేదు. తద్భవ పదాలు, దేశ్యపదాలు మాత్రమే గ్రహింపబడ్డాయి. సంస్కృతం నేర్చుకునే తెలుగు విద్యార్థులకే కాక పండితులకు కూడా ఇది చాలా ఉపయోగపడే మంచి నిఘంటువు.

ఈ విధంగా ప్రాచీనాకాలంనుండి నేటిదాకా వచ్చిన సంస్కృత నిఘంటువులు జిజ్ఞాసువులకు, పండితులకు తరగని నిధులుగా ఉంటూ, భాషా విజ్ఞానాభివృద్ధికి ఎంతగానో తోడ్పడుతున్నాయని చెప్పడం సత్యోక్తి.

(సాహిత్యమాసపత్రిక 'భారతి' (జూన్ 1986) లో ముద్రింపబడిన వ్యాసం.)

# అక్బర్‌షా రచించిన సంస్కృత శృంగారమంజరి

నాయికా నాయకులు, రసాలంకారాలు, గుణదోషాలు, రీతి వృత్తులు, ధ్వని విభేదాలు మొదలైనవి అలంకార శాస్త్రంలో చర్చింపబడే అంశాలు. ఆలంకారికుల్లో కొంద రీ విషయాలనన్నింటినీ తమ గ్రంథాల్లో చర్చిస్తే, మరి కొందరు వీటిలో ఏదో ఒక విషయాన్ని మాత్రమే గ్రహించి కూలంకషంగా చర్చించినారు. కావ్యశాస్త్ర విషయాల్లో ఏకదేశమైన నాయికా నాయక విభాగాన్ని తలస్పర్శిగా చర్చించిన సంస్కృత లక్షణగ్రంథం శృంగార మంజరి.

దీని కర్త అక్బర్‌షా. పదిహేడవ శతాబ్దికి చెందినవాడు. పూర్తిపేరు సయ్యద్ అక్బర్‌షా హుసేనీ. ఈతనికి 'బడే సాహెబ్' అనే వైభవసూచకమైన మరో పేరు కూడా ఉన్నట్లు శృంగార మంజరిలోని ఈ కింది శ్లోకంవల్ల తెలుస్తుంది.

శ్రీ శాహరాజ పుత్రోఽప్యక్బరశాహో మహద్వంద్యః
యస్య బడేసాహెబ్ ఇతి నామ మహావైభవైకపదమ్. (అవతారిక)

శృంగార మంజరి అవతారికలో అక్బర్‌షా తన వంశ వృక్షంతోపాటు తనను గురించిన వివరాలనుకూడా పొందుపరచినాడు. బందేనవాబ్ హజరత్ అక్బరుషా వంశంలో ముఖ్యుడట. ఈతని వంశంలోని శాహరాజుకు శాహరాజు, షానఫెజరుల్లా, అక్బర్‌షా అని ముగ్గురు కుమారులు. వీరిలో రెండవవాడైన షానఫెజరుల్లాకు షారాజు అనే కుమారుడు, అతనికి బడేసాహెబ్, మీర్‌సాహెబ్, షా సాహెబ్ అని ముగ్గురు కుమారులు. వీళ్ళలో పెద్దవాడైన బడేసాహెబ్ శృంగార మంజరీకర్త. ఈతడు - తపశ్శక్తి, తేజస్విత, ప్రజ్ఞ, ధర్మం మొదలైన గుణాల్లో తనకెవ్వరూ సాటిలేరనీ, తాను గొప్ప విద్వాంసుడననీ, అనిర్వచనీయ గుణసంపన్నుడననీ ఎంతో ఆత్మవిశ్వాసంతో చెప్పుకున్నాడు. చూడండి:

"కః కిల తపసా మహసా యశసా జ్ఞానేన ధర్మేణ
అభవద్భవిష్యతి జగతి బడేసాహేబేన సమః" (శ్లో. 9)

"యేషాం జ్యేష్ఠః శ్రీమాన్ విద్వాన్ మతిమాంశ్చకాస్తి విమలగుణః
(శ్లో. 11)

అకబరమవచో గోచభరగుణమపి యథామతి ప్రశంసంతి" (శ్లో. 14)

అంతేకాక అకవర (అక్బర్) అనే తనపేరు "అ-క-వర" అనే పదచ్ఛేదంతో బ్రహ్మ, విష్ణువులను అతిక్రమించిన వాడనే అర్థాన్ని సూచిస్తుందనీ, 'బడేసాహెబ్' అనే తన రెండో పేరు మహేశ్వరత్వానికి సూచకమనీ అక్బర్‌షా ఎంత ధీమాతో చెప్పుకుంటాడో పరిశీలించండి:

"కో విష్ణుః కో బ్రహ్మ
తాభ్యాం శ్రేష్ఠస్తతోఽప్యకవరోఽయమ్
ప్రథయతి మహేశ్వరత్వం
యస్య బడేసాహెబితి నామభ్యామ్" (13 శ్లో.)

అక్బర్‌షా తండ్రియైన షారాజు, గోలకొండను పాలించిన అబుల్‌హసన్ తానాషాకు రాజగురువుగా ఉన్నవాడు. తండ్రి తరువాత ఈ రాజగౌరవం అక్బర్‌షాకు ప్రాప్తించి ఉండవచ్చు. కనుకనే ఒక చోట "స్వయమకబరేణ భూభృన్మణి రంజితాంఘ్రికమలేన" అని తనను గురించి చెప్పుకుంటాడు.

అక్బర్‌షా తొలుత తెలుగులో రచించిన శృంగార మంజరికి ఇది తానే సంతరించుకున్న సంస్కృతానువాదమని అవతారికలోని క్రింది శ్లోకాలవల్ల తెలుస్తుంది.

"తేనాంధ్రభాషయాఽయం రచితః శృంగారమంజరీగ్రంథః
స్వయమకబరేణ భూభృన్మకుటమణి రంజితాంఘ్రికమలేన" (15 శ్లో.)
"తద్విరచితాంధ్రభాషాకలితాం శృంగారమంజరీచ్ఛాయామ్
సేవధ్వం సురవాణీరచితాం రసతోషతారసికభృంగాః" (16 శ్లో.)

దీన్నిబట్టి అక్బర్‌షా సంస్కృతంలోనే కాక తెలుగులో కూడా మంచి కవి పండితుడై విరాజిల్లి ఉంటాడని ఊహించవచ్చు. కాని, ఆతని తెలుగు శృంగారమంజరి మన కింతవరకూ లభ్యం కాలేదు.

శృంగార మంజరిలో ప్రకరణ విభాగమేమీ కానరాకపోయినా ఇందులో చర్చింపబడ్డ విషయాలను బట్టి దీన్ని నాయికా విభాగం, నాయక విభాగం, దూతీవిభాగం, రసవిభాగం అని నాలుగు విభాగాలుగా విభజించవచ్చు. నాయికా నాయక భేదాలు, దూతీ భేదాలు అతి విపులంగానూ, రసవిషయం సంక్షిప్తంగానూ చర్చింపబడ్డవి. నాయికా నాయక భేదాలను విపులంగా చర్చించిన గ్రంథాల్లో ప్రధానమైన భానుదత్తుని రసమంజరి శృంగారమంజరికి ఆధార గ్రంథంగా తోస్తుంది. ఐనా, చాలాచోట్ల అక్బర్‌షా రసమంజరికారుని అభిప్రాయాలను ఖండించినాడు. కాని, రసమంజరీ వ్యాఖ్యయైన 'ఆమోదా'న్ని మాత్రం పెక్కు చోట్ల ప్రామాణికంగా గ్రహించినాడు. రసమంజరీకారుడైన భానుదత్తుణ్ణి 'రస మంజరీ కారః' (పు. 19) అని ఏకవచనంలోనూ, ఆమోదవ్యాఖ్యాతయైన గుర జాలశాయి పండితుణ్ణి 'ఆమోదకారాః' (పు. 19) అని బహువచనంలోనూ పేర్కొవడం అక్బర్‌షాకు ఆమోదకారునిపై ఉన్న గౌరవభావాన్ని సూచిస్తుంది.

రసమంజరి, ఆమోదం, పరిమళం శృంగార తిలకం, రసికప్రియ, రసార్ణవం, ప్రతాపరుద్రీయం, సుందరశృంగారం, నరసకావ్యం, దశరూపకం, విలాసరత్నాకరం, కావ్యపరీక్ష, కావ్యప్రకాశం మొదలైన లక్షణ గ్రంథాల నెన్నింటినో పరిశీలించి తాను శృంగారమంజరీ గ్రంథాన్ని సంతరించినట్లుగ అక్బర్‌షా గ్రంథారంభంలో చెప్పుకున్నాడు. పై గ్రంథాల్లో పేర్కొబడ్డ 'నరస కావ్యం' నరస భూపాలీయం కావచ్చు. సుందరశృంగారం, రసికప్రియ అనేవి హిందీ లక్షణ గ్రంథాలు.

అక్బర్‌షా రచనా విధానం విశిష్టమైంది. ప్రాచీనాలంకారికులు చెప్పిన అభిప్రాయాలను యథాతథంగా గ్రహించలేదు అక్బర్‌షా. ఈతడు ప్రాచీనులు చెప్పిన లక్షణాల్లో అయుక్తమైనవాటిని పరిత్యజించి యుక్తమైనవాటిని మాత్రమే గ్రహిస్తూ, పూర్వగ్రంథాల్లో లక్షణాలు లేనివాటికి లక్షణాలను సంతరిస్తూ, ఉదా హృతులు లేనివాటికి ఉదాహరణలు చూపుతూ, వివరంగా చెప్పవలసినచోట వివరిస్తూ, సంక్షిప్తంగా చెప్పవలసినచోట సంక్షేపిస్తూ, పూర్వులు నామకరణం

చేయనిచోట్ల నామకరణం చేస్తూ, అయుక్త నామకరణం ఉన్నచోట్ల యుక్త నామకరణం చేస్తూ శృంగారమంజరిని రచించినాడు. ఈ విషయాన్ని తానే గ్రంథంలో స్పష్టంగా చెప్పుకున్నాడు. వీటిలో ఒకటి రెండింటిని మాత్రం పరి

విరహోత్కంఠితా లక్షణాన్ని వివరించే సందర్భంలో శృంగారమంజరీ కారుడు రసమంజరి, సాహిత్యరత్నాకరం, నాట్యశాస్త్రం, ప్రతాపరుద్రీయం, నాయకభూషణం, ఆమోదం మొదలైన గ్రంథాల్లో చెప్పబడ్డ విరహోత్కంఠితా లక్షణాల్లోని దోషాలను చూపుతూ "నివాస ఏవ కార్యాంతర వ్యాసంగప్రయుక్త ప్రియ విరహవతీ విరహోత్కంఠితా" (పుట. 19) అని స్వయంగా కొత్త లక్షణాన్ని నిర్వచిస్తాడు. ఇట్లా ప్రాచీనులు చెప్పిన లక్షణాలను తోసిపుచ్చి అక్బర్‌షా కొత్తగా నిర్వచించిన లక్షణాలెన్నో శృంగారమంజరిలో కనిపిస్తవి.

అనుశయాన అనే పరకీయా నాయికా భేదానికి ప్రాచీనాలంకార గ్రంథాల్లో భేదత్రయం ఉన్నట్లుగ చెప్పబడ్డా ఆ భేదాలు అనామకంగానే ఉన్నాయి. శృంగార మంజరిలో వీటికి విఘటిత సంకేత, అప్రాప్త భావి సంకేత, శంకిత సంకేత జారగమన అనే నూతన నామకరణం చేయబడింది అక్బర్‌షా ఈ విషయాన్ని ఇట్లా స్వయంగా చెప్పుకున్నాడు:

"ప్రాచీనాఖిలగ్రంథేషు అనుశయానాభేదత్రయస్యాపి నామకల్పనంనాస్తి, అస్మాభిర్నామాని కల్ప్యంతే."

అంతేకాక పెక్కుచోట్ల పూర్వ గ్రంథాల్లో లేని వివరణ కనిపిస్తుంది. నాయికా భేదాల్లోనూ, దూతీ భేదాల్లోనూ ప్రతిభేదానికి ఉత్తమా, మధ్యమా, అధమా అనే భేదత్రయం కల్పించడం, దూతీ భేదాల్లో విక్రేత్రీ, శంకితా అనే భేదాలను అవాంతర భేద సహితంగా నిర్దేశించడం మొదలైన వాటిని ఇందుకు ఉదాహరణంగా చెప్పవచ్చు.

అక్బర్‌షా అలంకార శాస్త్ర విషయాలను సునిశిత ప్రజ్ఞతో విశ్లేషించిన పండితుడు, విమర్శకుడు మాత్రమే కాదు; చక్కని కవిత్వాన్ని చెప్పగల

ప్రతిభాశాలి కూడా. గ్రంథారంభంలోని ఈ క్రింది గద్యభాగాన్ని పరిశీలిస్తే ఈ విషయం అవగతమౌతుంది.

"చతురబ్ధి పరివేష్టిత సర్వం సహేశనుత శౌర్యధైర్య మనోహర లావణ్య సంగీత లలిత సాహిత్య భావజ్ఞతా సదృక్పాండిత్య కలిత సులతాన్ అబుల్ హసన్ క్షోణీశమకుట తట దేదీప్యమాన రుచిరతర రత్నకిరణ నీరాజిత కల్ప తరు కిసలయ సదృశ చరణ గురురాజ శాహరాజభక్తి పాత్ర సద్గుణ గరిష్ఠ పరిమిత హిత వాక్య పాండిత్య యుక్త స్వమత పరమత సంపన్న సిద్ధాంత నిరంతర సంస్థాపనాఖిల నవరసాలంకార నవ్యగుణైక కవన ధౌరేయతా కలిత సన్నిధాన శ్రుతి స్వరస్థాన రాగాంగగాన క్రియా స్థాయి గమక ప్రబంధ ధాతు గాయన గుణ తతానద్ధ సుషిర ఘనగాత్ర భేద క్రియాగ్రహ జాతిమార్గ తాళ దేశికాతాల వేశికాతాల తత్వజ్ఞ నిధి పాలికాశ్రిత కవి బంధుమిత్ర బడే సాహె బాక్బర్ శాహః శృంగారమంజరీగ్రంథరాజం రుచిరం విరచయతి."

కేవలం లక్ష్యలక్షణ ప్రదర్శనైక పరమైన గ్రంథంగా కాక ప్రాచీన లక్షణ గ్రంథాల నెన్నింటినో ఆవలోడనం చేసి శృంగార మంజరిని ఒక విమర్శ నాత్మకమైన లక్షణ గ్రంథంగా సంతరించి సాహిత్య శాస్త్రానికి సేవచేసిన అక్బర్ షా చిరస్మరణీయుడు.

సంస్కృత శృంగారమంజరికి మూలమైన అక్బర్ షా "ఆంధ్ర శృంగార మంజరి" లభిస్తే అది తెలుగులోని అలంకార శాస్త్రానికి ఒక అమూల్యాలంకార మవుతుందనడంలో అతిశయోక్తి లేదు.

ఆధార గ్రంథం :

1. శృంగార మంజరి - సంపాదకులు డా॥ వి. రాఘవన్. హైదరాబాదు ప్రభుత్వంవారి పురావస్తు శాఖవారి ప్రచురణ 1951.

(సాహిత్యమాసపత్రిక "భారతి" - (డిసెంబర్, 1982) లో ప్రచురితం.)

# సింహాసనద్వాత్రింశతి – భాషాప్రయోగ విశేషాలు

కొరవి గోపరాజు రచించిన 'సింహాసనద్వాత్రింశతి' తెలుగు కథా కావ్యాల్లో చెప్పుకోదగ్గ గ్రంథం. విక్రమార్కుని సింహాసనంపై ఉన్న ముప్పై రెండు బొమ్మలు చెప్పిన ముప్పైరెండు కథలు ఈ కావ్యంలో రసవంతంగా వర్ణింపబడ్డవి. వ్యవహారంలోనూ, ఆశ్వాసాంత గద్యాల్లోనూ దీనికి 'సింహాసన ద్వాత్రింశిక' అనే పేరు కనిపిస్తున్నా, కవి చేసిన నామకరణం మాత్రం 'సింహాసనద్వాత్రింశతి' అనే. రసప్లావితంగా కథా కావ్యాన్ని రచిస్తూనే, దాన్ని ఒక విజ్ఞాన సర్వస్వంగానూ, నిఘంటురత్నంగానూ తీర్చిదిద్దే సంప్రదాయాన్ని గోపరాజే ఈ కావ్యంలో ప్రవేశపెట్టినాడు. తన కావ్యంలోని శైలిని గూర్చి అవతారికలో కవి ఈ విధంగా చెప్పుకుంటాడు :

"తెనుగునఁ దేటగాఁ గథలు దెల్పిన కావ్యము పొందులేదు మె
త్తన పస చాలదండ్రు విశదంబుగ సంస్కృత శబ్దమూడ జె
ప్పిన నవి దర్భుముండ్లనుచు బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్
దనర దెనుంగు దేశియును దద్భవముంగలయంగఁజెప్పెదన్."
(VI - 121)

పై పద్యం వల్ల గోపరాజు కవిత్వంలో దేశి, తద్భవ పదాలే అధికంగా చోటు చేసుకున్నాయని తెలుస్తుంది. కాని, ఈతని కవిత్వంలో దీర్ఘ సంస్కృత సమాస బహుళమైన రచన కూడా అక్కడక్కడా లేకపోలేదు. మాసర కొక్క పద్యం :

ప్రాలేయాచలచందనద్రవసుధాప్రాచుర్యవీచీలస
త్కేలీడోలవిశాలశీలసుమనః స్త్రీబాలఫాలస్థలా

వ్యాలోలాలకమూలికానుకలనవ్యాలంబరోలంబలీ
లాలోలాంబుజచిహ్నితంగనియె మధ్యాహ్నంబునన్ జాహ్నవిన్.
(VI - 121)

గోపరాజు తన కావ్యంలో భాషా విషయకంగా చూపిన ప్రత్యేకత ప్రశంసనీయం. తనకు పూర్వులుకానీ, తరువాతివారు కానీ ప్రయోగించని విలక్షణ శబ్ద ప్రయోగాలు, మాండలికాలు, దేశీయాలు, సామెతలు ఈ కావ్యంలో అడుగడుగునా కనిపిస్తాయి. ఈ కావ్యంలో కనబడే భాషాప్రయోగవిశేషాలను కొన్నింటిని చూపడమే ఈ వ్యాసం ఉద్దేశం.

## ధ్వనులు

i. శబ్దంలోని మధ్యమాక్షరం మీది అచ్చును లోపింపజేసి, సంయుక్తాక్షరాలతో గూడిన రూపాలను ప్రయోగించడం క్రింది ఉదాహరణల్లో కనిపిస్తుంది. ఈ రూపాల్లో లోపించే అచ్చు సాధారణంగా ర, న, డ అనే వర్ణాల మీదిదై ఉంటుంది.

ఉర్మ్రులు బెడ యనంగ (III-97)
ఆఱు నూఱేన్గుల నతని కిచ్చి (III-204)
ఇర్లహర్నిశ మంధతమసంబునకు (V-61)
ఉడ్కునూనె కొప్పెర (VI-126)

ii. ఒక్కొ-చోట ఛందస్సులోని ఆనుకూల్యంకోసం శబ్దాల్లోని ధ్వనుల్లో మార్పు కావింపబడింది.

మొకరతోరణములు మున్నుగాగ (X-45)

'మకరతోరణ' శబ్దంలోని మకారం మీది అకారం యతికోసం ఒకారంగా మార్పబడింది. "అపి మాషం మషం కుర్యాచ్ఛందోభంగం న కారయేత్" అని కదా ఛందోజ్ఞుల అభినివేశం. ఇట్లే "ఉజ్జయిని" అనే పదం ఉజ్జెని, ఉజ్జేని అనే రూపాల్లో కూడా కనిపిస్తుంది.

i) ఉజ్జేనికి డిగ్గి (II-123) ఉజ్జేనిలోన్ (I-163)
ఉజ్జేనికిన్ (VI-51) ఉజ్జేని వల్లభ (VIII-112)
ఉజ్జేని (VIII-4)

ii) ఉజ్జని కేతెంచి (I-137)

## విభక్తి ప్రత్యయాలు

I. శ. ర. లోనూ, సూ. ఆం. ని. లోనూ సంఖ్యార్థకమైన లక్ష శబ్దం మువర్ణరహితంగా "లక్ష" అనే చూపబడింది. కాని, ఈ కావ్యంలో "లక్షంబు" అనే రూపం కానవస్తుంది.

లక్షంబును, కోటియును (II-52)

II. సంస్కృత 'గరుడ' శబ్దాన్ని తెలుగులో తత్సమంగా గ్రహించేప్పుడు ఉత్వడుజ్జులు వచ్చి 'గరుడుడు' అనే ప్రథమైక వచన రూపం ఏర్పడుతుంది. సిం.ద్వా.లో ఈ రూపంతోపాటు గరుడడు, గరుడి అనే రూపాలు కూడా ప్రయోగింపబడ్డవి.

గరుడనికిత్తున్ (V-196) గరుడడు చక్రకంబు (II-111) యంత్ర గరుడినెక్కి (II-43) ఆ గరుడికి వెఱచి (V-189) వెఱుగుపడుచు నడలి గరుడి (V-230) కాష్ఠయంత్రంబున గరుడిజేసి (II-121)

III. చేను, పేను, మీను శబ్దాల్లోని నువర్ణానికి బహువచనంలోమాత్రమే లోపం వస్తుంది. కాని గోపరాజు కావ్యంలో ఒకచోట చేను శబ్దానికి 'చేలో' అనే సప్తమ్యేకవచనరూపం ప్రయుక్తం. 'చేలో మెచ్చుయినవి భుజియింపుడు' (I-173)

IV. "కువర్ణకంబు పరంబగునపుడుకారబుకారంబులకు నగాగమంబగు" అని చిన్నయసూరి సూత్రం. కువర్ణకం పరమైనపుడు నగాగమం రాని రూపాలు రెండు మాత్రమే ఈ కావ్యంలో కనిపిస్తున్నవి.

చాపుకింత (IV-136) విభీషణుకిచ్చి (IV-283)

## ఔపవిభక్తికాలు

ఔపవిభక్తికాలు కొన్ని అనౌపవిభక్తికాలుగానూ, అనౌప విభక్తికాలు కొన్ని ఔపవిభక్తికాలుగానూ ప్రయోగింపబడ్డ ఉదాహరణలు రెండు మూడు మనం గమనించవచ్చు.

I) పల్లును మెదలింపకుండెన (I-274)
నెయ్యింబోలెన్ (V-129)

II) చింతపంటి సరిగా (III-156)

## సంధులు

I) కొన్ని విశేష్య పదాల్లోనూ, క్త్వార్థక పదాల్లోనూ ఉన్న ఇద్వర్ణానికి సంధి చేసిన రూపాలు కొన్ని ఈ కావ్యంలో ప్రయుక్తాలు.

పుడమంతయునిచ్చి (I-169)
తిత్తొలిపింపదగు (III-60)
గంజియైనను నంబలైనను (IX-15)

II) మునిగున్నపగిది (IV-102)
మీఱ జూచిటు (VI-111)

III) అనంతర్యార్థకమైన 'డున్' చేరిన రూపాలకు పరపదాద్యచ్చుతో సంధి చేసిన రూపాలు ప్రాచీన సాహిత్యంలో కానరావు. గోపరాజు రెండుచోట్ల ఈ రూపాలను ప్రయోగించినాడు.

నీవీ కడకేలవచ్చితనుడేను (VI-63)
నావుడేను హూణనరపతి బంటన్ (VI-115)

III. ద్రుతద్విత్వసంధి వచ్చిన రూపాలు క్వాచిత్కంగా కనిపిస్తవి. పూర్తి కావ్యంలో, కింద చూపబడ్డ నాలుగు ప్రయోగాలు మాత్రమే లభించినవి.

తపంబున్నాత్మ (VI-30)
కస్తురి తిగురు మెయిన్నలది (VII-47).

ఇంకన్నధిక శ్రీరమ్య (IX- 60)
రాజిల్లుచున్నుండగన్ (X

## తత్సమాలు

సంస్కృతంలో మధుర శబ్దం ధర్మివాచకం, మాధుర్యం ధర్మవాచకం. ధర్మవాచకమైన మాధుర్య శబ్దం ప్రయోగించవలసినచోట ధర్మి వాచకమైన మధురశబ్దం ప్రయోగించబడింది.

మధురయుతములైన మారేడు పండుల (II-83)

"సహాయం" మొదలైన కొన్ని ధర్మి వాచకాలకు తెలుగులో ధర్మవాచకాలుగా వ్యవహారమున్నా మధుర శబ్దానికి మాత్రం ధర్మవాచకత్వం అప్రసిద్ధమే.

## దేశ్యపదాలు

దేశ్యపదాలను ప్రయోగించడంలో గోపరాజు చూపిన ప్రత్యేకత విశిష్టమైనది. పూర్వ కవుల్లోగానీ, అనంతర కవుల్లోగానీ కన్పడని అనేక దేశ్య శబ్దాలను సిం.ద్వా.లో గమనింపవచ్చు. గోపరాజు ప్రయోగించిన కొన్ని విలక్షణ పదాలనూ, వాటి అర్థాలనూ పేర్కొంటాను:

జానగిలు (I-20) బలాత్కృతమగు
ఉలుమడు (I-231) కుష్ఠరోగి
పొదపెట్టు (II-49, II-55) - ఆరోపించు
వెట్టము (II-138) విరోధి
నెలగ (II-157) - ధనము
వయ్యంది (I-95) - కుంపటి, కొలిమి
బిందించు (IV-259) - చల్లు, నివేదించు
సాకపట్టు (IV-259) -
పొంగు (V-66) - రహస్యము
ఫెంచ (X-39) - మడుగు

కాటుకమలక (V-299) - మసిమూకుడు
కాసించు (VII-102) - కాసెగాకట్టు
వితండము (VII-31) - విరోధము
పరిమాళించుట (VII-29, 36) మల్లవిద్యాక్రియావిశేషము
ఉద్దాలు (X-83) చెప్పులు
మగులు (X-121) గోడమీది కప్పు
దిచ్చు (X-84, 159) జూదరి
కొండరి (XI-15, 19, 26) గిరిజనుడు
భజనకెక్కు (II-113) స్తుతికెక్కు

## మాండలికాలు

గోపరాజు తెలంగాణా ప్రాంతానికి చెందినవాడు కావడంవల్ల తాను నివసించే ప్రాంతంలోని జనులవాడుకలో ఉండే పెండ (I-92), బొక్క (I-270, 274= ఎముక), అజ్జ (IV-270-గది), దివ్వెల పండుగ (VIII-47), పైకము (VII-103=ధనము) మొదలైన మాండలిక పదాల నెన్నింటినో తన గ్రంథంలో వాడినాడు. దివ్వెల పండుగ (దీపావళి పండుగ) అన్న పదానికి నేడు విద్యావంతుల వ్యవహారంలో ఆశ్రయం లేకపోయినా గ్రామీణుల వ్యవహారంలో దివిలె పండుగ, దీలి పండుగ ఇత్యాది వికృతరూపాలతో నేటికి అది భద్రంగా నిలిచి ఉన్నది.

'బొక్క' అనే పదానికి 'ఎముక' అనే అర్థం సూ.అం.ని.లో కానరాదు. శ.ర.కారుడు కూడా ఈ అర్థాన్ని వదలివేసినాడు.

## అన్యదేశ్యాలు

గోపరాజు కావ్యంలో అన్యదేశ్యాల ప్రయోగం తక్కువే అని చెప్పాలి. గలబ, జీబు అనే ఒకటి రెండు పదాలు మాత్రం కనిపిస్తున్నవి.

గలబ పుట్టకుండ నెడనెడి (VII-64)
ఇట్టి గలబలు సేయ (VII-30)
శ్రీకృష్ణవిలాసంబులును, జీబులును (III-188).

పైన పేర్కొన్న గలబ, జీబు అనే పదాలు క్రమంగా గల్‌భా, జేబ్ అనే పారసీక పదాలకు తద్భవరూపాలు. గల్‌భా అంటే అల్లరి, జేబ్ అంటే వస్త్రవిశేషం. డా॥ కె. గోపాలకృష్ణారావుగారు "తెలుగుపై ఉర్దూ, పారసీకముల ప్రభావము" అన్న గ్రంథంలో 'జిరా' అనే అన్యదేశ్యం కూడా సిం.ద్వా.లో ప్రయుక్తమైనట్లుగ తెలిపి కింది ప్రయోగాన్ని చూపినారు.

'వాగె వదలి జిరా గనగనం గదలించి తోలిన' (VIII-71) కాని, నేను చూచిన ప్రతిలో మాత్రం "వాగె వదలి రాగసంజ్ఞం గదలించి త్రోచిన" అనే పాఠమే ఉన్నది. ఈ పాఠంలో 'జిరా' అనే పదం కానరాదు.

## కృదంతాలు

భావార్థంలో ధాతువుపై టవర్ణకం వచ్చినప్పుడు ధాతువులో ఏ మార్పూ కలగదని అథర్వణుని ఉక్తి. ఈ నియమానికి విరుద్ధమైన ప్రయోగాలు ఎన్నో ఈ కావ్యంలో ఉన్నాయి.

లేకుంట (VI - 108) పీరుడుంట (VII-28)
మంట గంట పసిడిపంట గంట (IX-76)
జనులదింట (XI 65) కైకొంట (XI-95)
ఊరకుంట (XII-62)

## తద్ధితాంతాలు

కొండరుల్ (I-19)
కొండరికులంబు (XI-51)
కటకు కొండరులు (I-26) ఉలుమడు (I-231)

'కొండరి' అనేది కొండ శబ్దంపై 'అరి' ప్రత్యయం రాగా ఏర్పడిన రూపం. కొండలలో నివసించేవాడని అర్థం. నేడు మనం వాడుకునే 'గిరిజన' అనే సంస్కృత శబ్దానికి సమానార్థకమైన చక్కని దేశ్యశబ్దం. ఉలుమడు అన్నది 'ఉలుము' శబ్దంపై మతుబర్థంలో అప్రత్యయం రాగా ఏర్పడిన రూపం. కుష్ఠరోగి అని అర్థం.

## వ్యావహారిక ప్రయోగాలు

ఆయన ఘనత యెట్టిదంటేని (II-8)
తనూభవుల వద్దికి (IX-102)

గోపరాజు సంస్కృత భాషా పాండిత్యాన్ని వ్యక్తంచేసే అనేక ప్రయోగాలు సిం.ద్వా.లో ఉన్నా సంస్కృత వ్యాకరణ నియమాలకు విరుద్ధంగా కనబడే యీ క్రింది ప్రయోగాలు కొన్ని ఇందు చోటు చేసుకున్నవి.

దూరతమము (V-39) ఏకోనవింశతిమ ద్వారము (VIII-2) మనోల్లాసము (IX-63)

## సామెతలు - జాతీయాలు

అడుగడుగునా తెలుగు సామెతలూ, జాతీయాలూ వాడుతూ గోపరాజు తన కథా కథన శిల్పానికి మరింత మెరుగులు దిద్దినాడనడం స్వభావోక్తి. ఈ క్రింది సామెతలూ, జాతీయాలూ ఎంతో హృదయావర్జకాలు.

I) సానలబట్టి తీర్చినను సన్నపు రత్నము వన్నె కెక్కుదే (II-15) కుక్కలకు దొంతులు వేర్వగ నేర్పు గల్గునే (-16) జల్లి సేయునది కట్టెడు పుట్టము సేయ నేర్చునే (I-20) కడుపిట గాలంగ గంట కాటుక యేలా (I-86) సన్మార్గికి కలియుగమున సౌఖ్యము గలదే (II-72) కడి యేగివచ్చి యంగిట బడునే (VI-71) ఏనుగు జిక్కునేని మఱి యెంపెలిచెట్టుకు గట్టవచ్చునే (X-27)

II) వఱుత జింతపండు గలుపుట (I-19) గంజిలో మెతుకు గల్గిన క్రొవ్వుట (II-41) మూర్ఖు భారతపర్వంబు పఠింపబూనుట (VIII-2)

గోపరాజు కావ్యంలో కన్పట్టే భాషా ప్రయోగ విశేషాలను కొన్నింటిని మాత్రమే స్థాలీపులాక న్యాయంగా చూపడం జరిగింది.

('వివేచన' పత్రికలో ప్రచురితమైన వ్యాసం.)

# సంస్కృతీకరింపబడ్డ తెలుగుకావ్యాలు

తెలుగునుండి సంస్కృతీకరింపబడి మనకిప్పుడు లభ్యమౌతున్న గ్రంథాల్లో గురురాజకవి (క్రీ.శ. 15వ శతాబ్ది) రచించిన సంస్కృత పండితారాధ్య చరిత్ర కాలక్రమంలో ప్రథమమని చెప్పవచ్చు. పాల్కురికి సోమనాథుడు తెలుగులో రచించిన పండితారాధ్య చరిత్రకు ఇది సంస్కృతానువాదం. గురురాజకవి పండితారాధ్య చరిత్రను సంపూర్ణంగా సంస్కృతీకరిస్తే ఆధునికులైన శ్రీ శివపురపు రాజలింగసూరి పండితారాధ్య చరిత్రలోని దీక్షాప్రకరణాన్ని మాత్రమే 'చారిత్ర దీక్షా ప్రకరణమ్' అనే పేరుతో సంస్కృతీకరించి ప్రకటించినారు.

పాల్కురికి సోమనాథుడు ఉదాహరణ ప్రక్రియలో బసవోదాహరణమనే గ్రంథాన్ని తెలుగులోనేకాక సంస్కృతంలోనూ వ్రాసినట్లుగ తెలుగు సాహిత్య చరిత్రల్లో పేర్కొనబడి ఉంది. ఈ సంస్కృత బసవోదాహరణం సోమన తెలుగులో సంతరించిన బసవోదాహరణానికి తానే కావించిన సంస్కృతానువాదం కావచ్చు.

సంస్కృతీకరింపబడ్డ తెలుగు గ్రంథాల్లో వీటి తరువాత పేర్కొనదగ్గ కావ్యం కాళహస్తి కవి రచించిన సంస్కృత వసుచరిత్ర. ఇది రామరాజ భూషణుడు తెలుగులో రచించిన 'వసుచరిత్ర' ప్రబంధానికి సంస్కృతానువాదం. తెలుగు సాహిత్యంలో రామరాజభూషణుని వసుచరిత్ర కొక విశిష్టమైన స్థానం ఉంది. శ్లేష చమత్కారాలకూ, వ్యంగ్య వైభవానికీ, శబ్దాలంకార వైచిత్రులకూ తెలుగు వసుచరిత్ర పెన్నిధి. దీనికి సంస్కృతంలోనే కాక తమిళ, కన్నడా ల్లోనూ అనువాదాలు వచ్చినవి. కొంత భాగానికి ఆంగ్లీకరణం కూడా జరిగింది.

చాలా కాలంగా అముద్రితంగా ఉన్న కాళహస్తి కవి సంస్కృత వసు చరిత్ర కావ్యాన్ని ఆచార్య బి. రామరాజుగారు పరిష్కరించి విపులమైన ఆంధ్రాంగ్ల పీఠికలు సంతరించి 1965 లో ముద్రింపించినారు. కాళహస్తి కవి పదహారో శతాబ్దికి చెందినవాడు. కంచి కామాక్షీదాసుడు. ఈతడు తన సంస్కృత వసుచరిత్రలో కేవలం భావానువాదం మాత్రమే చేయక మూలంలోని ప్రతి పద్యాన్నీ సంస్కృత శ్లోకంగా అనువదించినాడు. రామరాజ భూషణుడు చూపిన సొగసులన్నింటినీ కాళహస్తి కవి తన అనువాదంలో చూపలేకపోయినా అందులోని శ్లేషచమత్కారాలను, శబ్దాలంకారాలను సాధ్యమైనంతవరకు ప్రదర్శించి సఫలుడైనాడనే చెప్పాలి.

మూలపద్యంలోని శ్లేష సంస్కృత పదాల్లో నిబద్ధమై ఉన్నప్పుడు అట్టి శ్లేషను సంస్కృతాను వాదంలో నిబంధించడం అంత కష్టసాధ్యమేమీ కాదు. కాని, శ్లేష అచ్చ తెలుగు పదంలో ఉన్నప్పుడు దాన్ని సంస్కృతంలోకి తేవడం ప్రతిభావంతుడైన కవికి మాత్రమే సాధ్యమయ్యే విషయం. కాళహస్తికవి తెలుగు పదాల్లోని శ్లేషను కూడా సంస్కృతంలో ఎంతో నైపుణ్యంతో నిర్వహించినాడనే చెప్పవచ్చు. ఒక ఉదాహరణం పరిశీలించండి:

'పల్గొమ్మలఁ జెందువారలు తగుల్వీరియాటలు నేరకుందురే' (3-138)

అన్న పద్య పాదంలో 'పల్గొమ్మలు జెందువారలు' అనే పదానికి అనేక స్త్రీలను చేరేవారని విటపరంగాను, అనేక వృక్ష శాఖలను చేరేవని తుమ్మెదల పరంగానూ రెండర్థాలు ఉన్నాయి. 'కొమ్మ' అనే పదంలో శ్లేష. ఈ శ్లేషను కాళహస్తికవి సంస్కృతంలో ఎలా నిబంధించినాడో చూడండి:

'వైదగ్ధ్యమేతదుచితం విటపాళిభాజామ్' (3-177)

మూలంలో మాదిరిగా రెండర్థాలు వచ్చేట్లుగా 'విటపాళి' అన్న పదం ప్రయోగించి ఎంతో నేర్పుతో శ్లేషను అనువాదంలోకి తీసుకురావడం ప్రశంసింపదగ్గ విషయం. విట+పాళి, భాజామ్ అని పద విభాగం చేస్తే విటపరంగానూ; విటప+అళి, భాజామ్ అని పదవిభాగం చేస్తే తుమ్మెదల పరంగానూ అర్థాలు చెప్పవచ్చు.

మూలంలోని శ్లేషార్థాలనేకాక శబ్దాలంకార వైచిత్రిని కూడా తన సంస్కృతానువాదంలో కాళహస్తి కవి ఎంతో మనోహరంగా సంతరించినాడు. ఒక్క ఉదాహరణం:

'తరువులపొంతఁ బొంచి వసుధావరమిత్రుఁడు గాంచె నచ్చటం
దరుణిఁదమోవినీలకచఁ దామరసోదరసోదరప్రభం
దరళవిలోచనం దతనితంబఁ దటిన్నిభగాత్రవల్లరిం
దరుణశశాంకఫాలనొక తన్విఁదరంగవళిం దలోదరిన్' (2-25)

రామరాజభూషణు డీ పద్యంలో అనేక తకారాది పదాలను వాడి పద్యానికి శబ్దగతమైన ఒక వైచిత్రిని కూర్చినాడు. కాళహస్తి కవికూడ యీ శబ్దసౌందర్యాన్ని అనువాదంలో ఎంత భద్రంగా పొందుపరచినాడో చూడండి:

"తారానాథముఖీం తమోఘనకచాం తాళస్తనీం పద్మభాం
తామ్రోష్ఠీం తరళేక్షణాం తతగురుశ్రోణీం తటిద్భాసురామ్
తన్వీం మధ్యతనుం తరంగవలికాంతర్వ్యాప్తరేఖాలికాం
తత్రైకాం తరుణీం దదర్శ స తదా తాదృక్తరుచ్ఛాదితః" (2-30)

మూలంలోని శబ్దాలంకార వైచిత్రి అనువాదంలో సాధ్యం కానిచోట్ల కాళహస్తి కవి తెలుగు యతిప్రాస నియతిని పాటిస్తూనో, మరొక రీతిగానో నాద సౌందర్యాన్ని పోషించడానికి ప్రయత్నించినాడనడానికి ఈ కింది పద్యం అనువాదం ఒక నిదర్శనం:

మెఱుగొప్పు నెఱిగొప్పు నెఱగప్పు తఱిగప్పు
జలదమాలిక చొప్పు తెలుపలేదొ (3-69)

రామరాజ భూషణుని పై పద్యంలోని శబ్ద చిత్రతను కాళహస్తి కవి తెలుఁగుయతిని పాటిస్తూ భంగ్యంతరంగా పోషించినాడు.

"ధమ్మిల్లోజ్జ్వలనీలిమైవ తనుతే ధారాధరాళి ప్రభాం
నేత్రశ్రీ ర్నితరాం కరోతి నియతాం నీలోత్పలాలీవిభామ్
కన్యాయాః స్మితకాంతిరేవ కురుతే కామం సుధాబ్ధిద్యుతిం
గాత్రశ్రీర్గ్ఘణసాధికాం కలయతే గాంగేయవల్లీరుచిమ్" (3-(

ఈ రీతిగా రామరాజ భూషణుడు ప్రదర్శించిన శ్లేష వైచిత్రినీ, శబ్దాలంకార సౌందర్యాన్నీ కాళహస్తి కవి తన అనువాదంలో తెలుగు యతి నియతిని పాటిస్తూ ఎంతో సముచితంగా పోషించినాడనే చెప్పవచ్చు.

పైన పేర్కొన్న కవులు తప్ప ప్రాచీనుల్లో తెలుగు కావ్యాలను సంస్కృతీకరించిన కవులు కానరారు. ఆధునిక సంస్కృతకవులు కొంద రీ ప్రక్రియను ఆదరించి పోషించినారు. అట్టివారిలో కుంటిమద్ది శేషశర్మ, గిడుగు సీతాపతి, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, గుండేరావు హర్కారే, లంకా కృష్ణమూర్తి గారలు అగ్రగణ్యులు.

సంస్కృతీకరింపబడ్డ తెలుగు కావ్యాల్లో వసుచరిత్ర తరువాత పేర్కొనదగ్గ కావ్యం మనుచరిత్ర. ఆంధ్ర కవితా పితామహుడైన అల్లసాని పెద్దన తెలుగులో ప్రబంధ రీతిలో సంతరించిన కావ్యం మనుచరిత్ర. దీనిని కుంటిమద్ది శేషశర్మగారు లలితమైన శైలిలో 'మనుసంభవః' అనే పేరుతో సంస్కృతీకరించినారు. మత్తేభాలు, ఉత్పలమాలలు, చంపకమాలలు సంస్కృత చ్ఛందోజన్యాలైన వృత్తాలే ఐనా వాటికి సంస్కృతంలో వినియోగం తక్కువ. శిశుపాలవధ కావ్యంలో ఎక్కడో ఒక చంపకమాల కనిపిస్తుంది.[1] తెలుగు కవులు విశేషంగా వాడిన యీ వృత్తాలను శేషశర్మగారు యథేచ్ఛంగా తమ సంస్కృతానువాదంలో వాడుకున్నారు. సీసం, ఆటవెలది, తేటగీతి మొదలైన దేశిచ్ఛందస్సులను కూడా శర్మగారిందులో ప్రవేశపెట్టి, కావ్యానికి నవీనత సంతరించడం మరో విశేషం. "నిడుద పెన్నెఱి గుంపు జడగట్ట సగరు మున్మనుమండు తపము గైకొనిన చోటు" అన్న హిమవత్పర్వత వర్ణనంగల సీసపద్యాన్ని శర్మగారు సీసంలోనే ఎలా సంస్కృతీకరించినారో గమనించండి.

"జటతి దీర్ఘ శిరోజపాశేఽత్ర సగరస్య
నప్తా తపశ్చర్యాం చకార
దర్శయంతీ జరత్కమఠకర్పరమత్ర
నాకాపగా జగత్యవతతార

---

1. 3-82 మల్లినాథుడు దీన్ని 'చంపకావళీ' అని పేర్కొన్నాడు.

అద్రీంద్రకన్యా విధూయ త్రపా మద్య
పతి సేవనాయాసమనుబభూవ
ఫాలాక్షనయనాగ్ని కీలావృతో హంత
భస్మీబభూవ సూనాశుగో౽త్ర
మదనతాపేన వివ్యథే పావకో౽త్ర
తాపసకళత్రసౌందర్యదర్శనేన
శరవణ మసూత దేవసేనాన్యమత్ర
నన్వితి దదర్శ భూసురః కౌతుకేన" (1-58)

కుంటిమద్ది శేషశర్మగారు శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదనుకూడా 'శ్రీవిష్ణుచిత్తీయం' అనేపేర సంస్కృతీకరించినారు.[2] తత్సమ పదభూయిష్ఠమైన మనుచరిత్రవంటి లలిత ప్రబంధాలను సంస్కృతీకరించడం సులభమేకాని దేశ్యపదభూయిష్ఠమూ, అప్రసిద్ధపదభూయిష్ఠమూ ఐన ఆముక్తమాల్యదవంటి ప్రౌఢ ప్రబంధాన్ని సంస్కృతీకరించడం కష్టసాధ్యమే. ఈ విషయాన్ని శర్మగారు స్వయంగా 'మనుసంభవవన్నేదం సులభం పరివర్తనాయ సుఖదమపి' అని చెప్పుకున్నారుకూడా. ఐనా ఉభయభాషా విద్వాంసులు, ప్రతిభావంతులు శ్రీ శర్మగారు ఎంతో సమర్థతతో ఈ ప్రబంధాన్ని సంస్కృతీకరించి సంస్కృతాంధ్ర విద్వాంసులను అలరించినారని చెప్పవచ్చు. శర్మగారి సంస్కృతానువాదాన్ని చదువుతున్నప్పుడు అది అనువాదమనే ఊహే మనకు కలుగదు. స్వతంత్ర రచనలాగే భాసిస్తుంది. ఇది ఉత్తమ అనువాద లక్షణం.

శర్మగారు ఈ కావ్యంలో పద్యానికోపద్యం చొప్పునే చాలావరకు అనువాదం చేసినా ఒక్కోచోట సీసం మొదలైన పెద్ద పద్యాలను రెండు మూడు శ్లోకాలలో అనువదించడం కనిపిస్తుంది. వీరి మనుచరిత్రానువాదంలో మాదిరిగా ఇందులో కూడా సీసం, ఆటవెలది, తేటగీతి మొదలైన తెలుగు ఛందస్సులను వాడి నూతనత్వాన్ని సంతరించినారు. అలాగే సంస్కృతవృత్తమే ఐనా సంస్కృతంలో అత్యతివిరళంగా వాడబడిన చంపకమాల (చంపకావళి)ను ఈ కావ్యంలో

2. రాధాకృష్ణయ్య శకుంతలమ్మ ఫౌండేషన్, కల్లూరు, ఆర్.ఎస్. 515774 వారి ప్రచురణ (1989)

అక్కడక్కడా వాడుకున్నారు (చూ. 2-7, 58). ఐతే, దీర్ఘసంస్కృత సమాసాలతోకూడిన పద్యాలకు సంస్కృతీకరణలోకూడా అదే ఛందస్సును వాడడంవల్ల అనువాదంలో మళ్ళీ అదే పాదం పునరుక్తం కావడం కనిపిస్తుంది. ఈ కింది ఉదాహరణం గమనించండి:

**తెలుగు :**

"ఖనటత్ప్రయోబ్ధివీక్ష్యరసాతలాన్యోన్య
పిండీకృతాంగ భీతాండజములు
ధృతకులాయార్థ ఖండితసమిల్లవరూప
చరణాంతికభ్రమత్తరువరములు" (ఆముక్తమాల్యద 1-3)

**సంస్కృతం :**

ఖనటత్ప్రయోధివీక్ష్యరసాతలాన్యోన్య
పిండీకృతాంగ భీతాండజాని
ధృతకులాయార్థ ఖండిత సమిల్లవరూప
చరణాంతికభ్రమత్తరువరాణి (శ్రీ విష్ణుచిత్తీయమ్ 1-3)

ఇందులో విభక్తి మాత్రమే భాషాంతరీకృతమై కనిపిస్తుంది. ఇలాంటి చోట్ల కవి భిన్నవృత్తాన్ని గ్రహించి ఉంటే సమంజసంగా ఉండేదేమో!

సంస్కృత సమపదాలు ఎక్కువగా ఉన్న పద్యాన్ని కానీ, సులభమైన దేశ్యపదాలున్న తెలుగుపద్యాన్ని కానీ సంస్కృతీకరించడం కష్టం కాదు. కాని అప్రసిద్ధమైన తెలుగుపదాలూ, సమానార్థక సంస్కృత పదాలు అంత సులభంగా దొరకని తెలుగుపదాలూ ఉన్న పద్యాన్ని సంస్కృతీకరించడమంటే కష్టమే. కాని శర్మగారు ఇలాంటి పద్యాలను కూడా ఎంతో నేర్పుతో అనువదించినారు.

గురుగుంజెంచలి తుమ్మి లేఁదగిరిసాకుందింత్రిణీపల్లవో
త్కరముంగూడఁబొరంటి నూనియలతో.... (4-13)

అనే రాయల పద్యంలోని గురుగు, చెంచలి, తుమ్మి, తగిరిస మొదలైన శుద్ధ దేశ్యశబ్దాలకు సంస్కృత పదాలను గుర్తించి ఎలా అనువదించినారో చూడండి:

"ఘూరండీ కుఱుజప్రపున్నట దళాన్యామ్లచ్ఛదైర్వ్యంజనం
పక్వీకృత్య కృతం సతైలమజహద్వాష్పం చ జగ్ద్వాదనమ్
మంచే ఛాగవిడంతికే వనగతాంబైర్లిహ్యమానా ముదా
వత్సైః ప్రాభవయుక్తరెడ్డికులజా వర్షేషు సంశేరతే" (4-170)

ఒక ప్రౌఢ ప్రబంధాన్ని స్వతంత్ర కావ్యం అన్నట్టుగా సంస్కృతీకరించిన కుంటిమద్ది శేషశర్మగారి ప్రతిభ ప్రశంసనీయం.

పింగళి సూరన రచించిన కళాపూర్ణోదయం తెలుగు సాహిత్యంలో అద్వితీయమైన రచన. కథా కల్పనాశక్తి, నాటకీయత, తెలుగు జాతీయాలు, సామెతలు - వీటికి పెన్నిధి. ఆధునిక యుగంలో ఉభయ భాషల్లోనూ కవి పండితులుగా పేరుపొందిన సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు ఈ కావ్యాన్ని 12 సర్గల కావ్యంగా సంస్కృతీకరించినారు. సూరనార్యుని కవితాశిల్పం అనువాదంలో సమగ్రంగా సంతరింపబడిందనటంలో సందేహం లేదు. శాస్త్రిగారి శైలి వైదర్భీ రీతిలో సాగి ఎంతో హృద్యంగా ఉంటుంది. ఇద్దరు రంభల సంవాదాన్ని వర్ణిస్తూ సూరన చెప్పిన ఈ కింది పద్యంలోని తెలుగు గృహిణుల పోరుతీరును శాస్త్రిగారెంత హృద్యంగా, సహజంగా సంస్కృతీకరించినారో గమనించండి:

**తెలుగు**

అంత మదింపకువే యని పల్కిన
నంత మదింపకువే యనుచున్
గంతు లడంచెద లెమ్మని పల్కిన
గంతులడంచెద లెమ్మనుచున్

ఒట్టుసుమీ యన్న నొట్టుసుమీ యంచు
నేమేమి యనిన నేమేమి యనుచుఁ
గానిగదే యన్నఁ గానిగదే యంచు
నింకేల యనిన నింకేల యనుచు

నోసి పోవే యన్న నోసి పోవే యంచు
నౌ నంటివనిన నౌ నంటివనుచు
మఱవకు మిదియన్న మఱవకు మిదియంచు
నీవెంత యనిన నీవెంత యనుచు (క.పూ. 3-206, 207)

**సంస్కృతం :**

త్వం పిధేహి ముఖమిత్యుదీరితే
త్వం పిధేహి ముఖమిత్యుదీరితమ్
మా దృపస్త్వమితి భాషితే పున
ర్మా దృపస్త్వమితి భాషితం పునః

న త్వాం మన్యే తృణాయేతి ధిక్కృతే చైకయా క్రుధా
న త్వాం మన్యే తృణాయేతి ధిక్కృతం చాన్యయా రుషా
హంజేఽపేహీతి రసితే హంజేఽపేహీతి రాసితమ్
ఉక్తే మా విస్మరేత్యుక్తం భూయో మా విస్మరేతి చ
కియతీ త్వమితి ప్రోక్తే కియతీ త్వమితీరితమ్
పశ్యామీత్యబ్రవీదేకా పశ్యామీత్యాహ చాపరా (పుట. 75)

**సూ**రన ప్రయోగించిన తెలుగు జాతీయాలను, సామెతలను శాస్త్రిగారు యథాతథంగా సంస్కృతీకరించి ప్రయోగించడం గమనింపదగ్గ విషయం. కొన్ని జాతీయాలకూ, సామెతలకూ వారు చేసిన సంస్కృతానువాదాలను పరిశీలించండి.

i) నీరుకొలది తామర సుమ్మీ (2-95)
జలావధి జలేరుహమ్ (పుట. 29)

ii) చెవిటికి బట్టినట్టి శంకును బోలెన్ (2-96)
గీతం వా బధిరశ్రుతౌ (పుట. 29)

iii) కంటికి రెప్పవలె
నేత్రం పక్ష్మేవ (పుట. 104)

iv) పేదకోపమెందు పెదవుల చేటు (6-30)
నిర్వీర్యస్య క్రోధ ఓష్ఠదంశనాయైవ కల్పతే (పుట. 158)

v) బట్టతలలు మోకాళ్ళు ముళ్ళు పెట్టగలదు (6-77)
గ్రథ్నాతి జానుఫలకం శిరసా ఖల్వాటకస్య సంయోజ్య (పుట. 167)

vi) ఆడఁబోయిన తీర్థమెదురయ్యె
యత్తీర్థం మనసి యియాసితం తదేవాయాతం మే పురతః (పుట. 181)

vii) ఇల్లలికినఁబండువగునె (3-201)
గృహాలేపేనైవ పర్వ సంపన్నమ్? (పుట. 75)

viii) కన్నుండంగను పాపందివియ నేర్పుగల మునిముచ్చు (3-199)
బింబం చ నయనమధ్యాదపహర్తుమియం మలిమ్లుచా కుశలా
(పుట. 74)

ix) సాధకబాధకాలు
సాధకబాధకాని (పుట. 189)

పై ప్రయోగాలు శాస్త్రిగారి నూత్న ప్రయోగ ప్రవణతకు చక్కని నిదర్శనాలు.

సూరనార్యుని ప్రతిభావిలసితమైన మరో కావ్యం ప్రభావతీ ప్రద్యుమ్నం. గుండేరావు హర్కారేగారు దీన్ని చంపూ రూపంగా సంస్కృతీకరించినారు. వీరు బహు భాషాకోవిదులు. వాచస్పతి బిరుదాంకితులు. హర్కారేగారు తమ 90 వ ఏట కండ్లు సరిగా కానరాని స్థితిలో శిష్యులెవరో మూలాన్ని చదువుతూ ఉంటే వింటూ ఈ అనువాదరచన చేసినారంటే వారి పట్టుదల ఎట్టిదో మనం అర్థం చేసుకోవచ్చు. ఈ కావ్యం అముద్రితంగానే ఉంది. హర్కారే గారి శైలీమాధుర్యాన్ని తెలుసుకోవటానికి ఒక్క శ్లోకం ఉదాహరిస్తాను :

"ప్రభావత్యా వాణీ మధురరసనాయాం స్థితవతీ
స్వరే మాధుర్యం స్యాదధికమితి భక్త్యా ద్విజపికః
శుకో వా సంపూజ్య స్వఫలముపహారార్థమదదాత్
ధ్రువం తస్యా ఓష్ఠం నవకిసలయం బింబమథవా"

మహాభక్తుడూ, సహజ పాండిత్య బిరుదాంకితుడూ ఐన బమ్మెర పోతన రచించిన ఆంధ్ర మహా భాగవతానికి ఉన్నంత ప్రచారం కానీ, విశ్వజనీనత

కానీ తెలుగులో మరే గ్రంథానికీ లేదని విద్వాంసుల అభిప్రాయం. దీనికి పోతన మధురమంజులమైన శైలీ, భక్తిరసమయమైన వస్తువూ కారణం కావచ్చు. ఇట్టి మహా గ్రంథంలోని కొన్ని రసవద్ఘట్టాలు అనువదింపబడి 'ఆంధ్రభాగవతానువాదః' అనే పేరుతో ప్రకటింపబడ్డాయి. అనువాదకులు సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు. ఆంధ్ర మహా భాగవతమే సంస్కృత భాగవతానికి అనువాదం కదా! ఇక మళ్ళీ దాన్ని సంస్కృతీకరించడంలో ఔచిత్యమేమిటనే సందేహం రావచ్చు. కాని, పోతన సహజంగా భక్తుడు కావటంవల్ల వ్యాస భాగవతాన్ని యథాతథంగా కాక భక్తితత్త్వాన్ని వివరించేప్పుడు ఆవేశపరుడై తన ఆంధ్రానువాదాన్ని మూలం కన్న ఎంతో విస్తృతం చేసినాడు. మూలంలో లేని సొగసులనెన్నింటినో అనువాదంలో సంతరించినాడు. అందువల్ల పోతన భాగవతం సంస్కృతీకరింపబడటం సార్థకమనే చెప్పవచ్చు. గజేంద్రమోక్షం, వామనావతారం, ప్రహ్లాద కథ, గోపీకృష్ణవిలాసం, కంసవధ, ఉద్ధవసందేశం భ్రమరగీతాలు - రసవత్తరమైన ఈ ఆరు ఘట్టాలను రసవత్తరంగా అనువదించినారు. శాస్త్రిగారి అనువాదం మూలవిధేయమై సహృదయరంజకంగా ఉంటుంది. మకరిచే పట్టుబడ్డ గజేంద్రుని దీనాలాపాన్ని పోతన "లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె" (8-98) అన్న పద్యంలో ఎంతో కరుణరస స్ఫోరకంగా వర్ణించినాడు. దీనికి శాస్త్రిగారి అనువాదాన్ని పరికించండి:

"క్షీణం మేఽంగబలం ధృతిర్విచలితా స్థానాచ్చ్యవంతేఽసవః
సమ్మూర్ఛోస్మి భృశం కృశోస్మి నితరాం స్విన్నోస్మి ఖిన్నోఽస్మి చ
న త్వద్వేద్మ్యపరం శరణ్యమవ మాం క్షాంత్వాపరాధాన్ రయా
దాయాహీశ్వర పాహి మాం వరద భో సంరక్ష సర్వేశ్వర" (పుట. 90)

పోతన వృత్త్యను ప్రాసాది శబ్దాలంకారాల మూలంగా సంతరించిన అపూర్వమైన రామణీయకాన్ని శాస్త్రిగారు అనువాదంలో చక్కగా పోషించినారు. గజేంద్రమోక్షంలోని ఒక ఉదాహరణను పరిశీలించండి:

**పోతన భాగవతం :**

తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్ల బంధంబుతో
శాటీముక్త కుచంబుతో సదృఢ చంచత్కాంతితో శీర్ణలా
లాటాలేపముతో మనోహర కరాలగ్నోత్తరీయంబుతోఁ
గోటీందుప్రభతో నురోజభరసంకోచ ద్విలగ్నంబుతోన్ (8-102)

**శాస్త్రిగారి అనువాదం :**

ఇత్యాందోళితకర్ణికా కుచతటీస్రస్తోత్తరాసంగికా
స్కంధాలంబితవేణికా విగళితప్రాంచన్మణీకాంచికా
స్వేదస్విన్నలలాటికా రుచిర భాలాన్తరీనీలాలకా
భర్త్రాకృష్టకుచాంశుకా స్ఖలితగత్యైత్యంబుధేః కన్యకా (పుట-56)

శాస్త్రిగారు ఆంధ్రభాగవతంలోని కొన్ని ఘట్టాలను పద్యరూపంలో అనువదిస్తే గరికపాటి లక్ష్మీకాంతయ్యగారు వచన రూపంలో సంస్కృతీకరించి ఆంధ్రేతరులైన సంస్కృతజ్ఞులకు పోతన భాగవత రామణీయకాన్ని చవి చూపించినారు.

తిక్కనగారి పద్యరచనా శిల్పం నిర్వచనోత్తర రామాయణంలోనే పరిణతి నందుకొన్నది. అందులో లేని అందాలు భారతంలో లేవు. తిక్కన భారతాన్ని రచించకపోయినా నిర్వచనోత్తర రామాయణంవల్లే ఆంధ్ర సాహిత్యంలో శాశ్వత యశస్సును పొంది ఉండేవాడని విమర్శకుల అభిప్రాయం. ఇంతటి ప్రశస్తికి పాత్రమైన నిర్వచనోత్తర రామాయణం సంస్కృత, కన్నడాంధ్ర కవితారాధకులు శ్రీ లంకా కృష్ణమూర్తిగారిచే సంస్కృతీకరింపబడటం ప్రశంసనీయమైన విషయం. ఈ అనువాదం ముద్రణ కావలసి ఉంది. కృష్ణమూర్తిగారి అనువాద వైఖరి తిక్కన నిర్వచనోత్తర రామాయణ రాష్ట్రాంతర ఖ్యాతికి తోడ్పడగలదని భావించవచ్చు. వీరి అనువాదానికి ఒక్క ఉదాహరణ:

**నిర్వచనోత్తరరామాయణం :**

"గుణమున, లస్తకంబునను, గోటియుగంబునఁ, గేలఁ, దారభీ
షణముగ నుప్పతిల్లి రభసంబుగ రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణ నికరంబు లొక్కట నరాతి బలంబులఁ గప్ప శార్ఙ్గని
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్ (3-18)

**కృష్ణమూర్తిగారి అనువాదం :**

శింజిన్యామపి లస్తకే చ యుగళే కోట్యోః కరే చ స్వయం
సంభూయ ప్రసభం భయంకరవిధా వుజ్జృంభమాణైరివ

అత్యాశ్చర్యకరైః శరైస్తు యుగపత్సంభావయన్ శాత్రవాన్
రేజే జ్యానినదేన పద్మనయనో రోదోంతరం భేదయన్।

ఈ శ్లోకం శ్రీ ఆవంచ వీరాంజనేయులుగారు శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయానికి సమర్పించిన "తిక్కన నిర్వచనోత్తర రామాయణము - ఒక పరిశీలనము" అన్న అముద్రిత సిద్ధాంతవ్యాసగ్రంథంనుండి గ్రహింపబడింది. (పుట 2-58.)

ప్రాచీనాధునికాంధ్ర కవిత్వాలు రెండింటి మాధుర్యాన్ని తమ 'కవితోదయ చంద్రిక' ద్వారా సంస్కృత భాషాభిజ్ఞులకు అందించిన విద్వత్కవులు డా॥ గిడుగు సీతాపతిగారు. వీరు మను చరిత్ర, ఆముక్తమాల్యద, వసుచరిత్ర, పారిజాతాపహరణం మొదలైన ప్రాచీన కావ్యాలనుండీ; గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు మొదలైన ఆధునికాంధ్ర కవుల రచనలనుండీ రసవత్తరమైన ఘట్టాలను ఎంతో హృద్యమైన శైలిలో సంస్కృతీకరించి ఈ సంపుటిలో పొందుపరచినారు. అంతేకాక, క్షేత్రయ్య పదాలకు, సుమతి, వేమన నారాయణ శతకాల్లోని కొన్ని పద్యాలకు కూడా ఇందులో సంస్కృతానువాదాలు ఉన్నాయి. సంస్కృత కవితారచనలో సీతాపతిగారు చూసిన వైవిధ్యం ఈ సంపుటిలో కొట్టవచ్చినట్లుగా కనిపించే గుణం. సీతాపతిగారు ఆరంభంలో "నాహం సంస్కృత పండితో న చ కవిః కింత్వేష యత్నః కృతః" అని తన వినయాన్ని ప్రకటించుకున్నా - సరస కవితా రచనలో వారిది అందెవేసిన చేయి అనడం ఎంత సహజోక్తో వారి ఈ కింది శ్లోకాలవల్ల తెలుసుకోవచ్చు:

"కా త్వం భీతమృగేక్షణేఽత్ర విహరస్యే కాకినీ నిర్భయం
కాంతారే మదగర్వితోఽహమిహ మే భ్రష్టోఽస్మి మార్గాదహో
నాలం గంతుమితః పరం మమ పురం మార్గం న జానామ్యయే
మార్గం దర్శయ సద్గుణే కరుణయా శ్రేయాంసి భూయాంసి తే.

(కవితోదయచంద్రికా - 4 పుట)

'ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ' అన్న మనుచరిత్రలోని పద్యానికి ఈ శ్లోకం సంస్కృతీకరణం.

పక్షాభ్యంతరగుప్తశీర్షవలితం కేదారకుల్యాంతరే
నిద్రాయోగసమేతహంసనివహం దృష్ట్వా తదారక్షకే
స్నాత బ్రాహ్మణపిండితాంబరమితి భ్రాంత్యా తదాప్తుం గతే
ప్రోడ్డీనా విహగాస్త ఏవ జహసుః కేదారగోపాంగనాః
(కవితోదయచంద్రికా, పుట - 9, 10)

ఈ శ్లోకం ఆముక్తమాల్యదలోని 'తలఁబక్షచ్ఛట గ్రుచ్చి జొతువులు' (1.65) అనే పద్యానికి సహజసుందరమైన సంస్కృతీకరణం:

స్వదేశభక్తో భవ రాగబద్ధః
సంవర్ధయ త్వం సుకృతం వరేణ్యమ్
అలం ప్రసంగేన నిరర్థకేన
సంకల్పయ త్వం పరమోపకారమ్. (కవితోదయచంద్రికా, పుట-19)

ఈ శ్లోకం గురజాడ అప్పారావుగారి-

"దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వట్టి మాటలు గట్టిపెట్టోయ్
గట్టి మేల్ తలపెట్టవోయ్" - అన్న ప్రసిద్ధమైన గేయానికి మూలవిధేయమైన సంస్కృతానువాదం. ప్రాచీన కవితతోపాటు ఆధునిక కవితలను కూడా సంస్కృతీకరించి, సంస్కృతజ్ఞులను అలరింపజేసిన ఘనత సీతాపతిగారికే దక్కింది.

ఈ విధంగా తెలుగు కావ్యాలను సంస్కృతీకరించి, వాటి మాధుర్యాన్ని ఆంధ్రేతరులకు తెలియజేసి, ఇటు సంస్కృతానికీ, అటు తెలుగుకూ ఎనలేని సేవ గావించిన కవులు సర్వదా, సర్వథా అభినందనీయులు.

(సాహిత్య మాసపత్రిక 'భారతి' (ఫిబ్రవరి 1988)లో ప్రచురింపబడ్డ వ్యాసం)

# నేటి వాడుక తెలుగులో కొన్ని అపప్రయోగాలు

ఒకనాడు ప్రధానంగా సాహిత్యావసరాలకు మాత్రమే వాడబడే తెలుగు నేడు వివిధ రంగాలకు విస్తరించింది. పత్రికలు, రేడియో, టీవీ మొదలైన ప్రచార సాధనాలు, ప్రభుత్వ పరిపాలనవ్యవహారం, కళాశాలాస్థాయిలో తెలుగుమాధ్యమంలో విజ్ఞాన శాస్త్రం మొదలైన అంశాల బోధన - వీటి మూలంగా నేడు తెలుగు భాషకు పూర్వంకంటే వాడుక ఎంతో పెరిగింది. ఈ కారణంగా తెలుగులో సంస్కృత పదాల వాడుక కూడా విపరీతంగా పెరిగింది. ఉదాహరణకు పత్రికా రంగం తీసుకోండి. ఆంగ్లంలోని అనేక పదాలను, పదబంధాలను తెలుగులో చెప్పవలసి వచ్చినపుడు వాటికి పత్రికా రచయితలు సాధారణంగా సంస్కృతపద బంధాలనే కల్పించుకోవడం కనిపిస్తుంది. ఇందుకు శిఖరాగ్ర సమావేశం, పంచవర్ష ప్రణాళిక, అల్పసంఖ్యాక వర్గాలు, త్రైపాక్షిక చర్చ, ఆమరణ నిరాహారదీక్ష, మధ్యాహ్న భోజన పథకం, అలీన దేశాలు మొదలైన పదాలను ఉదాహరించవచ్చు. ఈ పదబంధాలన్నీ పత్రికా రచయితలు కల్పించుకున్నవే కాని సంస్కృతంలో అంతకుముందే ప్రసిద్ధమైనవి కావు. ఇంత చక్కని సంస్కృత పదబంధాలను సృష్టించి, వ్యాప్తిచేసి సంస్కృతభాషకు పరోక్షంగా జీవం పోస్తున్న పత్రికారచయితలను మనం అభినందించాలి. ఈ పదబంధాలను కల్పించుకోవడానికి తెలుగుకన్నా సంస్కృత భాషే ఎంత బాగా నప్పుతుందో గమనించవచ్చు.

అలాగే తెలుగు మాధ్యమంలో వివిధ శాస్త్ర విషయాలు చెప్పవలసిన అవసరం ఏర్పడుతున్న ప్రస్తుత సందర్భంలో ఆంగ్ల పారిభాషిక పదాలనెన్నింటినో తెలుగులోకి తెచ్చుకోవలసి వచ్చినపుడు మనం సృష్టించుకున్న పదాలలో దాదాపు తొంభైయైదు శాతం పైగా సంస్కృత పదాల రూపంలోనే ఉండడం కనిపిస్తుంది. తెలుగు అకాడమీ వారు ప్రచురించిన 'సామాన్య భాషాశాస్త్రం' చివర ఇచ్చిన పారిభాషిక పదకోశంలో తెలుగు పారిభాషిక పదాలుగా ఇవ్వబడిన దాదాపు 400 పదాల్లో ఒక్క 'రొద' అన్న పదం తప్ప

తక్కిన పదాలన్నీ సంస్కృత పదాలే. ఇతర శాస్త్రాలకు సంబంధించిన పారి భాషిక పదాల్లో కూడా ఇంచుమించు ఇదే స్థితి కనిపిస్తుంది. దీన్నిబట్టి తెలుగు వాడుకతోపాటు సంస్కృతపదాల వాడుక కూడా తెలుగులో క్రమంగా పెరుగు తున్నదన్న విషయం సువిదితమే.

ఐతే, ఈ సంస్కృతభాషాపదాలను తెలుగులో తత్సమాలుగా వాడుకుంటు న్నపుడు సంస్కృతభాషా నియమాలను అతిక్రమించకుండా ఉండాలి. కాని, కొన్ని సందర్భాల్లో వీటిని సంస్కృతభాషా నియమాలకు వ్యతిరేకంగా ప్రయో గించడం కనిపిస్తుంది. ఈ నియమభంగం, తెలుగు వాడుకలో కనిపించే వివిధ భాషా పదాల్లో కంటే, సంస్కృత భాషా పదాల ప్రయోగంలోనే ఎక్కువగా జరిగినట్లు కనిపిస్తుంది. వందలకొద్ది సంస్కృత అపప్రయోగాలు మనకు తెలుగులో కనిపిస్తాయి. దీనికి కారణం సంస్కృత వ్యాకరణ నియమాలను ప్రయోక్తలు సరిగా గుర్తించకపోవడమే.

ఈ విధంగా ఇటీవలి తెలుగు వాడుకలో వినిపిస్తున్న కొన్ని సంస్కృత అపప్రయోగాలను గూర్చి తెలుసుకుందాం.

ఉత్సాహం కలవాళ్ళు అనే అర్థంలో ఇటీవల మనం ఔత్సాహికులు అన్న పదాన్ని బాగా వాడుతున్నాం. ప్రధానంగా పత్రికా భాషలో మరీ ఎక్కువగా కనిపిస్తుంది. ఔత్సాహికులు అంటే ఉత్సాహానికి సంబంధించిన వాళ్ళనే కాని ఉత్సాహం కలవాళ్ళు అనే అర్థం లేదు. ఈ అర్థంలో ఉత్సాహవంతులు అని ప్రయోగిస్తే సరిపోతుంది.

హైదరాబాదులో టాంక్ బండ్ పైన ప్రతిష్ఠించిన తెలుగు మహనీయుల ప్రాంగణానికి "తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త ప్రాంగణం" అని నామకరణం చేసినారు. ఇందులో 'తెలుగు వెలుగులు' అనేది ఒక సమాసం. ఇది తెలుగు సమాసం. మూర్తినిక్షిప్తప్రాంగణం అనేది సంస్కృత సమాసం. మూర్తినిక్షిప్త ప్రాంగణం అనే సమాసానికి సంస్కృతభాషా నియమాల ప్రకారంగా మూర్తు లచే ఉంచబడ్డ ప్రాంగణం అనే అర్థం వస్తుంది. అంటే, మూర్తులే ఏదో ఒక వస్తువును ప్రాంగణంలో ఉంచినారని తాత్పర్యం. మూర్తులే అక్కడ ఉంచబడి నవికాని, మూర్తులు దేనినీ ఉంచలేదు కదా! ఇక్కడ మూర్తులు ఉంచబడిన

ప్రాంగణం అనే అర్థం రావాలి. ఈ అర్థం రావాలంటే మూర్తినిక్షిప్తప్రాంగణం అని కాక నిక్షిప్తమూర్తిప్రాంగణం అని అనడం యుక్తం.

పత్రికారంగంలోనూ, విద్యారంగంలోనూ నేడు బాగా వాడుకలోకి వచ్చిన పదం ప్రశ్నాపత్రం అనేది. అధ్యాపకులు కూడా దీన్ని నిర్భయంగా వాడేస్తున్నారు. ప్రశ్న అనేది హ్రస్వ అకారాంత శబ్దం కనుక ప్రశ్నపత్రమనే అనాలి కాని ప్రశ్నాపత్రం అని అనకూడదు.

ఇటీవల పత్రికా రచయితలు సృష్టించి, వ్యాప్తిలోకి తెచ్చిన ఒక పదం భవిత. భావికాలం, భవిష్యత్కాలం అనే అర్థంలో ఈ పదం వాడబడుతుంది. కాని, ఈ విధమైన పదం సంస్కృతంలో అసలు ఏర్పడడానికి వీల్లేదు కనుక తెలుగులో కూడా దీన్ని వాడడం సబబు కాదు. ఈ అర్థంలో భవితవ్యం అంటే సరిపోతుంది.

పత్రికా రచయితల మూలంగా వాడుకలోకి వచ్చిన మరో పదం మత్స్యకారులనేది. జాలర్లు అని దీనికర్థం. సమాజంలోని నిమ్నజాతులవారిని దేశ్య పదాలతోకాక సంస్కృత పదాలతో వ్యవహరించడం మర్యాదాకరమనే ఉద్దేశంతో పత్రికా రచయితలు వస్త్రకారుడు, స్వర్ణకారుడు, చర్మకారుడు మొదలైన పదాలలాగా మత్స్యకారులనే పదాన్ని సృష్టించి ఉంటారు. వస్త్రకారుడంటే వస్త్రాలు తయారుచేసేవాడనీ, చర్మకారుడంటే చర్మంతో వస్తువులు తయారుచేసేవాడని అర్థం కదా! అలాంటప్పుడు మత్స్యకారులనే పదానికి చేపలను తయారుచేసేవాళ్ళు, లేదా చేపలతో వస్తువులు తయారుచేసేవాళ్ళు అనే అర్థమే వస్తుందికాని, చేపలు పట్టేవాళ్ళనే అర్థం రాదు. కనుక ఈ అర్థంలో మత్స్యకారులనే పదం ఎంతవరకు భావ్యమో ఆలోచించండి.

ఈ మధ్య ఈనాడు దినపత్రికలో 'మహిళా బాధితులకు సత్వరన్యాయం' అన్న శీర్షికతో ఒక వార్త ప్రకటింపబడింది. కొత్తగా ఒక మహిళా పోలీస్ స్టేషన్‌ను ఏర్పాటుచేస్తున్న సందర్భంగా వచ్చిన వార్త ఇది. ఇక్కడ మహిళా బాధితులకు అనే పదానికి బాధాతప్తలైన మహిళలకు అని అర్థమని భావించి ఉంటాడు పత్రికా రచయిత. కాని, దీనికి మహిళలచేత బాధింపబడినవారికి

అనే అర్థమే వస్తుంది కాని, బాధితలైన మహిళలు అనే అర్థం రాదు. ఈ అర్థంలో బాధితమహిళలు అని అనాలి.

ఇటీవలి పత్రికా భాషలో వార్తా శీర్షికల్లో కొన్ని వింత ప్రయోగాలు కనిపిస్తున్నాయి. అవి- దళాల సమాయత్తం, గ్రామాల దగ్ధం, దేశాల విచ్ఛిన్నం మొదలైనవి. ఇక్కడ భావార్థం ప్రయోగించకుండా విశేషణాలు ప్రయోగించడం దోషం. దళాల సమాయత్తత; దేశాల విచ్ఛిన్నత; గ్రామాల దహనం అని ప్రయోగించడం యుక్తం. లేదా- దళాలు సమాయత్తం, దేశాలు విచ్ఛిన్నం, గ్రామాలు దగ్ధం అనైనా ప్రయోగించవచ్చు. దళాల సమాయత్తం వంటి రూపాలు మాత్రం దుష్టాలే. దేశపతిష్ఠానికి వంటి రూపాలు కూడా ఇలాంటివే.

ఇలాగే సవిమర్శనాత్మక, సశాస్త్రీయ మొదలైన పదాలు పత్రికల్లోనే కాదు- సిద్ధాంత గ్రంథాల్లో కూడా చోటు చేసుకుంటున్నాయి. ఇక్కడ విమర్శ నాత్మక, శాస్త్రీయ అనే పదాలు ప్రయోగించడం యుక్తం.

ఇలాగే వయః పరిమితి బదులు వయోపరిమితి, సౌహార్దం బదులు సౌహార్ద్రం, సౌభ్రాత్రం బదులు సౌభ్రాతృత్వం; సమర్థంగా,పటిష్ఠంగా అనడానికి బదులు సమర్థవంతంగా, పటిష్ఠవంతంగా; సమష్టి బదులు సమిష్టి; ప్రాధాన్యం, ప్రాముఖ్యం, ప్రావీణ్యం బదులుగా ప్రాధాన్యత, ప్రాముఖ్యత, ప్రావీణ్యతలు; పునరావృత్తం బదులు పునరావృతం; దేవదాయం బదులు దేవాదాయం; జగదంబ బదులు జగదాంబ అనీ- ఇలా ఎన్నో పదాలను తప్పుగా ప్రయోగిస్తున్నాం. ఏమైనా ఇతర భాషా పదాలను మనం తెలుగులో వాడుతున్నప్పుడు ఆయా భాషల నియమాలను అనుసరించడం భాష సక్రమమైన ఎదుగుదలకు దోహదపడుతుందనే విషయం మనం గమనించాలి.

# తెలుగులో అలబ్ధవాఙ్మయం

తెలుగు సాహిత్యంలో మనకు నేటికీ లభ్యం కాని ప్రాచీన కావ్యాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. లక్షణగ్రంథాలు, సంకలనగ్రంథాలు, కావ్యావతారికలు-వీటి పుణ్యమా అని మనం అలభ్యమైన ప్రాచీన కావ్యవాఙ్మయాన్ని గురించి కొంతైనా తెలుసుకోగలుగుతున్నాం. తెలుగుసాహిత్యంలో వందలకొద్ది ప్రాచీన కావ్యాలు మన కందకుండా నశించిపోయినాయనే విషయం లక్షణ గ్రంథాదులవల్ల తెలిసినప్పుడు తెలుగువాళ్ళు ఇంత నష్టజాతకులా అని బాధ కలుగుతుంది. ఒక విధంగా ప్రస్తుతం మనకు లభ్యమౌతున్న ప్రాచీన వాఙ్మయం ఎంత ఉంటుందో అలబ్ధమైన కావ్యవాఙ్మయం కూడా అంత ఉంటుందని చెప్పటం సత్యదూరం కాదేమో! తెలుగులోని అలబ్ధ సాహిత్యాన్ని గురించి కొంత పరిశీలిద్దాం:

ఈ సాహిత్యాన్ని గురించి తెలుసుకోవటానికి మనకు ముఖ్యంగా 1. కావ్యావతారికలు, 2. ఛందో వ్యాకరణ గ్రంథాలు, 3. సంకలన గ్రంథాలు ప్రధాన ఆధారాలుగా కనిపిస్తున్నాయి.

## అవతారికలు :

ప్రాచీన కవులను గురించీ, ప్రాచీన కావ్యాలను గురించీ అనేక విషయాలు అవతారికలవల్ల తెలుస్తున్నాయి. సంస్కృత సాహిత్యంలో అతివిరళంగా కానవచ్చే ఈ అవతారికాపద్ధతి తెలుగు సాహిత్యంలో ఒక విశిష్టమైన పద్ధతిగా భావించవచ్చు. సాహిత్య చరిత్రకు అవతారికల ఉపయోగం అనల్పం. ఆయా కవుల కావ్యావతారికలవల్ల తెలియవచ్చే అలబ్ధ సాహిత్యాన్ని స్థాలీపులాకంగా పరిశీలిద్దాం.

నన్నయ ఆంధ్రమహాభారతారంభంలో రాజరాజనరేంద్రుని సభా భవనాన్ని వర్ణిస్తూ ఆ సభలో 'మృదుమధుర రసభాసురనవార్థ వచనరచనా విశారదు

లైన మహాకవు'లున్నట్లుగా వర్ణించినాడు.[1] అంతేకాక 'సారమతింగవీంద్రులు' అన్న పద్యంలో[2] కవీంద్రులు తన వివిధ కవితా గుణాలను ఆదరించినట్టుగా పేర్కొన్నాడు. ఈ మహాకవుల్లో ఒక్క నారాయణభట్టు పేరు తప్ప మరో కవిపేరు గానీ, ఆ కవి రచించిన కావ్యంకానీ మనకు తెలియరావటం లేదు. 'నారాయణభట్టు' కూడా పేరుకు మాత్రమే కాని అయన కావ్యాలు మాత్రం తెలియవు.

తిక్కన తన తాతయైన మంత్రి భాస్కరుణ్ణి సారకవితాభిరాముడని నిర్వచనోత్తర రామాయణంలో గొప్పగా ప్రశంసించినాడు.[3] ఈ సారకవితాభిరాముని కృతులు ఏమైనట్లు? భాస్కర రామాయణాన్ని మంత్రి భాస్కరుని రచనగా అంగీకరించినా విద్యాకేళిలో కమలాసనతుల్యులని కేతన పేర్కొన్న మంత్రి భాస్కరుని కుమారుల కృతులు అలభ్యమే కదా?

కేతన తన దశకుమార చరిత్రలో తిక్కనను ప్రశంసిస్తూ అతడు 'లలిత నానాకావ్యములు' చెప్పినట్లుగ పేర్కొన్నాడు.[4] ఆంధ్రమహాభారతం, నిర్వచనోత్తర రామాయణం - ఈ రెండే తిక్కన కృతుల్లో నేడు లభ్యమయ్యేవి. వీటితోపాటు తిక్కన మరికొన్ని లలిత కావ్యాలు తప్పక చెప్పి ఉంటాడు. వాటిలో ఒక్క విజయసేనం తప్ప తక్కిన కావ్యాల వివరాలు తెలియవు.

ఎఱ్ఱన నృసింహ పురాణంలో తన తండ్రిని "అప్రతిమాద్భుతోభయ కవిత్వ ప్రౌఢశబ్దార్థయోగాజ్ఞాసిద్ధిఘను"డని ప్రశంసిస్తూ అతడు "విజ్ఞానాత్మక వాఙ్మయంబున ముదావేశోజ్జ్వలుండయ్యెదున్"[5] అని కోరుకుంటాడు. దీన్నిబట్టి ఎఱ్ఱన తండ్రి సంస్కృతాంధ్రాల్లో గొప్పకవి అని తెలిసినా ఆయన రచించిన కావ్యాల పేర్లైనా మనకు తెలియవు.

వేమారెడ్డి ఎఱ్ఱనచే చేతోమోదమెలర్పగా రామకథ చెప్పించి అత్యుత్తమ ఖ్యాతిని పొందినట్లుగా హరివంశావతారిక తెలుపుతుంది.[6] చెదలువాడ మల్లన "వల్మీకభవు వచోవైఖరి రామాయణంబు నాంధ్రప్రబంధంబు సేసె" అని తన విప్రనారాయణ చరిత్రావతారికలో ఎఱ్ఱన రామాయణాన్ని రచించినట్లుగా పేర్కొన్నాడు.[7] లక్షణ గ్రంథాలవల్ల ఎఱ్ఱన రామాయణంలోని కొన్ని పద్యాలు లభ్యమౌతున్నా పూర్తికావ్యంమాత్రం అలభ్యమే.

---

1. 1-1-౪. 2. 1-1-26. 3. 1-12.
4. 1-93 5. 1-25 6. పూర్వ. 1-39;
7. 1-13;

శ్రీనాథుడు భీమఖండంలోనూ, కాశీఖండంలోనూ తన తాతయైన కమల నాభామాత్యుణ్ణి ఈ క్రింది విధంగా స్తుతించినాడు:

కనకక్ష్మాధరు వారిధితటీక్రాల్పట్టణాధీశ్వరున్
ఘనునిన్ బద్మపురాణ సంగ్రహకళా కావ్య ప్రబంధాధిపున్
వినమత్కాకతి సార్వభౌముఁ గవితావిద్యాధరున్ గొల్తు నా
యనుగుందాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్య చూడామణిన్.

(భీమఖండం 1-10)

మత్పితామహుఁ గవితాపితామహునిఁ దలఁతుఁ
గలితకావ్యకళాలాభుఁ గమలనాభుఁ
జంద్రచందనమందార సదృశకీర్తి
సరససాహిత్యసామ్రాజ్యచక్రవర్తి. (కాశీఖండం 1-20)

శ్రీనాథుడింత గొప్పగా స్తుతించిన కవితా విద్యాధరుడూ, కవితా పితామహుడూ, సరస సాహిత్య సామ్రాజ్య చక్రవర్తీ ఐన కమలనాభామాత్యుడు గొప్ప సాహిత్యస్రష్టయై ఉండవలె. ఆయన పద్మ పురాణ సంగ్రహం కానీ, ఇతర కావ్యాలు కానీ మనకు లభించలేదు.

శ్రీగిరికవి నవనాథచరిత్రను పద్యరూపంలో రచించినట్లుగ గౌరన తన ద్విపద నవనాథచరిత్రలో ఈ విధంగా తెలిపినాడు:

"అవిరళయోగ విద్యాధికులైన, నవనాథవరుల పుణ్యవర్తనలు
పరఁగ శ్రీగిరికవి పద్య బంధముల, విరచించినాడది ద్విపదకావ్యమునఁ
జెప్పింపవలయుఁ బ్రసిద్ధి పెంపలర...."

శ్రీగిరికవి రచించిన ఈ పద్యనవనాథచరిత్ర ఇప్పుడు కానరాదు.

అనంతామాత్యుని ముత్తాతయైన బయ్యన తిక్కనచే "భవ్యభారతి" అనిపించుకున్న కవిరత్నమని భోజరాజీయంవల్ల తెలుస్తుంది.[1] తిక్కన యంతటి మహాకవి ప్రశంసకు పాత్రుడైన బయ్యన సామాన్య కవియై ఉండడు. భవ్య భారతీ విలాసాన్ని చిందించే అనేక కావ్యాలు వ్రాసి ఉంటాడు. వాటి వివరాలేవీ ఈనాడు మనకు తెలియవు.

---

1. 1-24;

జక్కన విక్రమార్క చరిత్రలో తన తాతయైన పెద్దయామాత్యుడు తజ్జ్ఞులు మెచ్చేట్లుగా తెలుగులో ప్రబంధం చెప్పినట్లుగానే కాకుండా అతని సర్వతోముఖమైన కవితావైభవాన్ని సీసమాలికలో ఎంతో గొప్పగా ప్రశంసించి నాడు.[1] ఈ సీసమాలికవల్ల పెద్దయామాత్యుని కవితావైభవం తెలిసి మనకు సంతోషం కలిగినా ఆయన రచించిన ప్రబంధం పేరైనా కనీసం మనకు తెలియరాలేదే అన్న బాధ మాత్రం తప్పదు కదా?

పినవీరభద్రుడు - తన తాత, తండ్రి, సోదరుడు, తాను - గొప్ప కవుల మని జైమినిభారతంలోని కింది పద్యంలో పేర్కొన్నాడు.

తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువనభాసురకృతి ని
ర్మాతలు, పిల్లలమఱ్ఱివి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరేఁ సుకవుల్."

గోపరాజుకూడా పూర్వకవిస్తుతిలో పిల్లలమఱ్ఱివంశీయుడైన పెద్దిరాజును స్తుతించినాడు.[2] భువనభాసురకృతి నిర్మాతలుగా పినవీరుడు పేర్కొన్న అతని తాతా, తండ్రీ, అన్నా వ్రాసిన కావ్యాలు మన కీ నాడు లభ్యం కావు.

పిల్లలమఱ్ఱి పినవీరన వంశీయుడైన పెనుమల్ల సోమనామాత్యుడు రచించిన సీమంతినీ పరిణయంలో పినవీరన ప్రశంస ఉన్న ఈ క్రింది పద్యం కానవస్తుంది:

అవతారదర్పణంబన్న కావ్యముఁ జేసె
    నారూఢి నారదీయంబు పలికె
మహనీయమగు మాఘమాహాత్మ్యము రచించె
    శాకుంతలము జెప్పె సరసఫణితి
నొక్క రాతిరియందు నొనరించె మధురవా
    క్ప్రౌఢిచే జైమినిభారతంబు
లలితమౌ మానసోల్లాససారంబన్న
    కబ్బంబు భాషించె నబ్బురముగ

1. 1-120; 2. సిం. ద్వా. 1-12.

ఘటియు బహురూపకావ్య నిర్మాణ నిపుణుఁ
డగుచు నుతిగాంచె సకలదిగంతరములఁ
గుకవిజనగర్వతిమిరసంకోచకృత్ప్ర
భాతరవియైన పినవీరభద్రసుకవి. (1-45)

పై పద్యంవల్ల పినవీరన అవతారదర్పణం మొదలైన ఐదు కావ్యాలతో పాటు ఇంకెన్నో కావ్యాలు రచించినట్లుగ తెలుస్తుంది. ఆ తక్కిన కావ్యాల పేర్లేమిటో కూడా మనకు తెలియదు. తెలిసిన కావ్యాల్లోనూ అవతారదర్పణం, నారదీయం, మాఘమాహాత్మ్యం, మానసోల్లాసం అనేవి మనకు లభ్యం కాలేదు.

రామరాజ భూషణుడు తన వసుచరిత్రలో తాను బహు సంస్కృతాంధ్ర కృతులతో రామరాయలను మెప్పించినట్లుగ తిరుమలరాయల ముఖంగా తెలిపినాడు.[1] వసుచరిత్ర, కావ్యాలంకార సంగ్రహం, హరిశ్చంద్రోపాఖ్యానం తప్ప ఈతని తక్కిన సంస్కృతాంధ్రకృతులేవీ మనకు లభ్యం కాలేదు.

గోపరాజు తన ముత్తాతయైన సత్యనారయను ఆంధ్ర కవితా పితామహ బిరుదాంచితుడనీ, రామాయణ కృతికర్తయనీ సింహాసన ద్వాత్రింశికావతారికలో ప్రశంసించినాడు.[2] ఈతని రామాయణం నామమాత్రంగా మిగిలిపోయింది.

తెనాలి రామభద్రకవి తన ఇందుమతీ పరిణయంలో కృతిపతియైన పాలచూరి కృష్ణరాయల ముఖంగా తన పూర్వులను ప్రశంసిస్తూ చెప్పిన ఈ క్రింది పద్యం కనిపిస్తుంది:

ప్రౌఢి మీ పెదతాత పాండురంగాది స
        త్కృతులఁ జేసెను రామకృష్ణసుకవి
యనుజుఁడన్నప్ప మీ పినతాత రచియించెఁ
        బఱఁగ సుదక్షిణాపరిణయంబు
మీ తాత శ్రీగిరి చాతురీవిఖ్యాతి
        శ్రీశైలమాహాత్మ్యకృతి యొనర్చె
కడిమి మీ తండ్రి యిమ్మడి రామకృష్ణార్యుఁ
        డనఁ గీర్తిఁగనె సంస్కృతాంధ్రములను

1. 1-17; 2. 1-49.

వారలను మించె మీ యన్న వీరరాఘ
వాఖ్యసుకవి సర్వకవితా మహత్త్వమునను
నిన్ననూచాన సంతాను నెన్నఁదరమె
ప్రాజ్ఞహృదయాబ్జరవి రామభద్రసుకవి.[1]

పై పద్యంవల్ల రామభద్రకవికి పినతాతయైన తెనాలి అన్నప్ప సుదక్షిణా పరిణయాన్నీ, తాతయైన తెనాలి శ్రీగిరికవి శ్రీశైల మాహాత్మ్యాన్నీ రచించినట్లుగా తెలుస్తున్నా ఈ కావ్యాలు మాత్రం మనకు లభ్యం కాలేదు. అంతేకాక రామభద్రుని తండ్రి సంస్కృతాంధ్రాల్లో కీర్తి గన్నవాడనీ, అన్నయైన వీర రాఘవకవి కవితా మహత్త్వంలో రామకృష్ణాది కవులను మించినవాడనీ పై పద్యం తెలుపుతుంది. కాని వాళ్ళు రచించిన కావ్యాల పేర్లైనా మనకు తెలియవు.

పోతన, పింగళి సూరన, శ్రీనాథుడు మొదలైన మహాకవుల చేతనూ, పొత్తపి వెంకటరమణకవి, అప్పకవి మొదలైన లాక్షణికుల చేతనూ స్తుతింపబడిన వేములవాడ భీమకవి మహాకవుల శ్రేణికి చెందినవాడనటంలో సందేహం లేదు. భీమకవి రాఘవపాండవీయమనే ద్వ్యర్థికావ్యాన్ని రచించినట్లుగా లోకంలో ఉన్న జనశ్రుతిని పింగళి సూరన గ్రంథస్థం చేయటమేకాక, కావ్యాన్ని ఎవ్వరూ చూడలేదని కూడా చెప్పినాడు.[2] తెలుగులో ప్రథమద్వ్యర్థి కావ్యమైన భీమన రాఘవపాండవీయం లభించకపోవటం మన దురదృష్టమే. భీమకవి రచించిన నృసింహపురాణ, శతకంధర రామాయణాల్లో నుండి పద్యాలను ఉదాహరించిన లక్షణకారులు రాఘవపాండవీయంలోని ఒక్క పద్యం కూడా ఉదాహరించక పోవటం వల్ల ఆ కావ్యం అతిప్రాచీనకాలంలోనే నష్టమైపోయి ఉంటుందని భావించవచ్చు.

చెదలువాడ మల్లన తన తండ్రియైన లింగనకవి "రాజుల్ మెచ్చగ కావ్యములు జెప్పిన కవి" అని విప్రనారాయణ చరిత్రలో పేర్కొన్నాడు.[3] ఈ లింగన రచించిన కావ్యాలు మనకు తెలియవు.

గణనాథుడనే కవి కుతుబ్షాహీ రాజుల ఆస్థాన మహాకవీంద్రుడుగా విలసిల్లినట్లేకాక, అతడు సంస్కృతాంధ్రభాషావరకావ్యకల్పన విచక్షణుడనీ, దేవగవీ పయోఝర సదృగ్వచనాప్త యశోహరచ్ఛవి యనీ వాసిగాంచినట్లుగ కామినేని

1. 1-22. 2. 1-11. 3. 1-20.

మల్లారెడ్డి పద్మపురాణం తెలుపుతుంది.[1] కుతుబ్షాహీ రాజుల ఆస్థానంలో ఆస్థానమహాకవీంద్ర పదవిని అధిష్ఠించిన గణనాథ కవి తెలుగులో గొప్పకావ్యాలే రచించి ఉండవలె. కాని, ఈతని ఒక్క కావ్యం పేరైనా మనకు తెలియటంలేదు.

సుప్రసిద్ధ కవయిత్రి రంగాజమ్మ తన ఉషాపరిణయంలో "మహనీయ భారత రామాయణ కథా సంగ్రహణ విచక్షణయు" అని తన్ను గురించి చెప్పుకున్న ఆశ్వాసాంత గద్యంవల్ల ఈమె భారత, భాగవత, రామాయణాలను మూడింటినీ సంగ్రహ రూపంలో రచించినట్లు తెలుస్తుంది. కాని, ఈమె రచనల్లో ఉషాపరిణయం, మన్నారుదాస విలాసం తప్ప తక్కిన గ్రంథాలు లభ్యం కాలేదు.

రఘునాథ భూపాలుని తెలుగు రామాయణాన్ని సంస్కృతీకరించిన మధురవాణి తన రామాయణంలో ఇట్లా చెప్పుకున్నది:

సర్వోత్తరస్యాదిమసంస్కృతాంధ్ర
ప్రబంధనిర్మాణపచేళిమాని
యశాంసి భూయాంస్యవతారయంతః
సహస్రశః సంతి...."

అంతేకాక 'మాధుర్యైకధురంధరాంధ్రకవితానిర్మాణసమ్మాన్య' నని సగర్వంగా చాటుకొన్నది. మధురవాణి సంతరించిన తెనుగు కృతుల పేర్లైనా మనకు తెలియటం లేదు.

తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో ఛందోదర్పణం అనే పేర ఒక ఛందోగ్రంథం ఉన్నది.[2] ఇది అనంతుని పేర ప్రసిద్ధమైన ఛందస్సు కాదు. దీని కర్త ఎవ్వరో తెలియదు. ఈ ఛందఃకర్త అవతారికలో తాతంభట్టును స్తుతిస్తూ ఈ క్రింది పద్యం చెప్పినాడు:

"ఏ కవి చెప్పె ననేకపుణ్యానల్ప
బంధురసంక్షేపభాగవతము"

తాతంభట్టు చెప్పిన సంక్షేప భాగవతప్రతి ఒక్కటైనా మనకు లభ్యం కాలేదు.

---

1. 1-25, 27. 2. నెం. 713.

ఈ విధంగా మనం తెలుగు కావ్యావతారికలను పరిశీలించినట్లైతే తెలుగు సాహిత్యంలో నష్టమో, నష్టప్రాయమో ఐన ఎన్నో కావ్యాలను గురించీ, ఎంతో మంది కవులను గురించీ అనేకవిషయాలు తెలుసుకోవటానికి వీలౌతుంది.

## ఛందోవ్యాకరణగ్రంథాలు :

తెలుగులోని అలబ్ధ సాహిత్యాన్ని గురించి తెలుసుకోవటానికి మరో మెరుగైన ఆధారం లక్షణగ్రంథాలు. ముఖ్యంగా ఛందోవ్యాకరణాలు. యతికో, ప్రాసకో, శబ్దస్వరూపనిర్దేశానికో లాక్షణికులు వివిధ కవుల కావ్యాల నుండి పద్యాలనూ, పద్యభాగాలనూ లక్ష్యాలుగా చూపటం జరుగుతుంది. దీనివల్ల తెలుగు సాహిత్యంలో ఇప్పటికీ లభించని ఎన్నో కావ్యాలను గురించీ, కవులను గురించీ మనం తెలుసుకోగలుగుతున్నాం. లాక్షణికులు ఉదాహరించిన కావ్యాలు సాధారణంగా పండితలోకంలో మంచి పేరున్న కవులు రచించినవే ఐవుండాలి. ఛందోవ్యాకరణాల మూలంగా మాత్రమే తెలియవచ్చిన అలభ్య కావ్యాలు ఎన్నో ఉన్నాయి. వాటిని దిగువ పేర్కొంటాను:

| కావ్యం | కవి |
|---|---|
| ఆదినారాయణచరిత్ర | కవిరాక్షసుడు |
| ఇంద్రవిజయము | నన్నయ |
| కందశతకము | భాస్కరుడు |
| కవుల షష్ఠము | నంది మల్లయ, ఘంట సింగన |
| కూర్మపురాణము | మలయమారుతం మల్లన |
| కృష్ణవిలాసము | నాచన సోమన |
| | పరాతం అప్పన |
| | పింగళి సూరన |
| చమత్కారరామాయణము | ? |
| చారుదేష్ణచరిత్ర | ? |
| చిత్రశేషభాగవతము | కళాధరకవి |
| జైమినిరామాయణము | |

| | |
|---|---|
| దశగతులు | భాస్కరుడు |
| పద్మపురాణము | అయ్యలరాజు సింగన |
| పరమభాగవతచరిత్ర | లక్షణకవి అప్పన్న |
| బలరామవిజయము | నంది సింగయ |
| బ్రహ్మాండపురాణము | కవిమాధవుడు |
| మహాభారతము | ? |
| మిత్రవిందా పరిణయము | చక్రపాణి రంగనాథుడు |
| ముద్రారాక్షసము | ? |
| యథావాల్మీకిరామాయణము | లక్షణకవి అప్పన్న |
| యమకశతకము | గణపవరపు వేంకటకవి |
| యయాతి చరిత్ర | రాయసం దత్తన |
| ,, | సూరపరాజు |
| రాఘవాభ్యుదయము | నన్నయ |
| రామచంద్రాభ్యుదయము | బడబాగ్నిభట్టారకుడు |
| రుక్మాంగదచరిత్ర | చెదలువాడ మల్లన |
| లక్ష్మీనారాయణ విలాసము | కవిరాక్షసుడు |
| వసంతవిలాసము | నాచన సోమన |
| వాణీవిలాసము | ముక్కు తిమ్మన |
| వామనపురాణము | నంది సింగన |
| వాసవాభ్యుదయము | శ్రీనాథుడు |
| విక్రమార్కచరిత్రము | కవిభల్లటుడు |
| విజయవిజయము | చిమ్మపూడి అమరేశ్వరుడు |
| శంతనుచరిత్ర | సోమయాజి అనంతయ్య |
| శతపక్షిసంవాదము | క్షేమేంద్రుడు |
| శమంతకమణిచరిత్ర | వణుకూరి గుర్వరాజు |
| శశిబిందుచరిత్ర | చరిగొండ నృసింహకవి |
| శుద్ధాంధ్రరామాయణము | ఆడిదం బాలభాస్కరకవి |
| శూద్రకరాజచరిత్రము | కవిభల్లటుడు |
| శ్రీరంగమాహాత్మ్యము | తెలుగురాయలు |

| | |
|---|---|
| సత్యావధూప్రణయము | అల్లసాని పెద్దన |
| సునందనచరిత్ర | శ్రీనాథుడు |
| సునందనోపాఖ్యానము | హుళక్కి భాస్కరుడు |
| స్మరతత్త్వసారము | ? |
| హరవిలాసము | భీమన |
| హరికథాసారము | అల్లసాని పెద్దన |
| హ(రి)రవిలాసము | నాచన సోమన |

ఛందోవ్యాకరణ గ్రంథాల్లో పైన పేర్కొన్న కావ్యాలే కాక మరెన్నో అలబ్ధ కావ్యాలు ఉదాహరించబడ్డవి. ఐతే అవి మనకు సంకలన గ్రంథాల మూలంగా కూడా తెలియవస్తున్నందున కేవలం లక్షణ గ్రంథాలమూలంగా తెలియవచ్చిన గ్రంథాలను మాత్రమే పైన పేర్కొనటం జరిగింది. లక్షణ కారులు వీటిని ఉదాహరించక పోయినట్లైతే ఈ కావ్యాల ఉనికీ, మనికీ మనకు తెలిసి ఉండేవి కావు. ఈ విధంగా లక్షణకారులు తెలుగు సాహిత్యానికీ, తెలుగు సాహిత్యచరిత్రకూ చేసిన ఉపకారం ఎంత దొడ్డదో మనం ఊహించుకోవచ్చు

సంకలనగ్రంథాలు :

తెలుగులోని అలబ్ధసాహిత్యాన్ని గురించి తెలుసుకోవటానికి సంకలన గ్రంథాలు ఎంతో సాహాయ్యకారులు. "కవి తనకు పూర్వమందున్న కవుల కావ్యములనుండి వర్ణనాంశములు గాని, శాస్త్ర విషయములుగాని సేకరించి వానిని వర్గీకరించి ఏకాకారమైన ఒక కృతిగా సమకూర్చు సాహిత్య ప్రక్రియ సంకలన గ్రంథము" అని నిడుదవోలు వేంకటరావుగారు సంకలన గ్రంథ స్వరూపాన్ని నిర్వచించినారు.[1] తెలుగులో వెలసిన సంకలన గ్రంథాలు పరిమితమే ఐనా వాటి ప్రయోజనం మాత్రం అపరిమితం.

ఆయా సంకలన గ్రంథాల మూలంగా తెలియవచ్చిన అలబ్ధ కావ్యాలనూ, తత్కర్తలనూ దిగువ పేర్కొంటాను:

సకలనీతిసమ్మతం (మడికి సింగన)

| | |
|---|---|
| పంచతంత్రి | శ్రీగిరీశ తకం |

1. సకలనీతిసమ్మతం పీఠిక - పుట-౩.

| | |
|---|---|
| నీతి భూషణం | శ్రీరామాయణం |
| నీతిసారం | మిత్రనీతులు |
| పురుషార్థసారం | నీతితారావళి |

**ఉదాహరణపద్యములు :**[1]

| | |
|---|---|
| విక్రమసేనము | చిమ్మపూడి అమరేశ్వరుడు |
| కళావతీశతకము | తేళ్ళపూడి కసవరాజు |
| కాదంబరి | భాస్కరుని కేతన ప్రెగ్గడ |
| కుశలవోపాఖ్యానము | చిరుమూరి గంగరాజు |
| నందనచరిత్ర | గంగరాజు చౌడయ్య |
| విజయసేనము | తిక్కన |
| ప్రద్యుమ్నచరిత్ర | పొన్నాడ పెద్దిరాజు |
| అనిరుద్ధచరిత్ర | భావన పెమ్మన |
| విష్ణుకథానిధానము | బైతరాజు ముమ్మయ |
| కేదారఖండము | పెదపాటి సోమయ |
| అథర్వణభారతము | అథర్వణాచార్యుడు |
| అమరుకము | కానుకొలను అన్నమరాజు |
| కువలయాశ్వచరితము | కేతన |
| వీరమాహేశ్వరము | నిశ్శంకుని కొమ్మయ |
| బాలభారతము | కాకమాని గంగాధరుడు |
| సౌగంధికాపహరణము | రాయసం గణపయ |
| నాసికేతోపాఖ్యానము | చందలూరి చిక్కయ |
| కాంచీమాహాత్మ్యము | కుడిచెర్ల తిప్పరాజు |
| శివకాంచీమాహాత్మ్యము | రాపరది దేచిరాజు |
| హరిశ్చంద్రకథ | దేవరాజభట్టు |
| శ్రీవిష్ణుపురాణము | పశుపతి నాగనాథుడు |

1. దీని ప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్తు (కాకినాడ) వారి గ్రంథాలయంలో ఉన్నది. తుద మొదళ్ళు లేకపోవడంవల్ల గ్రంథ సంధాత పేరుకానీ గ్రంథం పేరుకానీ తెలియవు. 'ఉదాహరణ పద్యములు' అన్న పేరు గ్రంథాలయాధికారులు పెట్టిందే.

| | |
|---|---|
| జినేంద్రపురాణము | పద్మకవి |
| అష్టమహిషీకల్యాణము | రెడ్డిపల్లె ముత్తమరాజు |
| బృహన్నారదీయము | వాసిరాజు రామయ్య |
| త్రిపురవిజయము | పోతరాజు వీరయ్య |
| శ్రీరంగమాహాత్మ్యము | చెన్నమల్లు శ్రీగిరన్న |
| ఆదిపురాణము | సర్వదేవుడు |
| విరాటము | |
| శాకుంతలము | సిద్ధన ప్రెగ్గడ |
| త్రిపురవిజయము | పెదపాటి సోమయ |
| వసంతవిలాసము | నాచన సోమన |
| ఇంద్రసేనము | నన్నయ |
| పురాతనచరిత్రము | ? |
| రంగనాథశతకము | ? |
| రామా!రాజచూడామణీ! | ? |

పైన పేర్కొన్న వాటిలో మొదటి పది కావ్యాలను పెదపాటి జగ్గన్న కూడా తన ఆంధ్ర ప్రయోగ రత్నాకరంలో పేర్కొన్నాడు. తక్కినవి ఈ గ్రంథసంధాత మాత్రమే ఉదాహరించినట్టివి. అథర్వణభారతం, వసంత విలాసం, విరాటం - ఈ మూడూ కొన్ని ఛందోగ్రంథాల్లోకూడా ఉదాహరింప బడినవి. ఇక తక్కిన కావ్యాలన్నీ ఈ సంకలన కర్తవల్ల తెలియవచ్చేవే. ఈ విధంగా తెలుగు సాహిత్యచరిత్రకు ఎంతో మేలు చేసిన ఈ గ్రంథ సంధాత పేరు మనకు తెలియకపోయినా ఆయన సంకలనం మాత్రం తెలుగు సాహిత్య చరిత్రకారులకు చిరస్మరణీయం.

### ప్రబంధరత్నాకరము :

(జగ్గన) : 78 కావ్యాల్లోని పద్యాలు ఇందులో ఉదాహరింపబడ్డవి. ఉదాహరణపద్యకర్తా, లక్షణకారులూ ఉదాహరించిన కావ్యాలనూ లభ్యమైన కావ్యాలనూ మినహాయిస్తే జగ్గకవి మాత్రమే ఉదాహరించిన అలబ్ధకావ్యాలు దాదాపు ఇరవై ఐదు వరకు ఉంటాయి. అవి ఇవి :

| | |
|---|---|
| సకలపురాణసారము | కూచిరాజు ఎఱ్ఱయ |
| కుమారనైషధము | పెదపాటి ఎఱ్ఱాప్రెగడ |

| | |
|---|---|
| నవగ్రహస్తవము | గౌరనకవి |
| తారావళి | త్రిపురాంతకుడు |
| షోడశరాజచరిత్ర | ఆమడూరి నరసింహభట్టు |
| అనంతమహత్త్వము | బొడ్డపాటి పేరయ |
| పద్మినీవల్లభము | ,, |
| మంగళగిరివిలాసము | ,, |
| శంకరవిజయము | ,, |
| సూర్యశతకము | ,, |
| పర్వతపురాణము | పోలమరాజు |
| ఇందుమతీకల్యాణము | అంగర బసువయ్య |
| సావిత్రి కథ | తులసి బసువయ్య |
| హరిదత్తోపాఖ్యానము | నండూరి మల్లయ |
| జలపాలిమహత్త్వము | ఘటసాని మల్లుభట్టు |
| ప్రద్యుమ్నవిజయము | ఫణిధవు మాధవభట్టు |
| పద్మావతీకల్యాణము | నెల్లూరి ముత్తరాజు |
| రామలింగశతకము | ఎలుకుర్తి రామరాజు |
| షష్ఠస్కంధము | మలయమారుతం సర్వన |
| కన్నప్పచరిత్ర | కంచిరాజు సూరయ |
| భరతము | దామరాజు సోమయ |
| శివజ్ఞానదీపిక | పెదపాటి సోమయ |
| పంచతంత్రము | ? |
| వల్లభాభ్యుదయము | శ్రీనాథుడు |

జగ్గన తన ప్రబంధరత్నాకరంలో పై గ్రంథాలను పేర్కొని ఉండక పోతే వాటి ఉనికి మన కీ నాడు తెలిసిఉండేది కాదు.

కావ్యావతారికలు, లక్షణ గ్రంథాలు, సంకలన గ్రంథాలు - వీటి ఆధారంగా పరిశీలిస్తే తెలుగులోని ఎన్నో కావ్యాలు మనకు లభ్యం కాలేదన్న విషయం స్పష్టమౌతుంది. ఇక కావ్యావతారికాదుల్లోకి ఎక్కక, నామరూపాల ఉనికి కూడా తెలియక నష్టప్రాయాలైన కావ్యాలు మరెన్నో! మొత్తం మీద మన చేతికందని కావ్యాలు వందలకొద్ది ఉంటాయనటంలో సందేహం లేదు. తెలుగు జాతి ఇంత సాహిత్య సంపదను కోల్పోవటం నిజంగా దురదృష్టం.

(డా॥ ఆర్. శ్రీహరి సంకలనం చేసిన "అలబ్ధకావ్య పద్యముక్తావళి" 1983.)

# రామాయణకల్పవృక్షం - భాషాశిల్పం

విశ్వనాథ సత్యనారాయణ గారు అసాధారణ ప్రతిభా సంపన్నులు. అపూర్వ ప్రజ్ఞాధురీణులు. తన రచనల్లో అనేక రచనా శిల్ప రహస్యాలను ప్రతిభావంతంగా పొదిగిన మహాశిల్పి.

తెలుగుసాహిత్యంలో విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షానికి ఒక విశిష్టమైన స్థానం ఉంది. ఇందులోని ఇతివృత్తం పురాతనమే ఐనా కథా నిర్వహణంలో కొత్తదనం కనిపిస్తుంది. అట్లే స్వీకరించిన ఛందస్సుకూడా ప్రాచీనమే ఐనా భాషా ప్రయోగంలో నూతనత్వం భాసిస్తుంది. "ఒక మహాశిల్పి యగుటకు నొక్క-వేయి లక్షణములుండు" - అని ఒక సందర్భంలో అంటారు విశ్వనాథ. కవితాశిల్పానికి సంబంధించిన అంశాలలో భాషాశిల్పంకూడా ఒకటి. రామాయణ కల్పవృక్షంలో ఈ భాషా శిల్పాన్ని విశ్వనాథ ఏ విధంగా నిర్వహించినారో పరిశీలిద్దాం.

రామాయణ కల్పవృక్షంలోని భాషలో విశ్వనాథవారు వ్యావహారికతా లక్షణాన్ని ప్రవేశ పెట్టినట్లుగా కనిపిస్తుంది. ప్రాచీన పద్ధతిలో రచింపబడిన రచనలో వ్యావహారికతా లక్షణాన్ని ప్రవేశ పెట్టడం విశ్వనాథవారి భాషా ప్రయోగ శీలతకు ఉదాహరణంగా చెప్పవచ్చు.

భాషలో వ్యావహారికత అంటే కేవలం 'ము'కు బదులుగా సున్న వాడడం, చేయుచున్నాను మొదలైన పదాలను చేస్తున్నాను ఇత్యాదిగా వాడడం మాత్రమే కాదు - వ్యవహారంలో ఉన్న విశిష్టమైన పలుకుబళ్ళను, వాక్యవిన్యాస రీతులను ప్రవేశ పెట్టినపుడే భాష వ్యావహారికమౌతుంది.

విశ్వనాథవారు ఈ విధమైన వ్యావహారికతా లక్షణాన్ని తన రామాయణ కల్పవృక్షంలో ప్రవేశ పెట్టి రచనకు సహజత్వాన్ని తెచ్చినారని చెప్పవచ్చు.

ఆంధ్రప్రశస్తి కావ్యాన్ని మిత్రులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి అంకితం చేస్తూ చెప్పిన ఈ పద్యం గమనించండి:

"నీవనుకోనులేదు మఱి నేనది చెప్పనులేదు కాని అ
న్నా వినవయ్య నేటికిది నా చిఱుపొత్తము నీకు నంకితం
బై వెలయింపఁజేతు"

ఇందులో అలంకారాలేమీ ప్రయోగించకుండానే కేవలం భాషా ప్రయోగ వైచిత్రితో తమ యిద్దరి మధ్యనున్న చనువును అందంగా వ్యక్తీకరించినారు. 'నీవనుకోనూలేదు, మరి నేనిది చెప్పనూలేదు. అన్నా విను' - అనే వ్యావహారిక శైలి ఇందులో కనిపిస్తుంది.

శృంగారవీథిలోని మేలుకొలుపు అనే ఖండకావ్యంలో మరో పద్యం గమనించండి:

"పక్కయంతయుఁ జిమ్మితి పద్మనాభ
అన్న చూడుము పుస్తకమ్మట్లు పండు
కొనును, నీవేమొ పక్కంత కుమ్మి కుమ్మి
పక్క యటులుండ నీ విట్లు పండుకొందు"

యశోద శ్రీకృష్ణుణ్ని నిద్రలేపుతూ పలికిన పలుకులు ఈ పద్యం. 'పక్కంతా చిమ్మేసినావు. అన్న చూడు. పుస్తకమ్మాదిరిగా పండుకున్నాడు. నువ్వేమో పక్కంతా కుమ్మి కుమ్మి పక్క అక్కడ ఉంటే నువ్వు ఇక్కడ వచ్చి పడుకున్నావు' అన్న వ్యావహారిక వాక్యానికి ఈ పద్యభాష ఎంతో సన్నిహితంగా ఉంది. అన్న చూడు, నువ్వేమొ, పక్క అటులుండ అనేవి చక్కని వ్యావహారిక ప్రయోగాలు. వాక్య విన్యాసం కూడా పూర్తిగా వ్యావహారికమే.

దూరాన్వయం లేకుండా పరస్పరం అన్వయించే పదాలు ఒకదాని వెంట ఒకటి క్రమంగా ఉండడం వ్యావహారిక భాషా లక్షణం. ఈ లక్షణం రామాయణ కల్పవృక్షంలో పెక్కుచోట్ల కనిపిస్తుంది. ఒక్క ఉదాహరణం-

మన మిట్టి లేడిఁగనినా
మని చెప్పిన నమ్మరెవ్వ రసలీ లేడిం
గొని చని కనకమ్మృగంబం
చను చెప్పుచు నమ్మనపుడు చూపించవలెన్.

వ్యావహారిక వాక్యంలోని పదాల క్రమమే ఈ పద్యంలో కనిపిస్తుంది. ఇందులోని 'అసలు' అనేది ఎంతో శక్తిమంతమైన వ్యావహారిక ప్రయోగం. దీనికి సమానార్థకమైన పదం మనకు తెలుగులో కనిపించదు. వాక్యవిన్యాసమూ పదక్రమమూ మాత్రమేకాక, ఈ విధంగా శక్తిమంతమైన వ్యావహారిక పదాల ప్రయోగం కూడా వ్యావహారిక ప్రయోగ లక్షణంగానే చెప్పుకోవచ్చు. ఇలాంటి వ్యావహారికప్రయోగాలు కల్పవృక్షంలో ఎన్నో కానవస్తాయి.

మా బాబునకు ధర్మమహిమలు రక్ష
మా బుజ్జికిని మౌనిమహసులు రక్ష
చిట్టితల్లితోడ సీతమ్మతోడ (అభిషేక 67)
బాబు! ఇది శత్రులకుఁ గూడ వలదటన్న (పరరాత్ర 294)
వట్టి వెఱ్ఱిపప్పక్రిందం గట్టిరి (నూపుర 266)

బాబు, బుజ్జి, చిట్టితల్లి, వెఱ్ఱిపప్ప మొదలైన పదాలు నిత్యవ్యవహార సాధారణాలు. ఇలా వ్యావహారికభాషా పదజాలాన్నే కాకుండా తెలుగుదనం ఉట్టిపడే చక్కని తెలుగు పలుకుబళ్ళను, జాతీయాలను అసంఖ్యాకంగా వాడి రచనకు ఎంతో సహజత్వాన్ని తెచ్చినారు. ఈ ప్రయోగాలు ప్రాచీన కావ్య పద్ధతిలో రచింపబడ్డ కల్పవృక్షంలో ఉండడం విశేషం.

ఆ మాంస మీ మాంసమని లేక క్షుద్వార
కమ్ముగా సర్వభక్షణము సేత (పరరాత్ర
ఐనదానికి మఱియును గానిదాని
కేలికతనానఁ జిల్లకజ్జాలు పెంచ (కల్యాణ 262)
కుబేరునకున్ మొదల్ దిక్కులేదు
ఇంక మా మాట యనవలెనే ముకుంద! (బాలకాండ)
చచ్చినవారితో మనము చత్తుమె చచ్చిననైన వారలున్
వచ్చెడి వారటే ధరణిపైఁ దిన గింజలు నేరకుండునో

యచ్చట వారలుండెద రవెన్ని దినాలుగ వ్రాసియుండెనో
చచ్చినయట్టులుండవలె సర్వముగావలె మత్తకాశినీ!

బ్రతుకగఁదప్పని యప్పుడు
బ్రతుకుట లోపలను చచ్చుబ్రతుకేలా!

తానదేమో పిచ్చితల్లి యే ప్రేమ బోయిన నదే ప్రేమబోవు
చిలుకకుఁజెప్పినట్లు పదిచెప్పి, శతంబు వచించి వేయి యా
డి, లలన! సుంతలాభము గడింపము

తన యానంబడి యగ్నిలో దుముకనే' తానింత 'ఊ' అన్నచో
వనధిం దూకనె (అభిషేక 314)
స్త్రీయన్న తరువాత సిగ్గుండవలెగదే (పరరాత్ర 237)
మొద్దు విధంబునన్ నిదురపోవుచు నుండగ

నీవు లక్ష చెప్పు నిజముగా సుగ్రీవు
నందు శౌచభావమానృశంస్య
మధికమైన యట్టి యార్జవంబును లేవు (అన్వేషణ 151)

ఎన్నాళ్ళు సీత కన్పడ
దన్నాళ్ళును పోనెపోను (అన్వేషణ 151)

పోనె పోనిక నేనయోధ్యకు వనీభూముల్ మరిట్లే చనంగానౌ నాకును
(మునిశాప

అని లక్ష తిట్టితినయ్యె
వీధిలో పురమందున నొక్కపురుగు లేదు (సుందర)
అదియేమి పోవుకాలమో (ధనుస్సు 451)

వాక్య విన్యాసంలోనూ, పదప్రయోగంలోనూ పలుకుబళ్ళను గుప్పించడంలోనూ మాత్రమేకాక సంభాషణల్లో కూడా చక్కని వ్యావహారికతాలక్షణం కల్పవృక్షభాషలో కనిపిస్తుంది.

తిమ్మిరి వాయఁగోసికొని తిందుమె నిన్నిపుడోసి యోసి నీ
యమ్మమగండా. నీ మగడా యడ్డము వచ్చెడువాడు చూతుమా
(పరరాత్ర. 333)

స్వామి నిన్ను తర్జన భర్జనలతో లొంగదీయమన్నాడు గాని లేనిచో నీవు వినుటయేమి? నీ తలలో జేజెమ్మ వినును. (అపరరాత్ర. 289)

వ్యక్తులను సంబోధించేటప్పుడు సంబోధింపబడే వ్యక్తులు మనకు సన్నిహితులూ, ఆప్తులూ ఐనప్పుడు వారి పేర్లను కొంత మార్చి, క్లుప్తపరచి సంబోధించడం కనిపిస్తుంది. ఉదా:- పద్మ>పద్దు; రామారావు>రాము, కృష్ణ>కిట్టు మొ॥ సంబోధనల్లో ఇలాంటి వ్యావహారికతా లక్షణం రామాయణ కల్ప వృక్షంలో కనిపిస్తుంది. కొన్ని ఉదాహరణలు :

అన రాముడు లక్ష్మణుఁజే
కొని కౌగిలిగాఁగ నెదురుకొని లచ్చి రా
జని రాముఁడైన యెడ రా
జని లక్ష్మణుఁడేల కాడురా యని యొత్తెన్. (అభిషేక 78)

లక్ష్మణుణ్ని ఆప్యాయంతో సంబోధించేటప్పుడు 'లచ్చి' అని అంటాడు. ఇది సంబోధనలో వ్యావహారికత. అప్యాయంతో కాక కోపంతో సంబోధించేటప్పుడు కూడా ఈ వ్యావహారికతా లక్షణం కనిపిస్తుంది. నిత్యవ్యవహారంలో మనం తిట్టుకునే పద్ధతే కల్పవృక్షంలో కూడా చోటు చేసుకొని, రచనకు సహజత్వాన్ని ఆపాదించింది. కొన్ని ఉదాహరణలు:

అవునె దౌర్భాగ్య మాకారమైనదాన
నీకు నిదురయెటు పట్టునె దరిద్రు
రాల! యొకవంక నింటి చూరంటుకొనిన
సొగసుగా చలి క్రాగెడు పగిది దోప (అభిషేక. 105)

నీ పాడుముండ వచ్చెదవా! పా
పపు శకునపక్షి యని ప్రతిహారుల్
దీవింప .... .... .... .... (మునిశాప. 496)

ముసలి మొగముది యొక కొండముచ్చు ముండ
పసితనంబున రాముని పారిహాస్య
మునకుఁ బగబూని కైకతో పుల్లవిఱుపు
లాడి రాముని వనమేగు టాచరించె (మారీచ. 192)

విశ్వనాథ ఆయా సందర్భాలలో పాత్రల శీలాన్ని ప్రతిబింబింపజేసే విధంగా విశేషణాలు వాడడం కనిపిస్తుంది. పరిశీలనాత్మక దృష్టితో చూసినపుడే

వీటిలోని విశేషం తెలుస్తుంది. సీతారామలక్ష్మణులు గుహుడు తెచ్చిన పడవపై గంగానది దాటేప్పుడు "ఆరోపింపఁగజేయు మీ వదినె ముందా పైని నీ నావ నీవారోహింపుము - నేను వచ్చెదను తర్వాతన్" అని రాముడు ఆజ్ఞాపిస్తాడు. అప్పుడు లక్ష్మణుడు సీతాదేవిని పడవనెక్కిస్తాడు. ఈ సందర్భంలో విశ్వనాథ "లక్ష్మణుడు తల్లినెక్కించి పక్ష్మచలనః మృదుదృగంతములన్. రామునెగచి చూచి తాను నావపై నెక్కె యుంజానమూర్తి" - అంటూ లక్ష్మణునికి 'యుంజాన మూర్తి' అనే విశేషణం వాడతాడు. యుంజానమూర్తి అంటే 'ఇంద్రియ విషయా లలో శబ్ద స్పర్శాదులనుండి మరల్పబడిన నిర్మలమైన మనస్సుతో సమాధి యందుండువాడు' అని అర్థం. ఈ విశేషణం లక్ష్మణుని శీలాన్ని ఎంతో సమర్థంగా వ్యక్తం చేస్తుంది.

చెప్పవలసిన భావాన్ని నేరుగా, వాచ్యంగా కాక వక్రంగా చెప్పడం ఉక్తివక్రత. దీనికి ఒక్క ఉదాహరణ గమనించండి:

చిటికెనవ్రేలితో శివుని విల్విఱిచిన ఘోరబాహుని నెత్తికోనునగునె
యనుభూత దనుజమర్దన కాలవికటత్వ మీతని బుగ్గ ముద్దిడగనగునె
కోసలరాజ్య సింహాసనాధ్యాసన తర్కితుఁడౌడ నితని నెక్కింపనగునె
తన కాలిచెప్పు రామునికాల సరిపోవు వయసులోఁ గౌగిలింపంగఁదగునె

రామచంద్రుని వయసు కారణముగాఁగ
నవనిపతి పొంగులగు ప్రేమ వ్యర్థమైన
నతడు పూనిన యంజలి నంజలించి
యతని యంజలిలో ముద్దులాడె నృపతి. (అభిషేక. 48)

రాముని వయసును వాచ్యంగా చెప్పక "తన కాలిచెప్పు రామునికాల సరిపోవు వయసు" అని చెప్పడంలో ఉక్తి వక్రత కనిపిస్తుంది.

విశ్వనాథవారి కవితలో సంఖ్యావాచక పదాలకుముందు 'ఒక' శబ్దాన్ని వాడడం చాలా ఎక్కువగా కనిపిస్తుంది. ఇది వ్యవహారభాషలో కనిపించే లక్షణమే. ఒక యాభైరూపాయలు, ఒక డెబ్బైరూపాయలు మొ॥ ఈ విధంగా సంఖ్యావాచకాలకు ముందు ఒక శబ్దాన్ని వాడడం తెలుగునుడికారం. రామాయణ కల్పవృక్షంలో ఈ నుడికారం వాడబడిన ప్రయోగాలు గమనించండి:

ఒక పదివేల యేనుగుల కుండిన యంత బలంబు గల్గున
ప్రకట మహేంద్రపర్వతము (సుందర; పూర్వయాత్ర. 10)
ఒక యేబది మంది (అయోధ్య)
ఒక మూన్నాళ్ళకు ముందు సర్వము సుఖజ్యోత్స్నామయంబైన తే
నికి నీలోపున నెట్టి చీకటులు నిండెన్

ఒక యేమియు చేయకూరకుందురె ధాత్రిన్

ఒక వేయి రూపములతో
నొక వేయి విధాల వచ్చియుండినచో నుం
డక మండినచో మండక
యొక వేయివిధాల నలచె సుగ్రత వారిన్

ఒక వంద యంగదులు మామకదుఃఖము బాపలేరు (కిష్కింధ)

వేర్వేరు ప్రాంతాల భాషల్లో, వేర్వేరు వర్గాల భాషల్లో పరస్పరం భేదం ఉన్నట్లుగానే వేర్వేరు వయస్సుగల వారి భాషల్లో కూడా భేదం కనిపిస్తుంది. ఉదాహరణకు పిల్లల భాషను తీసుకోవచ్చు. 'ర'ను 'ల'గా ఉచ్చరించడం మొదలైనవి బాలభాషలో కనిపించే లక్షణాలు. బాల్యంలో ఉన్న శ్రీరాముడు పలికే మాటలను విశ్వనాథ ఎంత సహజంగా వర్ణించినారో గమనించండి.

తానో లాములు తండ్రి పేరెరవరయా దాచాతమాలాలు నా
లే నా పేరన నమ్మగా లనఁగ నోలిందల్లి కౌసల్య తం
డ్రీ నాగా ననబోయి రాక కనులన్ నీర్వెట్టి కౌసల్య నా
గానే కానుత్రె యమ్మనే యని ప్రభున్ గౌసల్య ముద్దాడెడిన్.

రాముడు అనడానికి లాములు అనీ, దశరథ మహారాజులు అనడానికి దాచాతమాలాలు అనీ, అమ్మగారు అనడానికి అమ్మగాలు అనీ రామునిచే పలికించడం ఎంతో సహజంగా ఉంది. పాత్రోచితంగా బాలభాషను శ్రవ్య కావ్యంలో ప్రవేశ పెట్టిన ఘనత విశ్వనాథకే దక్కుతుంది.

రామాయణ కల్పవృక్షంలో మనకు అడుగడుగునా సూక్తులు కనిపిస్తాయి. ఈ సూక్తులు ఆయా ఘట్టాలకు ఒక విశిష్టతను ఆపాదించడమే కాక భిన్న సందర్భాల్లో వాడుకోడానికి ఎంతగానో ఉపయోగపడతాయి. ప్రజల నాలుకల్లో చిరస్థాయిత్వం పొందగలిగిన శక్తి వీటికుంటుంది. రామాయణ కల్పవృక్షంలోని కొన్ని సూక్తులను పరిశీలించండి:

"ఆడదానికి గలుగు ధనాశయెంతొ
యవని మగవానికుండు కీర్త్యాశయంత"

వలయు విద్య కైకాగ్ర్య మభ్యసనవేళ
చనును బహుముఖత్వము ప్రదర్శనవేళ

తెచ్చిన వేపమొక్కకును తేనియ పోయుము చేదు మానునా
అల్పుడైన వాని కాపత్తి కలిగిన
గుండె నీరసించి కూలిపోవు

మన బంగారము మంచిదైనయెడఁ గంసాలిన్ మతేలా యనన్
జీవి లక్షణము చిత్రమైనది కదా
బుద్ధి వచ్చి మఱల బుద్ధిరాదు

సత్యనారాయణగారు సంస్కృతంలో గొప్ప విద్వాంసులు. సంస్కృతంలోని విలక్షణమైన ప్రయోగాల నెన్నిటినో రామాయణ కల్పవృక్షంలో వాడి తమ సంస్కృతభాషా వైదుష్యాన్ని చాటుకున్నారు. నైచికులు, మౌకలికులము, పురస్తాద్యాతు సౌమిత్రి, ఖాదతమోదతామతము, అటట్యావృత్తి, మాహేయి, మృధము మొదలైన ప్రయోగాలనెన్నింటినో ఉదాహరించవచ్చు.

'తద్ధితమూఢో వైయాకరణః' అని సంస్కృత సూక్తి. తద్ధితాలు తెలియనివాడు వైయాకరణుడు కాడనీ, తద్ధితాలు తెలిసినవాడే వైయాకరణుడని దీనికర్థం. తద్ధితరూపాల ప్రయోగంవల్ల రచనకు ఒక గాంభీర్యం వస్తుంది. సత్యనారాయణగారు ప్రయోగదక్షులైన వైయాకరణులు కనుక విలక్షణమైన ఎన్నో తద్ధితాంత రూపాలను వాడి రచనకు ఎంతో గాంభీర్యాన్ని చేకూర్చినారు. కొన్ని ఉదాహృతులు—

| | |
|---|---|
| ఆగ్నాయీప్రియతమున్ | త్రైదశజగత్సౌఖ్యంబు |
| పైనాకశరములు | మాఘవతాశ్మము |
| ఐరమ్మదీయసరసి | స్వామీచీన్యము |
| నైగనిగ్యము | సౌరాపగ |
| కార్తికికమాసము | వార్షకాత్రము |
| కార్ష్ణాయసపీఠికాగతుడు | |

అనేక తద్ధితాంతరూపాలను ఒకే పద్యంలో ఎంతో ఔచితీమంతంగా కూర్చి 'ప్రియతద్ధితా దాక్షిణాత్యాః' అన్న సూక్తిని సార్థకం చేసినారు.

ప్రేష్ఠంబుల్ ప్రజమోదములం గనుచుఁ దత్ప్రేమన్ గుబాళింప బృం
దిష్ఠమ్ముల్ పొలముల్ గనుంగొనుచు సాధిష్ఠంబులై యుంట బం
హిష్ఠమ్మౌ చనుత్రోవ వేగిరముగా నేగన్ సుమంత్రుండు క్షే
పిష్ఠాశ్వంబుల దోలఁ గోసలములున్ వెన్నైక ప్రయాణించుచున్
(బాల; ఇష్టి. 216)

ఈ పద్యంలోని ప్రేష్ఠ, బృందిష్ఠ, సాధిష్ఠ, క్షేపిష్ఠ అనే శబ్దాలు క్రమంగా ప్రియ, బృందారక. సాధు, బహు, క్షిప్ర అనే శబ్దాలకు అతిశయార్థక తద్ధితాంతరూపాలు.

ఈ విధంగా రామాయణ కల్పవృక్షాన్ని పరిశీలించినప్పుడు భాషావిషయకమైన అనేక విశేషాలు మనకు తెలియవస్తాయి. కొన్నింటిని మాత్రమే ఈ వ్యాసంలో పరిశీలించడం జరిగింది.

(విశ్వనాథ సాహితీసమాలోచనం (సెప్టెంబర్ 1995) లో ప్రచురితమైన వ్యాసం)

# ప్రాచీన కావ్యాలు – పాఠపరిష్కరణ

ప్రాచీనకాలంలో నేటిమాదిరిగా రాతకుపయోగపడే కాగితం మొదలైన సాధనాలుకానీ, ముద్రణయంత్రాలుకానీ లేకుండేవి. ఆనాటి సాధనాలు రెండే రెండు. కాగితం బదులు తాటాకులూ, కలం బదులు గంటమూ. సాధారణంగా పూర్వకాలపు కవులుకానీ, మహాపండితులుకానీ స్వయంగా వ్రాసుకునే అభ్యాసం ఉన్న వారు కారు. వాళ్లు సమర్థులూ, వినయవంతులూ ఐన శిష్యులకాశువుగా పద్యాలు చెపుతూ ఉంటే వాళ్లు రాసుకునేవారు. లేదా లేఖకులైనా రాసేవారు. తిక్కనగారికి గురునాథుడూ, తిమ్మన గారికి జగ్గకవీ లేఖకులుగా ఉండినట్లు ప్రసిద్ధి. ఒక మహాకావ్యం దేశమంతా ప్రసిద్ధం కావాలంటే దానికి ఎన్నో కాపీలు రావాలి. ఇందుకు లేఖకుల ఆవశ్యకత ఎంతగానో ఉంటుంది. ఈనాడు మనకు ప్రాచీన కవి స్వయంగా రాసిన ప్రతిగానీ, ఆయన సరిచూచి దిద్దిన ప్రతి కానీ లభించడం దుర్లభం. స్వయంగా రాసిన దాన్ని Autograph అని అంటారు. దాని పుత్రికలు, పౌత్రికలు, ప్రపౌత్రికలు మాత్రమే ఈనాడు మనకు లభ్య మౌతున్నాయి అంటే లేఖకులు రాసిన ప్రతులే మనకు లభ్యమౌతున్నాయన్న మాట. ఐతే ఈ లేఖకులందరూ వ్యుత్పన్నులు కారు. ఒక విధంగా వ్యుత్పన్నత లేకపోవడం కూడా లేఖకునికి గుణంగా భావించవచ్చు. ఎందుకంటే తన అవ్యుత్పన్నత కారణంగా యథేష్టంగా మూలగ్రంథంలో ఆతడు మార్పులు చేసే అవకాశం లేదు కనుక. ఎంత చక్కని లేఖకుడైనా చూచి రాసేప్పుడు ఏ దోషమూ లేకుండా రాయలేడు. ఇక మామూలు లేఖకుల విషయం చెప్పనవ సరం లేదు. అజాగ్రత్త, అజ్ఞానం, మూలంకన్న మెరుగుపరచవలెననే అత్యుత్సాహం మొదలైన అనేక కారణాల వల్ల లేఖకులు దోషం చేసే అవకాశం ఉన్నది. ఒక్క ఉదాహరణ మనవి చేస్తాను.

కుందమాలలో ఒక శ్లోకం ఉంది.

వామేన నీవారలతాం కరేణ
జానుం సమాలంబ్య చ దక్షిణేన
పదే పదే మే పదమాదధానా
శనైః శనైరేతు ఋుహూర్తమార్యా.

వచ్చింది. ఐతే ఇక్కడ మనకు తా.ప. ప్రతుల్లో 'గురువంశ భర్తకున్, అనికాక 'రఘువంశ భర్తకున్' అనే పాఠమే కనిపిస్తుంది. లేఖకుడు భారతప్రతులను రాసిన అభ్యాసంచేత కాబోలు రఘువంశ భర్తకున్ అనేచోట 'గురువంశభర్తకున్' అని పొరపాటుచేసి ఉంటాడు.

లేఖకుడు వ్యుత్పన్నుడై కవి కూడా అయివుండి తన శక్తిని ఆ కావ్యంలో చూపదలచుకుంటే పదాలను మార్చడమేకాక పద్యాలకు పద్యాలే కొత్తవి రాసి ఆ గ్రంథంలో చేర్చే అవకాశం ఉంది. వీటినే మనం ప్రక్షేపాలంటాం. దీనివల్ల మూలగ్రంథ స్వరూపమే మారిపోయే అవకాశం ఉన్నది. వేమన పద్యాల్లో ఇలాంటి ప్రక్షేపాలెన్నో ఉన్నాయని మనం ఎరిగిందే.

ఈ విధమైన ప్రక్షేపాలకు మరో అవకాశం కూడా ఉన్నది. ముఖ్యంగా పురాణంగా చెప్పుకునే భారత భాగవత రామాయణాల్లో పౌరాణికులు తమకు బాగా నచ్చిన ఇతర కావ్యాల్లోని అందమైన పద్యాలను తమ పురాణ ప్రవచనం ఆకర్షణీయంగా ఉండడంకోసం చేర్చుకోవడం జరుగుతుంది. ఆ పద్యాలు బాగా ప్రసిద్ధమై ఉండి అందరికీ అవి ఏ కావ్యంలోవో తెలిస్తే సరేకాని తెలియనప్పుడు మాత్రం అవి ఆ గ్రంథంలోనివనే భావించే అవకాశం ఉంది. దానిని అనుసరించి వచ్చిన ప్రతుల్లో ఈ పద్యాలన్నీ చేరే అవకాశం ఉంది.

మూల గ్రంథ స్వరూపాన్ని వికృతం చేయడంలోనూ, లుప్తం చేయడంలోనూ లేఖక మహాశయులదే కాక కీటక మహాశయుల పాత్ర కూడా ప్రధానంగా చెప్పుకోవలసి ఉంటుంది. పద్యభాగాలను, అక్షరాలను, అక్షరాల్లోని భాగాలను ఇవి భక్షించడంవల్ల మూలగ్రంథ స్వరూపానికి నష్టం కలుగుతుంది. ఒకే ప్రతి ఉన్న తాళపత్ర గ్రంథాల్లో కాని లేక కాగిత ప్రతుల్లో కాని ఇది జరిగితే మూలగ్రంథాన్ని నిర్ణయించడంలో కలిగే శ్రమను చెప్పవలసిన పనిలేదు. (ప్రసిద్ధ గ్రంథాల్లో నన్నెచోడుని కుమార సంభవానికి ఒకే ఒక తాళపత్ర ప్రతి, కేతన దశకుమార చరిత్రానికి ఎఱ్ఱన నృసింహపురాణానికి ఒకే ఒక కాగితపు ప్రతి మనకు లభించినాయి.) ఈ విధంగా నష్టమైన భాగం అక్షరంలోని అంశంనుండి కావ్యభాగంవరకూ జరుగవచ్చు. వీటిని పూరించేటప్పుడు చాలా జాగ్రత్త

వహించవలసి ఉంటుంది. పరిష్కర్త వాటిని పూరించినట్లైతే గ్రంథంలో ఆ భాగాన్ని కుండలీకరణంలో ప్రత్యేకంగా పేర్కొనాలి. ఈ పూరణ విషయంలో ఒక ఆసక్తి కరమైన విషయం మనవి చేస్తాను.

ప్రాచీన కావ్యాలలోని పూరణ కుండలీకరణ విధానానికి మార్గదర్శకు లైన వీరేశలింగం పంతులుగారు నాచనసోముని ఉత్తర హరివంశాన్ని 1900లో తంజావూరినుండి ప్రతిని తెప్పించి ముద్రించినారు. అందులో చివరిభాగం లేదు. వీరేశలింగంగారు ఆ నష్ట భాగాన్ని పూరించి కుండలీకరణంచేసి ప్రకటించినారు. వావిళ్ళవారు దాన్ని ముద్రించేప్పుడు పూరించిన భాగాలను కుండలీకరణాలను చూపకుండానే - గ్రంథమూలంతో అచ్చువేసినారు. దీనివల్ల వీరేశలింగంగారు పూరించిన భాగం ఉత్తర హరివంశంలో నాచన సోమనాథుని కవితగానే - పరిగ ణింపబడింది. ఇది ఎంత ఘోరమైన ప్రమాదమో గమనించండి. కీర్తిశేషులు నడకుదిటి వీరరాజుగారు తమ సోముని హరి వంశము అనే వ్యాసంలో తాళపత్ర పరిశోధన చేసి ఈ భాగం సోమనాథుని రచన కాదని, వావిళ్ళవారు కుండలీ కరణం చేయకుండా, చేసినవారి పేరు చెప్పకుండా ఉండడంవల్ల ఇట్టి అవ్యవస్థ వచ్చిందని నిరూపించినారు.

గ్రంథపరిష్కరణలో చేయితిరిగిన మానవల్లి రామకృష్ణ కవిగారు కూడ కుమార సంభవ ద్వితీయ భాగముల (1908, 1914) ముద్రణంలో కుండలీకరణ విధానాన్నే అవలంబించి ఉన్నట్లయితే కుమార సంభవం పాఠభేదాల విషయంలో ఎన్నాళ్ళుగానో సాగుతున్న వాదోపవాదాలకు ఆస్కారం ఉండేదికాదు. అంతేకాక పూర్వగ్రంథ పాఠాలను మార్చేస్తారన్న అపవాదం కూడా కవిగారికి వచ్చి ఉండేది కాదు.

ఈ వ్యాసకర్త భా.రా. పై పరిశోధన చేస్తున్న సందర్భంలో భా.రా.నికి సంబంధించిన తా.ప్ర. లను చూడడం సంభవించింది. ఎక్కడైనా అవతారిక లభిస్తుందేమోనన్న ఆశ, కర్తృత్వ నిర్ణయానికి ఆధారాలు లభిస్తాయన్న నమ్మకం. ఈ రెంటితో ఆశ్వాసాద్యంతాలు పరిశీలించి ఆ తరువాత ఇంచుమించు గ్రంథ

మంతా తా. ప. ప్రతులతో పోల్చిచూడడం జరిగింది. ఈ పరిశీలనవల్ల ప్రస్తుతం మనకు లభిస్తున్న భా.రా. ప్రతి పరిష్కృత ముద్రణం కాదనీ, ప్రధాన గ్రంథంలో ఎన్నో పూరణలు ఉన్నాయనీ, పూరణలేకాక కొన్నిచోట్ల గ్రంథ ద్వయం చోటుచేసుకున్నదని తేలింది. ఇప్పటి భా.రా. ప్రతుల్లో అరణ్యకాండలో ప్రధాన పాఠం, దాని దిగువ పాఠాంతర పద్యాలు చూపబడ్డాయి. పాఠాంతర పద్యాలు అధిక పద్యాలుకాక ప్రధాన పాఠంలోని విషయాన్నే వివరించేవిగా ఉన్నాయి. విశేషమేమంటే 98, 99 శాతం తా ప్ర.ల్లో, ము.ప్ర.ల్లో పాఠాంతరంగా చూపబడ్డ పాఠమే కనిపిస్తుంది. అలాంటప్పుడు ఈ అధిక తా.ప్ర.ల్లో కనబడే పాఠాన్ని ప్రధాన పాఠంగా చూపకపోవడంలో కారణ మేమిటో తెలియదు. బహుశ మొట్టమొదటగా భా.రా. ముద్రించిన కరాలపాటి రంగయ్యగారు కవి కావడంవల్ల తానే అనేక పద్యాలను రచించి అందులో చేర్చి ముద్రించి ఉండవచ్చునని పండితులు అనుమానించినారు. తరువాతి వారు ఈ ప్రతినే అనుసరించి ముద్రించినారు. మొత్తంపైన తా.ప్ర. ప్రతుల పరిశీలన వల్ల భా.రా.లోని బాల, అయోధ్య, అరణ్యకాండలకు పరిష్కృత ముద్రణం కావలసిన అవసరం ఎంతైనా ఉందని తేలుతుంది.

పాఠభేదాలు గ్రంథకర్త కాలనిర్ణయంలో ఎంతో ఉపయోగపడతాయి. ఒక్క ఉదాహరణం మనవి చేస్తాను.

మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపిరంధ్ర విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్

ఇది కుమారసంభవంలోని పద్యం (1-23). మానవల్లి కవిగారు, నన్నెచోడుడు నన్నయకంటె పూర్వుడని నిరూపించడానికి ఈ పాఠానికి బదులుగా ఇతర తాళప్రతుల్లో కనిపిస్తున్నట్లుగా కింది పాఠాన్ని గ్రహించినారు.

దేశికవిత బుట్టించి తెనుం
గున నిలిపిరంధ్ర విషయం
బునఁజన సత్యాశ్రయునిదొట్టి చాళుక్యనృపుల్"

కుమారసంభవానికి తమ వద్ద రెండు ప్రతులున్నట్లుగా చెప్పుకున్నా వాటిని లోకానికి చూపనందువల్ల ఈ పాఠాంతరాన్ని పట్టించుకోవలసిన అవసరం లేకున్నా ఈ పాఠం నన్నెచోడుడు నన్నయకు పూర్వుడనే విషయానికి సమర్థకంగా మాత్రం ఉన్నదని నిరూపించడానికి ఉపయోగపడుతుంది.

పై అంశాలవల్ల ప్రాచీన గ్రంథాల పాఠాలను సరిగా నిర్ణయించవలసిన అవసరం మనకు స్పష్టమవుతుంది.

ఒక గ్రంథానికి అనేక ప్రతులు లభించి ఆ ప్రతుల్లో వివిధ పాఠభేదాలు కనిపిస్తున్నప్పుడు సరియైన పాఠాన్ని నిర్ణయంచేయడం గ్రంథపరిష్కర్త కర్తవ్యం. వివిధములైన మార్పులకు లోనైన మూలగ్రంథానికి తిరిగి నిజరూపాన్ని ఆపాదింపజేయడమే గ్రంథపరిష్కరణంలోని ప్రధానమైన అంశం.

పరిష్కరణంలో పాఠనిర్ణయమే ప్రధానం. పాఠనిర్ణయంలో పరిష్కర్తలకు ఈ కింది అంశాలు ఎంతగానో తోడ్పడతాయి.

1. పద్యపాదాలను యథాతథంగా మరో కావ్యంలో వాడుకున్న రచనలు (Paradies).
2. ప్రాచీనవ్యాఖ్యానాలు ఉదాహరించిన గ్రంథభాగాలు.
3. అనువాదాలు - లభ్యమౌతున్న అతి ప్రాచీనమైన ప్రతికి ముందుకాలంలో వచ్చిన అనువాదాలు మూలగ్రంథ నిర్ణయానికి ఎంతగానో తోడ్పడతాయి. సంస్కృతంలోని మహాయాన గ్రంథాల స్వరూపనిర్ణయంలో టిబెట్, చైనీస్ భాషల్లోని అనువాదాలు ఉపయోగపడ్డాయి. అలాగే తెలుగు మహాభారతం సంస్కృతభారతానికి లభ్యమవుతున్న అతిప్రాచీన ప్రతికి పూర్వం వచ్చిన అనువాదం కనుక దాని ఆధారంగా మూల సంస్కృతభారత ప్రతి స్వరూపాన్ని నిర్ణయించడానికి వీలైంది.
4. తరువాతి సాహిత్యంలో కనిపించే మూలగ్రంథంలోని భాగాల ఉదాహరణలు - ముఖ్యంగా ఛందోవ్యాకరణాలంకార శాస్త్ర గ్రంథాల ఉదాహరణలు.
5. సంకలనగ్రంథాల్లో ఉదాహరింపబడ్డ పద్యాలు

ఇవన్నీ పరిష్కార్య గ్రంథానికి లభ్యమౌతున్న అతి ప్రాచీన ప్రతికి పూర్వం వచ్చినవి కనుక మిక్కిలి విలువైన ఆధారాలుగా భావించవచ్చు.

వీటి ఆధారంగా పరిష్కర్త పాఠాలను సంస్కరించి వీలైనంతవరకు గ్రంథకర్త ఉద్దేశించిన పాఠాన్ని పాఠకులకు అందించవలసి ఉంటుంది.

శాస్త్రీయ పద్ధతుల్లో బ్రౌన్‌తో ప్రారంభమైన ఈ గ్రంథ పరిష్కరణ నేడు అంత విస్తృతంగా కాకపోయినా పరిమితంగానైనా సాగుతూనే ఉంది. ఈ ప్రక్రియల్లో కాలూనేవారికి పాండిత్యం, ఓపిక, ప్రాచీన కావ్యాలను సువ్యవస్థితరూపంలో జిజ్ఞాసువులకు అందించాలన్న తపన మొదలైనవి ఎంతో అవసరం. ప్రాచీన సాహిత్యంలో ఏమీ లేదనే యువవిద్యార్థుల తెలియమి, తొందరపాటులతో గూడిన నిర్ణయం, దానికి ప్రోది కల్పించే ఆచార్యగణం, నవ్యతమీది మోజు, ప్రాచీన సాహిత్యంమీద తగినంత పట్టు మొదలైనవి లేకపోవడంవల్ల గ్రంథ పరిష్కరణం జరుగవలసిన స్థాయిలో జరగడం. లేదు. ఒక్కసారి తాళపత్ర గ్రంథాలయాధికారులు ప్రకటించిన గ్రంథ వివరణ పట్టికలను (Descriptive Catologues) చూస్తే అమూల్యమైన ప్రాచీన గ్రంథాలెన్ని ఇంకా పరిష్కరణ పొంది వెలుగు చూడాలో తెలుస్తుంది.

○ :-

# ఇటీవలి కవిత్వం
# భాషాప్రయోగ విశేషాలు

నవల, కథానిక, కవిత మొదలైన వివిధ ప్రక్రియల్లో ఆధునిక తెలుగు సాహిత్యం చెప్పుకోదగ్గ ప్రగతిని సాధించింది. వీటన్నింటిలో కూడా ఆధునిక తెలుగు కవిత్వం రాశితో పాటు వాసిలో కూడా అగ్రసరంగా ఉందని భావిస్తే అతిశయోక్తి కాదు. నవల, కథానిక - వీటి దృష్ట్యా రచనావిస్తృతి తక్కువగా ఉండడం కూడా ఎక్కువమంది కవితారచనకు ఉద్యుక్తులు కావడానికి కారణం కావచ్చు. ఏమైనా ఈనాటి తెలుగుకవిత ఏ భారతీయ భాషలోని కవితకన్నా తీసిపోని స్థితిలో ఉందని చెప్పవచ్చు. వస్తువు, భావం, భాష, వ్యక్తీకరణ మొదలైన అనేకాంశాలలో ఆధునిక కవులు ఎంతో నవ్యతను ప్రవేశపెట్టి ఆధునిక కవితకు సమున్నతమైన స్థానం సంపాదించినారు. ఇటీవలి కవిత్వంలో - అంటే ఈ పదిహేను సంవత్సరాలుగా వస్తున్న కవిత్వంలో- భాషాప్రయోగ విశేషాలను పరిశీలించడం ఈ వ్యాసం ఉద్దేశం. ఈ నా పరిశీలనకు నారాయణరెడ్డి, శేషేంద్ర, శివారెడ్డి, పాపినేని, జయప్రభ, కొండేపూడి నిర్మల, వేగుంట మోహన్‌ప్రసాద్, నిఖిలేశ్వర్, గోపి, ఎండ్లూరి సుధాకర్, సిధారెడ్డి, యాకూబ్ ఇస్మాయిల్ మొదలైన కవుల రచనలను స్థాలీపులాకంగా గ్రహించటం జరిగింది.

మొదటగా ఆధునిక కావ్యాల శీర్షికలను పరిశీలిద్దాం. ప్రాచీన కావ్యనామాలన్నీ కావ్యవిషయాన్ని సూటిగా వాచ్యంగా స్ఫురింపజేసేవే కాని వాటిలో ఆలంకారికత కానీ, చమత్కారిత కానీ కనిపించదు. ఉదా : రఘువంశం, కుమారసంభవం, నైషధం, మనుచరిత్ర, వసుచరిత్ర మొదలైనవి. కాని, ఈనాటి కవులు తమ కవితల మాదిరిగా కావ్యనామాలనుకూడా కవితాత్మకంగా, ఆలంకారికంగా, ధ్వన్యాత్మకంగా ఎన్నుకోవడం కనిపిస్తుంది. ఉదా :- నడిచే గాయాలు, ప్రవహించే జ్ఞాపకం. చిలుకలు వాలిన చెట్టు, రహస్తంత్రి మొ॥

ఈనాటి కావ్యాలన్నీ మహాకావ్యాలు కాక చాలావరకు ముక్తకకవితల సంకలనాలే కనుక వీటిలో అవాంతర శీర్షికలెన్నో ఉంటాయి. సాధారణంగా వీటిలో కవికి బాగా నచ్చిన ఒక శీర్షికను కావ్యనామంగా గ్రహించడం సర్వ సాధారణం. కాని సిధారెడ్డి ప్రాణహిత, సంభాషణ వంటి కొన్ని కవితా సంకల నాలు ఇందుకు అపవాదాలుగా కనిపిస్తాయి.

ఇక కవితాఖండికల శీర్షికలను గురించి ప్రస్తావిస్తాను. ఆధునిక కవుల కవితా శీర్షికలు ప్రధానంగా మూడురకాలుగా కనిపిస్తున్నాయి. ఒకటి-మామూలు తెలుగు పదాలతోనూ, తెలుగు సంస్కృత పదాలతోనూ కూడినవి. రెండు - ఆంగ్ల పదాలతోనూ, ఆంగ్ల వాక్యాలతోనూ కూడినవి. మూడు - సంస్కృత పదాలతోనూ, సంస్కృత సమాసాలతోనూ కూడినవి. ఆధునిక వస్తువును, ఆధునికరీతిలో వర్ణిస్తున్న కవితాఖండికలకు సంస్కృతసమాసరూపాలను శీర్షికలుగా గ్రహించడం విశేషంగా కనిపిస్తుంది. ఇది కొంత విలక్షణంగా కూడా కనిపించవచ్చు. శీర్షికగా వాడుకోవడానికి కావలసిన సంక్షిప్తతా లక్షణం, గంభీరతాగుణం సంస్కృత సమాసాల్లో ఎక్కువగా ఉండడం దీనికి కారణమై ఉంటుంది. కొన్ని శీర్షికలు గమనించండి.

చేతనాస్తిత్వం, మౌనాగ్ని, సంధ్యార్ణవం, సప్నసంగీతలహరి, ఖడ్గ చాలనం (రహస్యోద్యమం)

విస్మృత ప్రయాణం, రక్తనగరం, నక్షత్రమాల (వర్తమానం)

స్వయంవాహనం, బహుళదాహం (ప్రాణహిత)

కిరణజన్య సంయోగం, ప్రాక్తనస్పర్శ, రక్తారోహణ దృశ్యసంస్కృతి, రిక్తస్రావం (వంతెన)

ద్వైధీప్రకృతి, చరిత్రకిరణాలు

మౌనమృదంగం, శిశుజ్వాల, కిరణావిష్కరణ మొ॥

ఆంగ్లపదాలు శీర్షికలుగా ఉన్న కవితాఖండికలు వీటిదృష్ట్యా చాలా తక్కువే అని చెప్పాలి. దీన్నిబట్టి ఆధునిక కవుల్లో కొందరికి కవితా శీర్షికల విషయంలో సంస్కృత పదబంధాలపైనే ఎక్కువ మోజున్నట్లుగా భావించ వచ్చు.

పాపినేని శివశంకర్ 'ఒక సారాంశంకోసం' అనే సంపుటిలోని కవితా శీర్షికల్లో ఒక నవ్యత, చమత్కృతి కనిపిస్తుంది. గేయపాదాల్లోని చివరి అక్షరాన్నో, పదాన్నో శీర్షికగా ఉంచడం ఆ నవ్యత. ఉదాహరణకు ఈ కింది గేయానికి 'నీ' అని శీర్షిక.

ఈ క్షణం నా సమస్తం దేహమై పోనీ
దేహం దేహమంతా స్పర్శై పోనీ
.... .... .... .... ....
అలలు అలలై నన్ను తాకనీ
మన పాదాలు ప్రవహించనీ
.... .... .... .... ....
నన్ను నీలో వాస్తవీకరించుకోనీ
.... .... .... .... ....
నీ కలయిక కాంతిద్వారాలు తెరవనీ (పుట 25)

అలాగే 'గలనా' అనే శీర్షికతో ఉన్న ఈ గేయాన్ని చూడండి:

ఆనందం కట్టలు తెంచుకున్నప్పుడు
అందర్లో చిందెయ్యగలవా
ఒక ఆపిల్ బుగ్గలపాప దార్లో కనిపిస్తే
చటుక్కున ముద్దెట్టుకోగలవా
బజార్లో చెప్పు తెగిపోతే
నిస్సంకోచంగా నడిచిపోగలవా
చొక్కా చిరిగిపోతేనో
పదిమందిలో పైట జారిపోతేనో
సిగ్గుతో చితికిపోకుండా ఉండగలవా (పుట 46)

పై గేయంలోని చివరి నాలుగు పాదాల్లో చివర ఉన్న క్రియాపదగతమైన అనుబంధ క్రియారూపాన్ని శీర్షికగా ఉంచడంలో ఎంతో నవ్యత కనిపిస్తుంది.

త్రిపురనేని శ్రీనివాస్‌లో కూడా ఈ విధమైన విలక్షణ శీర్షికావరణ లాలసను మనం గుర్తించవచ్చు. రహస్యోద్యమం అనే ఆయన కవితా సంపుటిలో ఒక కవితకు 'న్నిఝంగా' అనే శీర్షికను ఎన్నుకున్నారు. ఒత్తి పలికేప్పుడు 'నిజంగా' అనే పదంలో నకారాన్ని ద్విత్వయుక్తంగానూ, జకారాన్ని మహా ప్రాణంగానూ మార్చి నిజంగానే 'న్నిఝం' అని ఉచ్ఛరించడం మన వ్యవహారంలో ఉన్నదే. ఈ విధమైన ఉచ్చారణను శీర్షికలో ఉంచడం నవ్యతా విలసితమే. కవితలో కూడా దీని పునరుక్తి ఎంతో అర్థవంతంగా కనిపిస్తుంది. ఉదా:- నిజంగా న్నిజంగా న్నిఝంగా. ఈ కవితా సంపుటిలో ఒక కవితకు 'చౌరస్తాయిజం' అనేది శీర్షిక. విశేషణ పదాలపై చేర్చే భావార్థకమైన 'ism' అనే ఆంగ్లప్రత్యాయాన్ని నామవాచకంపై చేర్చి 'చౌరస్తాయిజం' అనడం వింత ప్రయోగమే.

తెలుగులో కొత్త కొత్త పదబంధాలు సృష్టించి భాషకు వన్నెచిన్నెలు పుష్కలంగా సంతరించిన ప్రాచీన కవుల్లో తిక్కనను మొదటగా పేర్కొనాలి. ఆయన చేసిన 'కన్నుల నవ్వు' అనే ఒక ప్రయోగం చూడండి. కన్నులతో నవ్వడమేమిటి? అనొచ్చు. కన్నులతో నవ్వడమంటే తిరస్కారాన్ని తెలుపడమని అర్థం. ఇలాంటి అద్భుతమైన ప్రయోగాలు ఆధునిక కవులు అసంఖ్యాకంగా - సృష్టించుకొని భాషకు పరిపుష్టిని సమకూర్చినారు. ఆయా కవుల కవితాసంపుటులనుండి కొన్ని ఉదాహరణలు పరిశీలిద్దాం.

కొండేపూడి నిర్మల 'నడిచే గాయాలు' కావ్యంలోని ఈ గేయం చూడండి.

తల్లీ చెల్లీ అని పిలుస్తూనే
రహస్యంగా నువ్వు కంట కరచిన
పరాయి అందాల తాలూకు
మాంసపు ముక్కలతో పోల్చి చూస్తుంటావు (పుట 1, 2)

లోకంలో నోట కరవడమనే వ్యవహారముంది. కాని కంట కరవడమనే వ్యవహారం లేదు. ఐతే కంట కరచిన అనే పదం 'నోట కరచిన' అనే పదాన్ని గుర్తుకు తెచ్చి మరో జంతువును స్ఫురింపజేస్తుంది. మాంసపు ముక్కలనే పదం

ఆధారంగా అది కుక్క అని తెలుస్తుంది. స్త్రీ సౌందర్యాన్ని ఆకొన్న కుక్కలాగా చూస్తున్నాడని భావం. 'కంటకరచు' అనేది నిర్మల ప్రతిభావంతంగా సృష్టించిన కొత్త క్రియాపదబంధం.

ఎండ్లూరి సుధాకర్ వర్తమానంలోని ఈ కింది గేయపాదాన్ని గమనించండి.

"ఇక్కడ సిగ్గుతీగెలకు దొంగముద్దులు పూస్తుంటాయి" (పుట. 27)

స్త్రీ అనే అర్థంలో 'సిగ్గుతీగె' అనడం నవ్యాతి నవ్యం. అచేతన పదార్థమైన తీగెను సచేతనంగా ఆవిష్కరించడం ఇందులోని విశేషం.

వ్యాకరణంలో చెప్పబడ్డ వాక్యలక్షణాల్లో యోగ్యత ఒకటి. యోగ్యత లేకపోతే వాక్యం దుష్టమౌతుంది. 'నిప్పుతో తడుపుతున్నాడు'లో నిప్పుకు తడిపే గుణం లేదు కనుక ఈ వాక్యంలో యోగ్యత లేదన్నమాట. అందువల్ల ఈ వాక్యం వ్యాకరణ రీత్యా అసాధువు. కవి ప్రతిభావిలసితంగా సృష్టించి కవిత్వంలో వాడుతాడు కనుక ఇలాంటి ప్రయోగాలు యోగ్యత లేకున్నా కవిత్వంలో దుష్టాలు కావు. పైపెచ్చు మంచి అందమైన ప్రయోగాలుగా పరిగణింపబడతాయి. ఇందులోని గుణాన్ని ఉక్తివక్రతగా పేర్కొవచ్చు. ఇలాంటి ప్రయోగాలు ఆధునికవుల రచనల్లో అసంఖ్యాకంగా కనిపిస్తాయి. కొన్నింటిని గమనించండి.

ముద్దులు పూయడం[1] (వర్తమానం, 27 పు.)
బాల్యాన్ని తాపడం[2] (ప్రవహించే జ్ఞాపకం)
వాయువులు ఈలలు వేయడం[3] (ఆధునికమహాభారతం, 290 పు.)
సముద్రాన్ని దున్నడం[4] (ఆధునికమహాభారతం, 268 పు.)
చూపుల్ని ఆరేయడం[5] (నడిచే గాయాలు)
గాలిని కొడుక్కుతినడం[6] (నడిచే గాయాలు, 34 పు.)
రాత్రిని కప్పుకోవడం[7] (రహస్యోద్యమం. 4 పు.)
గదిని కప్పుకోవడం[8] (దృక్పథం.)
ఎండలు తడవడం[9] (రహస్యోద్యమం. 18 పు.)
పైర్లు ప్రవహించడం[10] (దృక్పథం)

ఊపిరికి ఉక్కపోయడం[11] (దృక్పథం)
అంగాలను పీల్చడం[12] (నిరంతరం, 67 పు.)
వార్తలను పుక్కిలించడం[13] (కాలం అంచుమీద 21 పు.)
కోర్కెను వొంపడం[14] (ప్రవహించే జ్ఞాపకం.)
నిశ్శబ్దాన్ని ప్రసవించడం[15] (గరుడపురాణం, 60 పు.)
చౌక్కాలు మనిషిని తొడుక్కోవడం[16] (రహస్యోద్యమం, 17 పు.)
పక్షుల్ని కప్పుకోవడం[17] (వంతెన 25 పు.)
పైసలు ఆవలించడం[18] (ఆధునికమహాభారతం 203 పు.)
నేత్రాన్ని ఆరేయడం[19] (గురితప్పిన పద్యం 15 పు.)

ఆధునిక కవుల రచనల్లో ఇలాంటి ప్రయోగాలు కుప్పతిప్పలుగా కనిపిస్తాయి. ఇవి వారి నూత్న పదబంధ సృజనశక్తికి తార్కాణాలు. భాషకు వింత సొబగును కూర్చే వినూత్నాలంకారాలు.

ఆధునిక కవిత్వంలో కొత్తరూపకాల కల్పన కూడా కొట్టవచ్చినట్లుగా కనిపిస్తుంది. సృజనశక్తీ, భాషా ప్రయోగ దక్షతా ఉన్న కవులు సృష్టించిన ఈ రూపకాలు భాషావిదులను ఆశ్చర్యపరుస్తాయి. ఆనందపరుస్తాయి కూడా. కొన్ని రూపకాలను గమనించండి.

నీటి మంచం[20] (వర్తమానం 4 పు.)
పార్కుపాప[21] (వర్తమానం 28 పు.)
ఇసుకఎముకలు[22] (వర్తమానం 5 పు.)
జలచర్మం[23] (వర్తమానం )
సంజ రిబ్బన్లు[24] (వంతెన 1 పు.)
భయం పువ్వు[25] (వంతెన 1 పు.)
పిన్నీసుల ఆభరణాలు[26] (వంతెన 1 పు.
చూపుల శరగోపాలు[27] (వెలివాడ)
పూల కత్తులు[28] (శేషేంద్ర)
మబ్బుల వలువలు[29] ,,
చీకటి మీసాలు[31] (వర్తమానం)
వెన్నెల మెతుకులు[30] ( ,, )

ఇలాంటి రూపకాలే కాక చక్కని సమాసాలు, ఈనాటి కవుల రచనల్లో కనిపిస్తాయి. ఈ సమాస కల్పనలో ఎంతో నవ్యతా, సృజనాత్మకతా కనిపిస్తాయి. కొన్నింటిని గమనించండి.

ఆపిల్‌బుగ్గ[32] (ఒక సారాంశం కోసం)
వృద్ధబాలిక[33] (గురి తప్పిన పద్యం)
జలారణ్యాలు[34] ( ,, )
అగ్నిగంగ[35] (నడక నాతల్లి)
అగ్గిపుండ్లు[36] (నిరంతరం)
గడ్డిపద్యములు[37] ( ,, )
ప్లాస్టిక్‌నవ్వులు[38] ( ,, )
నైలాన్‌బ్రతుకులు[39] ( ,, )
ముసలిశిశువు[40] (దృక్పథం)
డాలర్లగడ్డ[41] ( ,, )
సిల్కుచేపలు[42] ( వంతెన )
సిల్కునీరెండలు[43] ( ,, )
సిగ్గుముద్ద[44] ( ,, )
బద్మాష్ చలి[45] ( ,, )
రౌడీగాలి[46] ( ,, )

ఇలా అందమైన రూపకాలు, సమాసాలే కాక చెప్పదలచుకున్న అర్థాన్ని, భావాన్ని వాచ్యం కాకుండా వక్రంగా చెప్పడం ఆధునిక కవుల్లో కనబడే విలక్షణలక్షణం. వర్తమానంలో వర్షాగోదావరి ఖండికలోని ఈ వాక్యం చూడండి.

"ఆమె తడిసిపోతుంది
ఎవరైనా గొడుగుపట్టండి.
హరవిలాసంలో తపస్సుచేసే పార్వతి - మహారాణి"

వర్షాకాలంలో గోదావరి పొంగటాన్ని "ఆమె తడిసిపోతుంది" అన్న వాక్యంతో వ్యక్తం చేయడం కవి ప్రయోగదక్షతకు నిదర్శనం.

ఇస్మాయిల్ 'చిలుకలు వాలిన చెట్టు' అనే కవితా సంపుటిలో ఒక కుర్రవాడు సైకిల్ ప్రయాణంలో మరణించటాన్ని ఎంత సూచ్యంగా చెపుతాడో గమనించండి.

సూదిలా దూసుకుపోయే సైకిల్తో
సాయంత్రపు ట్రాఫిక్‌లో లేసులల్లేసి
రోడ్డుపై చివరికి భయంకరమైన రక్తపుష్పాన్ని
రచించాడీ కుర్రాడు.

కుర్రవాడు మరణించినాడన్న భావాన్ని 'కుర్రాడు రక్తపుష్పాన్ని రచించా'డని సూచ్యంగా చెప్పడం కవిప్రతిభకు నిదర్శనం.

కొండేపూడి నిర్మల 'నడిచే గాయాలు' అన్న కవితాఖండికలోని

ప్రొద్దుగూకే సరికల్లా చెంగున దూకేస్తావట
నీ కాలిగిట్టలు చప్పుడవకుండా వుండేందుగ్గాను
గాయాలే నీకేసి నడుచుకుంటూ వస్తాయి" అనే

ఈ పాదాల్లో 'కాలిగిట్టలు' అనే ప్రయోగంద్వారా స్త్రీల పొందుకోసం వచ్చే వాళ్ళను పశువుతో పోల్చి చెప్పడం కనిపిస్తుంది. వాళ్ళలోని పశుత్వగుణం సున్నితంగా సూచితమైంది. ఇలాంటి ఉదాహరణలు ఆధునిక కవితల్లోంచి ఎన్నైనా చూపించవచ్చు.

వాక్యంలో కర్తృవాచకపదం బహువచనమైతే క్రియకూడా బహువచనంలో ఉండాలి. కాని కవి ఒకప్పుడు ఉద్దేశపూర్వకంగా వ్యాకరణ విరుద్ధంగా క్రియను ఏకవచనంలో వాడి ఒక విశిష్టార్థాన్ని సాధిస్తాడు. కొండేపూడి నిర్మల 'నడిచే గాయాలు'లోని 'ఎదిగే ఎదగని వయస్సు' అనే ఖండికలో ఈ కింది పాదాల్ని గమనించండి.

"జంక్షన్‌లా గొంతు
రెండు రైళ్ళు పలుకుతుంది"

రెండు రకాల గొంతులు పలకడం కనుక 'రెండు రైళ్ళు పలుకుతుంది' అని పలుకుతుంది అనే క్రియను ఏకవచనంలో వాడడం ఎంతో అర్థవంతంగా ఉంది.

ఈ కవితలోనే మరో అందమైన ప్రయోగం 'చేతికి తోచని మీసం' అనేది. అప్పుడప్పుడే వస్తున్న నూనూగు మీసాన్ని-చేతికి అందని మీసాన్ని- ఈ పదం సూచిస్తుంది. చేతికి అందని అని అనకుండా చేతికి తోచని అనడం వింత ప్రయోగం.

అధునికకవుల్లో కొత్తకొత్త క్రియా పదాలను సృష్టించుకోవడమనే లక్షణం బాగా కనిపిస్తుంది. అవి ఒకొకప్పుడు వ్యాకరణ విరుద్ధాలుగా కూడా ఉంటాయి. ప్రతిభావంతుడైన కవి, సృజనశీలియైన కవి, నిరంకుశుడైన కవి కవితా భాషలో సృష్టించుకునే పదజాలాన్ని అందరూ అంగీకరించకపోయినా వాటిని విశిష్ట ప్రయోగాలుగా భావించవలసిందే. కొన్ని క్రియా పదాలను ఉదాహరిస్తాను.

| | |
|---|---|
| సంగీతించు | (మోహనా! ఓ మోహనా!) |
| స్నేహిస్తూ | ( ,, ,, ) |
| చిత్రహింసించుకొని[47] | (మోహనా! ఓ మోహనా!) |
| హత్యించుకోవడం[48] | ( ,, ,, ) |
| ఆత్మహత్యించుకొను[49] | ( ,, ,, ) |
| సెన్సారించు[50] | ( ,, ,, ) |
| స్నానించు[51] | ( ,, ,, ) |

భాషలో అంతకుపూర్వం ప్రహతంగా ఉన్న పదాలనే కవి తన కవితలో వాడడు. స్వయంగా తన సృజన శక్తితో కొత్త పదజాలాన్ని సృష్టించుకుంటాడు. వేగుంట మోహన్ ప్రసాద్‌గారి రహస్తంత్రిలోని 'ఒక వేకువ' అనే ఖండికలోని కింది పాదాలను గమనించండి:

కిణికిణి గిలక నిక్వణం
చీర్ చీర్ చిర్చ్‌ర్‌మని ఊడుస్తున్న సవ్వడి
ఎడ్లు కదల్చుతున్న గడ్డి మిచర్ మిచర్ మిచర్‌మని
నికిణీం నికిణీమని మోగుతున్న ఎడ్ల గంటలు"

ఇందులో కవి కొత్త కొత్త ధ్వన్యనుకరణ పదాలను సృష్టించుకొని వాడుకున్నాడు.

కవిత్వంలో అస్పష్టత వస్తు, భావ, భాషల నాశ్రయించి మూడు రకాలుగా ఉంటుంది. కవిత్వంలో అస్పష్టత అనేది గుణమా, దోషమా అనే చర్చకు

పోకుండా, ఆధునిక కవిత్వంలో భాషాగతమైన అస్పష్టతను గురించి రెండు మాటలు చెప్పుకుందాం.

కవిత్వంలో అన్వయం కుదరకపోవడంవల్ల భాషాగతమైన అస్పష్టత ఏర్పడుతుంది. ఈ విధమైన అస్పష్టత ప్రధానంగా వేగుంట మోహన్ ప్రసాద్ కవితలో కనిపిస్తుంది. దీన్ని గురించి చే.రా. గారు రాస్తూ "కొన్ని చోట్ల అన్వయం కుదరదు. కుదరకపోతే మనమే కుదుర్చుకోవాలి. ఒక భావం నుంచి మరొక భావానికి చెప్పకుండా పాములాగా జారిపోతాడు. ఒక వాక్యం నుంచి మరో వాక్యానికి అడ్డం వచ్చే సింటాక్సు కాలువను దూకిపోతాడు" అని అంటారు. (చేరాతలు, ఆంధ్రజ్యోతి 1988)

కవితల్లో మొదట చెప్పిన వాక్యానికీ, తరువాత చెప్పే వాక్యాలకూ సంబంధం ఉండాలి. దేనికదే గొప్ప కవితాత్మక వాక్యం కావచ్చు కాని, పరస్పర సంబంధం లేకపోతే అస్పష్టత ఏర్పడుతుంది. పెన్నా శివరామకృష్ణశర్మ గుంటూరి శేషేంద్రశర్మగారి ఈ కింది గేయాన్ని ఉదాహరించి, ఇందులోని వాక్యాలలో గల పరస్పర సంబంధాన్ని నిరూపించినాడు (శేషేంద్ర కవిత్వాను శీలనం 269 పు.)

గణపతిహుసేన్ సాగర్ని తాగేస్తున్నాడు.
గాలి చెట్లసభల్లో బోధిస్తుంది.
వర్షాలు గోరీల్లో శవాల్ని బయటకు తెస్తున్నాయి.
భిన్నభిన్న ఛందస్సుల్లో వాటిమీద మంత్రాలు చదువుతున్నాయి.
ఈ మినార్లు ఈ గోపురాలు.
కాలపు తీరాలమీద
ఒరిగి పడిపోయి ఓడిపోయిన సైనికుల్లా
నేను వస్తాను చేతిలో ఉషస్సు ధరించి.
విప్లవానికి ఒక రక్తబిందువు చాలదు"

(ఆధునిక మహాభారతం, 231 పు.)

ఈ కవితలో మొదటి వాక్యానికి మిగిలిన వాక్యాలతో సంబంధం లేదు. రెండో వాక్యానికి, చివరి వాక్యానికి సమన్వయం కుదరదు. దేన్ని బోధిస్తుందో తెలుపకపోవడంవల్ల 'గాలి చెట్లసభలో బోధిస్తుంది' అన్న వాక్యం అనన్వితమూ అస్పష్టమూ అవుతుంది.

తెలుగుకు సహజం కాని వాక్యనిర్మాణం కూడా శేషేంద్రలో అక్కడ క్కడా కనిపిస్తుంది.

"ఈ జీవితంలో నీవు ఎన్ని రంగులతో ఆడుకున్నా ఒకనాడు నీవు అదృష్టవంతుడివై నీ ప్రాచీన చీకటిని కలుసుకోకతప్పదు. ఏ చీకటిలో ఏ జీవ కాంతుల బంధువులు స్పందిస్తున్నాయో' (నీరై పారిపోయింది, 6 పు.)

ఈ యత్తదర్థక శబ్దాలతోటి వాక్యనిర్మాణానికి సంస్కృతభాషా ప్రభావమో, ఆంగ్లభాషా ప్రభావమో కారణమై ఉంటుంది.

ఆధునిక కవులు వాక్యాన్ని మామూలు పద్ధతికి భిన్నంగా రచించి విలక్షణతను ప్రదర్శించడం కనిపిస్తుంది. పైకి వాక్యరచన భాషా సంప్రదాయానికి విరుద్ధంగా కనిపించినా ఒక విశిష్టార్థాన్ని ఆ వాక్యరచన తెలియజేయడం వల్ల దాన్ని విలక్షణ ప్రయోగంగానే భావిస్తాం. పాపినేని శివశంకర్ కవితలోని ఒక ఉదాహరణం గమనించండి.

"కవిత్వాన్ని జీవిస్తాను
జీవితాన్ని కవిత్వీకరిస్తాను
నేను కవిత్వం కానప్పుడు మరణిస్తాను"
(ఒక సారాంశంకోసం 2 పుట.)

ఇందులో కవిత్వాన్ని జీవిస్తాను అనే ప్రయోగం భాషా సంప్రదాయ విరుద్ధంగా కనిపిస్తుంది. కాని కవిత్వమే తానుగా జీవిస్తానని తన జీవితానికి లక్ష్యం కవిత్వమేనన్న భావాన్ని శక్తిమంతంగా చెప్పడంకోసం కవి ఈ విధమైన విలక్షణ ప్రయోగం చేసి ఉంటాడని భావించవచ్చు.

కొంతమంది కవితా రచనల్లో కావ్యాలు ఎక్కడికక్కడా తెగక దీర్ఘదీర్ఘ వాక్యాలు చోటుచేసుకోవడం కనిపిస్తుంది. దీనివల్ల అన్వయసౌరళ్యానికి అవరోధం ఏర్పడుతుంది, త్రిపురనేని శ్రీనివాస్ రహస్యోద్యమంలోని చేతనాస్తిత్వమనే ఖండికను గమనించండి. ఇందులోని పద్నాలుగు పంక్తులు ఒక వాక్యంగా కూర్చబడడడం వల్ల వివిధ భావాలు ఎక్కడికక్కడా తెగక అన్వయంలో సౌరళ్యం కనిపించదు.

ఆధునిక కవిత్వంలో దీర్ఘ సంస్కృత సమాసాల ప్రయోగం చాలా వరకు తగ్గినా కొందరి కవితల్లో ఈ లక్షణం అక్కడక్కడా తొంగిచూస్తూనే ఉంది. కొన్ని ప్రయోగాలు గమనించండి.

కష్టభూయిష్ఠ ఆనందామృత అత్యంత ప్రీతిపాత్ర జీవనపోరాటం (అజేయం)

అనంత సజీవ సశేషయాత్రావాహినీ నిరంతరత్వం (రహస్యోద్యమం)
ప్రాభాత సౌందర్య ప్రకృతి సన్నివేశం (వర్తమానం)
అద్భుతానంద పరిష్వంగ సౌందర్యోపేతుడు (వర్తమానం)
పరస్పర దురారోప దూషణ ధూమ పంక్తులు (దృక్పథం)
మనోజ్ఞ దారిద్ర్య బాల్య సంగీతం (వంతెన)
భయాహత విభ్రమావృత వ్యక్తిత్వం (దృక్పథం)
అభివ్యక్తి వాద వ్యక్తాంతర దుఃఖాగ్ని కీలల్ని (వేగులు)
ఖండిత క్రియా ఆనంద పారవశ్యాలు (మోహనా మోహనా)

ఆంగ్లపదంతో ఒక విచిత్రమైన సమాసకల్పన 'నడిచే గాయాలు'లో కనిపిస్తుంది.

"టెన్షన్ భరితమైన నా చెంపమీద"

ఆంగ్లపదం పూర్వపదంగా, తత్సమపదం ఉత్తరపదంగా ఉన్న సమాసాలెన్నో ఉన్నాయి. కాని ఆంగ్లపదాన్ని పూర్వపదంగా కూర్చి టెన్షన్ భరితమైన అని తృతీయా సమాసం చేయడం ఇందులోని విలక్షణత.

ఆధునిక కవితల్లో అక్కడక్కడా - విరళంగానే అనుకోండి - కొందరికి మాత్రమే బోధపడే పదజాలం కనిపిస్తుంది.

ఉదా:- త్రాష్టులు, మూడయిదులు, క్రిస్వానీ చిత్రాలు, రొజెంథాల్ గ్లాసు, లలీకగ్లాసు, షక్రియా, విషయించు మొ॥

ఇలాంటి పదాలకు అధోజ్ఞాపికలో వివరణ ఇస్తే పాఠకులకు ఉపయోగకరంగా ఉంటుంది. వేగుంట మోహన్‌ప్రసాద్ గారి రహస్తంత్రిలో ఇలాంటి వివరణలను మనం చూడవచ్చు.

ఇటీవలి కవిత్వంలో కొందరు మాండలిక భాషను ప్రవేశపెట్టి కవితకు నూతనత్వాన్ని సంతరిస్తున్నారు. ఐతే ఈ రచనలు ప్రధానంగా తెలంగాణా మాండలికంలోనే కనిపిస్తున్నాయి. కవితలో అక్కడక్కడా మాండలిక భాషా పదాలను కొందరు ప్రవేశపెడితే మరికొందరు కవితా ఖండికనంతా మాండలికంలో రాయడం గమనించవచ్చు. మాండలిక భాషలో రచనలు చేసిన వారిలో దేవరాజు మహారాజు, గోపి, ఎండ్లూరి సుధాకర్, మద్దూరి నగేశ్‌బాబు, సిధారెడ్డి ప్రముఖంగా కనిపిస్తారు. తెలంగాణా మాండలికంలో ఎండ్లూరి సుధాకర్ రచించిన 'తెలంగాణా ఉత్తరం' అనే కవిత తెలంగాణా మాండలిక ప్రియులను అట్టే ఆకట్టుకుంటుంది. గోపి కవితల్లోని బిడ్డా మొదలైన పదాలు, సిధారెడ్డి కవితలోని తమ్మీ, శాని, కందిని, తలె, వొడువదు, పోయినాంక మొదలైన పదాలు అచ్చమైన తెలంగాణామాండలికతను పుక్కిలించే పదాలు.

కవితావేశంలోనేమో ఈనాటి కవులు కొందరు భాషాసంప్రదాయ విరుద్ధాలైన (వీటినే వ్యాకరణవిరుద్ధాలు అని అనొచ్చు) శబ్దాలను ప్రయోగించడం కనిపిస్తుంది. అందమైన భావాలు, పదచిత్రాలు వీటిమధ్య ఇవి "ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అన్నట్లుగా కప్పిపుచ్చబడతాయని సమర్థించుకోవాలి. ఇలాంటి కొన్ని ప్రయోగాలు చూడండి.

| | |
|---|---|
| నిశ్శబ్ద సవ్వడులు | రక్తహీనపూల పెదవులు |
| రాక్షసాకలులు | మనోశక్తులు |
| రుజాశ ప్తమూల్గులు | శిరఃమాలలు |
| రక్తదాహుడు | అనలవేసవి |
| మృదువాతిమృదువుగా | సహస్రరెక్కలు |
| సంక్షుభితపగలు | రాజకీయకోరలు |
| మృత్యుచీకటి | వ్యాకులకలిత |

ఆధునిక కవిత్వంలో అసభ్యతామానం దిగంబరకవుల రచనల్లో ఎక్కువగా కనిపిస్తుంది. ఇటీవలి దళితకవులు కూడా ఈ విషయంలో వీరి మార్గంలోనే నడుస్తున్నట్లుగా కనిపిస్తుంది. దీనికి వారి అణచివేత, దానికి ఫలితమైన కసి మొదలైనవి కారణాలు కావచ్చు. లుచ్చామేధావులు. సన్నాసివెధవలు.

దొంగవెధవలు, మగవెధవలు, బచ్చానాన్న, అంజెకొడుకులు మొదలైన పదాలు ఇందుకు ఉదాహరణలు.

ఏమైనా ఆధునిక కవులు భాషాప్రయోగంలో చూపిన ప్రతిభ గణనీయమైందని చెప్పడం సత్యోక్తి. ఆసక్తిగల పరిశోధకులు ఈ విషయంలో పరిశ్రమిస్తే ఆధునిక కవుల భాషావిషయకమైన సృజనశక్తి లోకానికి స్పష్టమౌతుంది.

(ఆంధ్రసారస్వతపరిషత్తు సారస్వతవేదికలో చదివిన ప్రసంగవ్యాసం. నవంబర్ 1995)

## సూచికలు

1. ఇక్కడ సిగ్గు తీగెలకు దొంగముద్దులు పూస్తుంటాయి (వర్తమానం, 27 పు.)
2. పగలు మర్రిచెట్టు/ఊడల చేతుల్ని దాహంతో చాస్తుంది. కుర్రాళ్ళు బాల్యాన్ని తాపుతారు (ప్రవహించే జ్ఞాపకం)
3. శీతలవాయువు కిటికీలో
   ఈలలు వేస్తున్నప్పుడు
   మది దిగులుతో కుంగిపోతుంది (ఆధునిక మహాభారతం, 290 పు.)
4. వలలు కావాలి సముద్రం దున్నడానికి ( ,, 268 పు.)
5. కలుగులో చిట్టెకలాంటి గుబుల్లా
   తలవంచి చూపుని ఆరేసినచోట (నడిచే గాయాలు 34 పు.)
6. మధ్య మధ్య గ్రాంఫోను రికార్డు అప్లిక్‌వర్క్‌చేస్తూ గాలిని కొరుక్కుతింటున్నవాడు
   .... .... .... మీక్కనిపించాడా (నడిచే గాయాలు, 55 పు.)
7. మేమిద్దరం ఒకే రాత్రిని కప్పుకుపడుకున్నాం (రహస్యోద్యమం)
8. గదిని కప్పుకొని పడుకుంటే
   గాయం పొడవకుండా ఉంటుందా (దృక్పథం)
9. కొన్ని ఎండలు వానలకు తడిశాయి (రహస్యోద్యమం, 18 పు.)
10. మట్టి తలూపితే పైర్లు ప్రవహిస్తాయి (దృక్పథం)

11. ఊరేగే వంచనల ముఖచిత్రాలను చూచి
ఊపిరికి ఎన్నిసార్లు ఉక్కపోసిందో (దృక్పథం)

12. అంగాలను ఆత్మతో పీల్చిందే
అభినయం కాదు (నిరంతరం 67 పు)

13. పొద్దున్నే బుట్టెడు వార్తల్ని
పుక్కిలిస్తూ వస్తుంది కాలం (కాలం అంచుమీద 21 పు)

14. కోర్కెనంతా వొంపుతూపోయాను (ప్రవహించే జ్ఞాపకం)

15. ఆకాశం నిశ్శబ్దాన్ని
ప్రసవిస్తున్నవేళ (గరుడ పురాణం 60 పు)

16. చొక్కాలు గాలిలో తేలుతూ కనిపించిన మనిషిని తొడుక్కున్నాయి.
(రహస్యోద్యమం 17 పు)

17. చెట్లు పక్షుల్ని కప్పుకునేవేళ
కొమ్మలు పక్క ముడుచుకునేవేళ
కత్తులు కరాళనాట్యాలు చేస్తాయి (వంతెన 25పు)

18. జేబులో పైసలు ఆవులించాయి
కాళ్ళు త్రీపీసెన్‌కు దారి తీశాయి (ఆధునిక మహాభారతం 203 పు)

19. జన్మనిచ్చిన నేత్రాల్ని ఆరేయనేలేదు (గురి తప్పిన పద్యం 16 పు)

20. నీటి మంచం మీద గోదావరి
నిస్ప్రాణంగా పడివుండి (వర్తమానం 4 పు)

21. చీకటి చెట్ల ఊయల్లో
పాలపిట్టపాప హరితస్వప్నంగా మారుతుంది (వర్తమానం 28 పు)

22. వేలాడే గోదావరి ఇసుకఎముకలు బయటి కొస్తుంటాయి
(వర్తమానం 5 పు)

23. పలచబడుతున్న జలచర్మంతో
ఎనీమియా పేషెంటులా ఎంతో జాలిగొలుపుతుంది (వర్తమానం 5 పు)

24. ఆకాశంలోంచి
సంజరిబ్బన్లను పట్టుకొని ఊహల ఉయ్యాల లూగాలని ఉంది (వంతెన)

25. ఫుట్‌పాత్‌మీద పూచిన
కాడలేని రేకులు వాణికే భయంపువ్వు (వంతెన)

26. స్లిప్పర్లు తెగినప్పుడు
పిన్నీసుల అభరణాలతో ఊరేగిన క్షణాలు (,,)

27. చూపుల శరగోపాలెట్టిన రాయిగాడు (వెలివాడ)

28. నిన్న నీటిబొట్లు కారుస్తున్న చెట్లు ఇవాళ
జ్వలించే పూలకత్తులు ఝళిపిస్తున్నాయి
(ఆధునిక మహాభారతం 355 పు)

29. మబ్బుల వలువలు విడిచి
రాత్రి నగ్నంగా వెన్నెల్లో స్నానం చేస్తుంది (శేషేంద్ర)

30. } రాత్రి, చీకటిమీసాలమీద రాలిన వెన్నెల మెతుకులు తుడుచుకోకుండా
31. } జట్కా తోలుకుపోతోంది శిథిల స్వప్నాలమీద ప్రయాణికులు దొరుకు
తారనే ఆశతో "(శేషేంద్ర) ఆధునిక మహాభారతం. 90 పుట).

32. ఒక ఆపిల్ బుగ్గల పాప దారో కనిపిస్తే
చటుక్కున ముద్దెట్టుకోగలవా (ఒక సారాంశంకోసం 46 పు)

33. బాల్యం వంతెన కూలి నడుం విరిగిన వృద్ధబాలికా
(గురితప్పిన పద్యం 14 పు)

34. కళ్ళు జలాగణ్యాలయ్యాయి (గురి తప్పిన పద్యం 14 పు 37 పు)

35. నాకు తెలుసు ఈ మురికి అనాది; తుడిస్తే పోనిది
కదిలొస్తున్నాను అగ్నిగంగలతో కడగాలని (నడక నా తల్లి 45 పు)

36. బొగ్గయిన మా హృదయాల్లో రెచ్చిన
అగ్గిపుండ్లు ఆరలేదు సుమా (నిరంతరం. 1పు)

57. కళాపరిమళమే లేని
గడ్డిపద్యములు నిల్వావు (నిరంతరం 4పు)

38. ప్లాస్టిక్‌నవ్వుల్లో దాగిన
సృష్టిరహస్యాలు పరికిస్తున్నాను (నిరంతరం 9 పు)

39. నైలాన్ బ్రతుకుల్లో మూగిన
జాలిగాథలు వడబోస్తున్నాను (నిరంతరం 11 పు)

40. మూత్రపిండాలు రెండూ చెడిపోయిన ఆకాశం
ముసలిశిశువులా రోదిస్తున్నది (దృక్పథం. 54 పు.)

41. కవిత్వం కావాలంటే డాలర్లగడ్డను తవ్వనక్కరలేదు. (దృక్పథం)

42. ఎక్వేరియంలోని సిల్కుచేపలు
సుతారంగా ఈదుతాయి నీటిని మృదువుగా చీలుస్తూ (వంతెన)

43. పసితనం సిల్కునీరెండల్లోంచి నడిచోచ్చే
అసంఖ్యాక చిన్నారి ప్రేయసులకోసం
అనంతకోటి హస్తాలను చాస్తాను (వంతెన పు 1.)

44. సిగ్గుముద్దై పోతున్నాను
నాలుగువందలేండ్ల చరిత్ర కాగితాల్ని
చెత్తకుండీల్లో ఉండగా చుట్టిపారేస్తున్నాను (వంతెన 57 పు.)

45. అపార్టుమెంట్లని సైతం
బద్మాష్‌చలి వణికిస్తూనేవుంది (వర్తమానం 65 పు)

46. కొబ్బరిచెట్ల నడుముల మీదుగా
రౌడీగాలి చెయ్యి నిమురుతూ పోతుంది (వర్తమానం)

కొమ్మలు విలవిల కొట్టుకుంటున్నాయి (ఆధునిక మహాభారతం. 80 పు)

47. ఒకచోట శిలమీద తన్నుతాను
హింసించుకుంటూ చిత్రహింసించుకుంటూ ఆత్మహత్యించుకుంటూ
(మోహనా ఓ మోహనా పుట 11)

48. అత్మను హత్యించుకోడమెంత రహస్యంగా
జరిగిపోతుందో వీళ్ళకి తెలియదు (నడిచే గాయాలు 32 పు)

49. యుద్ధఖైదీలుగా పట్టుబడినట్లు పారిపోయి
ఆత్మహత్యించుకొని కనిపిస్తాయి (నడిచే గాయాలు 35 పు)

50. ఏ పీడకల రాక్షసుడో సెన్సారించిన నిద్రలోంచి/ఔట్ డోర్ కెళ్ళిన అమ్మా నాన్న గుర్తొస్తే/మూసిన తలుపుల మీద నిలువెత్తు కటౌట్లను/ ఎలా కౌగిలించుకోవాలో తెలిక/ పసి చూపులు నదులౌతాయి (నడిచే గాయాలు 47 పు)

51. స్నానంలో స్నానిస్తూ
నిద్రలో నిద్రిస్తూ
ఎటువంటీ కళ్ళకైనా యివి మెత్తలు పరుస్తాయి.
రాగద్వేషాల్లేని విరాగులకు మల్లే (నడిచేగాయాలు 34 పు)

-: o :-